# శ్రీ జగన్నాథక్షేత్రమాహాత్మ్యము

[ తెలుగు వచనము ]

మూలము – సంస్కృత స్కాందపురాణము

# SRI JAGANNATHAKSHETRAMAHATMYAMU

[ Telugu Prose ]

**Original – Sanskrit Skandapurana**

*Translated*

*by*

Dr. M. V. SATYANARAYANA, M.A., Ph.D.
Telugu Department
Andhra University
Visakhapatnam 530 003

## ABOUT THE AUTHOR



*Parents :*

Modekurti Seetaramaswami and Smt. Veeralakshmi

*Qualifications :*

B.A. (Hons.) Telugu (1952), M.A. (1953), Ph.D. (1965), Diploma in Hindi (1968), Andhra University

*Employment :*

Teaching - T e l u g u Department, the Government Arts College, Srikakulam, etc. 1952-57 (June) ; Dictionary preparation : Telugu Etymological Dictionary Scheme, Telugu Department, Andhra University (1957-62) ; Publication and editing work : Telugu Department, Andhra University (1962 September - 1988)

*Personal Publications :*

Sri Satyasaisatakamu (1973) ; Sri Ramasatakamu (1973) ; Srikrishnasatakamu (1974) ; Sri Panduranga Satakamu (1974) ; Sri Satya Sai Sooktimuktavali (1984) ; Sri Venkatachalamahatmyamu (1979) ; and Sri Jagannathakshetramahatmyamu (1988) [ Telugu & English ] .

*Books Edited :*

NAVA KAVITA – An Anthology of Modern Telugu Poetical Selections of 176 poets (1980) ; KAVYASAMEEKSHALU – 30 critical Essays on old Telugu Kavyas (1984) – Pub. : Andhra University, Visakhapatnam – 3.

*Conferences attended and read Research Papers on deputation by the Andhra University :*

All India Dravidian Linguistics Conference – held in Bangalore University, Bangalore (1977) ; World Sanskrit Conference, Benaras Hindu University, Varanasi (1981) ; Potana Panchasati Celebrations, Warangal (1982) ; International Telugu Conference, Hyderabad (A.P.) (1983) ; Research papers communicated : A.P. Oriental, All India Oriental, VI and VII World Sanskrit Conferences in 1981, 82, 84 and 87 respectively.

30 Radio-talks in Telugu and Sanskrit, Sooktimuktavali and book reviews were broadcast by A.I.R., Visakhapatnam since 1976.

Participated in several Literary, Poetical and Spiritual Conferences in A.P. and other States and was honoured.

డాక్టర్ లకంసాని చక్రధరరావు, ఎం.ఎ., పిహెచ్.డి.
తెలుగు శాఖాధిపతులు
తెలుగు వ్యుత్పత్తి కోశ ప్రధాన సంపాదకులు, డైరెక్టర్
తెలుగు వ్యుత్పత్తి కోశ సంపాదకవర్గ సభ్యులు, కార్యదర్శి
ఆంధ్ర విశ్వకళాపరిషత్

## ప్రస్తుతి

డాక్టర్ మోదేకుర్తి వేంకట సత్యనారాయణగారు భగవద్భక్తి ప్రబోధ కాలైన శ్రీరామ శ్రీకృష్ణ శ్రీపాండురంగ శ్రీసత్యసాయి శతకాలను ఎన్నో రచించటమే కాకుండా "శ్రీవేంకటాచల మాహాత్మ్యము" (మే 1979) అనే సరసవచన రచన కావించి ఆంధ్రభాషా యోషను అలంకరించి భక్తులను అలరించారు. శ్రీవేంకటాచల మాహాత్మ్యమువలె ప్రస్తుతం మీ ముందున్న "శ్రీజగన్నాథ క్షేత్ర మాహాత్మ్యము" కూడా స్కాందపురాణాంతర్గతమైనది. ముక్తిదాయకమైనది. ముఖ్యమైన చోట్ల మూలగత శ్లోకాలు యథాతథంగా ఉంచబడ్డాయి. ఈ శ్లోక పఠనంవల్ల విశేషఫలం భక్తులకు కలుగుతుందనటంలో సందేహం లేదు. ఒరిస్సాలోని పూరీ జగన్నాథుల క్షేత్రమహిమ యావద్భారతదేశ ప్రసిద్ధం. భారత దేశైకాత్మతా ప్రబోధక భక్తిభావ బంధురమయిన ఈ శ్రీజగన్నాథక్షేత్ర మాహాత్మ్య గ్రంథం ప్రశస్తమైనది.

అనేక కష్టనష్టాలను సహించి మిక్కిలి శ్రమపడి విశేషకృషి కావించి ఏతద్గ్రంథ ప్రచురణను పూర్తి కావించిన కవిపండితులు పండితపక్షపాతులు సహృదయులు డాక్టర్ సత్యనారాయణగారిని ప్రస్తుతిస్తూ భావికాలంలో ఇతోధిక సద్గ్రంథరచన కావిస్తారని ఆశిస్తున్నాను.

విశాఖపట్నం
26-3-1988

లకంసాని చక్రధరరావు

# జగన్నాథక్షేత్ర మాహాత్మ్యము

## 1వ అధ్యాయము

1. మునులు జైమినిమహర్షిని పురుషోత్తమ క్షేత్రమునుగూర్చి చెప్పుమనుట :

"ఓ జైమిని మహర్షీ! నీవు సర్వజ్ఞుడవు. సర్వ తీర్థముల మహిమ నెరిగినవాడవు. మున్ను సకల తీర్థముల గురించి చెప్పుచు పరమ పావనము మహిమాన్వితమయిన పురుషోత్తమము అను పేరుగల క్షేత్రము అనగా జగన్నాథ క్షేత్రమును గూర్చి చెప్పితివి. అట శ్రీపతి మానుషలీలతో దారు తనువును దాల్చి యున్నట్లు తెల్పితివి. ఆ పురుషోత్తముడు భక్తులకు సందర్శన మాత్రముననే సాక్షాత్కరించి సర్వ తీర్థ ఫలములను ముక్తిని ఇచ్చునని వచించితివి. కావున ఆ క్షేత్రము నెవరు నిర్మించిరో మాకు విపులముగా చెప్పుము. జ్యోతివలె ప్రకాశించు భగవంతుడు సాక్షాత్తు నారాయణుడు ప్రభువయిన పరమ పూరుషుడు ఆ క్షేత్రమున దారుమయుడయి ఎట్లు నివసించుచున్నాడు ?

ఓ మునీంద్రా! నీవు వాగ్మివి, సర్వలోక గురుడవు, బ్రహ్మవిదుడవు. ఈ వృత్తాంతమును వినుటకు కుతూహలముతో నున్నాము. కావున విశదముగా వచింపుము" అని మునులు జైమిని మునిని కోరిరి.

2. జైమిని మహర్షి మునులకు శ్రీ జగన్నాథ క్షేత్రమును గూర్చి తెల్పుట :

"ఓ మునులారా! ఇది పరమ రహస్యమయిన విషయమయినను మీకు చెప్పుచున్నాను. వినుడు. వైష్ణవులుకానివారు ఆ విషయమును వినినను ఆ భగవంతునియందు భక్తి కలుగదు. అతనిని భక్తితో స్మరించినవారి తమోగుణము నశించును. ఆ పురుషోత్తముడగు జగన్నాథుడు అంతటనుండువాడు అతడే సర్వమని భావింపదగినవాడు.

ఈశ్వరుడు స్వయముగా చెప్పగా కుమారస్వామి విని చెప్పిన సర్వ పాపహారములగు ఇతర క్షేత్రములు కూడ కలవు. మహాత్ముడయిన పురుషోత్తముడు ఈ క్షేత్రమునందంతరాత్మవలెనుండగా అతనికి జగన్నాథక్షేత్రము

శరీరముపలెనుండి పవిత్రమై ఆ జగన్నాథుని నామముతో ప్రసిద్ధమైయున్నది. ఆ జగన్నాథుడు శరీరధారియై అచట నివసించుచున్నాడు. ఆ పుణ్యక్షేత్రమున వసించువారు పాపరహితులగుదురు. అక్కడ నివసించి గదాధరుని చూచువారి పుణ్యమును చెప్పవలయునా? ఎంత ఆశ్చర్యము? ఆ పుణ్యక్షేత్ర విస్తీర్ణము పది యోజనములు. అది శ్రేష్ఠమయిన తీర్థోదకమునుండి వెలువడిన ఇసుకతో ఒప్పుచున్నది. దానిమధ్యనే ఘనమగు నీలాచలము ప్రకాశించుచున్నది. దానిని దూరముగా నుండి చూచినవారికి అది భూమికి స్తనముగానున్నట్లు గోచరించును. పూర్వము వరాహ రూపధారియగు హరిచే భూమి ఉద్ధరింపబడి అంతట సమముగా చేయబడి పర్వతములచే సుస్థిరము కావింపబడినది.

బ్రహ్మ పూర్వము చరాచరాత్మకమయిన సర్వమును తీర్థములను నదులను సముద్రములను పుణ్యక్షేత్రములను సృష్టించి వానిని ఉచిత స్థానములందుంచి సృష్టిభారపీడితుడయ్యెను. మరల అట్టి ఘనకార్యమును తాను ఎందులకారంభింపనున్నాడనో అని అతడు ఆలోచింపసాగెను. ఇట్లాలోచించుచున్న ప్రజాపతి ముక్తికి మూలకారణభూతుడు పరమేశ్వరుడగు విష్ణువును సంతోషపెట్టవలెనని తలంచెను" అని జైమిని మహర్షి మునులతో చెప్పెను.

3. బ్రహ్మ విష్ణువును స్తుతించుట :

"ఓ జగదాధారా! శంఖచక్ర గదాధరా! నీకు నా నమస్కారము. విశ్వ సృష్టికర్తనయిన నేను నీ నాభి కమలమునుండి జనించితిని. ఓ జగన్మయా! నీ పరమార్థ స్వరూపమును నీవే ఎరుగుదువు. మహదాదికమయిన జగమంతయు నీ మాయచే నిర్మింపబడినది. నీ నిశ్వాసము నుండి ఉద్భవించిన శబ్దబ్రహ్మము మూడు విధములయ్యెను. దాని మూలముననే భువనముల నన్నిటిని సృజించితిని. నీకంటె ఇతరమైనది స్థూలసూక్ష్మ దీర్ఘహ్రస్వాదికమయినది ఏదియును లేదు. ఓ భగవంతుడా! స్వర్ణము కటకాద్యలంకారములగుచున్నట్లు వికార భేదముచే ఈ చరాచరమంతయు నీవే. ఓ జగత్ప్రభూ! గుణత్రయ విభాగమువలన ఇచట స్రష్టవు సృష్టివి నీవె. పోషకుడవు, పోషింపబడునదియు నీవే.

ఓ పరమేశ్వరా! ఆధారము, ఆధేయము, సర్వమును ధరించువాడవు నీవే. నీచే ప్రేరేపింపబడిన బుద్ధితో సర్వప్రాణికోటి శుభాశుభకర్మలు చేయుచున్నది. పిమ్మట నీ నిర్ణయానుసారముగ ప్రతి జీవుడు స్వకర్మ ఫలము ననుభవించుచున్నాడు. ఓ పరాత్పరా: ఈ జగత్తుకు గతివి, భర్తవు, సాక్షివి నీవే. ఓ కృపామయా! సర్వజీవమయా! చరాచరగురుడా! ఓ జగన్నాథా! నీవే నిత్యము నాకు శరణ్యుడవు. నన్నిపుడే అనుగ్రహింపుము." అని బ్రహ్మ విష్ణువును ప్రార్థించెను.



4. విష్ణువు బ్రహ్మకు ప్రత్యక్షమగుట :

ఇట్లు బ్రహ్మచే స్తుతింపబడిన విష్ణువు గరుడధ్వజుడు నీలజీమూతసంకాశుడు, శంఖచక్రాదిచిహ్నితుడు గరుడారూఢుడు వికసిత వదనారవిందుడునై పలుకదలచి పెదవులు మెదపుచు ప్రత్యక్షమయ్యెను.

5. భగవంతుడు బ్రహ్మతో సంభాషించుట :

"ఓ బ్రహ్మదేవా! నన్నెందులకు స్తుతించుచున్నావో తెల్పుము. అనాదియగు అవిద్య సుదృఢమైనది. కర్మ బంధనము బాగుగా ఛేదింపదగినది. అది కలుగుచుండగ జనన మరణములు తప్పవు. ఓ ఘనుడ! అట్లయినచో దీని విషయమై నీకృషి ఏపద్ధతిలో జరుగునో దానిని నీకు చెప్పుచున్నాను. వినుము.

ఓ విధాతా! నేనే నీవు. నీవే నేను. ఈ జగత్తంతయు నా స్వరూపమే. మన్మయమే. నీకు దేనియందభిరుచి కలదో నాకును దానియందే ఉన్నది. మరియొక విధముగా నుండదని గ్రహింపుము.

దక్షిణ సాగరమునకు ఉత్తరమున మహానదికి దక్షిణ భాగమున పృథివి యందుగల ఈ ప్రదేశము సర్వతీర్థఫలప్రదము కదా! అచట ఏమనుజులు సద్బుద్ధితో నివసింతురో వారు గతజన్మముల యందాచరించిన పుణ్యకర్మల ఫలితములను అనుభవింతురు. ఓ పద్మజా! అల్పపుణ్యాత్ములు నాయందు భక్తి లేనివారు ఆ పుణ్యక్షేత్రమున ప్రభవింపరు. ఏకామ్ర వనమునుండి దక్షిణ సముద్రతీరభూమి అంతయు ఒకఅడుగు కంటె మరియొక అడుగుభూమి శ్రేష్ఠతమము, క్రమముగా పరమ పావనమయినది.

ఓ కమలాసన! సింధుతీరమున విరాజమానమగు నీలపర్వతము పృథివి యందు గోప్యముగా నున్న స్థానము, నా మాయచేత ఆచ్ఛాదితమయిన అది దేవదానవులకు కూడ తెలియశక్యముకాదు. నీకు అది సుదుర్లభమయినది. సర్వసంగ పరిత్యాగి నయిన నేనచట దేహధారినయి వసించుచున్నాను. క్షరాక్షరముల కతీతుడనై పురుషోత్తమ క్షేత్రమున వర్తించుచున్నాను. నా యొక్క పురుషోత్తమక్షేత్రమునందు సృష్టిస్థితిలయములకు తావులేదు.

ఓ పితామహా! చక్రాది చిహ్నితమయిన నా ఈ రూపమునిట చూచుచున్నట్లే ఆ క్షేత్రమున కేగి అచటకూడ ఇట్లే చూడగలవు నీలాద్రియొక్క అంతర్భాగమున కల్పవటవృక్షముల మూలమునందు పశ్చిమ దిక్కున రౌహిణమనెడి కుండ మొక్కటికలదు. ఆ తీరమందు నివసించుచున్న నన్ను చర్మ చక్షువులతో చూచు

వారు ఆ కుండమునందలి జలమహిమచే పాపరహితులై నాసాయుజ్యమును పొందుదురు.

ఓ మహాభాగ ! అనటికేగి నన్ను గూర్చి ధ్యానించుచున్న నీకు అతిశ్రేష్ఠమయిన ఆ పుణ్యక్షేత్రమహిమ ప్రకాశమగును. నీకును అది పరమైశ్వర్య కారణము కాగలదు. శ్రుతి స్మృతీతిహాస పురాణములయందు గోప్యమయినది నామాయచేత ఎవ్వరికిని గోచరముకాదు. నన్ను స్తుతించుచున్న నీకు నాయనుగ్రహము వలన సర్వము గోచరించి ప్రకాశించును. వ్రతములయందు తీర్థములయందు, పరిశుద్ధాత్ములకు లభ్యమగు పుణ్యమెయ్యది చెప్పబడినదో అయ్యది ఆపురుషోత్తమ క్షేత్రమున ఒకపగలు గడిపినచో తప్పక ప్రాప్తించును, అచట నిశ్వాసకాలమందున్నంత మాత్రమున అశ్వమేధయాగఫలము కలుగును." అని పురుషోత్తముడు బ్రహ్మదేవునకు ఉపదేశించి అంతర్ధానమయ్యెను.

## 2వ అధ్యాయము

1. జైమిని ద్విజాలతో ఇట్లు పలికెను :

"ఓద్విజాలారా ! భగవంతుడు స్వయముగావెలసిన స్థలమునకు బ్రహ్మవెళ్ళి అతనిని స్తుతించినప్పుడు ఏరూపముతో కానవచ్చెనో ఆదేరూపముతో అప్పుడుకూడ భగవంతునిచూచి బ్రహ్మ సంతసించెను.

బ్రహ్మ ఆ పరమేశ్వరుని రూపమును గాంచి అత్యద్భుత జ్ఞాననిధి అయ్యెను. బ్రహ్మ హర్ష సంపుల్లలోచనుడై స్తుతింపనారంభించెను. అపుడు ఎటనుండియో ఒక వాయసము వచ్చి కారుణ్యోదకసంపూర్ణమైన కుండములో మునిగి నీలరత్నఖానియు కృపానిధియు నగు మాధవుని పరికించి భూమియందు మాటిమాటికి పరిభ్రమించి తుదకు కాకిదేహ మును విడిచి శంఖచక్రగదాపాణియగు అతని పార్శ్వమునందుండెను. బ్రహ్మ అద్భుతగా పోవుచున్న దానిగమనమును చూచి అది యోగీంద్రులకును సులభ సాధ్యముకాదని భావించెను. సృష్టి క్రమముగా క్షీణించును. మనుష్యుడు పొందదగిన ముక్తినిగురించి వేదాంతములయందు చెప్పబడిన విషయములో సంశయచిత్తుడగుచున్నాడు. విష్ణుభక్తునకు దీని విషయమై దుర్లభమైనది ఏదియు లేదు. నరుడు పురాణపురుషుని నామసంకీర్తనము చేసిన సర్వపాప విముక్తుడగును. భగవంతుడాతనికి ప్రత్యక్షమగును. విష్ణుసందర్శనము ప్రాప్తించినవానికి ముక్తి దుర్లభముకాదు. విష్ణువును మనస్సులో ధ్యానించుచున్న భక్తుడు ప్రాణములను విడుచు సమయమున వానికి విష్ణువు సాక్షాత్కరించి ముక్తి నొసంగును కాబట్టి విష్ణుభక్తుడు ముక్తి నొందుచున్నాడనగా ఆశ్చర్యమేమి ?



పురుషోత్తమ క్షేత్రమహిమమనగా శ్రీ జగన్నాథ క్షేత్రమహిమము. ఇది అత్యద్భుతమైనది. కాకి సాక్షాత్తుగా శ్రీ హరిని సందర్శించిన యీ క్షేత్రము అజ్ఞానాపహరమగుచున్నది. కాకికి కూడ మోక్షప్రదమయిన యీ క్షేత్ర మాహాత్మ్య మెంత విశిష్టమయినది. ఇచ్చట జ్ఞాన వైరాగ్యవంతులకు సతతము శాంతి కల్గును.

2. ద్విజులు జైమినితో పలుకుట :

ఓ జైమిని మునీంద్రా ! నీలాఖ్యుడయిన మాధవుని దర్శించిన క్షణముననే దేహ బంధమును వీడిన వాయసమును గూర్చి పితామహుండేమి చేసెను ?

3. జైమిని ముని విప్రులకు సమాధానము చెప్పుట :

కాకము మాధవుని యత్యద్భుత మూర్తిని ధ్యానించుచుండగనే యముడు తన విధిని నిర్వర్తించుటకై దీనవదనుడై నిశ్వసించుచు శీఘ్రముగా పోయి నీలాద్రియందున్న మాధవుని గాంచి సాష్టాంగముగ ప్రణమిల్లి స్వధర్మ నిర్వహణమునందు జగన్నాథునకు సంతుష్టి కలిగించెను.

4. యముడు జగన్నాథుని కొనియాడుట :

ఓ దేవదేవా ! సృష్టి స్థిత్యంతకారణా ! నీకు నమస్కారము. సూత్రము నందు మణిగణమువలెనే నీయందీజగమంతయు కూర్చబడినది. ఇది నీచే సృష్టింపబడి ధరింపబడి తృప్తి నొందింపబడుచున్నది. నీవు సూర్య చంద్రాది రూపములతో సమస్తమును ప్రకాశింపజేయుచున్నావు. ఓ జగన్నాథా ! విశ్వేశ్వరుడవు జగద్యోనివి విశ్వనిలయుడవు, జగద్గురుడవు విశ్వసాక్షివి అద్యంత రహితుడవగు నీకు నా వందనములు. పరమకారుణ్య సాగరుడవగు నీకు నా నమస్కారములు. ఓ పురుషోత్తమా ! పరాపరపరాతీత వైభవోపేతుడవు ! విశ్వ సంభవుడవు. భవసంతాపనివారణుడవు, దీనబాంధవుడవు. స్వమాయారచితాఖిల విభవయుతుడవు. గుణసంయుతుడవు కమలకింజల్క సదృశపీత నిర్మల వసనుడవు. యజ్ఞ విధ్వంసకుల స్కంధచ్ఛేదకచక్రుడవు. చక్రివి, దంష్ట్రోద్ధృతక్షితి భర్తవు, త్రయీమూర్తి వగు నీకు నా వందనములు. యజ్ఞ వరాహుడవు, సూర్యచంద్రాగ్ని నేత్రుడవు, నరసింహుడవు, నీ దంష్ట్రోగ్రమగు నీ మూర్తిని గాంచినంతనే శత్రువులు పారిపోవుదురు. నీ యపాంగ వీక్షణము వలనే సృష్టిస్థితిసంహారములు జరుగుచున్నవి. నీయిచ్ఛానుసారముగ అవతారములను దాల్చుచున్నావు. అట్టి యీ నీవు నీలమేఘాభుడవు, నీలాశ్మమయ విగ్రహుడవు, నీలాచలగుహావాసుడవు. కృపానిధివగు నీకు నాప్రణామ

ములు, నీవు శంఖచక్రగదా పద్మధారివి, శుభదాయివి, నీకు నమస్కరించినంతనే సర్వపాపౌఘములను హరింతువు. నీకు నా నమస్కారములు.

ఓ జగన్నాథా! కమలాపాంగసంగ సంస్కార చక్షుష్మంతుడవు, శ్రీవత్స కౌస్తుభ భాసమాన తనువు దయామయుడవు విశాలవక్షస్కుడవు. ఓ కమలనాథా! నీ పాద పంకజ ద్వంద్వసంశ్రయ, ఐశ్వర్యభాగిని అయిన శ్రీదేవి తన్నాశ్రయించిన వారికి శాశ్వతైశ్వర్యములను స్వయముగా నిచ్చుచున్నది. నిన్ను సేవించు నిచ్చగల యామె నీయొక్క పరాపర భిన్నయగు ప్రకృతి. నిర్వికారమగు పరబ్రహ్మము నవికారముగా సృజింపబడినది. సర్వశుభలక్షణ లక్షితయై పరిపూర్ణయై విష్ణువక్షఃస్థలస్థితయగు ఆ లక్ష్మీదేవికి నా నమస్కారములు.

5. జైమిని ఋషులతో పలుకుట :

"ఋషులారా! ఈ విధముగా లక్ష్మీపతి యమధర్మరాజుచే స్తుతింపబడి తన పార్శ్వభాగమందున్న శ్రీదేవిని క్రేగంటితో ఆజ్ఞాపించెను. అట్లు సంభావితయు భవదుఃఖ వినాశినియునగు లక్ష్మీదేవి సర్వలోకముల శుభముకొరకై యమున" కిట్లనియె.

6. లక్ష్మీదేవి యమునితో సంభాషించుట :

ఓ యమధర్మరాజా! అతి దుర్లభమైన యీక్షేత్రమున మా యిద్దరిని ఏల స్తుతించితివి. ఈ శ్రీపురుషోత్తమ క్షేత్రమును మేమిద్దరమెన్నడును విడువము కల్పాంతమందయినను పరమేష్ఠిచే నియ్యది మాకై ధరింపబడును. ఈ క్షేత్రము పైని బ్రహ్మాది దేవతలకు కూడ అధికారముండదు. ఈ పుణ్యక్షేత్రమందు కర్మ పరిపాకమయినవారెన్నడును జన్మింపరు. ఇట నివసించుచున్న దుష్టనరపక్ష్యాదుల పాపరాశి ప్రజ్వరిల్లుచున్న అగ్నిలో దూది దహింపబడుచున్నట్లు నిశ్చయముగా దహింపబడును. పాపపుణ్యములనెడి శృంఖలలచే దినమంతయు బద్ధులయినవారిని అదుపులో ఉంచువాడవు నీవే. అందులకే పూర్వము యముడు సృజింపబడి యీ పురుషోత్తమ క్షేత్రమున సాక్షాత్తుగ శరీరధారి నీలేంద్రమణి మంజులుడు దేవుడునగు నారాయణుని దర్శించి కర్మబంధమునుండి విముక్తుడగుచున్నాడు.

"ఓ సూర్యసంభవుడా! కాబట్టి యితర కర్మభూములయందు నీయధికారము చెల్లును. ఓ యముడా! నిన్ను ఈ పుణ్యక్షేత్రమున అరికట్టుటవలన కలతచెందకుము. నీకును పురుషోత్తముడే భగవంతుడు, ఇచటనే బ్రహ్మకూడ కాకి విష్ణు సారూప్యము నొందుటను కుతూహలముతో పరికించెను. నరుడు సర్వప్రాణుల కర్మ పరిపాకమును తెలిసికొని, ఈ క్షేత్ర మాహాత్మ్యమును గ్రహించి గదా



ధరుడు దేవుడునగు నిన్ను స్తుతించి నీయధీనుడగుట ఉచితము. కాని అట్టి వాడిచట నుండడు. ఓ వైవస్వత! ఇచటి జీవులు జీవన్ముక్తులు, ముముక్షువులయి నివసించుచున్నారు.

7. యముడు లక్ష్మీదేవితో పలుకుట :

ఓ జననీ! నీవాజ్ఞాపించిన విషయము నాకింతకు పూర్వము తెలియదు. నేనజ్ఞానిని, ఉత్తమమయిన రహస్యమునెట్లు ఎరుగగలను. పితామహుండుకూడ ఏ పురుషోత్తముని రూపము వేదములని తెలిసికొనలేక పోవుచున్నాడో, అట్టి మహాత్ముని మహిమను అహంకార భూయిష్ఠుడనగు నేనెట్లు తెలిసికొనగలను.

ఓ సురేశ్వరి! ఈ పురుషోత్తమక్షేత్రము వాసుదేవుని సాన్నిధ్యమువలన ముక్తిప్రదమని నుడివితివి. ఈశ్వరేచ్ఛ నిరంకుశమయినది. అన్య స్థలములయందు బంధమును కలిగించు విష్ణువు ఈ క్షేత్రమున ముక్తిప్రదుడు. అంబా! నన్ను, నరకములను స్వర్గములను సృజించినవాడు ఈ పురుషోత్తముడే. ఇక్కడ మృతినందినవారికి ముక్తికలుగు విధమును, క్షేత్రసంస్థా ప్రమాణమును, ఇచట నివసించుటవలన కలుగు ఫలితమును ఈ పుణ్యక్షేత్రమున గల యితర తీర్థములను, ఇతర రహస్య విషయములను మరియు ఏ అధిష్ఠానమును నేను విడిచి నిర్భయముగా సంచరింపగలనో అద్దానిని స్పష్టముగా చెప్పుము.

## 3వ అధ్యాయము

1. లక్ష్మీదేవి యమునితో సంభాషించుట :

ఓ రవినందనా! యమధర్మరాజా! ఈ విష్ణు సాన్నిధ్యము వలన నీకు సద్బుద్ధి కలిగినది. ఈ క్షేత్రముయొక్క అద్భుతమయిన మహిమను చెప్పుచున్నాను, వినుము. చరాచరమైన యీ జగత్తు పూర్వము ప్రళయకాలమున లీనమయి ఉండగా నేను విష్ణువక్షఃస్థలస్థితనై దానిని చూచితిని అప్పుడీ క్షేత్రము నేను మాత్రమే ఉంటిమి. అప్పటికి మృకండుని సుతుడయిన ముని ఏడు కల్పములకాలము ఆయుఃప్రమాణము కలవాడై ప్రళయ సమయమున స్థావర జంగములు నశింపగా వానితో అతడుకూడ మునిగిపోయెను. అతడుండుటకు చోటులేనందున ఎచటను భద్రత చేకూరలేదు. ఆముని ప్రళయ సమయమున జలార్ణవములో ఇటు, అటు తిరుగుచు పురుషోత్తమ తుల్యమయిన క్షేత్రమున వటవృక్షమునుగాంచెను. అతడు ఆ వృక్షమూలమునెక్కి, యొక్క, దాని సమీపమున ఈ బాలవచనమును వినెను. ఓమార్కండేయా! నా సమీపమునకు వచ్చి అతులమైన దుఃఖమును విడువుము" అను, ఉపశీతమయిన చిత్రవచనము

ఆ ముని విని ఆశ్చర్యముతో తన దుఃఖమును కూడ మరచెను. ప్రళయ కాలమున జలార్ణవములో నీటిచే ఈ పురుషోత్తమ క్షేత్రము తడియక కాలవహ్నిచే దహింపబడక, సంవర్తకాదులచే శోషింపబడక, చలింపక, మహాఘోరమయిన ఏకార్ణవమందున్న నావ వలె కనబడెను. అట మహావటవృక్షమొక యూపమువలె నున్నది.

కావుననే ఈ క్షేత్రము, వటవృక్షము ప్రభువు యొక్క శరీరమువలె పవిత్రములు, మహాప్రళయకాలమందయినను ఆ తరుశాఖకూడ కదల లేదు. ఆ మార్కండేయముని ఆ వటవృక్షము క్రింద ఉపవిష్టుడై యిట్లు చింతించెను.

"ప్రళయకాలమందు స్థావర జంగమ సృష్టి అంతయు ఈ ఏకార్ణవమున నష్టమయినను ఈ భూప్రదేశము మిక్కిలి స్థిరముగా ఉండగలదని ఎట్లూహింపవగును"! అని మార్కండేయుడు చింతింపినట్లు లక్ష్మీదేవి యమునితో చెప్పెను.

"ఓ మార్కండేయా! ఈ వృక్షశ్రేష్ఠము కోమలముగా కనిపించుచున్న స్థలమునకు రమ్ము" అని అభిమానపూర్వకమయిన పలుకులను, ఆమార్కండేయముని విని ఈ క్షేత్రమెందులకు నిరాశ్రయమైనదని ఆలోచించి, దాటుచు, శంఖ చక్ర గదాపాణియగు శ్రీమన్నారాయణుని, తదంగ పద్మాసనస్థయగు నన్నును, ఆముని గాంచె" నని లక్ష్మీదేవి యమునితో చెప్పెను.

పిమ్మట మార్కండేయముని జలవాయు బాధా వివశుడై తేరుకొని సంతుష్టాంతరంగుడై దేవునికి సాష్టాంగప్రణామమాచరించి నారాయణుని కరుణకై ఇట్లు స్తుతించెను.

2. మార్కండేయముని విష్ణువును నుతించుట :

"ఓ విష్ణు దేవా! ఓకృపాసాగరా! నీ పాదపద్మములను ఆశ్రయించుటయందునురక్తికల్గి, రుద్రేంద్రబ్రహ్మల కరుణకు పాత్రుడను. నీయందు గాఢమైన భక్తిలేక వ్రతభ్రష్టుడను. దీనుడనయిన నన్ను రక్షింపుము.

ఓ కృపార్ణవా! బ్రహ్మాదులచే పరిచర్య చేయబడుచున్నట్టియు, ఊహాతీతమయిన శక్తితో కూడిన నీ పాదపద్మద్వంద్వము మోక్షప్రాప్తికి నిదానము.

నీ లీలావిలాసతో ఏర్పడిన సృష్టిస్థితి లయాత్మకమగు ఈ జగమంతయు అనేక కోటిరెట్లు ప్రకాశించు చున్నది.

ఓ విష్ణు దేవా! దీనుడయిన నన్ను రక్షింపుము. బంగారమొక్కటే కటకాది భేదములచే వివిధాభరణములుగా రూపొందు చున్నట్లు, ఆకాశమున ఉద



యించు సూర్యుడు భిన్నాధారములు గల జలములందు వివిధముగా గోచరించుచున్నట్లు నిర్గుణుండగు నీవొక్కడవే, వివిధాకారములతో భాసించుచున్నావు. సమస్త సంపూర్ణకాంతిమంతుడవయి ఉపాదాన సంకల్ప వివర్జితుడవయినను అపారశక్తియుతుడవై ప్రతియుగమునందును దీనులననుగ్రహించుటకు ఉచితమైన దేహమును ధరించు చున్నావు.

ఓ కృపాసాగరా! జగదీశా! పూర్వము నేను ఆత్మలాభపరిహీనుడనగుటచే నీపాద పద్మములను సేవింప లేక పోయితిని. అట్టిసత్కర్మను ఆచరింపనందున దారుణ ఫలితము నందిన నన్ను కాపాడుము.

ఓ మహాత్మా! సమస్త సృష్టి స్థితి లయ విలాసమయిన నీ గుణత్రయము ప్రకాశించుచున్నది, నీ శరీరము మహదాదులకు కారణభూతమగు చున్నది. అట్టి కారణమయిన ప్రకృతికంటె శ్రేష్ఠుడవయిన నీకు నమస్కారము. అంతటను బాగుగా వ్యాపించి ఊహాతీతముగా ప్రవర్ధమానమగుచు నీయందు బృంహితమై, పరిణామహేతువై స్వాధ్యాత్మ విశ్వాత్మకమయిన ఆ బ్రహ్మరూపమును ఆశ్రయించుచున్నాను.

ఓ లక్ష్మీపతీ! మహాఘోరమైన ఏకార్ణవమందు వర్షజల వాయుపీడవలన నిలుచుటకు చోటులేదు" అని బ్రహ్మర్షియగు మార్కండేయుడు స్తుతింపగా, నారాయణుడు వానిని అనుగ్రహముతో చూచి, క్రిందివిధముగా చెప్పినట్లు లక్ష్మీదేవి యమధర్మరాజుతో అనెను.

3. భగవంతుడు మార్కండేయునితో పలుకుట :

"ఓ ద్విజోత్తమా! మార్కండేయా! నన్నెరుగక అతిదీనుడవయితివి. అతి కఠినమయిన తపమాచరించితివి. అందువలన నీకు దీర్ఘాయువుమాత్రమే లభ్యమగును. కల్పవటవృక్షమునకు ఊర్ధ్వమున నుండి తత్పత్రపుటమున శయనించిన బాలస్వరూపుడను, అందరికి కాలస్వరూపుడనయిన నన్ను గాంచుము. అక్కడ విశాలముగానున్న చెట్టుతొర్రలో ప్రవేశించి అందులో ఉండుము" అని విష్ణువు మార్కండేయునితో చెప్పెను.

4. లక్ష్మీదేవి యమునితో సంభాషించుట :

ఓ యమధర్మరాజా! ఆ మార్కండేయముని భగవంతుని మాటలు విని ఆశ్చర్యచకితుడై వటవృక్షమునెక్కి బాలుని రూపమును గాంచెను. అతని ముఖమునందు ప్రవేశించి, కంఠమార్గమునబోగి, మహాయామమును మహోదరమును ప్రవేశించి అక్కడ ఆ విప్రుడు చతుర్దశ భువనములను అవలోకించెను. మార్కండేయముని ఆ బాలుని కుక్షియందు బ్రహ్మాదిదేవతలను, దిక్పా

లకులను, సిద్ధగంధర్వ రాక్షసులను, ఋషులను, దేవర్షులను, సాగరపర్యంతముగల భూప్రదేశమును, నానాతీర్థములను, నదులను, పర్వతములను, అరణ్యములతో కూడిన పట్టణములను, గ్రామములను చూచెను. వేలకొలది నాగకన్యలను అత్యున్నత మణిసౌధములతోడను సుధాపాత్రములతోడను ఒప్పుచున్న సప్తపాతాళలోకములను సముజ్జ్వలములు, అమూల్యములైన మణులతో ఒప్పుచున్న సర్పములచే, సేవింపబడుచున్న ఆదిశేషుని ఆ ముని చూచెను. ఆ యాదిశేషుడు పరమాద్భుతమయినవాడు. సహస్రఫణామండితుడు, జగములను తన శిరస్సులపై ధరించువాడు. వ్యాకరణమును రచించినవాడు. ఆతనిచుట్టు శిష్యులుపనిష్ఠులై అధ్యయనము చేయుచుందురు. అట్టి ఆదిశేషుని మార్కండేయుడు దర్శించెను. అంతియేకాక ఆ మహాముని బ్రహ్మ సృష్టించిన బ్రహ్మాండోదరములో నున్న సమస్త వస్తుజాలమును ఆ బాలుని కుక్షిలో చూచెను, ఆ ముని ఆ బాలుని కుక్షిలో ఇటునటు తిరుగుచు దాని యంతమును చూడలేకపోయెను. తరువాత అతడు బయటికివచ్చి మరల నాతో కూడ మున్ను జూచినట్లే యున్న పురుషోత్తముని గాంచి విస్మయోత్ఫుల్ల నయనుడై వానికి వందనమాచరించి మార్కండేయుడు క్రింది విధముగా భగవంతునితో సంభాషించినట్లు, లక్ష్మీదేవి యమునితో అనెను.

5. మార్కండేయముని భగవంతుడయిన విష్ణువుతో పలుకుట :

"ఓ దేవదేవేశా ! భగవంతుడా ! ప్రభూ ! ఇది యెంత ఆశ్చర్యముగా నున్నది. మహాప్రళయ సమయమున అణచివేయబడిన సృష్టి ఇచట కానవచ్చుచున్నది. సులభగ్రాహ్యముకాని, నీ మాయ నాకెట్లు తెలియగలదు," అని మార్కండేయుడు విష్ణువుతో పల్కెను.

6. భగవంతుడు మార్కండేయునితో వచించుట :

"ఓ మునీంద్రా ! ఈ క్షేత్రము చిత్రమయినది. శాశ్వతమయినది. ఇట సృష్టి ప్రళయములు సంసారమునుండవు. నన్ను కేవలము సత్స్వరూపునిగా, పురుషోత్తమునిగా, ముక్తిప్రదునిగా, తెలిసికొని, ఇందు ప్రవేశించువాడు, సాంద్రసుఖస్వరూపుడై పునర్జన్మమునందడు," అని విష్ణువవలన వినిన మార్కండేయుడు, అన్యతీర్థ పరాఙ్ముఖుడై ప్రహృష్టవదనుడై అచటనే నివసించుటకు నిశ్చయించుకొని భక్తిశ్రద్ధా సమన్వితుడై ఇట్లనెను.

7. మార్కండేయుడు భగవంతునితో నుడువుట :

"ఓ పురుషోత్తమా ! ఈ పురుషోత్తమ క్షేత్రమున నేనేమి చేసినచో మృత్యువును పొందనో అట్టికర్తవ్యమును తెల్పుము," అని మార్కండేయుడు విష్ణువునడిగెను.



8. భగవంతుడు మార్కండేయునకు సమాధానము చెప్పుట :

"ఓ విప్రర్షీ ! ప్రాణికోటి సంచరించునంతకాలము నేను మోక్షప్రదనుయిన క్షేత్రమున నుందును. సందేహమక్కరలేదు. ప్రళయావసానమున నీకు శాశ్వతమయిన తీర్థమును నిర్మింపగలను. దీని తీరమందు తపోనిష్ఠలోనుండి, నా ద్వితీయ దేహమయిన శివుని ఆరాధించి, నా యనుగ్రముచే నిశ్చయముగా మృత్యువును జయింపగలవు" అని భగవంతుడు మార్కండేయునితో చెప్పెను.

9. జైమిని ఋషులతో పలుకుట :

"ఓ ఋషులారా ! మార్కండేయముని విష్ణువుచే ఇట్టి వరమును బడసి, వటవృక్షమునకు వాయవ్యకోణమున శ్రీహరి చక్రముచే త్రవ్వబడిన పవిత్రమయిన గోతిలో నివసించుచు మహేశ్వరుని పూజించి తీవ్రముగ తపస్సుచేసి అల్పకాలముననే మృత్యువును జయించెను. ఆ మార్కండేయుని నామముతో ప్రసిద్ధమయిన ఆ ఉత్తమగర్తములో స్నానమాచరించి శివుని దర్శించు వానికి అశ్వమేధఫలము లభించును," అని జైమిని ఋషులతో చెప్పెను.

10. లక్ష్మీదేవి యమునితో పల్కుట :

"ఓ యమధర్మరాజా ! సముద్రాంతర్భాగమందున్న యాక్షేత్రము పంచక్రోశవిస్తీర్ణము కలది. ఈ తీర్థరాజముయొక్క తటమందు నిర్మలమైన రెండు క్రోశముల పరిమాణముగల స్థలము, సువర్ణమువంటి యిసుకతో కూడి నీలాచలముతో శోభించుచున్నది. ఇచటి యా విశ్వేశ్వరుడు సాక్షాత్తు నారాయణాత్మకుడై ఇంద్రియములను జయించి జగన్నాథుని ఉపాసించుటకు సముద్రతటమందున్న అరువదినాల్గవ ప్రభువు.

ఈ మహేశ్వరుడు యమబంధమును తొలగించువాడు కనుక యమేశ్వరుడని ప్రసిద్ధుడయ్యెను. ఈ యీశ్వరుని దర్శించి పూజించినవారికి కోటిలింగార్చనవలనకలుగు ఫలము ప్రాప్తించును" అని లక్ష్మీదేవి యమునితో పల్కెను.

## 4వ అధ్యాయము

1. లక్ష్మీదేవి యమునకు పురుషోత్తమక్షేత్ర మహిమను తెల్పుట :

శంఖాకారముగల యీ క్షేత్రమునకు పశ్చిమదిశ హద్దు. ఆ క్షేత్రమునకు ఊర్ధ్వభాగమున వృషభధ్వజుడు అను పేరుగల దేవుడున్నాడు. అతడు సర్వభక్తుల కోర్కెలను దీర్చగలడు. శంఖాకారముగల యీ క్షేత్రముయొక్క చివర

నీలకంఠుడు అను దేవుడున్నాడు. క్రోశపరిమాణముగల యీ క్షేత్రము సాక్షాత్తు శ్రీమన్నారాయణునకు నివాసస్థలమగుటచే, సుదుర్లభము, పరమపావనమయి నది. సాగరజల పర్యంతము వటవృక్ష మూలమున్నది. ఈ క్షేత్రమందలి శంఖాకారముయొక్క ఉదరభాగమును సముద్రజలము తాకుచున్నది. ఇట్టి సంపర్కమువలననే ఇచటి సముద్రప్రాంతము తీర్థరాజమయినది. భగవంతుడు దీనిపైని దృష్టిని ప్రసరింపజేసి ఈ తీర్థమున గ్రుంకినవారికి మోక్షమునిచ్చు చున్నాడు. మరియు ఈ పుణ్యక్షేత్రమునందు మరణించినవారికి, ఈ సముద్రతీర్థమున స్నానమాచరించినవారికి ముక్తికలుగుచున్నది.

రుద్రుడు కోపముచే బ్రహ్మయొక్క పంచమశిరస్సును ఖండించినపుడు బ్రహ్మ తెగిన తన తలను విడువలేక దానిని పట్టుకొని బ్రహ్మాండమంతయు పరి భ్రమించెను. తుదకు బ్రహ్మ తిరిగివచ్చి తెగిన తన కపాలమును యీ పురు షోత్తమక్షేత్రమున విడిచెను. ఈ క్షేత్రముయొక్క ద్వితీయావర్తమున కపాల మోచనమను లింగమున్నది. ఆ లింగమునెవడు చూచునో, పూజించునో, నమ స్కరించునో వాడు బ్రహ్మహత్యాదిపాప సంచయమునుండి విముక్తుడగును. ఇందున్న కపాలమోచన లింగమునకు దక్షిణపార్శ్వమున మరణించినవానికి పునర్జన్మముండదు.

ఓ యమధర్మరాజా ! ఈ క్షేత్రముయొక్క తృతీయావర్తమునందున్న మొదటి శక్తిపేరు విమల. అది నావలననే ఉద్భవించినది. ఆశక్తి భక్తులకు భుక్తిముక్తులొసగును. ఎవడీశక్తికి భక్తితో ప్రణమిల్లునో, స్తుతించునో వానికి అన్ని కోరికలు ఫలించి, అంతమున ముక్తి ప్రాప్తించును. శంఖాకారముగల యీ పురుషోత్తమక్షేత్రముయొక్క నాభిలేక మధ్యప్రదేశమున కుండము, వటవృక్షము, ప్రభువు అను ముగ్గురున్నారు. చక్రపాణియగు విష్ణువుచే, కపాలమోచన లింగప్రాంతమున అరాశిని అను శక్తి ప్రతిష్ఠింపబడినది. నా శక్తియే ప్రళయకాలమునందు వృద్ధిపొందు జలములో అర్థభాగమును త్రాగు చున్నది. అందుచే నా యీ శక్తికి సృష్ట్యాదియందు అర్థాశిని అను పేరు వచ్చినది. ఆశక్తిని గాంచి నమస్కరించువారికి శాశ్వతభోగములు లభించును. ఈ క్షేత్రమునందున్న వటవృక్షమూల పర్యంతమున్న సముద్రజలములో మునిగిన కీటక పక్షి మనుష్యులకు జననమరణ రహితమగు ముక్తి కల్గును. అంత ర్వేది అనబడు ఈ తీర్థము చాల పవిత్రమైనది. దేవతలుకూడ ఈ తీర్థమును వాంఛింతురు. చక్రాబ్జధారియగు విష్ణువుయొక్క సర్వస్వమును ఇచట చూడ గలరు. భూమ్యాకాశ స్వర్గములందున్న మూడున్నరకోట్ల తీర్థములు స్వర్గ మోక్షప్రదములు. వానిలో శ్రేష్ఠమయిన ఈ పురుషోత్తమ తీర్థము సుప్రసిద్ధ మయినది. ముక్తిప్రదములగు క్షేత్రములన్నింటిలో ఇది సాయుజ్యప్రదమగు



చున్నది. ఈ క్షేత్రవాసులు జన్మజరామరణ సమయములందును దుఃఖింపరు, రోహిణమను పేరుగల యీ కుండము నిత్యము కారుణ్య జలపూరితమై యుండును. దీనిని స్పృశించువారికి ముక్తి కల్గును దీనియందలి జలము ప్రళ యమున వృద్ధినొందుచు పిమ్మట ఇందే లీనమగుచున్నది. కావుననే ఈ కుం డమునకు రోహిణమను పేరు కలిగినది.

కావున ఓ యమధర్మరాజా ! నీకీ క్షేత్రముపైని అధికారము లేనందులకు విచారింపకుము. నీవు పరేతరాజవు. ఇక్కడనుండు మోక్షాధికారులపై నీకధి కారము లేదు" అని లక్ష్మీదేవి ధర్మరాజునకానతియిచ్చి, ఎదుటనున్న బ్రహ్మతో సాదరముగ ఇట్లు పలుకనారంభించెను.

"ఓ పితామహా ! ఇదంతయు జగన్నాథునకు తెలిసిన విషయమే, సర్వ ప్రాణులకును ఈ పురుషోత్తమక్షేత్రమును మోక్షప్రదముగాను, కామాఖ్యుని దీనికి క్షేత్రపాలునిగాను ఆదేశింపుము. ఈ కాముడు సాక్షాత్తు బ్రహ్మ స్వరూ పుడు. విష్ణువునకు దక్షిణముననున్న యీ నృసింహస్వామి హిరణ్యకశిపుని వక్షః స్థలమును చీల్చి ఇట్లు ఉజ్జ్వలమగు ప్రభతో వెలుగుచున్నాడు. ఈతనిని దర్శించువారికి పాపములు నశించి భుక్తిముక్తులు లభించును, సందేహము లేదు. ఈతని సన్నిధిని ప్రాణములు విడుచువారికి బ్రహ్మ సాయుజ్యము కల్గును. ఇచట ఏమాత్రము సత్కర్మనాచరించినను కోటి గుణితమగును. కల్పవృక్షముయొక్క యీ ఛాయ నృసింహార్కునిచే ప్రకాశించుచున్నది. ఈ ఛాయలో తెలిసియో తెలియకయో మరణించినవారికిగల అవిద్య నశించును. వేదాంతములందలి విజ్ఞానప్రదములగు విషయములను వినలేకపోయిన మూఢు లకు గూడ ఇచట ముక్తికల్గును. ముక్తిపొందలేనివానికిని ఈ క్షేత్రమున ముక్తియందు కోరిక కల్గును. అట్టివాని చెవిలో కృపానిధియగు మహేశ్వ రుడు బ్రహ్మసంజ్ఞగల బోధోపాయమును చెప్పును. ఆ బుద్ధితో సాధనచేయు వాడు క్రమముగా మోక్షమునందగలడు."

పిమ్మట లక్ష్మీదేవి :

"ఓ యమధర్మరాజా ! ఉపదేష్టయయిన మహేశ్వరుని మహిమచే సాధకుని ప్రభావము తగ్గదు. ఇట ప్రాణములు విడుచువారికి స్వరూపజ్ఞానమువలన ఆ క్షణమునందే ముక్తి కల్గును. ఎవ్వరును దీని విషయమై సంశయింపనక్కర లేదు.

ఓ వైవస్వతా ! మూఢులకు, ప్రయోజనములేని గతాగత ప్రసంగములచే కాలమును వ్యర్థముచేయువారికి, అర్థరహితములయిన కర్మలనాచరించువారికి

ఈ పురుషోత్తమక్షేత్రమహిమయెడల విశ్వాసము కలుగదు. నిర్మలము, శీతలము, పానయోగ్యము, రుచికరమయిన గంగాజలమును విడిచి పిపాసువు మురికిగుంటలోని నీటిని త్రాగుటకు పరుగిడుచున్నట్లు ఈ యుత్తమ క్షేత్రమును దర్శింపక అన్యక్షేత్రములకు మూఢులు తిరుగుచున్నారు. పలాశమోదకములచే తృప్తులయినవారు శ్రమవలన కలుగు ఫలితమునందుచున్నారు. సముద్రస్నానమువలన, దేవదర్శనమువలన, కల్పవృక్షమునీడవలనను, ఎచట నున్న పుణ్యక్షేత్రము వలననైన మానవులకు మరణము లేకుండచేసి ముక్తి నిచ్చును. ఏ నరుడు ఏ క్షేత్రమునుగాని, దైవతమునుగాని భక్తితో విశ్వసించునో వాడు దానివలననే ముక్తినొందగలడు. ఈ పురుషోత్తమక్షేత్రము వంటి తీర్థములేదు. దీనిని విడిచి అన్యతీర్థమునందెవడు ప్రీతికల్గి యుండునో వాడు లోభలాలసుడై విష్ణుమాయావంచితుడగుట నిశ్చయము. అట్టి వానికెన్ని యుపదేశించినను నిష్ప్రయోజనమే.

విష్ణురూపధారియైన యీ కరటుడు ప్రత్యక్షముగా నున్నాడు. అనుభూతి కలవాడు. అంతర్వేదిరక్షణకు అష్టశక్తులున్నవి.

పూర్వము రుద్రుడు ఉగ్రతపమాచరించి నన్ను భావనచేసెను. అతనికి భార్య అగుటకు గౌరిని సృజించితిని. పిమ్మట ఆమె సౌందర్యవతియై నా శరీరమునుండి బయల్వెడలెను. నా ప్రియమైన వాక్కును పాటింపుమని ఆమెను ఆజ్ఞాపించితిని.

ఓ భద్రా! నీమూర్తులతో ఈ అంతర్వేదిని సంపూర్ణముగా రక్షింపుము. నాయందుగల ప్రీతితో ఆమె ఎనిమిది రూపములను దాల్చి ఎనిమిది దిక్కులందుండెను. వటమూలముననున్న ఆమెపేరు మంగళ. పశ్చిమముననున్న దేవివిమల. శంఖమునకు వెనుక భాగమున నున్న శక్తి సర్వమంగళ. కుబేర దిక్కున అర్ధాశని, లంబ అను శక్తులు: దక్షిణ దిక్కున కాలరాత్రి; తూర్పు దిక్కున మరీచిక, చండరూప అను శక్తులు కలరు. ఉగ్రరూపములు గల శక్తులచే అంతర్వేది పరిరక్షింపబడుచున్నది. అల్పపుణ్యము చేసిన వానికి ఈ క్షేత్రమున తావు దొరకదు. ఈ యష్టశక్తులను దర్శించినవారికి సంకీర్తనము చేసినవారికి సర్వపాపములు నశించి అశ్వమేధ ఫలము లభించును. రుద్రాణియొక్క అష్టవిధ రూపములను చూచిన రుద్రుడయిన శంకరుడు తన్నష్టవిధములుగా భేదించుకొని పరమేశ్వరుని ఉపాసించుచున్నాడు. అతడు విష్ణువును గూర్చి తపము చేసి అతనిని ఉత్తమవర మిమ్మని ఇట్లు ప్రార్థించెను.

'ఓ దేవా! నీ వెచట నుందువో నే నచట సుఖముగా నుందును. ఓ కమలాకాంతా! నీవు నిర్వాణ మీయగలవు. ఓ ప్రభూ! అంతర్యామీ!



నాకు నీవే సర్వము. నీవులేనిచో నాకు దేహ మెందులకు? నీ మహిమ నెరుగని మూఢులు అపవిత్రములు, అశాశ్వతము లయిన విషయములకు లోనై తృప్తి పడుచున్నారు. నిర్మలాంబరసదృశుడవైన నిన్ను నేను శరణు పొందితిని' అని శివుడు విష్ణువుతో పల్కెను' అని లక్ష్మీదేవి యమునికితెల్పెను.

2. జైమినిమహర్షి మునులతో మహేశ్వరుని అష్టలింగములను గురించి చెప్పుట :

'ఓ మునులారా! భగవంతుడయిన విష్ణువు తాను మధ్య నుండి అన్ని దిక్కుల యందు రుద్రుని క్షేత్రపాలునిగా స్థాపించెను. అచట కపాలమోచనుడు క్షేత్రపాలుడు. యమేశ్వరుడు, మార్కండేయుడు, ఈశానుడు, బిల్వేశుడు, నీలకంఠుడు, వటమూలమున వటేశుడు — ఈ యెనిమిది నామములతో మహేశ్వరుని యష్టలింగములు ప్రతిష్ఠింపబడినవి. ఆ లింగములను దర్శించి, స్పృశించి, పూజించినవాడు ముక్తుడగును. ఈ క్షేత్రములో మరణించినవారిపైని యముని యాధిపత్యముండదు. నీవు చేయదలచిన పవిత్ర కార్యమును శీఘ్రముగా చేయుము. ఈ జగన్నాథుడు తన భక్తునకు తన యాత్మను సమర్పించును. ప్రపన్నార్తి హరుడగు విష్ణువును యముడు కూడ భక్తితో సంతసింపజేయును. ఈతడు తన చక్రముచే మాయను గూడ అరికట్టగలడు. స్వర్ణమయమైన ఇసుకతో గూడి విడువశక్యము గాని ఈ పవిత్రక్షేత్రమందు యమధర్మరాజును నంపించి, యమేశ్వరాలయమును నిర్మించి బాగుగా ఆలోచించి, పిమ్మట బ్రహ్మ యెదుట నున్న యముని గురించి పలికెను' అని జైమిని మునులకు వాక్రుచ్చెను.

3. లక్ష్మీదేవి బ్రహ్మతో నవించుట :

'ఓ పితామహా! ఇంద్రద్యుమ్నుడను రాజు సత్యయుగమున ఉద్భవింపగలడు. వైష్ణవుడు శాస్త్రకోవిదుడు, యజ్ఞములు చేయువాడును అగునట్టి ఆరాజు ఇచటకు వచ్చి మహాభక్తిని ప్రకటింపగలడు. ఓ ప్రజానాథా! భగవంతుని ప్రీతికొరకు అతడు వేయి అశ్వమేధ యాగములను ఆచరించును. ఒక్కదారువు మూడు భాగములు కాగా విశ్వకర్మ వానిని ప్రతిమలుగా చేయును. ఓ ప్రజాపతీ ఇంద్రద్యుమ్నుని కృపచే నీవు మాకు తగిన ప్రతిమలను ప్రతిష్ఠింతువు' అని లక్ష్మీదేవి చెప్పగా విని చతుర్వక్త్రుడు, యముడు తమ పురములకేగిరి. వారు పురుషోత్తమ క్షేత్రమహిమను సంస్మరించుకొనుచు, ఆశ్చర్య సంతోష యుక్తులై పులకితగాత్రు లయిరి.

4. జైమిని మునులతో పలుకుట :

'ఓ మునులారా ! ఇప్పుడింద్రద్యుమ్నుని కృపచే శంఖచక్రధరుడు, శ్రీమంతుడు, నీలజీమూతసన్నిభుడు, నీలాచల గుహాంతఃస్థుడు అగు విష్ణువు దారుమయ మగు దేహమును ధరించెను.

లక్ష్మీపతి లోకోపకారమునకై దారు నిర్మిత మయిన సుదర్శన చక్రమును ధరించి సుభద్రాబలరామ సహితుడై విరాజిల్లుచున్నాడు. ప్రణతార్తిహరుడు, హితంకరుడు, కరుణాసాగరుడగు ఆ విష్ణువు తన్ను దర్శింపవచ్చిన వారి పాపబంధము లెంత దృఢముగా నున్నను ఛేదించి వారిని విముక్తులను చేయు చున్నాడు.

ఓ మునిశ్రేష్ఠులారా ! సత్కర్మల ఫల మంతయు ఒక్కతడవలభ్య మయినది. తాపత్రయమునకు సుధానిధి అయిన జగన్నాథుని చూడుడు. విష్ణువు పెక్కు దివ్యావతారములను, మానవావతారములను ధరించెను. ఆ పురాణ పురుషుని యత్యద్భుత కర్మలు, మాహాత్మ్యము మహాత్ములచే వర్ణింపబడినవి.

ఓ విప్రులారా ! దేవాసుర మనుష్యులచిత్తము, గంధర్వోరగ రాక్షసుల మనస్సు పశుపక్ష్యాదులచేతస్సును, సర్వాత్మస్వరూపుడు, సర్వ సుఖప్రదుడు, దారుమయు డయిన ఆ హరి యందుండును. అనన్య స్వరూపులగు వారికి అతని వలన సుఖము ప్రాప్తించుచున్నది. వేదవాక్కులు పరబ్రహ్మానుభూతిని తెల్పుచున్నవి. సంసారదుఃఖములను పోగొట్టి అవ్యయ మయిన సుఖము నిచ్చుటచే బ్రహ్మము దారుమయమని వేదాంతముల యందు నుతింపబడినది.

ఇది విష్ణువు యొక్క నిరుపమాన మయిన ఉత్తమ స్థానము. ఎక్కడ జగన్నాథుని ప్రతిమ గురించి వినబడినను అది కనబడినను దానిని నుతింపదగును' అని జైమిని విప్రులతో అనెను.

5. జైమిని శ్రీ జగన్నాథస్వామిని వర్ణించుట :

ఓ మునులారా ! జగన్నాథుడు దీనులకు, అనాథులకు శరణ్యుడై వారిని భవవారిధి నుండి తరింపజేయుచున్నాడు. కావున అతని పాద పద్మములు చరాచర ప్రాణికోటికి సర్వదా వంద్యము లగుచున్నవి. ఆ పురుషోత్తముడు భక్తపరాయణుడు, నారాయణుడు, జగత్తుకు కారణభూతుడు, సృష్టిస్థితిసంహారములకు కారణుడు, సర్వపాపులకు మోక్షదాత, అన్ని ఆపదలను పోగొట్టి సుఖశాంతు లొసగువాడు. యోగులకు ఆశ్రయుడు. సకల ప్రాణులను, పోషించుచు, జగముల భారమును వహించువాడు, సకల భాషలను భాషించువాడు సర్వ దుష్కృత్యములను దూషించువాడు, సర్వ పాపపంకిలములను శోషింపచేయు



వాడు, నీలాద్రి నివాసి. అట్టి హరి అనన్యశరణుడు, ప్రభువు. ఓ మునులారా ! వానిని శరణు పొందుడు. ఆ స్వామి నిశ్చేష్టుడయినను, దారుశరీరి అయినను, దివ్యలీలావిలాసములను ప్రదర్శించువాడు. నరులు స్వల్పభక్తితో హరిని కొల్చినను, హరి వారి అపరాధ శతమును క్షమించును. మీకు నేనిట పాపనాశన మయిన-చరితమును చెప్పుచున్నాను వినుడు.

6. పుండరీకాంబరీషకుల చరిత్ర :

ఓ మునులారా ! దారుదేహధారి అగు పరమాత్మునిలీలచే నుదు క్షేత్రమున బ్రాహ్మణక్షత్రియులు ఇద్దరు జన్మించిరి. సమానాహార విహారములు గల వారిద్దరు ప్రీతితో మిత్రులయిరి. వారు శీలభ్రష్టులయి, నిషిద్ధ మయిన వాటినే భక్షించుచు పానము చేయుచు భోగము ననుభవించుచు మోహపరవశు లయిరి. వారికి స్వాధ్యాయ వషట్కారముల యందును, స్వధా స్వాహాదుల యందు దృష్టి లేకుండెను. వారు ధర్మరహితులై మహా పాతకములు చేసి దూషింపబడు చుండిరి. మధుపానము చేసి వారాంగనలతో సుఖముగా కాలము గడుపుచుండిరి. వారికి పారలౌకిక చింత కలలోనైనను లేదు. వారీవిధముగా ప్రవర్తించి ఆయువులో సగము వ్యర్థము చేసికొనిరి. అట్లు తిరుగుచున్న వారొకనాడు యజ్ఞవాటమును చేరిరి. ఆ ద్విజాలిద్దరు దూరమునుండి మనోహరము శాస్త్రవిహితమునగు స్తోత్రమును వినుచుండిరి. వారు వేదప్రోక్తములయిన సర్వక్రియల నటమాని, అధార్మికు లయినను ధర్మవర్తనమునందు శ్రద్ధచూపిరి. పుండరీకాంబరీషక నామధేయు లయిన ఆ బ్రాహ్మణ క్షత్రియు లిరువురును అపుడు తమజాతిని జ్ఞప్తికి తెచ్చికొని తమ దుశ్చరిత్రమును పరస్పరము నిందించుకొని కూలంకషమయిన స్వీయ దుష్కృతార్ణవమును దాటుటయెట్లని విచారింపసాగిరి. ఈ జన్మమునందే బుద్ధి పూర్వకముగా పాపము ఉపార్జింపబడినదనియు ఆ పాప పరిహారవిధానము శాస్త్రమువలన నెరుగుట శక్యముకాదనియు జన్మాంతర సంచితమునకు ప్రాయశ్చిత్తము సుదుర్లభమే అని వారు భావించిరి. సభాసదులు, బ్రహ్మిష్ఠులయిన అచటి బ్రాహ్మణులను వందనపూర్వకముగా తమ పాపవిముక్తినిగూర్చి అడుగదలచిరి. అట్లు ఆబ్రాహ్మణక్షత్రియులిరువురు నిశ్చయించుకొని విప్రులకు నమస్కరించి తమ పాపకర్మములను పదేపదే తెల్పుచుండగా, ఆ విప్రులు వారిమాటలు వినుచు, నిమీలితాక్షులై, విస్మితాననులై ఒకరినొకరు చూచుచు ఏమియు పలుకకుండిరి. ఆ దుర్మార్గుల దుష్టకర్మలు చాల ఘోరమయినవి కావున శాస్త్రసమ్మతముగా వారి పాపములకు ప్రాయశ్చిత్తముచేయ సాధ్యముకాదని, ఆ సభలోని బ్రాహ్మణు లనుకొనిరి. వారి మధ్యనున్న ప్రధానసభ్యుడు భగవద్భక్తిమాహాత్మ్యముచే

కల్మషరహితుడు, వాక్యవిదులలో శ్రేష్ఠుడునగు ఒకానొక వైష్ణవ పుంగవుడు వచ్చుచు వారి నుద్దేశించి యిట్లుపలికెను.

7. వైష్ణవుడు పుండరీకాంబరీషకులకు శ్రీ జగన్నాథక్షేత్ర మహిమను చెల్పుట :

ఓ ద్విజులారా! అతిదారుణమయిన క్షత్ర దాయాద పాపరాశివలన ముక్తిని కోరుచున్న మీరిరువురును పురుషోత్తమమనబడు క్షేత్రరాజమునకుపొండు. అచట పురుషోత్తముడు దారుమయుడై విరాజిల్లుచున్నాడు. ఆ ప్రభువు రాజర్షి యయిన ఇంద్రద్యుమ్నుని భక్తికిమెచ్చి అనుగ్రహించెను. శంఖచక్రగదాధరుడయిన ఆ జగన్నాథుని ఆరాధించి పాపక్షయమును లేదా ముక్తిని నిశ్చయముగ పొందుడు. మీ ఘోరపాపతూలరాశికి ఆ జగన్నాథుడు దావాగ్నిసదృశుడు. కోటిజన్మములెత్తి తపమాచరించినను మీ పాపక్షయము చేసికొనుట శక్యము కాదు. ఆ జగన్నాథునొక్కమారు చూచినంతనే సర్వపాపక్షయమగును. కావున మీరు ఆలస్యము చేయక ఆ పురుషోత్తమ క్షేత్రమునకు వెళ్లవలయును. దక్షిణ సముద్రతీరమునందున్న పవిత్రమయిన ఉత్కళదేశమున నీలాద్రిశిఖరమున నివసించుచున్న శరణ్యుడయిన ఆ జగన్నాథస్వామిని దర్శించుటకు మీరు పోవలయును. ఆ దేవుడు కృపానిధి. మీ కోరికను నెరవేర్చగలడు, అని వారిరువురితో వైష్ణవుడు చెప్పెను.

'ఓ విప్రులారా! ఆ బ్రాహ్మణక్షత్రియులిరువురు వారిచే ఆజ్ఞప్తులై సంత సించి పురుషోత్తమక్షేత్రమునకటనుండియే ఏగిరి' అని జైమినిముని ఋషులతో చెప్పెను.

## 5వ అధ్యాయము

1. పుండరీకాంబరీషకులకు శ్రీ జగన్నాథస్వామి ప్రత్యక్షమగుట :

పశ్చాత్తాపము నొందిన పుండరీకాంబరీషకులను ద్విజులు వేశ్యాది సంగమ వర్జితులై శుద్ధాహారవ్రతులై మనసులో విష్ణువును ధ్యానించుచుండిరి. వారు స్వల్ప కాలముననే హరియొక్క నీలాద్రినిలయమును చేరిరి. వారు పుణ్యతీర్థమున గ్రుంకి విధిపూర్వకముగా ప్రాసాదద్వారమునుండి సాష్టాంగ వందన మాచరించి భగవద్దర్శనమునకు నిరీక్షించు చుండిరి. వారికి దేవదర్శనము ప్రాప్తింపనందున వ్యాకులచిత్తులై వివర్ణవదనులై భగవద్దర్శనము పర్యంతము ఆహారమును సేవింప కుండిరి. ఆ ద్విజులిద్దరు కల్మషహారమగు శ్రీ భగవన్నామస్మరణ చేయు



చుండగా, మూడవదినమున మూడవజామున ఒక జ్యోతిని దర్శించిరి. వారు చిత్త వృత్తిని నిరోధించి మరల మూడుదినములు ఉపవాస ముండిరి. సప్తమరాత్రి మధ్యలో వారికి భగవద్దర్శనము ప్రాప్తించినది. బ్రాహ్మణుల స్తుతులను విని వారుభయులు దివ్యజ్ఞానసంపన్నులయిరి. పాపరహితులయినవారికి సాక్షాత్తు దేవదర్శనము లభించినది.

2. శ్రీ జగన్నాథుని వర్ణనము :

శంఖచక్రగదాపాణి, దివ్యాలంకారభూషితుడు, రత్నపాదుకలపై తన పాద పద్మముల నుంచినవాడు, వికసిత పద్మాక్షుడు, ప్రసన్నవదనుడు, ప్రభువయిన జగన్నాథుని, హరిని, పుండరీకాంబరీషకులను బ్రాహ్మణక్షత్రియులు చూచిరి. హరి వామపార్శ్వము నందున్న లక్ష్మీదేవిని తన వామబాహువుతో ఆలింగనము చేసికొని పరిహాసమునకు లక్ష్మి తీసికొనిన తాంబూలమును స్వీకరించెను.

రత్నవేత్రపాణులు కొందరు, చామరపాణులు మరికొందరు, లక్ష్మీనారా యణులను సేవించిరి. బాగుగా అలంకరించుకొనిన యువతులు కొందరు గంధ తైలదీపములను రత్నవర్తిదీపికలను, తమ హస్తములతో ధరించిరి. ఒక సుందరి శ్రీపాదులవెనుక నిలుచుండి రత్నమయఛత్రమును పట్టుకొనెను. ముఖ ధూపమునకై కృష్ణాగురుధూపయుక్తమగు పాత్రను మరొక స్త్రీ చేత ధరించెను. మందహాసము చేయుచున్న ఒక అప్సరఃస్త్రీకూడ అటనుండెను.

ఆ బ్రాహ్మణక్షత్రియులిరువురు గాంచుచున్న హరిసుందర విగ్రహముతో శోభాయమానుడై తనయెదుట బద్ధాంజలులై నమ్రకంధరులై స్తుతించుచు నుండున్న వారిని విలాసదృక్కులతోడను, సిద్ధులను, మునీంద్రులను, దివ్యులను, సనకాదులను వేరువేరుగా మందహాసముతోడను, నారదాదులను దివ్యగాన మనో హరులయిన గంధర్వులను లీలచేతనే అనుగ్రహించెను. హరిస్వరూపమును ధ్యానించుచు ఎదుటనున్న ప్రహ్లాదాదులను వైష్ణవ శ్రేష్ఠులను స్వామి తనదేహ మందు వారిచిత్తము లీనమగునట్లు చేయుచు, తన విశ్వరూపమూర్తియొక్క వక్షః స్థలమున ప్రకాశించుచున్న కౌస్తుభమున ప్రతిబింబించుచున్న దేవతలతో ప్రకా శించుట, ఉపరిభాగమున దివ్యమయిన పుష్పవృష్టివలన క్రిందిభాగమున శ్రీ సన్ని ధానమునున్న అప్సరఃకాంతలు కాంతిహీనలగుట మొదలగు హరిలీలలను చిత్యము అంగహారమనోహరుడు దివ్యలీలావిలాసుడయిన హరిని ఆ బ్రాహ్మణ క్షత్రియ మిత్రులు గాంచి క్షణకాలములో సర్వవిద్యాపారగులయిరి.

వారిరువురు ముకుళితహస్తులై దేవేశుడగు హరికి ముమ్మారు ప్రదక్షిణము చేసి సాష్టాంగ దండప్రణామమాచరించి సంతసముతో తృప్తినందిరి.

3. పుండరీకుడను విప్రుడు శ్రీజగన్నాథుని నుతించుట :

'ఓ జగదాధార! సృష్టిస్థిత్యంతకారణ! ఓ నారాయణ! పరమాత్మ! పరాయణ! నీకు నమస్కారము. పరమార్థము నీవే. జన్మరహితుడవు. నిత్యానంద స్వరూప! విశ్వాత్మ! జగన్నాథ! పరాత్పర! అధిష్ఠానుడ! నిన్ను ధ్యానలోచను లయిన సత్పురుషులు తెలిసికొనుచున్నారు.

ఓ స్వామీ! మూఢస్వాదయులు, కామాది వివశులు, అత్యంత దుఃఖస్వభావులు, విశ్రాంతిరహితులు, సంభ్రాంతచిత్తులు, సుఖభోగలాలసులు, గతాగత కర్మ ఫలములను ఆలోచించి క్రుంగిపోవువారు, పరమ పవిత్రుడవయిన నిన్ను ఎన్నడయినను తెలిసికొనగలరా ?

ఓ ప్రభూ! దీనుడు, శరణాగతుడు, మూఢుడు, పాపకర్ముడు, భవసాగర పతితుడు అయిన నన్ను అనుగ్రహింపుము.

ఓ దీనబాంధవా! ఈ బ్రహ్మాండమందు నీవంటి బంధువు, దీనానాథ రక్షకుడు, స్వకర్తవ్యాపేక్షకుడు ఎవ్వడయినను కలడా ?

ఓ కృపాసాగర ! బహుప్రకారములుగా భ్రమించుటచే దుఃఖితుడు జలయంత్రఘటివలె నిత్యము కర్మబద్ధుడు అగు నన్ను రక్షింపుము.

ఏ మూఢులు తమ యోగక్షేమమునకే స్వార్థపరులై లీలాముక్తిప్రదుడ వగు నిన్ను ఉపాసించుచున్నారో వారు నీ మాయామోహితులు.

ఓ జగన్నాథ ! స్వేచ్ఛగా 'నారాయణ' అను నీ నామమును స్మరించినచో నీకంటె అధికమైన చతుర్వర్గసాధన మేమున్నది ? నీవే ఆయా భిన్నభిన్న యజ్ఞములతో ఆయా సిద్ధులను ప్రసాదించుచున్నావు.

ఓ లోకనాథ ! భవార్ణవమున పడిన వారికి నీవే శరణ్యుడవు. ఓ ప్రభూ ! అనన్యభక్తితో ధ్యానింపబడిన నీవే జ్ఞాననౌకపై నుండి కరుణాక్షేపణిని కరమున దాల్చి చైతన్యరహితుడగు భక్తుని సంసారాబ్ధియొక్క పారమును పొందించుటకు తలంచుచున్నావు.

శాస్త్రముల యందు పేర్కొనబడిన ముక్తిప్రదులగు దేవతలు దుఃఖాబ్ధిలో మునుగకుండుటకు శక్తియుక్తిని ప్రసాదింపగలరు.

ఓ భగవంతుడా ! ఓ జగన్నాథా ! నేను అష్టాంగయోగాభ్యాసము చేయలేకున్నను, ఘోరము సుదుస్తర మగు సంసారసాగరమును దాట శక్యమగు నీ పదపంకజములపైని దృఢభక్తి నాకు ప్రసాదింపుము.

ధర్మార్థకామములచే కుమతులు కోరుకొను క్షుద్రములు అహితాల్ప సుఖములపై నాకు వాంఛలేదు. ఇవుడే నీ పదపంకజధ్యానముచే కల్గు



ఆనందసాగర నిమజ్జనము నాకు అనుగ్రహింపుము అని పుండరీకుడను ద్విజుడు స్తుతించి గద్గదస్వరముతో బాష్పార్ద్రవాక్కుతో కృష్ణా ! త్రాహి అని పల్కుచు జగదీశుని పాదపద్మాంతికమున పడెను. అతడు మరల లేచి చేతులు జోడించి నుతించుచు అట నుండెను.

4. అంబరీషుడను క్షత్రియుడు శ్రీజగన్నాథస్వామిని స్తుతించుట :

ఓ సర్వాత్మ ! అసంఖ్యేయ శిరోభుజ ! దేవ ! నన్ననుగ్రహింపుము. అసంఖ్యఘ్రాణనయనపాణిపాద ! నీకు నా నమస్కారములు. నీవు మున్పది యారు తత్త్వముల కతీతుడవు. నిష్ప్రపంచ ప్రపంచకుడవు. చతుర్విధ పురుషార్థఫలప్రదుడవు. జగద్ధాముడవు. విశ్వమూర్తివి. నీకు నా ప్రణామములు. ఏకపాదుడవు. త్రిపాదుడవు. తీర్థపాదుడవు. అంతరిక్షపాదుడవు. భవత్పాదోద్భవ అయిన గంగ ముల్లోకములను పావనము చేయుచున్నది. నీ నామకీర్తనము బ్రహ్మహత్యాది సర్వపాపములను పరిహరించి సర్వ శుభములను చేకూర్చును. అట్టి శుభాత్ముడ వగు నీకు నా వందనములు.

ఓ స్వామీ ! నీ నామసంకీర్తనము వలన సర్వసిద్ధులు కల్గుచున్నవి. బుద్ధిమంతులగు విద్వాంసులు కౌతుకముచే నిన్ను వెదకుచున్నారు.

ఓ నాథ ! నీ పాదనలిన సేవనము తాపహారకము. తాపత్రయపీడిత నయిన నాకు నీయందు దృఢభక్తిని కల్గింపుము. ఇప్పుడు నీవు నాకు అనన్యస్వామివి, నాకింకొకటి ప్రార్థింపదగినది లేదు.

ఓ జగన్నాథ ! నీకు సహస్రవిధముల ప్రణామము అర్పించి నిన్ను యాచించుచున్నాను. సమస్త పురుషార్థములకు నీవు బీజమవు. నాలో ప్రాణము లున్నంతవరకు నీ పాదపంకజ మందు నా భక్తి దృఢముగా నుండవలయును. బ్రహ్మ నీయందు గల దృఢభక్తి వలననే సృష్టికార్యమును చేయగల్గుచున్నాడు. అట్లే రుద్రుడు అఖిలమును లయము చేయుచున్నాడు. లక్ష్మీదేవియు ఐశ్వర్యదాయిని అగుచున్నది.

ఓ దీనదయాసాగర ! అనన్యమానసుడనయి నీయందట్టి భక్తినే అభిలషించుచున్నాను.

ఓ జగన్నాథ ! సుదృఢము. దుస్తరము. అనాది అయిన యీ అవిద్యాపంకమున నిమగ్నుడయి నశించుచున్నవానికి అవలంబము లేదు. మహామహిమ గల నీయందలి భక్తికంటె అన్యపరాయణము లేదు. శ్రుతిస్మృత్యాదులకంటె భిన్నము లయిన మార్గము లన్నియు సంమోహహేతువులగుచున్నవి. నీపైని భక్తిలేక ప్రవర్తించుట కెవ్వరును సమర్థులుకారు.

‘ఓ స్వామీ ! ప్రభూ ! నిన్నే శరణువేడుచుంటిని. నన్ను దయతో చూడుము’. ఇట్లు స్తుతించుచు అంబరీషుడు అనుగ్రహింపుమని మాటి మాటికి వేడుచు జగన్నాథుని పాదపద్మములపైబడెను. పిమ్మట దేవత లందరు కేశవుని స్తుతించి పూజించి ఆ దేవుని కటాక్షవీక్షణములచే సంతుష్టి నొంది స్వర్గమున కేగిరి.

తరువాత పుండరీకాంబరీషకులు కన్నులు తెరచి విష్ణుమాయచే మోహితు లయి స్వప్నమున చూచిన దానిని తెలిసికొనలేకపోయిరి. వారిరువురు కలలో చర్మచక్షువులతో ఏ దివ్యలీలలను చూచిరో, మరల మానుషభావముతో హరి రూపమును అదేవిధముగ గాంచి ఆనందించిరి. ఆ హరి దివ్యసింహాసన స్థితుడు, నీలజీమూతసంకాశుడు, ఫుల్లపద్మాయతేక్షణుడు, శోణాధరుడు, మంచి నాసిక కలవాడు, దివ్యకుండలభూషితుడు, శంఖచక్రగదాపద్మధారి, వనమాలి, పీనవక్షస్కుడు సుందరహారధారి, అనర్ఘ్యముకుటోజ్జ్వలుడు, శ్రీవత్సకౌస్తుభోరస్కుడు, దివ్యాంగదవిభూషితుడు, ప్రలంబబాహుడు. దీనార్త పరిత్రాణశీలుడు, సువర్ణసూత్రసన్నద్ధమధ్యగ్రంథిమణియుతుడు, దివ్యపీతాంబరధరుడు, దివ్యస్రగ్గంధభూషితుడు, స్వర్ణపద్మాసనాసీనుడు, సర్వాంగాలింగితశ్రీయుతుడు, ప్రసన్నసంతాపహరుడు, సుధాసాగరుడు, అశేషవాంఛాఫలదుడు, కల్పవృక్షనిభుడై ప్రకాశించుచుండగా వానికి దక్షిణ పార్శ్వస్థితుడయిన హలాయుధుని పుండరీకాంబరీషులు చూచిరి. మరియు వారిద్దరును హరి శక్తిమంతుడైన ఏ బలరామునిచే బ్రహ్మాండమును భరించుచున్నాడో ఆ బలరాముని గాంచిరి. ఆ బలరాముడు ఫణాసప్తక మండితుడు నాగరాజు, కైలాసశిఖరోత్తుంగుడు, ధవళవర్ణుడు, కుండలోజ్జ్వలుడు, విచిత్రవనమాలాఢ్యుడు, దివ్యనీలనిచోళయుతుడు, సతతము వారుణీక్షీబ ఘూర్ణోన్నయనపంకజుడు, నిమ్నపృష్ఠోన్నతోరస్కుడు, కుండలీకృత విగ్రహుండు, శంఖచక్రగదాపద్మసముజ్జ్వల చతుర్భుజుడు, నానాలంకార రుచిరుడు, నతకల్మషనాశనుడై తేజరిల్లెను. ఇంకను వారిరువురు జగన్నాథ బలరాముల మధ్యనున్న సుభద్రను గాంచిరి. ఆ సుభద్ర కుంకుమారుణ, భద్ర, సర్వలావణ్యనిలయ, సర్వదేవ నమస్కృతయై విరాజిల్లుచున్నది. అంతియేకాక లక్ష్మీశహృదయపంకజవాసిని, వరాబ్జధారిణి, దివ్యనేపథ్యభూషణ, ప్రసన్నకల్పలతిక, సర్వకల్మషనాశిని, సంసారార్ణవసముత్తారిణి, దేవతారిణి, విష్ణుపార్శ్వస్థిత అగు లక్ష్మీదేవిని విష్ణువామపార్శ్వస్థ చక్రమును పుండరీకాంబరీషకులు గాంచిరి. మరియు ఆ ద్విజులిరువురును దార్వగ్రనిర్మితము, స్వర్ణభక్తిసముజ్జ్వలము, నాల్గు భాగములుగా నున్న విష్ణు స్వరూపమును, అరుణోదయవేళ యందు చూచుటచే తమ శ్రమఫలించెనని తలంచిరి. అప్పుడు వారు తమకు గోచరించిన స్వప్నలీలలను స్మరించుకొని విస్మయ మందిరి. ఇది దారువిగ్రహము కాదు. సాక్షాత్తు బ్రహ్మమే ప్రకాశించుచున్నది.



వారు ఆనాడు సదస్సునందు విన్న విప్రుల వాక్యమును వేడు శ్రద్ధతో పాటింపదలచి ఇట్లనుకొనిరి. ‘మహాపాతకులము, యాతనా క్రమభాగులమయిన మన మెక్కడ ? ఈ సుర సమాక్రాంతస్థిత మగు విష్ణుదర్శన మెక్కడ ? మూర్ఖులయిన మన యిద్దరికి అష్టాదశ విద్యాప్రవీణత ఎక్కడ ? తీర్థరాజతట మందున్న దారువు బ్రహ్మమని జ్ఞానులు చెప్పినది అసత్యము కాదు. వటమూలమున ప్రకాశించుచున్నవానిని జూచి ప్రాణి ముక్తినందుచున్నాడు. అతడే యీ జగన్నాథుడు, నాల్గుభాగములుగా కాన్పించుచున్నాడు. విష్ణువు భూమిపైని అవతరించగానే నాల్గురూపములతో ప్రకాశించుచున్నాడు.

మన ప్రాణము లున్నంతవరకు క్షుద్రకామపరాఙ్ముఖులమై, ఇతర స్థలములకు పోకూడదు అని విష్ణుభక్తిపరాయణులగు వారిరువురు నిశ్చయించుకొని నారాయణ నామమును సతతము జపించుచు ముక్తిని గాంచిరి.

ఓ మునులారా ! ప్రసంగవశమున చెప్పబడిన పాపనాశన మయిన పుండరీకాంబరీషుల చరితమును, ఎవరు విందురో, ఎల్లప్పుడు పరమ సంతోషముతో సతతము కీర్తింతురో, వారు పరమానందభరితులై పాపరహితులై విష్ణునిలయమును చేరగలరు అని జైమిని మహర్షి మునులతో అనెను.

## ౨వ అధ్యాయము

### 1. ఓఢ్రదేశ వర్ణనము :

ఏ దేశమునందు పురుషోత్తమమను క్షేత్రమున్నదో, ఎచట నారాయణుడు దారువిగ్రహమై ప్రకాశించుచున్నాడో, సవివరముగా చెప్పుమని మునులడుగగా జైమినిముని వారికిట్లు బదులుచెప్పెను — ‘ఉత్కలనామము గల దేశము పరమ పావనమయినది. అచట అనేక తీర్థములు పుణ్యదేవాయతనములు కలవు. దక్షిణసముద్రతీరమందా దేశమున్నది. అందున్న జనులు సదాచారయుతులు భూసురులు, సచ్ఛీలురు, అధ్యయన సంపన్నులు, యజ్వులు. వారు సృష్ట్యాదిని వేదశాస్త్రప్రవర్తకులై వేదాధ్యయనమును క్రతువులను చేసిరి. ఆ దేశము అష్టాదశ విద్యలకు నిధానము. నారాయణుని యాజ్ఞచే లక్ష్మి ప్రతిగృహమందు నివసించుచున్నది. అచటి వైష్ణవజనులు లజ్జాశీలురు, జితేంద్రియులు, శారీరక మానసిక రోగములు లేనివారు, పితృ మాతృభక్తి కలవారు, సత్యవాక్పరిపాలకులు. అచటి విష్ణుభక్తుడెవడును నాస్తికుడు కాడు. మరియు ఆ దేశ ప్రజలు దీర్ఘాయుష్కులు, పరహితులేకాని లుబ్ధులు, శఠులు, ఖలులు కాదు. అచటి స్త్రీలు పతివ్రతలు, సుశీలలు, ధర్మరతలు, త్రపాచారిత్ర భూషితలు, రూప

[illegible] స్వర్ణాలంకార భూషితలు, కులశీల వయోవృత్తాను రూపా [illegible]

ఉత్కలదేశమునందున్న క్షత్రియులు స్వకర్మనిరతులు, ప్రజారక్షణ దీక్షితులు, దానశౌండులు, శస్త్ర శాస్త్ర విశారదులు. వారు సతతము భూరిదక్షిణ లిచ్చి క్రతువులు చేయుచున్నారు. కాంచనభూషితములయిన యూపములు వారి ఖ్యాతిని దీపింపజేయుచున్నవి. వారి గృహములయందు అతిథులు కోరికను మించిన సత్కారములను పొందుచున్నారు.

ఉత్కల దేశస్థులైన వైశ్యులు కృషి వాణిజ్య గోరక్షావృత్తి నవలంబించిన వారు. వారు దేవగురు ద్విజులకు భక్తితో ధనమర్పించి ప్రీతి నొందించుచున్నారు. ఒక వైశ్యుని యింటికి వెళ్ళిన యాచకుడు మరియొకరి యింటికి వెళ్ళ రాడు. అచటి వైశ్యులు సంగీతకావ్య కళాశిల్ప నిపుణులు, ప్రియవాదులు.

ఉత్కలదేశస్థులయిన శూద్రులు ధార్మికులు, స్నానదాన క్రియారతులు, వారు మనోవాక్కర్మలచే దానధర్మములుచేసి ద్విజులను సేవింతురు. ఇతర జాతివారు తమతమ ధర్మముల నాచరింతురు.

అచట ఋతువులు నియమమును తప్పవు. మేఘము అకాలమున వర్షించదు. సస్యహాని కలుగదు. గాలి, ఆకలి, ప్రజలను పీడింపవు. ఆ దేశమందు దుర్భిక్షము కలుగదు. రాష్ట్రములో దేనికిని భంగముండదు. భూమిపైనున్న ఏవస్తువయినను అచట దొరకదన్న మాట లేదు.

ఈ విధముగా సర్వగుణములతో ఒప్పుచున్న ఉత్కలదేశమున నానా ద్రుమలతలు, అర్జునాశోక పున్నాగ తాలహింతాల శాలక తరువులు; అమలక లోధ్ర వకుల నాగకేసర వృక్షములు, నారికేళ ప్రియాల దేవదారు ద్రుమములు; ధవఖదిర పనస కపిత్థ వృక్షములు; చంపక కర్ణికార కోవిదార కదంబ నింబ నిచుల రసాల తరువులును; నాగరంగ జంబీర బీజక మాతులుంగ మందార పారిజాత న్యగ్రోధాగురు చందన ఖర్జూరామ్రాతక ద్రుమములును; ముచుకుంద కింశుక తిందుక సప్తపర్ణాశ్వత్థ విభీతక పాదపములును; మనోహరములైన యితర వృక్షములతోకూడ ఉత్కలదేశము వ్యాపించియున్నది.

మాలతీకుంద బాణ కరవీరకేతకీ వన షండములతో, నానాద్రుమలతలతో, పర్వతములతో, నదులతో విరాజిల్లుచున్న దేశము ఉత్కలాఖ్యతో ప్రసిద్ధి నొందినది.

దక్షిణసముద్రమువైపు ప్రవహించు ఋషికుల్యానది మొదలుకొని స్వర్ణరేఖా మహానదులమధ్యను ఉత్కలదేశము సుస్థిరముగా నున్నది. ఈ పురుషోత్తమ



క్షేత్రము ప్రస్తుతము భూతలస్వర్గమని చెప్పబడినది. మా తీర్థయాత్ర యందు పూర్వమీ పుణ్యదేశమున గల బహుక్షేత్రములు వర్ణింపబడినవి' అని జైమిని ముని ద్విజులతో పల్కెను.

## 7వ అధ్యాయము

1. జైమిని మునులకు ఇంద్రద్యుమ్నుని గూర్చి చెప్పుట :

'ఓ జైమిని మునీంద్రా! ఇంద్రద్యుమ్నుడను నృపతి ఏయుగమున జన్మించెను ? ఏ దేశమున అతని నగరముండెను ? అతడు పురుషోత్తమ క్షేత్రమున కేటులబోయి జగన్నాథుని విగ్రహమును చేయించెను. ఓ సర్వజ్ఞ! మాకీవిషయ మంతయు యథాతథముగ వినుటకు కుతూహలము కలదు. కావున దానిని సవిస్తరముగ తెల్పుము' అని మునులు జైమినిని అడుగగా అతడిట్లు బదులం పల్కెను.

'ఓ ద్విజశ్రేష్ఠులారా! మీరడిగినది పురాతన విషయము, అయినను పురుషోత్తమ చరితము శుభప్రదము, సర్వపాపహరము, పుణ్యదము, భుక్తి ముక్తిప్రదము. అది కృతయుగమునాటి చరిత్ర.

ఓ మునులారా! సావధానచిత్తులై జితేంద్రియులై వినుడు. ఇంద్రద్యుమ్న మహారాజు కృతయుగమున సూర్యవంశమున జనించెను. అతడు ధర్మాత్ముడు, బ్రహ్మనుండి పంచమ పూరుషుడు, సత్యవాది, సదాచారుడు, అవదాతుడు, సాత్త్వికాగ్రణి. ఆ ప్రభువు ప్రజలను తన సంతానమువలె న్యాయముగ ఎల్లప్పుడు పాలించుచున్నాడు. అతడు అధ్యాత్మ విజ్ఞానదక్షుడు, శూరుడు, సంగ్రామవర్ధనుడు. మరియు ఆ రాజశేఖరుడు విప్రపూజకుడు, పితృభక్తి తత్పరుడు, అష్టాదశ విద్యల యందు అపర బృహస్పతి. ఐశ్వర్యముచే ఇంద్రుడు, ధన సంచయముచే కుబేరుడు, రూపవంతుడు, సుభగుడు, సచ్ఛీలసంపన్నుడు, దాత, భోక్త, ప్రియంవదుడు, సమస్త యాగములు చేసిన యజ్వ, బ్రహ్మణ్యుడు, సత్యసంగరుడు. పౌర్ణమినాటి చంద్రునివలె నరనారీమణులకు హృదయాహ్లాదకరుడు. ఆదిత్యుని వలె దుష్ప్రేక్ష్యుడు, శత్రుపక్ష క్షయంకరుడు, వైష్ణవుడు, సత్యసంపన్నుడు, అక్రోధుడు, జితేంద్రియుడు, శ్రీమంతుడు, ముముక్షువు, రాజసూయ క్రతువును, మహాప్రాశ్వమేధ యాగములను గావించిన యజ్వ. ఇట్టి సర్వగుణోపేతుడయిన నృపుడు మాలవదేశమున ప్రసిద్ధమయిన అవంతీనగరవాసియై పృథ్విని పాలించెను, మనోవాక్కాయకర్మలచే అవద్యశము, అత్యద్భుతమగు విష్ణుభక్తి కలిగి యుండెను. ఇట్లు ఆదర్శ జీవితమును గడుపుచున్న ఇంద్రద్యుమ్న నృపతి ఒక

నాడు దేవార్చన గృహమందు పూజాసమయమున విద్వాంసులు, కవులు, తీర్థయాత్రాప్రసిద్ధులు, దైవజ్ఞులు, శ్రోత్రియులు ఉపవిష్టులయిన సభలో తన పురోహితుని పూజించి యిట్లు ప్రశ్నించెను – 'ఈ చర్మచక్షువులతో సాక్షాత్తు శ్రీ జగన్నాథస్వామిని ఎచట చూడగలము'. వైష్ణవభక్తియుతుడయిన ఇంద్రద్యుమ్న నృపతి అడిగినప్రశ్న విని పురోహితుడు తీర్థయాత్రలు చేయుచున్న పండితులను చూచి యిట్లనెను – 'ఓ తీర్థకోవిదులారా! తీర్థాటనవిత్తులార! ధార్మికులార! ఇంద్రద్యుమ్ననృపతి యానతిని మీరు వినియుంటిరి'. అపుడా పురోహితుని యభిప్రాయమెరిగి, బహుతీర్థములు సేవించిన ఒక వృద్ధుడు వాక్చాతుర్యముతో రాజు నుద్దేశించి సవినయముగా ఇట్లు పల్కెను.

2. ఇంద్రద్యుమ్న వృద్ధసంవాదము :

'ఓ రాజా! నేను బాల్యమునుండి భూమిపైనిగల సర్వ తీర్థములను గూర్చి పరులవలన వినుచు అన్నిటిని సందర్శించితిని.

భరతవర్షమునందు ఓఢ్రదేశము ప్రసిద్ధమయినది. దక్షిణ సముద్రతీరమున శ్రీ పురుషోత్తమ క్షేత్రమున్నది. అట కాననావృతమైన నీలగిరి కలదు. దాని ఉపరిభాగమున క్రోశ పర్యంతము వ్యాపించిన కల్పవృక్షమున్నది. దాని నీడనున్నవానికి బ్రహ్మహత్యాపాపము కూడ పోవును. దాని వెనుక భాగమున రౌహిణమను పేరుగల కుండము కారణజల పూర్ణమై ఉన్నది. దానిని స్పృశించినంతనే ముక్తికల్గును. ఆ కుండము యొక్క ప్రాక్తటమందు ముక్తిప్రదమగు శ్రీవాసుదేవుని విగ్రహము నీలేంద్రమణిచే నిర్మింపబడినది. ఆ కుండములో స్నానము చేసి పురుషోత్తముని దర్శించినవానికి వేయి అశ్వమేధయాగముల ఫలితము, ముక్తిలభించును. స్వామివిగ్రహమునకు పశ్చిమదిక్కున శబరాలయములతో పరివేష్టింపబడిన శబర దీపకమను పేరుగల ఆశ్రమ మున్నది. అక్కడనుండి కాలిబాట ఉన్నది. ఇరుకైన ఆ మార్గమున విష్ణ్వాలయమున కేగవలయును. ఓ రాజా! ఎచట శంఖచక్రగదాధరుడు, కృపానిధి, దృగ్గోచరుడగు జగన్నాథుడు భక్తులకు దర్శనమాత్రముననే ముక్తినిచ్చుచున్నాడో ఆ పురుషోత్తముని దివ్యక్షేత్రమున ఆ దేవదేవుని ప్రీతికొరకు ఆ వనమునం దొక సంవత్సరకాల ముంటిని. ఓ మహారాజా! భగవంతుని దర్శనమునకు ప్రతి రాత్రి వచ్చిన దేవతలకు అమానుషమగు దివ్యగంధము కల్పపుష్పవృష్టి లభించుటయేగాక వివిధ స్తుతివచనములు వినవచ్చును. ఏ విష్ణుక్షేత్రము నందును ఇట్టి మహిమ ప్రదర్శింపబడుటలేదు. ఓ మహీపతీ! ఆ స్థలమున పౌరాణికమైన ప్రవృత్తివినబడినది. వాయసము మాధవుని దర్శించి పక్షిదేహమును త్యజించి ముక్తిని పొందెను. ఓ పార్థివా! పుణ్యకృత్యమున కధికారములేని అజ్ఞాని ఒకడు దాహముతో బాధపడుచు రౌహిణకుండము నందు జలపానము చేయుటకు



వచ్చెను. అతడు కాలవశమున ప్రాణములు విడిచి విష్ణుసారూప్యమును పొందెను. పూర్వము నేను కూడ మూర్ఖుడనే. హరికరుణవలన అష్టాదశవిద్యా ప్రవీణుడనైతిని. నేనిపుడు అదిశేషునకు సాటివత్తును. నా బుద్ధి కూడ నిర్మలమయ్యెను. సర్వదా విష్ణువునే చూచుచున్నాను. ఇతరుని చూడనొల్లను, నీవు విష్ణుభక్తుడవు. నిరతము దృఢవ్రతుడవగుటచే నీకుపదేశించుటకై నీకడకు వచ్చితిని గాని నిన్నిపుడు ధరణిని ధనమును యాచించుటకై రాలేదు. ఇది అసత్యమని భావింపకుము. ఆ పురుషోత్తమ క్షేత్రవాసియగు శ్రీ జగన్నాథుని సేవింపుము' అని జటిలు డిట్లుపలుకుచునే అందరు చూచుచుండగనే వెంటనే అచట అదృశ్యుడయ్యెను. రాజు పరమాశ్చర్యచకితుడై వ్యాకులచిత్తుడై ఆ కార్యసాధనమును గూర్చి పురోహితుని ఇట్లడిగెను –

3. ఇంద్రద్యుమ్నుడు పురోహితుని జగన్నాథునిదర్శనమునకై సాహాయ్యము నర్థించుట :

'ఓ ద్విజోత్తమా! అమానుషుడయిన మునివలన వినిన వృత్తాంతము అమానుషమైనదే। గదాధరుడున్నస్థలమునకు పోవుటకు నాబుద్ధినన్ను తొందరపెట్టుచున్నది. నాధర్మార్థకామములు నీయధీనములు. నీ యనుగ్రహము వలననే విరుద్ధముకాని త్రివర్గమును సాధించితిని. ఓ ద్విజశ్రేష్ఠా! నీవిప్పుడే దీనివిషయమైనన్ను పంపించినచో నాకు చతుర్వర్గప్రాప్తితప్పక కల్గును' అని రాజు పురోహితునితో పల్కెను.

4. పురోహితుడు ఇంద్రద్యుమ్న నృపతి కోర్కెను తీర్చుటకు సమ్మతించుట :

'ఓ రాజా! చర్మాచ్ఛాదిత చక్షువులుగల వారికి సాక్షాత్తు ముక్తిప్రదుడగు కేశవుని నీకేవిధముగా చూపించగలనో అట్లుతప్పక చేయుదును. ఆ పురుషోత్తమ క్షేత్రమందు మనమందరము ససహాయులమై నివసించుటకు ప్రయత్నించెదను. వరజన్మమెత్తినవానికి ఇంతకంటె జన్మసాఫల్య మేమికల్గును. తమస్సునకు అవతలనున్న మాధవుని చూడగలవు. విద్యాపతి అను నా కనిష్ఠ భ్రాత దేశభ్రమణశీలు రయినవీ వారులతో ఇపుడే వెళ్లగలడు. అతడా క్షేత్రమున కేగి గిరిపైనున్న జగన్నాథుని గాంచి కంటకావృతమైన భూప్రదేశమును శుభ్రపరచుటచే శీఘ్రముగా మనకు శ్రేయస్సు కలుగును' అని పలికిన పురోహితుని మాటలు విని రాజిట్లనుచున్నాడు.

5. రాజు పురోహితుని కార్యక్రమమును ప్రశంసించుట :

ఓ పురోహితోత్తమా! ఉచితమగు సమాధానము చెప్పి, చేయవలసిన కార్యక్రమమును గూర్చి బాగుగా ఆలోచించితివి. నీవుచెప్పిన విషయమును

త్వరలోనే ఆ పురుషోత్తమ క్షేత్రమున కేగి భగవంతుని సన్నిధి నుండుటకు నిశ్చయించుకొంటిని. నీ సోదరుడా కార్యసాధనకై ఇష్టము వచ్చినపు డేగ వచ్చును' అని రాజు పలికి సంతోషముతో అంతఃపురమును ప్రవేశించెను.

అపుడు పురోహితుడు రాజాజ్ఞచే ఆ సభలోని పండితులు మున్నగువారిని యథావిధిగా, క్రమానుసారముగా పూజించి, వారి నివాసములకు పంపెను. అతడు తనసోదరుడగు విద్యాపతిని దైవజ్ఞులు నిర్ణయించిన సుముహూర్తమున బ్రాహ్మణులు స్వస్త్యయనము చేసిన పిమ్మట పంపెను.

విద్యాపతి అను ఆ ద్విజుడు విశ్వాసపాత్రులైన రహస్యజ్ఞులతో రథ మధ్యభాగమున కూర్చుండి రథ వేగమును గమనించక మనస్సులో 'నా జన్మము సఫలమైనది। రాత్రి శుభప్రదమైనది. పాపహరమగు భగవంతుని ముఖపద్మమును చూడగలను. తమ హృదయపుండరీకములందు నివసించుచున్న పరమాత్మని యతులు అహర్నిశలు చూచుచున్నారు. నీలాచల శిఖరముపైని విగ్రహరూపమున వసించుచు పుణ్యాత్ములగు భక్తుల భవబంధములను హరించు నట్టి, చక్రిని ప్రత్యక్షముగా చూడగలను. శ్రుతిస్మృతీతిహాసపురాణవాక్యములచే ప్రతిష్ఠించుటకు శక్యముకాని శ్రీపతిరూపము నింతకుపూర్వము చూడలేక పోయినను ఇపుడు చూచి భవాంబురాశిని దాటగలను. శ్రీహరి నామస్మరణముచే త్రిగుణరహితుడనై, నీలాచలవాసి, అప్రమేయుడగు విశ్వేశ్వరుని సాక్షాత్క రించుకొందును.

హరి పాదపద్మములను ఆశ్రయించనివాడు, పదేపదే దుఃఖమును పొందువాడు, గాఢమైన అజ్ఞానముచే జన్మించినవాడు, ఆత్మాశ్రితుడు, తన దుష్కర్మలచే తానే వశించుచున్నాడు.

ఈశ్వరుడు సూక్ష్మస్వరూపుడు. స్వగృహనివాసి, పంచకోశావృతుడు, ఆత్మసంస్థుడు, వేదాంత వాక్యసన్నుతుడు, వేదవేద్యుడు, ఆత్మవిద్యావిదుడు, ఆద్యుడు, బ్రహ్మాండమాలాకలితానురోముడు, సహస్రమూర్ధాంఘ్రిభాసమానుడు, పురాణపురుషుడు, నిఃశ్వాసవాపోత్థిత వేదరాశి, సర్వలోకేశుడు, అట్టి పురుషోత్తమునికి నా నమస్కారములు. ఈ సృష్టిస్థితి క్షయవిలాసరూపమైన కూటము శ్రీహరిమాయచేతనే నిరూపింపబడినది. నిరూపితారోపిత హేయరూపస్వరూపహీనుడు, ప్రణవస్వరూపు డయిన శ్రీహరిని శరణుపొందుచున్నాను. పశుపక్ష్యాదుల దాహశాంతుల నిమిత్తమై తనయిచ్చాను సారముగ, అట్టి రూపమును దాల్చి, ఆ దేహముతోడనే స్వరూపముక్తి నొందిన విష్ణువును దృగ్గోచరుని చేయుదును. కోటిజన్మములలో సంపాదించిన నా పుణ్యఫలమువలన నా చర్మచక్షువులతో జగదాదిభూతుడయిన పరమాత్మను గాంచగలను'. విప్రుడీవిధముగా అలో



చించుచు సంతసించిన అంతరాత్మతో రథవేగమువలన గతించిన అధికమార్గమును గుర్తింపడాయెను.

మధ్యాహ్నము గడచినప్రమాణము తగ్గిన పిమ్మట దారిలో భువనమున కలంకారప్రాయమైనట్టి భూమినంతటిని పావనము చేయునట్టి ఓఢ్రనామముగల దేశమునుగాంచెను. అతడు మార్గమున వనములను, గిరిదుర్గములను చూచుచు, మహానదీ తటమును చేరుసరికి సూర్యాస్తమయ మయ్యెను. విప్రుడు రథము నుండి దిగి శీఘ్రముగా ఆహ్నికకృత్యము నొనర్చి పశ్చిమసంధ్యను ఉపాసించి మధుసూదనుని ధ్యానించెను. ద్విజుడు రథమునకు వెనుక భాగమున కూర్చున్న వాడై రాత్రిగడచిన తరువాత త్వరగా మహానదిని దాటి ప్రాతఃకార్యమును పూర్తిచేసి రథమునం దాసీనుడై గోవిందుని స్మరించుచు బయలువెడలెను.

ఆ విద్యాపతి అనుద్విజుడు భగవంతుని చేరు మార్గమున పోవుచు శ్రోత్రియులు, యజ్వులు, అగ్నివర్చస్సులు, నివసించు గ్రామములు, పోకచెట్లతో సుందరముగా ఒప్పుచుండగా వానిని దాటి, ఏకామ్రకవనమును సమీపించగానే శంఖచక్రగదాధారులయిన జనులను అవలోకించెను. పూర్వజన్మమునందు తానుకూడ దివ్యరూపుడే అనుకొనెను.

ఆ విద్యాపతి వెంటనే రథము నుండి దిగి వైష్ణవజనులకు సాష్టాంగ దండప్రణామ మాచరించి హర్షాశ్రుపూర్ణనయనుడై ఇతర మయిన దానిని చూడ డాయెను. అతడు అంతట విష్ణువును మాత్రమే చూచుచు ధ్యానించుచు స్తుతించుచు దట్టమైన అడవిలో కల్పవృక్షభూషితమైన చూపరులకు పాపనాశన మై అత్యద్భుతమై విగ్రహరూపుడైన విష్ణువునకు నివాసమై, ఆకాశము నంటుచున్న నీలాచలమును గాంచెను. ఆ విప్రుడు పర్వతము క్రిందిభాగమున ఉపవిష్టుడై ముకుందుని దర్శించుటకై అత్యుత్సాహము కలవాడై మార్గమును వెదకుచు, కాంచలేకపోయెను. అతడు మౌనముతో భూమిపైని దర్భలు పరిచి నిద్రించెను, ఆ దేవుని చూచుటకు అతని అనుగ్రహమునకు అతనినే ప్రార్థించి శరణు పొందెను.

పర్వతము యొక్క వెనుకభాగమున భగవద్భక్తి విషయమైన రహస్యముగ పలుకబడిన అమానుష వచనమును వినెను. పిమ్మట అతడు ఆ శబ్దము నను సరించి పోయి, అంతట శబరగృహములతో పరివేష్టింపబడి, ఆ పుణ్యక్షేత్రము నకు దీపము వలె నున్న శబరదీపకమని ప్రసిద్ధి గాంచిన జనపదమును వినయము తో ప్రవేశించెను. అతడచట శంఖచక్రగదాధరు లయిన విష్ణుభక్తులను చూచి చేతులు జోడించి శిరస్సు వంచి నమస్కరించి అటనుండెను. నెరసిన జుట్టు గల విశ్వావసు వను శబరుడు విష్ణుపూజను గావించి శోభాయ మానుడై గిరి మధ్య ప్రదేశమునకు రాగా, అక్షణముననే ఆ విద్యాపతి వానిని చూచి సంతసించి యిట్లు తలంచెను.

'ఈ వైష్ణవశ్రేష్ఠుడు అలసిపోయి విద్యాభూషితుడై విష్ణుదేవాలయము నుండి యిటకు వచ్చియున్నాడు. దుర్లభమయిన విష్ణువార్తను వీనివలన తెలిసికొనగలను' అని ఆలోచించిన విప్రునితో శబరుడు ఇట్లనెను.

6. విశ్వావసు వను శబరుడు విద్యాపతికి ఆతిథ్యమీయదలచుట :

'ఓ విప్రుడా ! సుదుస్తర మయిన కాననాంతమున కేలవచ్చితివి ? క్షుత్పిపాసలచే కృశించితివి. చిరకాలమిట నుండుము. విశ్వావసువు ద్విజునకు అర్ఘ్యపాద్యాసనము లర్పించి ఉపశమన వాక్యములతో నీ కాకలి తీరుటకు ఫలములు కావలయునా ? పాకము కావలయునా ? నీకేది రుచించునో దానినే నీకు నేనిట చేయగలను. ఓ భగవత్స్వరూపుడా ! ఇది నా భాగ్యము. నా జీవిత మిప్పుడు సఫల మగుచున్నది. సాక్షాత్తు అపరవిష్ణువు వలె నా గృహమునకు వచ్చితివి.' ఇట్లుపల్కిన శబరునకు విద్యాపతి ప్రత్యుత్తర మీయనారంభించెను.

'ఓ వైష్ణవపుంగవా ! నాకు ఫలములు కాని పాకములుకాని అక్కరలేదు. ఓ సాధుజనుడా ! నేను దూరము నుండి వచ్చినందున నా కార్యమును సఫలము చేయుము. అనంతపురనివాసి యగు ఇంద్రద్యుమ్న నృపతి యొక్క పురోహితుడను. విష్ణుదర్శనలాలసుడనై యిటకు వచ్చితిని. ఇంద్రద్యుమ్న రాజసమక్షమున తైర్థికుల సభ యందు తీర్థక్షేత్ర ప్రసంగవశమున జటిలునిచే చెప్పబడినరీతిగా రాజాజ్ఞచే ఈ క్షేత్రమందున్న నీలమాధవుడను విష్ణువును చూచుటకు ఇటకు వచ్చితిని. నిరాహారుడ నగు నాకు విష్ణు దర్శనము చేయింపుము. నాకు విష్ణు దర్శనమయిన వెంటనే మా రాజుకడకేగి అతనికి ఆ వార్తను తెల్పుదును' అని విద్యాపతి విశ్వావసువుతో అనెను.

## 8వ అధ్యాయము

1. జైమిని మునులకు శబరుని మనోవ్యాకులము నెరిగించుట :

"ఓ మునులారా ! విద్యాపతి అను విప్రుని వచనములు వినిన విశ్వావసు వను శబరుడు మనోవ్యాకులముతో ఇట్లు తలంచెను. 'మనకు ఆధారభూతుడయిన జనార్దనుడు రహస్యముగా నున్నాడు. మనకు దుర్దినము సమీపించినది. అందుచే హరి సార్వలౌకికు డగును. ఈ విప్రునకు విష్ణువును చూపించనిచో ఈతడు నన్ను శపించును. అందరికిని బ్రాహ్మణుడు పూజ్యుడు. విశేషించి ఇతడు నాకు అతిథి. ఈతడు విఫలుడయినచో నాకు రెండు లోకములు విఫలములే' అని శబరశ్రేష్ఠుడయిన విశ్వావసు ఇట్లు విచారించుచు శబరాలయమున చాలకాలము క్రిందట వ్యాపించియున్న జనప్రవాదమును వెంటనే ఇట్లు జ్ఞప్తికి తెచ్చుకొనెను.



ఇచట భగవంతుడగు మాధవుడు అంతర్ధానమును పొందగానే భూమధ్యభాగమున అంతర్లీను డగును. శక్రతుల్య పరాక్రముడగు ఇంద్రద్యుమ్న మహారాజు మనుష్యదేహముతో బ్రహ్మలోకమునకు పోవును. అతడిటకు ప్రజలతో వచ్చి నూరు అశ్వమేధయాగము లొనర్చి దారువిగ్రహరూపుడగు విష్ణువును నాల్గుభాగములుగా స్థాపింపగలడు. ఈ అతిథియగు బ్రాహ్మణునకు భాగ్యము కల్గినది. భగవంతుని యంతర్ధానము క్రిందిభాగమున సన్నిధాన మగును. అట్టి నీలేంద్రమణి యగు అచ్యుతుని దర్శింపగలను. దైవసంకల్పము ప్రకారము జరుగబోవు కార్యమును గూర్చి శబరుడు మాటిమాటికిని మనసులో తలంచె" నని అవ్యయుడగు విష్ణువును గూర్చి యెదుట ధ్యానము చేయుచున్న విప్రునితో శబరుడు పల్కెనని జైమిని మునులకు తెల్పెను.

2. శబరుడు విద్యాపతికి జగన్నాథస్వామిని చూపించుట :

'ఓ విద్యాపతి ! ఇంతకుపూర్వమే మాకీ వృత్తాంతము తెలిసెను. ఇంద్రద్యుమ్నుడను నరపతి ఇచట నివసించును. అతని వలెనే నీవును అదృష్టవంతుడవు. అతనికంటె ముందుగానే నీ చర్మచక్షువులతో నీలమాధవుని గాంచుచున్నావు. పర్వతముపైనున్న భూమిమీదికి పోవుదము రమ్ము అని చెప్పి శబరుడు విద్యాపతి హస్తమును పట్టుకొని ఆ మార్గమున అరణ్యమున కేగెను.

శిలావిషమ మార్గమున ఉపరిభాగమునకు ఎక్కి ఒక్కొక్క మనుజుడే నడచుటకు వీలుగానున్నట్టియు, కంటకావృతము, దుర్గమము, అంధకారా వృతమైన త్రోవలో నడచుచున్న విద్యాపతిని విశ్వావసువు ప్రియవచనములతో ముందిదారికి రమ్మని ప్రోత్సహించుచు, ఆ తటమందు నాల్గుగడియల కాలములో రోహిణ మను కుండమును చేరగలమని చెప్పెను. విశ్వావసువు కుండమును గాంచి విద్యాపతితో ఇట్లనెను.

'ఓ ద్విజోత్తమా ! సర్వ జలములకు రోహిణ మను గొప్ప తీర్థము మూలకారణము. ఇందు స్నానము చేయువాడు వైకుంఠమును పొందగలడు. దీని పూర్వభాగమున కల్పచ్ఛాయా వటవృక్షము చాల గొప్పది. దాని నీడనున్న వానికి బ్రహ్మహత్యాదోషము కూడ పోవును.

ఓ బ్రాహ్మణుడా ! ఈ రెంటికిని మధ్యనున్న పొదరింటిలోనున్న వేదాంత ప్రతిపాదితుడైన సాక్షాత్తు జగన్నాథుని చూడుము. ఆపురుషోత్తముని దర్శనము చేసిన వెంటనే సమస్త పాపసంచయమును నశించును. భవసాగరమున పడిన నీవిటుపైని విచారింప నక్కరలేదు' అనిన పిమ్మట విద్యాపతి కుండమున స్నానమాచరించి సంతుష్టమానసుడై నతశిరస్కుడై మనోవాక్కులచే దూరము

నుండి శ్రీజగన్నాథునకు ప్రణమిల్లి హర్షగద్గదవాక్కుతో స్తుతించి ఏకాగ్ర చిత్తుడై ఆనందించెను.

3. విద్యాపతి జగన్నాథుని స్తుతించుట :

ఓ ప్రధానపురుషాతీతా! సర్వవ్యాపీ! పరాత్పర! పరావరపరిణామ! పర మార్థ! నీకు నమస్కారము. ఓ జగత్పతీ! శ్రుతిస్మృతి పురాణేతిహాస సంప్రతి పాదితములైన కర్మలచే ఆరాధింపదగినవాడవు. నీవొక్కడవే. ఓ విభూ! ఈ జగ ములు, సృజింపబడినవి, ఈ సృష్టికి ఆధారము నీవే. లోకపాలకుడ నీవే. ఓ సర్వా త్మకా! అంతర్యామీ! నీకు నా నమస్సులు. కల్పాంత మందున్న దంతయు నీ కుక్షిలో సురక్షితముగా నుండును. దేవదేవా! త్రయీరూపుడ వగు నీకు నమస్కారము. నీ సూర్యచంద్రాది రూపముతో ఎల్లపుడు జగత్తు ప్రకాశించు చున్నది. సర్వ తీర్థమయిన గంగ నీ పాదాబ్జసంపర్కముచేతనే సర్వలోకములను పావనము చేయుచున్నది. ఓ పావనమూర్తీ! నీకు నా సాష్టాంగ దండప్రణామ ములు. ఆనందరూపుడ వయిన నీ యంశము వలన జగములు వెలుగొందుచున్నవి. సర్వకల్మషరహిత! బ్రహ్మాత్మస్వరూప! నిర్మలాంతరంగ! శుభరూప! మాయా స్వరూప! సర్వసంగవిహీన! సర్వజీవస్వరూప! సర్వరూప! నీవు సర్వసాక్షివి. బహుపాదాక్షి, శిరాస్యబాహుడవు, సర్వమును జయింప నిచ్చగలవాడవు, నీకు నా భక్తిపూర్వక వందనము లర్పించుచున్నాను.

ఓ కమలాకాంత! ఓ కమలాసన! ఓ కమలపత్రాక్ష! ఓ పురుషోత్తమ! నన్ను రక్షింపుము. రోగ శోకములచే అపార సంసార పరిభ్రమణముచే పీడింపబడు చున్న నన్ను ఉద్ధరింపుము. ఈ భవదుఃఖసాగరమునుండి నన్ను తరింప జేయుము' అని విద్యాపతి జగన్నాథస్వామిని నుతించెను.

ఈవిధముగా సురేశ్వరుడు, ప్రణవస్వరూపుడు అగు దేవుని స్తుతించి, విద్యాపతి హరి సన్నిధిని ప్రణవ మంత్రమును జపించెను. జపాంతమున ప్రశాంత చిత్తముతో కృతార్థుడు, ఉపవిష్టుడు, బద్ధాంజలిపుటుడగు బ్రాహ్మణునితో శబరు డిట్లనెను.

4. జగన్నాథుని దర్శనసంతుష్టుడైన విద్యాపతిని విశ్వావసువు ప్రశంసించుట :

'ఓ ద్విజపుంగవ! ప్రభువును దర్శించి ఇపుడు కృతార్థుడవయితివి. సాయంకాలమాయెను. ఆకలివలన నీరసించితివి, ఇంకేగుడము రమ్ము. ఘాతుక మృగములున్న యీ అరణ్యములో మనకు ఉనికి ఉచితముకాదు. భానుడ స్త మించుటకు ముందే నిలయమునకు పోవుదము' అని విశ్వావసువు విద్యాపతి కరమును పట్టుకొని తన యాశ్రమమునకు శీఘ్రముగా తోడ్కొని వచ్చెను.



ఆ బ్రాహ్మణుడు ఆనంద సాగరుడైన జగన్నాథుని ధ్యానించుచు క్షుత్పిపాసలు శ్రమమున్నగు వానివలన కలుగు దుఃఖములను ఎరుగడాయెను. విద్యాపతి దుర్గమ శిలావిషమభూయిష్టమై కంటకావృతమగు మార్గమున పయనించినను, సంతోషము ననుభవించి మైమరచెను కాని దుఃఖింపలేదు.

వైష్ణవోత్తముడగు శబర శ్రేష్ఠుడు బ్రాహ్మణాతిథియగు విద్యాపతిని ఉచిత రీతిని సత్కరించెను. స్పృహోచితములయిన అతిథి మర్యాదలు గావించిన శబరు నకు అరణ్యములోనున్న అతని గృహమునందు రాజులకుతగిన భక్ష్యభోజ్యము లెట్లు సమకూడినవని విద్యాపతి ఆశ్చర్యము నందగా, శబరుడా బ్రాహ్మణాతిథికి సవినయముగా ఇట్లు సమాధానము చెప్పెను.

5. శబరుడు విద్యాపతితో పల్కిన ప్రియవచనములు :

'ఓ విప్రా! ఇపుడు నీ ఆకలిదప్పి తగ్గినందున శ్రమహీనుడవైతివి. అరణ్య కుల నివాసములలో నాగరకులకు సుఖమెట్లు ప్రాప్తించును? శబరులకు ముఖ్య ముగా నాగరకవృత్తి తెలియదు. రాజోపజీవులలో రాజుయొక్క అమాత్య పురోహితులు శ్రేష్ఠులు. వారిలో రాజనముడు, శాస్త్రసమ్మతుడయిన పురో హితుడు పూజ్యుడు.

ఓ బ్రాహ్మణోత్తమ! ఇంద్రద్యుమ్న మహారాజు సార్వభౌముడు. ప్రతాప వంతుడు. నీవు సంతసించినయెడల అతడు తప్పక ఆనందించును.' అరణ్యవాసి యగు శబరుని వినయాద్భుతవాక్కులు విని విద్యాపతి యిట్లనెను.

6. విద్యాపతి శబరుడొసంగిన భక్ష్యభోజ్యములగూర్చి ఆశ్చర్యపడుట :

'ఓ సాధు జనోత్తమ! నా ఉపచారములకు నీవు సేకరించిన వస్తువులన్నియు అమానుషములు. రాజులుకూడ చూచియుండరు. శబరుని యింట దివ్యవస్తు సముదాయముండుట విచిత్రము. ఈ విషయమును నీవు తెల్పుటకు నాకు చాల కుతూహలముగా నున్నది' అని విద్యాపతి శబరునితో వచించెను.

7. శబరుడు అతిథియగు విద్యాపతికి భోజ్యవస్తు రహస్యమును తెల్పుట :

'ఓ ద్విజశ్రేష్ఠ! ఈ రహస్యమును బహిర్గతము చేయుట నాకిష్టములేదు. అయినను నాకు నీ వతిథివగుటచే నీయందుగల భక్తిచే చెప్పుచున్నాను. వినుము. జగత్పతిని ప్రతిదినము ఇంద్రాది దేవతలు పూజించుటకు ఇటకు దివ్యోపచార వస్తువులను తీసికొని వచ్చుచున్నారు. వారు జగన్నాథుని భక్తితో స్తుతించి వందనము లాచరించి, గీతవాదిత్రనృత్యము లొనర్చి, పురుషోత్తముని ఆనంద పరచి, దేవలోకమునకు మరల వెళ్లుచున్నారు.

విద్వాంసుడగు నీకు సమర్పించిన భక్ష్యభోజ్యములన్నియు జగన్నాథునకు నివేదన చేయబడినవే. వానిని భుజించుటవలన మనపాపములు రోగములు ముసలితనము పోవును. మనకు మన సుపుత్ర బాంధవులకు సంపూర్ణాయువు, ముక్తి ప్రాప్తించును. ఇది చిత్రము కాదు' అని శబరుడు పల్కగా, వినిన విద్యాపతి నయనములు ఆనందాశ్రుపూరితము లయ్యెను. అతని పుణ్యము అనల్పమనుకొనెను. శబరుడయినను విశ్వావసువు అవ్యయుడయిన ఈశ్వరుని చూచుచున్నాడు. విష్ణువు భుజించి విడిచిన ఉచ్ఛిష్టమును, దివ్యభోగమును ఇతడు దివారాత్రములు తినుటచే భూమియందలి చరాచర జీవులలో ఇతనికి సాటివచ్చువారెవ్వరు నుండరు. నీలాచలమందిట్టి విష్ణుభక్తుడయిన శబరోత్తముని విడిచి నా యింటికి పోయిన సుఖరహితమయిన కుటుంబ జీవితమువలన ఏమి ప్రయోజనము ? ఈ శబరునితో స్నేహముచేసి యీ వనాంతరమందు నివసించెదను. శ్రీ కృష్ణాసక్త మానసుడయిన బ్రాహ్మణశ్రేష్ఠుడగు విద్యాపతి చిరకాలమాలోచించి శబరునితో ఇట్లు వాక్రుచ్చెను --

'ఓ సాధుపుంగవ ! నీకు నాపైని అనుగ్రహమున్నచో నీతో సఖ్యముచేయవలయునని దృఢనిశ్చయముతో నున్నాను. అనుగ్రహింపుము. మా రాజునకు సేవచేయుటవలన పరలోక సుఖము కల్గదు కావున రాజధానికి నేనేగుటవలన ప్రయోజనమేమి ? నీతో కూడ నేనిటనుండి మధుసూదనుని ఉపాసించి నాకు మరల దేహబంధము కలుగనిరీతిగా ప్రయత్నించెదను.

ఓ మిత్రుడా ! నా పుణ్యమువలన నీ సాంగత్యము లభించినది. నీ ప్రసాదమువలన దుస్తరమయిన భవసాగరమును దాటగలను. సారములేని సంసారమున సత్సాంగత్యమే సారమయినదందురు. వైష్ణవునితో మిత్రత్వము దుఃఖ సంసార సాగరపారమును చేర్చును. నీవంటి మిత్రుని సహవాసమువలన మరల శంఖ చక్ర గదాధరుడు భగవంతుడయిన పుండరీకాక్షుడు ప్రత్యక్షమగును. ఓ సఖుడా ! ఇంద్రద్యుమ్నుడను నరపతి సేవకులు వెళ్లిన వెంటనే భగవంతుని సమారాధనకై ఇటకు మరలిరాగలడు. జగత్పతియొక్క సహస్రోపచార పూజ సల్పుటకు భగవంతునికి ప్రియమైన విశాలమైన ప్రాసాదమును నిర్మించుటకు ఇంద్రద్యుమ్న మహీపతి ప్రతిజ్ఞ చేసెను. 'నేను క్రీతుడనైతిని. అది అనుమతింపబడినది' అని ఆ నృపతి యెదుట ప్రతిధ్వనించెను.

8. ఇంద్రద్యుమ్నాగమనము శ్రుతపూర్వమని శబరుడు విద్యాపతికి తెల్పుట :

'ఓ సఖుడా ! ఇంద్రద్యుమ్న నృపతి ఇటకువచ్చు ననెడివార్త చాల కాలము నుండి ఈ ప్రాంతమున ప్రచారములో ఉన్నది. ఆ రాజు అచట మాధవుని మాత్రమే చూడడు. స్వల్పకాలములోనే స్వర్ణవాలుకతోకూడిన భగవంతుడు



దీనిని తెలిసికొనదగిన మాయచే అంతర్ధానమును పొందింపగలడు. నీకు మహాపుణ్య పరిపాకమువలన నీ మూలముగా అగోచరుడయిన హరి చరులకు కానవచ్చును. ఇంద్రద్యుమ్న నృపతి వచ్చుటకు భగవంతుడు అనుకూలించును.

ఓ మిత్రుడా ! నృప సమక్షమున ఈ విషయమును నీవు పలుకరాదు. అతనికి ఇచట పరమేశ్వరుడు కానరావందున ప్రాయోపవేశవ్రత మాచరించి స్వప్నమున గదాధరుని దర్శించి అతని యానతిచే దారుమయ మయిన ప్రభులింగ చతుష్టయము బ్రహ్మచే ప్రతిష్ఠింపబడగా భక్తితో పూజింపగలడు. ఇక్కడ హరి ఉన్నంతకాలము మన వంశముండును. భగవంతుని అనుగ్రహ మున్నందువలన దీని విషయమై చర్చ చేయరాదు.

ఓ సఖుడా ! ఇక విచారింపకుము. శీఘ్రముగా ఇది జరుగును. ఇప్పుడు సుఖముగా నిద్రింపుము. ప్రాతఃకాలమున మరల నీలేంద్రమణిమయుడగు దేవుని దర్శించి సాగరమున స్నానమాచరించి దాని తటమందు మహావటనివాసమునకు కోరినరీతిగా మంచి సంస్థానమును కాంచ గలము. బ్రాహ్మణశబరులగు విద్యాపతి విశ్వావసువులు ఇట్టి యితర పుణ్యకథలను పరస్పరము చెప్పుకొని మంచిచోట పల్లవనిర్మితమైన శయన మందు నిద్రించిరి. ఆ మిత్రు లిద్దరు ప్రాతఃకాలమునలేచి తీర్థరాజోదకమున స్నాన మాచరించి విధిపూర్వకముగా మాధవునకు ప్రణమిల్లి రాజునకు తగిన స్థానమును నిర్ణయించి మరల నివాసములకు వెడలిరి. విద్యాపతి అచట మిత్రుడయిన శబరునితో సంప్రదించి ఇంద్రద్యుమ్న నృపతి యాజ్ఞను పాటించి రథము నధిష్ఠించి అవంతీపురమునకు పయనమాయెను.

## 9వ అధ్యాయము

1. జైమిని మునులకు జగన్నాథుని గూర్చి తెల్పుట :

'ఓ విప్రులారా ! సాయంకాలమున దేవతలు మాధవార్చనకు వచ్చినపుడు విద్యాపతి అను బ్రాహ్మణుడు కూడ ఉన్నతరిని ప్రచండగతిని వాయువు వీచెను. అంతట అతడు సువర్ణ విగ్రహములనుచేయించి అటనుంచెను. అచటకు వచ్చిన సురలు వ్యాకులదృష్టితో శ్రీ విష్ణు విగ్రహమును చూడలేకపోయిరి. అపుడు వారు పురుషోత్తముని ధ్యానించిరి. దివిజులు స్థిరదృష్టితో ధ్యాననిమగ్నులైనను ధ్యానానంతరము, సువర్ణవిగ్రహములను చూచిరి. కాని మాధవుని మాత్రము గాంచరైరి. అటులనే వారు రోహిణ మను కుండమును గూడ చూడలేక వ్యాకులేంద్రియులై అధికమైన చింతతో హాహాకారమొనర్చుచు మిక్కిలి రోదించిరి.

ఒక్కసారి వారికి దుర్దైవము ప్రాప్తించినదని అంతకుమున్నువారి దృక్కులను ఆనందబాష్పములతో తడుపుచుండిన శ్రీపతి అత్తరిని క్షణకాలమయినను వారికి దర్శనమీయలేదని దేవతలచట ఇట్లు విచారించిరి.

ఓ పురుషోత్తమ ! మేము ఏ అపరాధముచేసితిమి ? నీ సేవకులందరిని విడిచితివి. ఒక్క తడవయినను కానరాకున్నావు.

ఓ జగన్నాథ ! ఎవరికై విగ్రహరూపమును ధరించితివి ? మమ్ము అరణ్యములో విడిచిపెట్టి ఎందులకు ఉపేక్షించుచున్నావు. మేమనాథుల వలె అలమటించు చున్నాము. మేము నిరాధారులమై అపఖ్యాతిపాలగుచున్నాము.

ఓ యజ్ఞపురుష ! భవదంశసంభూతులమై నీయాజ్ఞానుసారము ఫలముల నొసంగుచున్న మమ్ములనుద్దేశించి స్వప్రీతికొరకు యజ్వలు యాగములు చేయుచున్నారు. నీ యహంకారగాత్రులము, నీ యనుగ్రహముచే జీవించు చున్నవారము. ప్రస్తుతము నీచే ఉపేక్షితులమైన కాందిశీకుల మెచటికి పోగలము.

ఓ మాధవా ! నిన్ను చూడలేని మేము దివిజులమైనను ఏమిచేయగలము ? నీవులేని మేము అకృతార్థులమై వనేచరులము కాగలము. శోభాయమానమై నిష్కళంక సుధాకరబింబము వంటి నీ వదనమును మేము చూడలేకపోయినచో సురలోకమునకు పోము. జటావల్కలధారులమై నియమయుక్తులమై తపోవృత్తితో పరమమయిన తపము నాచరించుచు ఇచటనే ఉందుము.

ఓ పుండరీకాక్ష ! నిసర్గకరుణాసముద్ర ! దీనులమయిన మమ్ము రక్షించుట కర్తుడవీవే. ఎన్నాళ్లతో నిన్ను విలోకింపగలము.

ఓ జగత్పతీ ! అనాథులము, దీనహృదయులము, నిన్నే శరణు పొందిన వారము. త్వదనాలోక శోకైకపారావారమున మునిగిన మమ్ములను నీ శుభ దృష్టి తరణిచే సముద్ధరింపుము'. ఇట్లు విలపించుచున్న సర్వదేవతలకు, అపుడు అశరీరవాణి పల్కిన వాక్కులు వినవచ్చెను.

'ఓ దేవతలారా ! మీరిచట స్వామి దర్శనమునకై యత్నించుట వలన ఫలితము శూన్యము. నేటినుండి భూమిపైని దేవుని దర్శనము దుర్లభము. ఇచట వానికి నమస్కరించినను అతని దర్శన ఫలము లభ్య మగును. స్వయంభువుని కడ కేగి యథార్థ విషయమును తెలిసికొనుడు' అనిన విని సురలు బ్రహ్మదేవుని సమీపమునకు వెళ్లిరి. లక్ష్మీనారాయణులు యముని అనుగ్రహించుట, హరి దారువిగ్రహరూపముగా అవతరించుట, బ్రహ్మదేవుని వలన విని దేవత లందరు సంతసించి తమలోకమునకు చనిరి.



రథారూఢడయిన విద్యాపతి అను పురోహితుడు నీలమాధవుడు కానవచ్చుటచే తాను వచ్చిన కార్యసిద్ధి కలిగినదని భావించి, పురుషోత్తమ క్షేత్రమును సంపూర్ణముగ చూచుటకు కుతూహలపడెను. విద్యాపతి పుణ్యప్రదము, సంకీర్తనముచే పాపహారియు, పరమ పవిత్రమయిన పురుషోత్తమ క్షేత్రమును మున్నెన్నడు చూడలేదు. ఆ క్షేత్రమునకు ప్రదక్షిణ మాచరించినచో భూప్రదక్షిణము వలన కలుగు ఫలితముకంటె నూరురెట్లు లభ్యమగును. అచటి అరణ్యము సకల కల్మషహరము. దక్షిణ సముద్రతీర మందున్న పురుషోత్తమ క్షేత్రము నీలాచల శోభితమని మిత్రుడయిన శబరునివలన విద్యాపతి వినుటచే, పురుషోత్తమక్షేత్రమున సంచరించెను. అచట వనములో అన్నిరకముల చెట్లు, పక్షులు, గానము చేయుచున్న తుమ్మెదలు, సూర్యకిరణములుకూడ దూరలేని వాయాతరుసమూహము, సర్వర్తువులందు పరిమళించు కుసుమగుచ్ఛములు లతాగుల్మములు, జలాశయములందు సంచరించు కూజత్సారససంకులము, పద్మకల్హార కుముదవికచోత్పలములు, విద్యాపతికి హృదయాహ్లాదకరము లయ్యెను. ఆ దివ్యక్షేత్రశోభను తిలకించిన పిమ్మట విద్యాపతి ఉపవాసముతో హరి ధ్యానము చేయుచు బయలువెడలి ఇంద్రద్యుమ్న నృపతి నివసించుచున్న అవంతీనగరమున అతనికి పురుషోత్తమ క్షేత్ర మాహాత్మ్యమును తెల్పుటకు సాయంసమయమున ఆ నగరప్రాంతము చేరుకొనెను. విద్యాపతి దూరముగ నుండగనే అతని రాకను ముందుగా తెలిసికొని ఇంద్రద్యుమ్న నృపతి పరమ హర్షము నందెను.

ఆ రాజ పురోహితుడు, బ్రాహ్మణోత్తముడయిన విద్యాపతి రాక కెదురుచూచుచు, జనార్దనుని పూజించి బ్రాహ్మణులతోడను, విద్వాంసుల తోడను ఉపవిష్టు డయ్యెను.

ఆసమయమున వేత్రహస్తులైన ప్రావేశికులు, పురస్సరులైన దౌవారికులు, మార్గనిర్దేశకు లయిన పౌరులు, రాజపురోహితు డయిన విద్యాపతిని రాజమర్యాదలతో రాజసన్నిధికి తీసికొనిరాగా, పురుషోత్తమ క్షేత్రము నందలి నీలమాధవుని నిర్మాల్యమాలను చేతిలో నుంచుకొని ఆ ఉత్తమ ద్విజుడు త్వరగా రాజునకు ముందు నిలచెను. రాజు ఆ విప్రుని గాంచినంతనే ఉత్తమాసనము నుండి లేచి 'జగదీశ ! ప్రసీద' అని పలుకుచు వాని సమీపమున చేరెను. ఇటు నిర్మాల్యమాలాధరుడగు మాధవుని చూచుటచేత, తన జన్మకర్మలచే తన జీవితము సఫల మయినదని ఇంద్రద్యుమ్నుడు తలంచి విద్యాపతి తెచ్చిన మాలనిట్లు వర్ణించుచున్నాడు.

మాలావర్ణనము : ముకుందుని కంఠము నందుండుటచే ప్రభావితమయిన ఈ నిర్మాల్యమాలాపరిమళము కల్పవృక్షకుసుమ సుగంధమును

తిరస్కరించుచు, తత్కుసుమము లందున్న అలిసమూహమునకు అంధత్వ మును చేకూర్చుచు, జగముల కలుషమును హరించు చున్నది. కావున ఈ మాలకు నమస్కరించు చున్నాను. విష్ణుపాదపంకజరజస్సు నందనురక్తులైన బ్రహ్మాదులు పరమ సంపదల నందిరి. విష్ణుదేహమున ప్రకాశించుచున్న అంగరాగసంసక్తపుష్పవిలయమైన మాలకు నమస్కరించుచున్నాను. విష్ణుహృత్పద్మస్థిత అగు పద్మ, విష్వంకస్థితిగర్వితా, సపత్ని అగుటచే విష్ణుని ర్మాల్యమాల వికస్వరములు గల కుసుమములతో నవ్వుచున్నది. శ్రీపతి యొక్క శరీరము నందు సర్వాంగముల నలంకరించిన మాల ఉజ్జ్వలమై మహామాన్విత మైనది.

ఓ శ్రీపతీ ! నీలాద్రిశిఖరభూషణ ! అఘప్రదూషణ ! ప్రణతార్తిహర ! జయము. శరణాగతుడ నయిన నన్ను రక్షింపుము' అని రాజు శ్రీహరి మాలను నుతించి బాష్పగద్గదస్వరముతో గగుర్పాటుతో శీఘ్రముగా విద్యాపతిని సమీపించెను.

బ్రాహ్మణోత్తముడయిన విద్యాపతి హాసరహితుడై, దివ్యదేహుడై మాధవుని ధ్యానించుచు ఇంద్రద్యుమ్నుని యెదుట నిలిచి 'ఓ రాజా ! నీలాద్రి శిఖరనిలయుడు, సుధీమంతుడు, స్వీయతేజస్సుచే సర్వలోకముల పాపములను నాశనము చేయుచున్న దేవుడు నిన్ననుగ్రహించుగాక ! సాక్షాన్ముక్తిదాయకుడు, ఉత్తమ క్షేత్రగతుడయిన శ్రీవిష్ణువును దర్శించుటకు శ్రీపతి యొక్క అజ్ఞనీకు ఈ మాలారూపముగా లభించినది.' ఇట్లు పలుకుచు బ్రాహ్మణుడు ఇంద్రద్యుమ్నుని కంఠములో మాలను వేసెను.

ఆ క్షితిపతి తేవి హృదయమందు వ్రేలాడుచున్న మాలను చూచి శ్రీకాంతుడు తనహృదయమందున్నట్లు తలంచి అర్ధనిమీలితలోచనుడై శిరమున హస్తములుంచుకొని ఆనందాశ్రుజలక్లిన్న వదనుడై హరి నిట్లు స్తుతించెను.

2. ఇంద్రద్యుమ్నుడు హరిని స్తుతించుట :

'శ్రీహరీ ! అఖిలజగత్సృష్టిస్థితిసంహారకారా ! విశ్వరూపా ! బ్రహ్మాండ భారవాహకా ! అంతర్యామీ ! అశేషప్రణతార్తిహరా ! ఓ ప్రభూ ! బ్రహ్మేంద్రరుద్ర ముకుట కిర్మీరితపదాంబుజా ! దీనానాథా ! విపన్నైకసతతత్రాణతత్పరా ! నిర్వ్యాజకరుణావారిపారావారా ! పరాత్పరా ! శ్రీజగన్నాథా ! భక్తానిరత వత్సలా ! అనాదిభ్రమనిర్భరుడగు నిన్నే శరణుపొందుచున్నాడను. దీనుడను నన్ను రక్షింపుము' అని నుతించుచు ఇంద్రద్యుమ్నుడు తన ఆసనమున కూర్చుండెను.



3. ఇంద్రద్యుమ్నుడు విద్యాపతిని పూజించుట :

రాజు సభామండపమున గృహస్థబ్రహ్మచారి యతివైఖానసపరివృతుడై అష్టాదశవిద్యల యందు పండితులయిన ద్విజులతో మౌనము వహించిన స్వర్ణభృత్యులతో, పురస్సరులైన మంత్రులతో బహుమానపురస్సరముగా విద్యాపతిని పూజించి ముందున్న పీఠముపైని కూర్చుండబెట్టి ముందుగా కుశల మడిగి పురుషోత్తమక్షేత్ర మాహాత్మ్యమును, నీలమణిదేహి అయిన శ్రీజగన్నాథుని స్వరూపమును, మహిమను సావధానచిత్తుడై సంతసముతో అడిగెను. క్షత్రియుడగు ఇంద్రద్యుమ్నుడు బ్రాహ్మణుడగు విద్యాపతిని పురుషోత్తమ క్షేత్రములోని విశేషములను తెల్పుమని కోరెను.

4. విద్యాపతి ఇంద్రద్యుమ్నునకు పురుషోత్తమ క్షేత్రవృత్తాంతమును వివరించుట :

విప్రుడు నృపునకు తాను భిల్లద్వీపమును ప్రవేశించుట మొదలుకొని సముద్రస్నానము చేసినంతవరకు తనఅనుభవములను సవిస్తరముగ వ్యక్తము చేసెను.

నీలాద్రిరోహణము, నీలమాధవుని దర్శనము, రౌహిణమను కుండమున స్నానము, వటవృక్షమహిమ, నృసింహోద్యష్టశంభులింగములు, అష్టశక్తులు మున్నగువాని వృత్తాంతమును విద్యాపతి రథముపై పోవుచుండగా కనబడిన క్షేత్రముయొక్క ఆయామ విస్తరములు, మొదటినుండి క్రమముగా అంతయు రాజునకు చెప్పగా రాజు సంప్రీతితో సంతుష్టచిత్తు డయ్యెను.

5. ఇంద్రద్యుమ్నుడు విద్యాపతిని విష్ణుస్వరూపమును నిర్మాల్యమాలా మహిమను వర్ణింపుమని కోరుట :

'భగవంతుడయిన విద్యాపతీ ! ఇంతకుముందు తైర్థికాదుల వల్లనేనువినిన పురుషోత్తమ క్షేత్రమును గూర్చి వివరములవింటిని. ఇపుడు మరల పురుషోత్తమ క్షేత్రవిశిష్టతను, నీలేంద్రమణిమూర్తి అయినవిష్ణువు యొక్కరూపమును యథాత థముగ వర్ణింపుమ'ని రాజు కోరగా విద్యాపతి రాజున కిట్లుచెప్పనారంభించెను.

'ఓ రాజా ! జగత్పతి యొక్క ఏ దివ్యమూర్తిని చర్మచక్షువులతో చూచిన ముక్తికలుగునో, దానినే నీకు తెల్పగలను. అచటి విష్ణువుయొక్క పురాతన మయిన మూర్తినీలేంద్రమణిమయము. దానిని ప్రతిదినము బ్రహ్మరుద్రేంద్ర ముఖ్యులగు దేవతలు పూజింతురు. ఓ నృపా ! దివిజులచే పూజాసమయమున విష్ణువును అలంకరించిన ఈ దివ్యమాలవాడదు. దీని పరిమళము తగ్గదు. ఓ భూపతీ ! బహుదినములు, తిథులు గడచినప్పటికినీ, ఇట్టిమాలవలన కలిగిన

దివ్యోపహార నిర్మాల్య భక్షణము వలన క్షీణకల్మష డనయిన నాలో అమానుష వర్చస్సును అవలోకించలేకున్నావా ?

విష్ణునిర్మాల్యభక్షణము వలన క్షుత్పిపాసాబలక్షయములు ఒక్క పర్యాయమయినను బాధింపవు. ఓ భక్తాగ్రగణ్యా! ఈ నిర్మాల్యమాలను చూచుటచేతనే అదృష్టము, భక్తిముక్తులు ప్రాప్తించును. ఆ దివ్యక్షేత్రము నందున్నవారికి, జరారోగశోకాదుల వలన దుఃఖము కలుగదు. అచటనున్న జగన్నాథుడు ప్రసన్నవదనుడు, విభుడు, ఫుల్లేందీవరపత్రాక్షుడు, ప్రపన్నామృత ముక్తి ప్రదుడు' అని విద్యాపతి రాజునకు చెప్పెను.

## 10వ అధ్యాయము

1. విద్యాపతి ఇంద్రద్యుమ్నునకు పురుషోత్తమక్షేత్ర వృత్తాంతమును విశదీకరించుట :

విద్యాపతి పుట్టినది మొదలు పురుషోత్తమక్షేత్రమును చూడకుండినను అచటి దివ్యవృత్తాంత మతని కెట్లు తెలిసె నని ఇంద్రద్యుమ్నుడు ప్రశ్నించగా విద్యాపతి అతని కిట్లు సమాధానము చెప్పుచున్నాడు.

"ఓ రాజా! అచటనున్న నేను సాయాహ్నమున భగవంతుని దర్శించితిని. అపుడు దివ్యపరిమళముగల శిశిరవాయువు వీచెను. ఆకాశమున పుట్టినసంతుల శబ్దము ఇట్లు వినబడెను—'క్రమముగా వెళ్లుము. బాగుగావెళ్లుము' అను దివ్య గానోపేతమయిన వర్ణమయము, అభూతపూర్వమయినధ్వని కూడ వినవచ్చెను. మనుష్యులకంతకు పూర్వము చూడశక్యముకాని సహస్రోపచారపూజను పరమేశ్వరప్రీతికై సురలు కావించిరి. వారు స్వహస్తములతో దేవుని యథావిధిగా పూజించి జయపూర్వక స్తుతులచే మధుసూదనుని ఆనందింపజేసి వచ్చినరీతినే దేవలోకమునకు వెడలిరి. వారు మరలినవెంటనే నాయకుడయిన విశ్వావసువను శబరుడు నాకు దివ్యోపహార భోజ్యములను, ఈ మాలను యిచ్చెను. ఈ మాల వాడదు, శ్రీరాజ్య సుఖదాయకము, దారిద్ర్యపాపరాక్షసనిర్మూలకము, అట్టిదాని నతడు నా కొసగెను. ఇది అమూల్యము.

ఓ నృపా! ఉత్తమ మయిన విష్ణుక్షేత్రమును గూర్చి వినుము – ఆ దేవుని రూపము అపూర్వ శిల్పనైపుణ్యముతో మనోహరముగా నున్నది. దీని మహిమను వర్ణించుట పుడమిపై జనించిన ఏ పురుషునకును శక్యముకాదు. భగవత్కటాక్షమువలనను, నా మానవబుద్ధిచేతను గ్రహించినదానిని నీకు విశదీకరించుచున్నాను.



పురుషోత్తమక్షేత్రము అరణ్యమున ఉన్నది. ఆ క్షేత్రమధ్యమున నీలాద్రి కలదు. దాని పొడవు వెడల్పుల మొత్తము పంచక్రోశపరిమితము. ఆ పుణ్య తీర్థము యొక్క ఒడ్డున స్వర్ణప్రతిమతో కూడిన పర్వతశిఖరమునందలి కల్ప వృక్షము మిక్కిలి ఎత్తుగానున్నది. పొడవు క్రోశము. దానిపల్లవములు నయనానందకరముగా నున్నవికాని పుష్పఫలములు లేవు. సూర్యుడు అస్తమించిన పిమ్మట దాని నీడ నుండరాదు. దానికి వెనుకభాగమున రోహిణమను పేరుగల కుండమున్నది. జలము భూమిలోపలి నుండి బయటకువచ్చి, నీల శిలలపైని పారుట శోభాయమానముగా ఉన్నది. దానిబాహ్యప్రదేశము నాల్గుదిక్కుల యందు స్ఫటికవేదులతో కూడినది. ఆ కుండ మందలి జలము పరిపూర్ణము, పాపహారమై మనోహరముగా ఉన్నది. దానికితూర్పున వేదికామధ్యభాగమున వటవృక్షము యొక్క శీతలచ్ఛాయ యందు ఇంద్రనీలమణిమయుడు చక్రగదా ధరుడు అయిన దేవుడున్నాడు. అతని పరిమితి 81 అంగుళములు. అతడు స్వర్ణపద్మ పరిభాగము నందున్నవాడు. అష్టమీచంద్రకళావిలసితఫాలభాగము కలవాడు. అతని లోచనములు వికసిత పద్మద్వంద్వశోభను మీరుచున్నవి.

అతని ముఖారవిందనిష్యందామృతము తాపత్రయమును హరించును. అతని నాసాపుటము తిలపుష్పశోభతో అలరారుచున్నది. అతని విగ్రహము శిలామయమయినను, అధరము సుస్మితయుతమై విరాజిల్లుచున్నది. ఆ భగవానుని మందహాసముచే అతని గడ్డము, చెక్కిలిమీదిభాగము, హృద్యముగా నున్నవి. హాసముచే బిమ్మములైన అతని అధరములు, చెక్కిళ్లు, గడ్డము చూపరులకు ఆశ్చర్యానందజనకములుగా ఉన్నవి. ఆ శిలావిగ్రహము సర్వావయవ సౌందర్య శోభతోపాటు విశ్వకర్మాది శిల్పిల నైపుణ్యమును వేనోళ్ల చాటుచున్నది. ఆ విష్ణు దేవుని చెవులు మకరాస్య కర్ణభూషణములతో శోభించుచున్నవి. ఆ స్వామి గురు శుక్రుల మధ్య పూర్ణచంద్రునివలె ఉపహాసము చేయుచున్నాడు. కంఠహారముతో అతని మెడ శోభిల్లుచున్నది. చతుర్భుజుడగు ఆ జగన్నాథుడు పీనాయత స్కంధ యుగముతో దీర్ఘ జానుద్వయముతో ఒప్పుచున్నాడు.

ఆ పురుషోత్తముడు స్వచ్ఛనిర్మలహారోపశోభిత వక్షస్థలుడై లోకములకు కాంతినిచ్చు కౌస్తుభమును ధరించియున్నాడు. ఆ మురారి నిమ్ననాభి హృదావిష్ట దేహరోమాళిచే మంజులుడు. ఆ దేవుడు రత్నమేఖలాదామముచే కింకిణీమౌక్తిక స్రజముచే శోభిల్లుచున్నాడు. ఆ దేవదేవుని జగల్లావణ్యపుటములగు పిరుదులు మోక్షమాంగల్య తోరణాశ్రయములైన జంఘాస్తంభ యుగము వృత్తానుపూర్వ జానువులతో దివ్యమైన మాల, రత్నాఢ్య వలయములతో చరణద్వంద్వము భక్త కోటికి హృదయరంజకముగా నున్నవి. హార కంకణ కేయూర ముకుటాదులచే అలంకృతుడగు కేశవుడు జ్ఞానాలంకార శబ్దబ్రహ్మమునందు, చక్ర పద్మ గదా

శంఖములను ధరించుచు సర్వాశాద్యోతకుడైన దేవుడు నీలాద్రియొక్క ఉపరి భాగమునందున్నాడు. అతనిని భక్తితో దర్శించి ప్రణామము చేయువారు దేహ బంధమునుండి విముక్తులగుదురు.

కమలపాణియైన విష్ణువు వామపార్శ్వగత అయిన లక్ష్మీదేవిని కౌగిలించుకొనెను. ఆమె వీణావాదన తత్పర. భగవదున్ముఖలోచన, సర్వలావణ్యవతి, ఆ నీలాచలమందున్న జీవకోటికి ఆ లక్ష్మీనారాయణులే తల్లిదండ్రులు. ఓ రాజా! ఆ పుణ్యదంపతులను కనులార గాంచుచు, నిశ్శబ్దముగా నిశ్చలముగా నున్న నన్ను వారు కరుణాకటాక్షవీక్షణములతో అనుగ్రహించుచున్నట్లు తృప్తిపడితిని. దీనానుగ్రహమును ప్రదర్శించిన ఆ దంపతులు సజీవులని గ్రహించితిని. స్వామి వెనుకనున్న శేషుని ఫణము ఛత్రముగా నుండెను. సుదర్శనమును చేత ధరించి యున్న శ్రీహరిని గాంచితిని. వాని వెనుకభాగమున ముకుళితహస్తుడై యున్న గరుత్మంతుని, అద్భుతరూపుడయిన శ్రీపతిని చూచితిని. నా మనస్సు రజ్జువులచే కట్టబడినట్లు ఆ ప్రదేశమందు మాత్రమే సంచరించుచుండెను. అనేక సహస్ర జన్మములందు ఆచరించిన సత్కర్మలు ఒక్కసారి పరిపక్వమయిన సద్భక్తుడే అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన ఆ పురుషోత్తముని దర్శనభాగ్యమును పొందగలడు. ఆ వైకుంఠపతిని మానవుడు చూచుటకై తీర్థ స్నాన తపో దాన దేవయజ్ఞము లెన్ని చేసినను ప్రయోజనము లేదు.

పురుషోత్తమ క్షేత్రవాసి. నీలమూర్తి విమలాంబరాధరుడయిన విష్ణువును ధ్యానించువారు బంధరహితులై వైకుంఠపురమును ప్రవేశించి నిర్విచారులై తన్మయులగుదురు. అష్టాదశ విద్యానిష్ణాతులయి నానావిధ సత్కర్మ లాచరించుట వలన పొందిన ఫలితము ఒక్కసారి శ్రీవిష్ణువును సందర్శించుటవలన కలుగు సత్ఫలితములో నూరవవంతు మాత్రమే.

ఓ క్షితీంద్రా! సద్భక్తుడు బుద్ధిబలముచే పొందుచున్న తన కోర్కెల ఫలములకంటె అత్యధికముగా పురుషోత్తమ క్షేత్ర మహిమచే నీలాద్రిపతికి నమస్కరించి పొందగలుగుచున్నాడు. ఇంతకంటె ఎక్కువగా దీని విషయమై చెప్పవలసిన దేమున్నది ?

నీలాద్రినాథుని సందర్శించిన సత్పురుషుడే దాత, సర్వక్రతువుల నాచరించిన యజ్వ, సత్యప్రవక్త, ధర్మశీలుడు, సద్గుణసంపన్నుడు, తన జన్మసాఫల్యము పొందినవాడగుచున్నాడు.

ఓ నృపోత్తమా! ఆ పురుషోత్తమ క్షేత్రమున జగత్పతి అయిన మాధవుని సన్నిధినిగల సేవకుల వలననే, నీకు తెల్పిన యీ మాహాత్మ్యమును ఆకర్ణించితిని. అచట పరంపరాయాతమై ఆదిసృష్టికంటె పురాతనమై, సుప్రసిద్ధమైన ఈ ఆఖ్యానమును నేనక్కడ విని వచ్చితిని.



ఓ రాజేంద్రా! నీ యాజ్ఞవలననే నేనట కేగి శ్రీపురుషోత్తముని దర్శన లాభమును పొంది, నీకు తెల్పితిని. ఇక నీ వేమి చేయదలచితివో దానిని ఒనరింపుము' అని విద్యాపతి ఇంద్రద్యుమ్నునితో పలికెను.

2. ఇంద్రద్యుమ్నుడు తన భవిష్యత్కార్యక్రమమును విద్యాపతికి తెల్పుట :

'ఓ భగవత్స్వరూపా! విద్యాపతీ! ఆప్తవాక్యమువలన పాపహరమగు భగవంతుని రూపమునుగూర్చి విని, నీవు ప్రసాదించిన దివ్యనిర్మాల్య సంపర్కముచే కృతకృత్యుడనైతిని. బహుజన్మములం దాచరించిన నా పాపము లన్నియు క్షీణించినవి. శ్రీపతిని దర్శించుటకు ఇపుడు అర్హుడనైతిని. నేను సర్వసమృద్ధిగల నా రాజ్యముతో, సప్తాంగములతో పురుషోత్తమ క్షేత్రమునకు వెళ్ళి పుర దుర్గాదులను అక్కడ నిర్మించుకొని నివసించెదను. మురవైరి అగు విష్ణువు ప్రీతికై హయమేధ క్రతువును ఒనర్చెదను. ప్రతిదినము శ్రీనాథుని శతోపచారములతో పూజింతును. జగద్గురువగు హరిని వ్రతోపవాస నియమములతో ప్రీతి నొందించెదను. కరుణామయుడగు నారాయణుడు జగత్పతి, దీనానుకంపి, భగవంతుడు, ప్రభువు కావున తన వాక్యామృతధారలచే నా తాపమును పోగొట్టును' అని రాజు పరమేశ్వరుని శ్రద్ధాభక్తులతో స్మరించుచు తన కార్యక్రమమును చెప్పుచుండగా త్రిభువన సంచారి, బ్రహ్మసుతుడగు నారదమహర్షి తద్దేశమును చూడవలెనని కుతూహలముతో అటకు ఏతెంచెను. ఇంద్రద్యుమ్న మహారాజు వచ్చుచున్న ఆ త్రిలోక సంచారిని చూచి తన కార్యసిద్ధి తప్పక కాగలదని తలంచెను. అపుడు రాజు శీఘ్రముగా సింహాసనమునుండి లేచి, నారదమహర్షిని ఉత్తమాసనముపైని కూర్చుండబెట్టి, వానికి నమస్కరించుచు నమ్రుడై ఇట్లు పలికెను.

3. ఇంద్రద్యుమ్నుడు నారదమునీంద్రునితో పల్కుట :

ఓ బ్రహ్మసుతా! నారదమునీంద్రా! నా యింటికి నీవు వచ్చుటచే కృతార్థుడనైతిని. ఇపుడు నా యజ్ఞములు దానము, అధ్యయనము, తపము సఫలములయినవి. అయినను నీ యనుగ్రహమును పొందుటకు నీ యాజ్ఞను పాటింతును. ఏ ఉత్తమాశయముతో నా గృహమును పావనము చేసితివి ?

బ్రహ్మపుత్రుడగు నారదమహర్షి భక్తిప్రశ్రయకోమలమయిన నృపతి వాక్యమును విని, స్మితపూర్వకముగా మహీపతిని జూచి యిట్లనెను.

4. నారదమహర్షి ఇంద్రద్యుమ్నునకు విష్ణుభక్తిమాహాత్మ్యమును తెల్పుట :

ఓ ఇంద్రద్యుమ్న మహారాజా! నీ విమలగుణములచే దేవతలు, సిద్ధులు, మునులు, బ్రహ్మయు సంతుష్టులయిరి. నీ ప్రతిష్ఠ విశిష్ట గుణములు యోగ్యము లయినవి. అవి నీకు బ్రహ్మసదన నివాసమును చేకూర్చును.

బదరాశ్రమమందున్న నరుని చూచుటకై భువికి వచ్చితిని. నా ధ్యాన సమయమునందు నీ వొనర్చిన సుకృతమంతయు తెలియవచ్చినది. ఓ భూపతీ! నీ పారలౌకిక కృషి ప్రశంసనీయమైనది. నీవు సద్బుద్ధితో సహస్రజన్మములందు గావించిన ఆధ్యాత్మికసాధన మూలముననే జగదీశ్వరుడు నీలాచల గుహావాసుడయిన మాధవునియందు నీకట్టి దృఢభక్తి కలిగినది.

జగత్పతియగు మాధవుని ఆరాధించుటచేతనే మహాప్రాజ్ఞుడయిన పితామహుడు పైతామహపదమును పొందెను. అతని వంశమునందు జనించిన నీకు ఇట్టి భక్తియుక్తమయిపనే.

విష్ణుభక్తివలన చతుర్వర్గఫలము, అధికతపఃఫలముకూడ లభించును. అనాదియగు అవిద్య బలవత్తరములగు పంచక్లేశములను వృద్ధిచేయుచున్నది. ఒక్క విష్ణుభక్తియే తత్క్లేశనివారణము చేయగలదు.

దుఃఖసంకటసంకులమైన భవారణ్యమునందు అతి కష్టముగా తిరుగుచున్న నరులకు విష్ణుభక్తియే సుఖప్రదమయినది. దుస్తరము, నిరాలంబము, ద్వంద్వ వాతప్రోద్ధత మయిన భవాంభోధియందు నిమగ్నులయినవారికి విష్ణుభక్తి నౌక అని చెప్పబడినది. భగవత్స్వరూపిణి, మాతృదేవత అయిన విష్ణుభక్తి నాశ్రయించి, సత్పురుషులు సంతుష్టచిత్తులై దుఃఖరహితులుకాగలరు. విష్ణుభక్తి సుధాపానము గావించిన మహాత్ములకు బ్రహ్మపదముపట్ల ఆసక్తికలుగదు. అర్హులయినవారికి విష్ణుభక్తి ముక్తి నొసగును.

ఓరాజా! జీవులకు త్రివిధమైన పాపరాశి అధికమయినను అది విష్ణుభక్తి దావవహ్నిచే శలభము వలె దహింపబడును.

గంగా ప్రయాగాది తీర్థములందు స్నాన మాచరించినను, తపములు, అశ్వమేధక్రతువు, ఉత్తమదానములు, చేయుటవలన వ్రతోపవాసనియమములు, పాటించుటవలన లభ్యమయిన తత్ఫలమును ఒకచోట చేర్చినను, అది విష్ణుభక్తి వలన ప్రాప్తించు ఫలితములో సహస్రాంశమునకు గూడ సమానముకాదని చెప్పబడినది" అని నారదుడు ఇంద్రద్యుమ్నునితో చెప్పగా విని రాజు మరల సత్కార భక్తిప్రపత్తులతో నారదుని కొనియాడి విష్ణుభక్తి లక్షణములను తెలుపుమనెను.

౯. నారదమహర్షి రాజునకు విష్ణుభక్తి లక్షణములను వివరించుట :

ఓరాజా! ఉత్తమ మయిన భక్తిలక్షణములను నీవడుగుట సమంజసముగా ఉన్నది. నీవు భక్తిభాజనుడవు : ఉత్తముడవు. కావున నీకు భక్తి లక్షణములను యథార్థముగా వివరించెదను. ఈ విషయము అపాత్రుడయిన నరునకు, అంధునకు, మలినాంత రంగునకు చెప్పరాదు.



ఓ అనఘా! నేను చెప్పునట్టి విష్ణుభక్తి సామాన్యముగాను విశేషముగాను సనాతనమైనది. దానిని సావధాన చిత్తముతో వినుము.

అత్యంత సుఖప్రాప్తి యందు దుఃఖసంతతి విచ్ఛేదము నందు ఇది ఒక్కటే ప్రయోజనకారి. ఆశ్రయింపదగినది, ఆచరణయోగ్యమయినది అగుటచే భక్తి ఉత్తమయినదిగా పేర్కొనబడినది.

అట్టిభక్తి గుణభేదముచే మువ్విధములయినను, వాస్తవది నిర్గుణమని చెప్పబడినది.

ఓ నృపా! కామక్రోధాభూతులయినవారిభక్తి, అన్యుల వలన లాభమును పొందుటకే యత్నించువారి భక్తి పరుల నాశనముకొరకే కృషిచేయువారిభక్తి తామసభక్తి అనబడును,

కీర్తి నార్జించుటకుగాని, ఇతరులకంటె అధికుడనని ప్రదర్శించుటకు మితిమీరి ప్రవర్తించుటకు గాని, ప్రసంగవశమున పరలోకప్రాప్తికి గాని వ్యక్తము చేయు భక్తి రాజభక్తి అనబడుచున్నది.

పశించుభావములను త్యజించి, స్థిరతరమగు ఆముష్మికసాధన చేయువాని భక్తి, వర్ణాశ్రమోక్తధర్మములను విడువక, ఆచరించుటకు కృతనిశ్చయుడయిన వాని భక్తి, ఆత్మజ్ఞానలబ్ధికి వినియోగించుభక్తి, సాత్త్వికభక్తి అనబడును.

ఈ జగత్తంతయు శ్రీజగన్నాథుని సంకల్పము వలననే ఆవిర్భవించి, వృద్ధి పొందును తుదకు లయముగు చున్నది.

'నేను జగన్నాథుని కంటె భిన్నుడను కాను, నాకంటె అతడు వేరుగా లేడు' అని భావించుచు, అహంకారపాధిహీనమై ప్రేమోత్కర్షతో కూడిన భావనాసహితముగు భక్తి ముక్తి హేతువగును. ఇట్టి దుర్లభమయినభక్తి అద్వైతభక్తి అనబడును.

నరులు సాత్త్వికభక్తితో బ్రహ్మపదమును, రాజభక్తితో ఇంద్రలోకమును, తామసభక్తితో భోగముల ననుభవించు పితృలోకమును పొందుచున్నారు. మరల భూలోకమునకు వచ్చినవారు ఆ భక్తిని వైపరీత్యము వలన తామసభక్తిని రాజసభక్తిగాను, రాజసభక్తినిసాత్త్విక భక్తిగాను మార్పుచేసికొనవలయును.

సాత్త్వికుడు అద్వైతభావనను చేసి ముక్తిని పొందుచున్నాడు. ఏ భక్తిని ఆశ్రయించినను క్రమముగా ముక్తిలభించును.

విష్ణుభక్తి లేనివారు శ్రౌతస్మార్తపరములయిన క్రియ లాచరించినను, ప్రాయశ్చిత్తకర్మ లొనర్చినను, తీర్థయాత్రలు సల్పినను, కఠినతపస్సు చేసినను, ఉత్తమకులజు డయినను, శిల్పనైపుణ్యము కలవాడయినను లౌకిక మయిన ప్రయోజనమును కొంతవరకు సాధింపవచ్చును. కాని అట్టివారికి శాశ్వతానందకరమగు ఫలితము పొందశక్యము కాదు.

స్వైరిణీ వ్యభిచారము వలన పొందుచున్నది కాయక్లేశఫలమే కదా! విష్ణు భక్తిరహితునకు అట్టి ఫలమే దక్కును.

కులాచారహీనుడయినను దృఢభక్తియుతుడు, జితేంద్రియుడయినచో సర్వలోకములందు ప్రశంసనీయుడగును.

ఓ రాజా! అష్టాదశవిద్యానిపుణుడయినను, ఉత్తమజాతికి చెందిన వాడయినను ధార్మికు డయినను విష్ణుభక్తిహీనుడయినచో అన్నిలోకములలో పూజనీయుడు కాడు.

తక్కువపుణ్యము కలవానికి విష్ణుభక్తి కలుగదు. కృషి చేసి అట్టి భక్తిని సంపాదించినవాడు కృతకృత్యుడు కాగలడు. అట్టివాడు నశింపడు.

ఏవిద్య జగన్నాథుని తెలిసికొనుటకు ఉపకరించునో అది విద్య అనబడును.

జగన్నాథుని తెలిసికొనదగిన విద్య నార్జించినవాడు అతని ప్రీతికొరకు కర్మ లాచరించువాడు దృఢవ్రతుడు. అట్టివాడే నిజమయిన విష్ణుభక్తుడు. అతని పవిత్రమయిన పాదపాంశువుచే చరాచరమగు విశ్వమే పవిత్రమగుచున్నది. అట్టి ఉత్తమవిష్ణుభక్తుడు తన ఇచ్ఛచేతనే సృష్టిస్థితిలయములను పొందుచున్నాడు. క్షణికము లయిన సుఖములను కోరునట్టి క్షుద్రులు అస్వతంత్రులయిన సృష్టిస్థితి వినాశములకు బద్ధు లగుదురు.

వాస్తవముగా వాసుదేవునకును, భక్తునకును భేదములేదు. వారిరువురును ఒక్కరే. ఇంతవరకు విష్ణుభక్తి లక్షణములను తెల్పితిని. ఇంక విష్ణుభక్తుని లక్షణములను తెల్పెదను వినుము, అని నారదుడు రాజుతో అనెను.

6. నారదుడు రాజునకు విష్ణుభక్తుని లక్షణములను తెల్పుట :

ఎట్టివారితో నివసించుచున్నను, ప్రశాంతచిత్తము కలవాడు, సౌమ్యుడు, జితేంద్రియుడు, మనోవాక్కర్మలచే పరద్రోహమును కోరనివాడు, నిత్యము దయార్ద్రచిత్తుడు, స్తేయహింసల యెడ పరాఙ్ముఖుడు, సద్గుణాసక్తుడు, పరకార్యాచరణరతుడు, ముదాన్వితుడు, సదాచారసంపన్నుడు, శ్రేష్ఠుడు, పరోత్సవ నిజోత్సవములయెడ సమభావము కలవాడు, అమత్సరుడు, సర్వభూతాంతరాత్ముడయిన వాసుదేవుని చూచుచున్నవాడు, నిత్యము దీనులయెడ అనుకంప కలవాడు, ఎల్లప్పుడు పరహితమునే కోరువాడు, రాజోపచార పూజలు చేయుటకై ఇతరులను తన కుమారునివలె బుజ్జగించువాడు, కృష్ణసర్పమును జూచి భయపడునట్లు బాహ్యప్రాపంచిక స్థితిగతులను చూచి భయపడువాడు, అజ్ఞానులు విషయోపభోగములయందు ఎంత ప్రీతిని చూపించుచున్నారో దానికి కోటిరెట్లు ప్రీతిని హరి యందు చూపించువాడు, నిత్యకర్తవ్యతాబుద్ధితో శివాదులకు క్రతువు



లొసర్చువాడు, పితృదేవతలందును భక్తితో విష్ణుస్వరూపమును ధ్యానించువాడు, సర్వత్ర విష్ణువుకంటె భిన్నమయినదానిని చూడనివాడు, పృథగ్గతుడయిన విష్ణువును వేరుగా భావింపనివాడు, సమష్టివ్యష్టిరూపి అయిన విష్ణువుయొక్క అన్యత్వము, భిన్నత్వము కాదని భావించువాడు, జగన్నాథుడును, దాసుడగు తాను ఒక్కరే అని తలంచువాడు, దేవుడు సర్వుల హృదయము లందు అంతర్యామిగా ఉన్నట్లు గ్రహించువాడు, సేవ్యుడు, సేవకుడు, భగవంతుని కంటె భిన్నవ్యక్తులు కారనుకొనువాడు, అట్టి భావనలతో సావధానుడైనవాడు విష్ణుభక్తు డనబడును. అట్టి లక్షణములు గల విష్ణుభక్తుడు భుక్తి ముక్తి ప్రదుడగు హరికి నమస్కరించుచు అతని గుణగణములను కీర్తించుచున్న యెడల బ్రహ్మాది సురమునిపూజితు డయిన విష్ణువును సేవింపగలడు. అట్టి ఉత్తమ విష్ణుభక్తుడు సామాన్య మానవులను ఆశ్రయింపడు.

లోకులకు అజస్రము ఉపకృతి చేయువాడు పరుల క్షేమమును తన క్షేమముగా తలంచువాడు, పరులు తన్నవమానించినను దయార్ద్రహృదయుడై పరమేశ్వరునిపై చిత్తమును లగ్నము చేయువాడు విష్ణుభక్తుడుగా పరిగణింప బడును.

మరియు పరధనమునందు మట్టిబెడ్డయందు; పర భార్యలయెడ తల్లియందు; మిత్రులందు శత్రువులందు సమభావముకలవాడు వైష్ణవభక్తుడనబడును.

పరుని గుణగణములయెడల సద్భావము కలవాడు రహస్యమును తెల్పుట యందాసక్తి కలవాడు, పరిణామసౌఖ్యము నొసగువాడు, భగవద్భక్తుని సతతము ప్రీతితో చూచువాడు, ప్రియవచనములు పల్కువాడు విష్ణుభక్తుడని ప్రసిద్ధుడగు చున్నాడు.

కంసహంతకుడయిన విష్ణువు యొక్క స్ఫుటమధుర పదమును కలుషహరమును అగు హరి నామమును స్మరించుచున్నవాడు, వాసుదేవుని జయజయ పరిఘోషణను, పల్కుచున్నవాడు, విష్ణుభక్తి సంపన్నుడనబడు చున్నాడు.

హరిచరణ సరోజ యుగ్మచిత్తుడు, జడిమబుద్ధి, సుఖదుఃఖముల యెడ సమభావము కలవాడు, పూతచరితుడు, హరిని స్వకీయమైన బుద్ధితో నమ్రతతో స్తుతించువాడు విష్ణుభక్తుడని ప్రఖ్యాతిగాంచు చున్నాడు.

రథచరణ గదాబ్జశంఖ ముద్రలు గలవాడు, మురరిపుచరణ ప్రణామధూళీ ధూతకవచ ధారుడును విష్ణుభక్తుడని ప్రసిద్ధుడగు చున్నాడు.

మురజిత్తుని దేహము నుండి తొలగింప బడిన ఉత్తమ తులసీదళమాల్య చందనములను ధరించిన విష్ణుభక్తుడు ముక్తికి అర్హుడు.

విగలితమదమానశబ్ద చిత్తుడు, అహంకార నాశముచే ప్రశాంత హృదయుడు, అమరుల కాప్తబంధువయి సరహరిని పూజించి పూర్ణకుడు అయినవాడు

విష్ణుభక్తుడు. ఇట్టి శుభలక్షణములు గలవాడే విష్ణుభక్తుడు. హరికి ప్రీతి పాత్రుడగును.

ఓ ఇంద్రద్యుమ్న మహారాజా! సతతము భగవంతుని యెడల భక్తియుక్తమగు శుభచరితము నీలో మాకు సులభగ్రాహ్య మగుచున్నది. అదియే శ్రుతిపథమునుండి దిగివచ్చినది. అది జనుల చిరసంచితమయిన మలమును త్వరగా హరించును.

ఓ రాజా! నీ ఐశ్వర్యమునుగాని, నీ శారీరక శ్రమనుగాని, నీకు మృదు మధుర భాషణముచే సంప్రాప్తమయిన కీర్తినిగాని చూడక నీయందు మూర్తీభవించిన విష్ణుసేవానిరతినే పరిగణించుచున్నాను' అని నారదమహర్షి ఇంద్రద్యుమ్న మహారాజుతో అనెను.

అంతియేకాక నారదమహర్షి ఇంద్రద్యుమ్నునకు విష్ణుభక్తులు కానివారిని గూర్చి తెలుపుచున్నాడు.

"ఈ లోకమున కొందరు దుశ్చరితానుబంధ చిత్తులయినను, పరుల శుభ చరితమును ద్వేషించుచున్నారు. వారెంతో దుఃఖము ననుభవించుచున్నను, భవ రస రసికులైన వైష్ణవులుగా పరిగణింపబడు చున్నారు.

మత్తస్వభావము కలవారు, హృదంబుజస్థ మయిన పరమసుఖమును క్షణ కాల మయినను పొందక ఎల్లపుడు వ్యర్థసంభాషణములతో హరినామమును మరుగుపరుచు చున్నారు. అట్టివారును విష్ణు భక్తులుకారు.

పరనారీ ధనములయందు నిత్యము మోహముకలవారై, లోభులై తమ కుక్షిని నింపుకొనుచు, ఐహిక సుఖములనే ఆశించునట్టి విష్ణుభక్తిహీనులు నర పశువులు.

ఎల్లపుడు దుష్టులయందనురక్తులు, పరులను అవమానించువారు, ఇతరులను హింసించువారు, అతి రౌద్రులు, నరహరి చరణ స్మరణమునందు విరక్తులయిన వారు విష్ణుభక్తులు కారు. అట్టి మలినాత్ములకు దూరముగా ఉండవలయును' అని నారదమహర్షి ఇంద్రద్యుమ్నునకు వైష్ణవభక్తులు కానివారినిగూర్చి చెప్పెను.

## 11వ అధ్యాయము

1. ఇంద్రద్యుమ్నమహారాజు నారదమునీంద్రుని పురుషోత్తమ క్షేత్రమునగల తీర్థములగూర్చి తెలుపుమనుట :

'భగవంతుడవగు నారదమునీంద్రా! విద్వాంసులతోడను, సాధువుల తోడను, సాంగత్యము భవవ్యాధి హరము. నాకు నీవు ఉపదేశించిన దాని



ఫలితము నాకిపుడే సమకూడినది. పరమాత్మ, పరాత్పరుడయిన విష్ణువును, నీవు సాక్షాత్కరింపజేసికొంటివి. అట్టి పుణ్యపురుషుడవీవు నా మందిరమునకు వచ్చితివి. ఇచట నీకంటె వేరొక సాధుపురుషుడెవడు కలడు?

ఓ భగవంతుడా! నీ సన్నిధానమున నాతమస్సు నాశనమయ్యెను. నా చిత్తము నీలాచలవాసియగు మాధవుని అర్చించుటకు కుతూహల పడుచున్నది.

సార్వలౌకికుడవగునీవు పర్యటించుచు బ్రహ్మాండ వృత్తాంతము నెరుగుదువు. మనమిద్దరము రథము నధిరోహించి నీలాచల మాధవుని దర్శింతము. పురుషోత్తమక్షేత్రమునందు శుభతీర్థములున్నట్లు నాతో పలువురు చెప్పిరి. నీ వలన వానిని గూర్చి వినినచో నా కవి సత్ఫలితము లొసగును' అని రాజు నారదునితో పల్కెను.

2. నారదుడు రాజునకు పురుషోత్తమ క్షేత్రతీర్థములను వివరించుట :

ఓ రాజా! నీకు పురుషోత్తమక్షేత్రమును అందలి తీర్థములను చూపింతును. నీవు తీర్థములను, శివశక్తులను, క్షేత్రమాహాత్మ్యమును, భక్తునకు హితంకరుడైన దేవుని ప్రత్యక్షముగ చూడగలవు.

నీ కృపవలన నాల్గు భాగములుగా వెలసిన హరిని సందర్శించు మానవులు శీఘ్రముగా భక్తిభాజనులు కాగలరు' అని నారదుడు ఇంద్రద్యుమ్నునితో నుడివెను.

ఇట్లు కథాంతమున వారిరువురు ప్రీతులై అహఃకృత్యమును సమాప్తిచేసి జ్యేష్ఠమాసమున శుక్లపక్షమున పంచమీ తిథియుక్త బుధవాసరమున, పుష్యమీ నక్షత్రసహిత శుభలగ్నమును అనుకూలముగా నిర్ణయించి నృపనారదులు ఒక చోట పండుకొని రాత్రిని గడపిరి. పిమ్మట విమలమయిన ప్రభాతసమయమున ఇంద్రద్యుమ్న నృపోత్తముడు, రాజ్యముయొక్క విభవమునసనుసరించి సైన్యముతో బంధువులతో నీలాద్రి గమనమును గూర్చి యిట్లు చాటించెను – 'యావజ్జీవము హరుల నీలాద్రిపై నివసించుటకు నిశ్చయింపబడినది. ఎవనికి ఏ వృత్తి కల్పింపబడినదో అతడా వృత్తితో అచట జీవింపవలయును.

రాజులు అంతఃపుర స్త్రీలతో, అమాత్య పరిజనసహితముగ, రథ గజ తురగ కోశ పదాతులతో కూడ వెళ్లవలయును.

బ్రాహ్మణులు అగ్నిహోత్రములతో, వణిజులు భాండములతో, పణ్య జీవనము చేయువారు పణ్యములతో, రాష్ట్రకర్మమున నిష్ణాతులు, రాజమార్గ కుశలులు, జ్యోతిశ్శాస్త్రవేత్తలు, నృత్యగాన వాదిత్రములందు నిపుణులు, గజ వాజినరులకు ఉత్తమ భైషజ్యశాస్త్రకుశలులు, దైవజ్ఞులు, అష్టాదశవిద్యలయందు

ఉపాంగవిద్యలయందు పండితులు, కుహకార్థకుతూహలులు, సాహసికులైన చోరులు, అట్లే స్వర్ణకారులు, విచిత్రకథనాజీవులు, చాటుకారులు, మాగధులు శాస్త్రోపజీవులు, శల్యహారకులు, ద్యూతకారులు, కులటలు, వేశ్యలు, వేశ్యాను సారులగు విటులు, కృషీవలులు, గోమేషచ్ఛాగోష్ట్రఖరరక్షకులు, శకుంత పాలకులు, కపి వ్యాఘ్రశార్దూల రక్షకులు, పాములవారు, గోరక్ష్యశబరులు, మ్లేచ్ఛులు మొదలైనవారు మాలవదేశమున పుట్టి నా యాజ్ఞను పాటించుచున్న వారందరు బయలుదేరి నీలాచలమున స్వేచ్ఛగా వాస్తుశాస్త్రప్రకారము గృహములు నిర్మించుకొని నివసింపవలయును' అని ఇంద్రద్యుమ్న నృపతి వారలకు ఆజ్ఞాపించి ప్రయాణమునకు సన్నద్ధుడై నారదునితోవచ్చి దైవజ్ఞునితో నిట్లనెను.

'ఓ దైవజ్ఞశేఖరా! ఇంతకుపూర్వము నాకు సాంవత్సరముహూర్తము నిర్ణయించితివి. మంగళప్రదమగు వస్తు సమూహమును తెమ్ము' అనగా పురోహితుని సహాయకుడగు గణకుడు పురోహితుని యభిప్రాయానుసారముగ అటకు అవసరమయిన వస్తు సామగ్రిని తీసికొనిపోయెను. ఇంతలోనే రాజర్షియగు ఆ ఇంద్రద్యుమ్నుడు దివ్యసింహాసనస్థితు డయ్యెను. విప్రులచే ముందుగా అభిషేక మాంగల్యము నిర్ణయింపబడినది.

ఇంద్రద్యుమ్న మహారాజు శ్రీసూక్తసహస్ర సూక్తములచేతను, అద్వైవత పావమాన్యాది సూక్తములచేతను, మాంగల్యప్రదములగు అభితీర్థములచే, ఓషధులచే సర్వగంధములచేతను అభిషిక్తుడై చీనాంశుకముచే హరింపబడిన జలముకలవాడై పొగలేనిపావకునివలె దీప్తుడై ప్రకాశించెను. రాజు ఆముక్త శుక్లవసనుడై పవిత్రమును ధరించి నాందీముఖ పితృగణములను యథావిధిగా పూజించి రాష్ట్రభృద్గణహోమములను చేసి శంఖధ్వని సుగంధాఢ్యము, శ్వేత వర్ణము, విధూమకము, దక్షిణావర్త గార్చిస్సుతో జయార్థియగు రాజునకు సాక్షాత్కరించెను. జయము నిచ్చుచున్న వహ్నికి రాజు ప్రదక్షిణము చేసెను.

రాజు నవగ్రహముఖాంతమున గ్రహకుంభముచే సేవింపబడెను. గ్రహముల దౌష్ట్యనాశమునకు స్వాస్థ్యవృద్ధికి దైవజ్ఞవిధిప్రకారము జ్యోతిశ్శాస్త్రోక్త, మంత్ర ములతో మాంగల్య నేపథ్యవిధానము ప్రారంభింపబడెను.

నృపశ్రేష్ఠుడు చీనాంశుకమును తనకవచమువలెనే చుట్టుకొని, స్వచ్ఛ మయిన శిరోవేష్టనమును, రత్నఖచిత కిరీటమును ధరించెను. అతని చెవులు రత్నకుండలములతో అలంకరింపబడినవి. అతని కంఠము నందలి మహార్ఘ మయిన హారమున తరళము ప్రకాశించుచున్నది. పిమ్మట ఇంద్రద్యుమ్న మహారాజు కేయూరాంగదముద్రికలు దాల్చెను. నడుమున త్రివళీసక్తమయిన మూడుపేటలు గల స్వర్ణసూత్రమును కట్టుకొనెను, తరువాత రాజు హిరణ్య కింకిణీయుక్తముక్తాతోరణమాలికను, నానారత్నసుఘటితమైన మొలనూలును,



పదములకు పాదకటకములను ధరించెను. తన యెదుట నుంచిన నిలువుటద్ద ములో రాజు తన యలంకారములశోభను పరికించెను. నృపతి మంగళకార్యా చరణమునకు సువర్ణపీఠమున కూర్చుండెను. మహీపతి తూర్పుదిక్కునకు అభిముఖుడై శ్రీధరుడు, మధుసూదనుడు, మంగళాయతనుడు, సర్వమాంగల్య గుణుడు అగు విష్ణుదేవుని స్మరించెను. ఆ పురుషోత్తముని స్మరించుట వలన సర్వపాతకములు నశించును. రాజు తన పురోహితుడు మంత్రించిన హోమన ద్రవ్యము, ఋతుసంబంధము, గంధ సర్జితమైన అధోమాలను దాల్చెను. మట్టి ప్రమిదలో నుంచిన జ్యోతిని ఫలమును దూర్వాంకురమును దధిగోరోచనమును మంత్రములచే అభిమంత్రితము అయిన సర్వమును, తన్ను హారశోభ యందు చూచుకొనెను. అప్పుడు రాజు సిద్ధార్థులచే అభిరక్షితుడయ్యెను.

ఆ నృపోత్తముడు మంత్రపూత మయిన ముకురమందు మరల తన్ను గాంచి. వివిధ బుక్కులచే శాంతిపాఠములచే, శుభప్రభావము కలవాడై యాజుష్కులచే పఠిమాక్తము పఠింపబడుచుండగా పయనించి మార్గమున రక్షింపబడెను.

ఆ రారాజు ప్రాభీపమంగళవాక్యములు వినుటచే వీర్యధృతియుతుడై మాగధుల స్తుతిపాఠముచే పరాక్రమవంతుడై పారిజాతహరుడు, సత్యపతిహితు డగు గరుడధ్వజుని హృత్పంకజమున ధ్యానించెను. పిమ్మట తన ముందరనున్న రథమునకు ప్రదక్షిణ చేసి వేత్రపాణులచే ఆవృతుడై మధ్యద్వారమునకు వచ్చెను. రాజు ఆదిష్టపథమార్గమున అగ్నిహోత్రపురస్సరుడై తనకుడి వైపున నున్న విప్రులకు నమస్కరించెను. కొందరు విప్రులు స్వచ్ఛకాంతి యుతులై శ్వేతవస్త్రధారులై మాంగల్యసూక్తములను పఠించుచుండిరి. శుభమును పలుకుచు రాజునకు అగ్రభాగమున లాజలను, పుష్పములను జల్లుచుండిరి. నృపతికి శుభ్రాలంకారవస్త్రధారిణు లైన స్త్రీలు చామరములు వీచుచుండిరి. భక్తినమ్రుడైన ఇంద్రద్యుమ్నమహారాజు, బ్రాహ్మణులను పూజించెను. వారు తమ హృత్పంకజములందు భగవంతుని భావించుకొనుచున్నవారిని రాజు వస్త్రాలంకారమాలలతోడను, సుగంధానులేపనముల తోడను సత్కరించెను.

మంత్రి రాజానుమతితో వేశ్యలకు, మాగధులకు, దీనులకు, అనాథులకు వారి వారి అర్హతలనుబట్టి ధనమును ఒసంగెను. అప్పుడు ఆనృపతి శుభ సూచకములగు శ్వేతపారావతములను, హంసలను, కుంజరమును, శ్వేతమాలా ఫలవిభూషితము, కదలీకాండసన్నద్ధమైన తోరణముక్రింద ఉంచబడిన పూర్ణ కుంభమును, చూతపల్లవములు మున్నగువానిని గాంచెను.

సితాతపత్రచ్ఛాయచే రాజు శిరస్సునకు ఎండతగులుట లేదు. ఒకే పర్యాయము పూరింపబడిన శతసంఖ్యాకములయిన శంఖధ్వనులను, మంగళ

గీతములను, వాద్యఘోషను, జయజయ నినాదములను రాజు వినెను. అటు పిమ్మట భూపతి నృసింహస్వామిని గాంచుటకై ప్రాసాదమును ప్రవేశించెను.

ఇంద్రద్యుమ్న మహారాజు ఏ దేవుని స్మరణమువలన మర్త్యుడు సర్వకల్యాణ భాజనుడగునో అట్టి సింహాసనస్థితుడైన నృసింహస్వామిని మిక్కిలి దూరమునుండి చూచి సాష్టాంగదండప్రణామములాచరించి ఉపనిషద్వాక్యములచే స్తుతించి వెంటనే ఆ స్వామికి దక్షపార్శ్వస్థితియు, సర్వదుర్గతిమోచనియు, కృపతో రక్షించునదియు అయిన దుర్గాదేవి చరణములకు వందన మాచరించెను.

తరువాత పురోహితుడు దేవుని విగ్రహమునుండి శుభప్రదమగు మాలను తీసి నృపతి మెడలో వేసి సుగంధమును పూసి రాజునకు నీరాజన మొసగెను.

రాజశేఖరుడు ఆ రెండు దేవతావిగ్రహములకు ప్రదక్షిణము చేసి, వానిని పల్లకిలో నుంచిన పిమ్మట పల్లకిని కొందరు మోయుచుండగా కొందరు ముందుగా నడవసాగిరి.

3. ఇంద్రద్యుమ్న నృపతి సపరివారముగా పురుషోత్తమ క్షేత్రమునకు బయలు దేరుట :

వాయువేగముతో పరుగిడు పది గుర్రములతో సమకూర్చబడి, బహిర్ద్వార ప్రదేశమున సిద్ధముగా నుంచబడిన రథమును చూచిన రాజు దానికి ప్రదక్షిణ మొనర్చి దానిపైని నారదమహర్షితో కూర్చుండెను. ఆ సమయమున ఢక్కా మృదంగనిఃసాణభేరీపణవగోముఖములు, మధురీఝర్ఝరీశంఖములు ప్రయోగింప బడెను.

ఇంద్రద్యుమ్న సార్వభౌముని రథముచుట్టు అతని సామంత నృపాదులున్న రథములు బారులు తీర్చె. ఆ రథములు నానాప్రహరణములతోకూడి ధ్వజము లతో ఎత్తుగానుండి పతాకలతో అలంకరించబడినవి. అవి బంగారము తాపింప బడిన కింకిణీజాల దర్పణములతో బహువిధ యంత్రములతో అలరారుచు గంభీర స్నిగ్ధధ్వను లొనర్చిరి. హస్త్యశ్వపదాతుల పాదఘట్టనముల ధ్వని, రథఘోషల తోడను, వాద్యరవములతోడను మిశ్రితమై యుగాంతార్ణవఘోషతో తుల్యమై జనులకు వినబడినవి.

ఆ సమయమునవే పౌరజనులు తమతమ వస్తువులను సిద్ధము చేసికొనిన వారై ఉష్ట్రఖరాశ్వవాహనములతో బయలు వెడలిరి. జనప్రస్థాన సంకుల సమయమున అందలములు, పల్లకీలు, అసంఖ్యాకములయిన తురంగములు, వరుసగా కానవచ్చుచున్నవి.



అనేక యానములతో బయలుదేరినవారు, అధికారులచే పాలింపబడినవారు సైన్యములచే సంరుద్ధులు, మార్గావరోధకులై కోటనుండి బయలుదేరిరి.

యజ్ఞముచేయువారు, అగ్నిహోత్రములను బృందములుగా శకటముపై సపత్నీకులై వెడలిరి. అటులనే వస్త్రకభారములను, దేవతార్చన కరండకము సమిత్కుశలను, పాత్రలను, హోమసంభృతసంభారములను, శకటవాహకులైన ద్విజులచే మోయించిరి.

సామన్తామాత్య భృత్యులు, పురోహితులు, ఋత్విక్కులు, రాజసేవకులు, చారకులకై నియోగింపబడినవారు, ఇతరానుయాయులు, సర్వోపచార సంభారములను తీసికొని వెళ్లిరి. కోశాగార నియుక్తులు, సమస్త కోశజాతమును శీఘ్రముగా తీసుకొనిపోయిరి. రాజునకు అవసర సేవకులు మాలాకారులు, నర్తకులు, వారు అమ్మదగిన వస్తువులను గొంపోయిరి. పుర గ్రామవాసులు వ్యవహార నిపుణులుకూడ వెడలిరి. ఇంద్రద్యుమ్న మహారాజు సపరివారముగా పయనించుసమయమున వాద్య ధ్వనులను వినిన జానపదులు ఆశ్చర్య చకితులైరి. రాజాజ్ఞను శిరసావహించి నీలపర్వతమునకు బయలువెడలిరి. ఏది ఋజుమార్గమో, ఆదారినే వారు పోయిరి. నృపాజ్ఞచే వారు రాజమార్గమున పోవుటకు యత్నించలేదు. దుర్గమ మయినను నీలాద్రిని చేరునట్టి మార్గముననే పయనించిరి. ఇంద్రద్యుమ్న రాజేంద్రుడు సంతుష్టులైన సమస్త పురజనులతో, చతురంగబలముతో పరివేష్టితుడై రాజరథావళి మధ్యనున్న రథము మీద ఇంద్రతుల్యపరిచ్ఛదుడై రాజర్షి వలె ప్రకాశించెను.

పురస్త్రీలు మంగళగీతములు పాడుచు, లాజలు పుష్పములు అక్షతలు పైని చల్లుచుండగా అతడు మంగళాచారశోభలతో ప్రసన్నచిత్తుడై హయములు వాయు వేగముతో గొంపోవుచున్న రథముపై కూర్చుండి పయనించెను. ఆ శుభ సమయమున అనుకూలవాయువులు వీచుచుండెను.

సుశీతలమైన చెట్టుమొదటను, చతుష్పథమునందున్న కాననాంతరవిదు అయిన దేశపథికులు మార్గమును తెల్పుచుండగా ప్రయాణమును సాగించుచున్న ఇంద్రద్యుమ్నమహారాజు మార్గమునకు రెండు పార్శ్వములయందు వెళ్లుచున్న వారిని, ఆయా ప్రాంతములను, అరణ్యములను పరికించుచు ఆనందముతో వనాంతరమున ఉత్కలదేశముయొక్క హద్దును విభజించుచున్న మార్గ మందున్న మాలాలంకృత అయిన చర్చికను సమీపించెను.

నారదమునీంద్రుని ఆజ్ఞచే వినతుడైన ఇంద్రద్యుమ్నమహారాజు రథము నుండి దిగి ఆ దేవతకు సాష్టాంగవందనమాచరించి ఆనందచేతస్కుడై సంతుష్టి చెందెను.

**4. ఇంద్రద్యుమ్నమహారాజు చర్చికాదేవతను స్తుతించుట :**

'సర్వాపద్వినివారిణి, బ్రహ్మవిష్ణుశివాదిస్తుత్రిదశేశాని ! నీకు నమస్కారము. జగత్తులకు మూలకారణ మయిన పరమేశ్వరి ! అనుగ్రహింపుము. ఓ శివస్వరూపిణి ! నీవులేనిచే జగ మొక క్షణకాలమయినను నిలువజాలదు. ఓ శాశ్వతశక్తిస్వరూపిణి ! మర్త్యలోకమున సర్వకార్యసిద్ధులు, శుభములు నీ పాదారాధన వలన కలుగుచున్నవి. ఓ పరమేశ్వరి ! చరాచరపతి అయిన విష్ణువు యొక్క శక్తివి నీవే. పరమేశ్వరుడు నీ శక్తివలననే సృష్టిస్థితిలయ కార్యములు చేయుచున్నాడు. ఓ దేవి ! నానేత్రములతో నేను చరాచర గురువు నీలాచలనివాసి అయిన దేవుని చూచునట్లు అనుగ్రహింపుము' అని ఇంద్రద్యుమ్నుడు నారదుని ఉపదేశముచే స్తుతించి, ఉదయభానునిభమౌ రథమును అధిష్ఠించెను.

ఆ రాజు మరల వాహనములపై శీఘ్రముగా పయనమై చిత్రోత్పల మహానదీతీరము నందు ధాతుకందర విఖ్యాత మయిన స్నిగ్ధకాననములో తన సైన్యమును విడిపెను. ఆమహీపతి ఆహ్నికకార్యమును చేసి పిమ్మట మాధ్యాహ్నిక క్రియను నిర్వర్తించుటకు ముందుగా ప్రాజ్ఞులచే పరిశీలింపబడినట్టి పంకకంటక వర్జితమైన నదియొక్క రేవులో స్నానము చేయుటకు తన పురోహితునితో కూడ ప్రవేశించెను.

ఇంద్రద్యుమ్న నరపతి స్నానానంతరము శుభదేవతలను సంతృప్తి పరచి తరువాత పితృదేవతలకు తర్పణములు విడిచెను. ఆ ప్రభువు విధిప్రకారము విష్ణువును, స్వాయమ్భువాదిసప్తప్రకృతులను, నృపతులను పూజించి ఆసనము లందు కూర్చుండబెట్టి గౌరవించెను.

పిమ్మట శ్రీమంతుడగు పృథివీపతి నారదమహర్షితో కూడ అంతఃపురమును ప్రవేశించి ప్రీతమానసుడై షడ్రసములైన భోజ్యములను భుజించెను.

సూర్యభగవానుడు పశ్చిమాద్రిని చేరినపుడు నరపతి సాయంకాలార్చనా విధిని నిర్వర్తించి, చంద్రోదయ మయిన పిమ్మట ఇంద్రద్యుమ్నమహారాజు సభామధ్యమున ఆసీనుడయ్యెను. అచట ఆ మహారాజు సార్వభౌమ లక్షణోపేతుడై నక్షత్రములతో శరత్పూర్ణిమాచంద్రుని వలె ప్రకాశించెను. అతని సత్కీర్తిని కవులు వర్ణించిరి. గాయకులు కలకంఠసుస్వరములతో సుగ్రథితమైన ఇంద్రద్యుమ్నుని గాథను గానము చేసిరి. పిమ్మట వారి యెదుట లయతాళాంగహారములతో రూప యౌవన లావణ్యగర్విత లయిన వేశ్యలు నృత్యము చేసిరి. మరికొందరు లోకోత్తర శుభాకృతి గల రాజోత్తముని గద్యపద్యప్రబంధాదులతోవిచిత్రములైన పదకదంబకములతో స్తుతించిరి. తరు



వాత రాజు వైష్ణవశ్రేష్ఠులైన సభాసదులను మనోహరములైన గంధమాల్య తాంబూలములతో పూజించెను. అటుపిమ్మట నృపాజ్ఞచే అచట సుఖోపవిష్టులైన, గౌరవనీయులైన పందలకొలది రాజులు సన్మానింపబడిరి.

ఉచితసింహాసనోపవిష్టుడగు నారదమహర్షి భగవత్ప్రియుడు, మునివరుడు కావున సర్వపాపహారమగు భగవచ్చరిత్రమును వినిపింపుమని ఇంద్రద్యుమ్నుడు నారదుని బహుమానపురస్సరముగా ఇట్లు ప్రార్థించెను.

'ఓ భగవత్స్వరూప ! వేదవేదాంగనిధీ ! భగవత్ప్రియ ! నీజ్ఞాననేత్రముతో విష్ణుచరితమును తెలిసికొనుచున్నావు. ఓ నారదమునీంద్ర ! నాయందు దయకలవాడ వయినచో దృఢపంకమలీమసమైన నాయంతఃకరణమును హరిచరితసుధచే ప్రక్షాళనము చేయుము' అని రాజు నారదుని ప్రార్థించు సమయమున ద్వారపాలకుడు ఉత్కలభూపతిని లోనికి ప్రవేశపెట్టి ఇంద్రద్యుమ్నునితో 'దేవా ! ద్వారాంతమున ఉత్కలదేశాధిపతి ఆసీనులైరి. ఆ నరపతి కిరీటధారియై ఉపాయనసహితుడై దేవపాదపద్మములను గాంచుటకు విజ్ఞాపనము చేసిరి' అనెను.

నారదమహర్షి ఉత్కలదేశమునకు భూషణ మయిన శ్రీ పురుషోత్తముని క్షేత్రమును గూర్చి వినినవాడగుటచే, ఆ వార్తను వినుటకై కుతూహలపడుచు శీఘ్రముగా ఓఢ్రమహీపతిని ప్రవేశపెట్టుమనెను. ఉత్కలనృపతి నీలాచలమున విష్ణువు నారాధించి సునిర్మలుడయ్యెను. అట్టి పుణ్యాత్ముని సందర్శనము వలన మనమందరము పాపరహితులము కాగలమని నారదుడు చెప్పగా, రాజాజ్ఞచే ఓఢ్రదేశాధిపతి సభలోనికి ప్రవేశపెట్టబడెను.

ఓఢ్రమహీపతి సచివులతో, విష్ణుభక్తులతో సభలో ప్రవేశించి సాదరముగ వంద్యమయిన ఇంద్రద్యుమ్నాంఘ్రియుగమునకు నమస్కరించెను. ఆ రాజేంద్రుడు వైష్ణవు డయిన ఓఢ్రనృపతిని లేవనెత్తి ముందుగా తీసికొని వచ్చి తన యాసనాంతమున కూర్చుండబెట్టుకొని ప్రీతిపూర్వకముగా ఇట్లు పచించెను.

'ఓఢ్రదేశాధీశా ! నీ పన్నివిధముల కుశలముగా నుంటివి కదా ! నీలాద్రి శిఖరాలయమునందున్న జగన్నాథుడు విజయియే కదా ! సర్వభూతముల యందు, హరునియందు సమచిత్తుడవయిన నీ నిర్మలమైన బుద్ధి ఒకానొకప్పుడయినను, భగవత్పాదపద్మముల యందే నిలుచుచున్నది కదా !' అని రాజు ఓఢ్రనృపతితో పలికెను.

అపుడు ఓఢ్రదేశాధిపతి ఇంద్రద్యుమ్నుని వాక్కులు విని కృతాంజలుడై హర్షవిస్మయోపేతుడై వినయముతో ఇట్లు వచించెను.

'ప్రభూ ! నీ యనుగ్రహము వలన నాకంతటకుశలమే. సూర్య భగవానుడు ప్రకాశించుచుండగా చీకటి ఉండునా ?

నిసర్గ సద్గుణశోభితుడవగు నీవు మహీపతివి కావున ఇంద్రుడు పాలించిన అమరావతీపట్టణమువలె పృథివి సనాథ అయినది. నీవు ధరణిని పాలించుచుండగా ధర్మము నాల్గుపాదములతో నడచుచున్నది. శ్రుతి యందే నిషేధాచరణలు కేవలము వినబడుచున్నవి. రాజనీతులయందు రాజులకు చెప్పబడిన ఉత్తమ గుణము లన్నియు నీయందు గలవు. ఇతర రాజుల యందు ఆ లక్షణములలో ఒక్కొక్కటి మాత్రమే పేర్కొనబడినది.

ఓ నృపోత్తమ ! ఈ నీరాజ్యమువంటిది దుర్లభము. అష్టాదశద్వీపవతి అయిన క్షితి ఒక్క గృహము వలె నీ రాజ్యపాలనలో కాన్పించుచున్నది. బ్రహ్మ నిన్ను సృజించకున్నచో సర్వప్రాణులపట్ల నీవు వాత్సల్యము చూపుట యెట్లు ? సామాన్యప్రజలు తమ సంతతి విషయమై బంధువుల యెడల సేవకుల పట్ల శోకరహితు లగుట సంభవించునా ?

కావుననే పృథివీపతులు విష్ణ్వంశసంభూతు లని శ్రుతి చెప్పుచున్నది. నీవు సాక్షాత్తు భగవంతుడవే. ఇట్టి గుణములు కలవాడితరుడెవ్వడు కలడు ?

దక్షిణసముద్రతీరమునందు కానవావృతమయిన నీలాద్రి కలదు. అచట జనసంచారములేదు. కాని ఒకదేవతకలదు. ఆ నీలాద్రినుడిగాలి వలన ఇసుకతో కప్పబడియున్నదని చెప్పబడుచున్నది. నీమూలముగా నా రాజ్యములో దుర్భిక్షము, అంటువ్యాధులు నిర్మూలమగును. నీవటకువచ్చినచో నాకు అన్ని విధముల క్షేమము కలుగును'. ఇట్లు పలికిన ఓఢ్రదేశ ప్రభువును ఇంద్రద్యుమ్నుడు మరల కలిసికొనుటకు ఆహ్వానించి వీడ్కొలిపెను.

ఇంద్రద్యుమ్నుడు నారదమహర్షిని గాంచి నిర్విణ్ణుడై నాకెందులకీ శ్రమ, అది విఫలమగునని తలంచుచున్నాననెను. ఇట్లు పలికిన రాజు నుద్దేశించి త్రికాలజ్ఞుడయిన నారదుడు 'దీని విషయమై నీవాశ్చర్యపడనక్కరలేదు. వైష్ణవోత్తముడవగు నీవదృష్టవంతుడవు. విష్ణుభక్తుల వాంఛలెన్నడును విఫలము కాజాలదు.

ఓ రాజా ! అనతికాలములోనే పృథ్వీసంబంధమైన తనువును ధరించి నట్టియు జగత్తులకు ఆద్యుడు, కారణభూతుడు, అనామయుడగు నారాయణుని చూడగలవు. నీమూలముననే ఆ పరమేశ్వరుడు భూమిపైని అవతరించును. చరాచరమగు జగమంతయు విష్ణువశమైయున్నది. సనాతనుడగు ఆ పరమాత్మ ఎవ్వని వశమునను లేడు. భక్తవత్సలు డగు భగవంతుడు కేవలము భక్తికే వశ్యుడు. అతని మాయచేతనే బ్రహ్మాదికీటపర్యంతము సుగుప్తముగా నున్నది.



ఓ నృపా ! ఆ దయామయుడు ఎల్లపుడు భక్తులకు పెన్నిధిగా నుండును. విష్ణుభక్తి ధర్మార్థకామమోక్షములకు మూలము. ఆ హరి దయకుపాత్రు డగుటకు భక్తికంటె వేరొకటిలేదు. ఒక్కవిష్ణువే తనమాయచేత బహురూపములు దాల్చెను. సుఖప్రదుడు ఆ పరమాత్మయే కాని వేరొకడు కాడు.

శివదుర్గాద్యన్యదేవతలు తమ తమ కర్మలకు లోనయి పూజింపబడి విష్ణుపరాయణులై భక్తుల కోరికలను నెరవేర్చుచున్నారు. అంతర్యామి అగు భగవంతుడు దేవతల హృదయమందుకూడ వసించుచున్నాడు. అతని ప్రేరణము వలననే ఇతర దేవతలు ఫలముల నొసంగుచున్నారు.

ఓ రాజేంద్రా ! నీవు వైష్ణవోత్తముడవు. బ్రహ్మకు ఐదవవాడవు. వశ్యులుడవగు నీవు అష్టాదశవిద్యాపారగుడవు. భూమిని న్యాయముగా పాలించుచు రక్షించుచున్నావు. విశేషించి బ్రాహ్మణులను పూజించుచున్నావు. నీ చర్మచక్షువులతో భూమిపైని వైకుంఠమును ఇపుడేచూడగలవు. నీదు కార్యము విషయమై నన్ను విధాత వినియోగించెను.

ఓ రాజా ! ఆ ఉత్తమ క్షేత్రమును సందర్శించిన వెంటనే నీకు సమస్తమును తెలుపగలను. ఇపుడు రాత్రి శేషమయిన తృతీయ యామము గడచుచున్నది.

ఓ ప్రభూ ! మా నివేశములకేగుటకు ఇపుడే ఆజ్ఞాపింపుము. నిద్రావశుడవగు నీవును అంతర్గృహమున కరుగుము.

## 12వ అధ్యాయము

1. ఇంద్రద్యుమ్నుడు నారదుని సాహాయ్యమునకు సంతసించుట :

ఇంద్రద్యుమ్నుడు నారదముని వచనములు విని సంతసించి బాగుగా ఆలోచించి అధికశ్రమ పడుటవలన ఫలితము చేకూరునని ఇట్లు తలంచెను. 'నేను బహుజన్మలలో సంపాదించిన పుణ్యము వలన సర్వలోక సృష్టికర్త అయిన బ్రహ్మ వాక్పతియం దాసక్తితో జీవన్ముక్తుడయిన తనతనూజుని నాకు సాహాయ్యమొనర్చుటకు పంపెను. నరులకు ఎట్టి సాహాయ్యము లభించునో అట్టి కార్యఫలమే నమకూడునని, అన్ని సభలలోను వినవచ్చినది. ఇది వృద్ధానుశాసనము' అని రాజు ఇట్లాలోచించి సభాసదులను విడిచిపెట్టి తరువాత నారదుని కరము పట్టుకొని అంతఃపురములోనికి ప్రవేశించెను. రాజు నారదుని యథావిధిగా పూజించి రహస్యసంభాషణమును సల్పిన పిమ్మట శయనించి ఆ రాత్రిగడపిరి.

తరువాత ఇంద్రద్యుమ్నుడు విమలమైన ప్రభాతకాలమున నిత్యకర్మలను ముగించి, జగన్నాథుని పూజించి మహానదిని దాటెను.

ఓఢ్రదేశాధిపతి ముందుగా నడచి మార్గమును చూపుచుండగా ఇంద్రద్యుమ్నుడు కొంతదూర మేగి గంధవహా అని పేరుగల వల్లనీటితో ఒప్పుచున్న వేగవతీనదిని వేగముగా సమీపించి పూర్వాహ్ణ మందుకోటి లింగేశ్వరునకు పూజ సల్పి మహారణ్యములో వినవచ్చుచున్న ఝర్ఝరీ శంఖ కాహళమృదంగ మురజ ధ్వనులను దూరమునుండి వినెను.

రాజు నీలాచల నివాసి అయిన భగవంతుని స్మరించి ఆ ధ్వని ఎచట నుండి వచ్చుచున్నదని నారదుని ప్రీతితో ప్రశ్నింపగా మునిపుంగవు డిట్లు బదులు చెప్పెను -

'రాజా! మురవైరి సుదుర్లభమైన క్షేత్రమును గోప్యముగా నుంచినట్లు అత డక్కడ నున్నట్లు ఏ మానవునకును తెలియదు. అదృష్టవంతులలో నీవు అగ్రగణ్యుడవు. అందువలననే జితేంద్రియుడైన నీపురోహితునిచే భగవంతుడు ఏదోవిధముగా చూడబడినాడు. ఓ నృపోత్తమా! నీవు షడంగ బలయుతుడవై అతి సాహసముతో ప్రవర్తించితివి. నీలాచలము ఇటకు మూడవ యోజనములో ఉన్నది. ఈ ఏకామ్రవనములోని గౌరీపతిక్షేత్రము ఇక్కడకు దగ్గరగా నున్నది. శరణాగతు డయిన గౌరీశుడు భీతి నందెను.

2. గౌరీపతి భీతికి హేతువును తెల్పుమని ఇంద్రద్యుమ్నుడు నారదునడుగుట :

'ఓ నారదమునీంద్రా! గౌరీశుడు ఎట్లు భయపడెను? ఎవనిని శరణు పొందెను? శరణ్యులలో అతి ప్రధానుడయిన ఆ శివుడే దుష్టుడయిన త్రిపురాసురుని పూర్వము దహించెను. ఈ సందర్భములో నీవు చెప్పినది ఆశ్చర్యముగా ఉన్నది. పునర్జన్మము వలన భీతు లయిన వారిని రక్షించుచున్న పరమ పావనుడయిన పరమేశ్వరుడే ఎందులకు భయపడెను? నా సందేహమును తీర్పుము' అని రాజు మునీంద్రుని ప్రశ్నించెను.

3. నారదుడు రాజునకు శంకరుని భీతిని గూర్చి తెల్పుట :

'ఓ రాజా! దీని పూర్వచరిత్రను చెప్పెదను వినుము - ఇంతకు పూర్వము బ్రహ్మచారి, భగవంతుడు అయిన నీలలోహితుడు హిమగిరిపైని తపస్సమాధి నిమగ్నుడైనను, మన్మథశర పీడితుడై బ్రహ్మచర్యమును విడిచి మనోహరమగు యౌవనముచే ఉన్మత్త అయిన పార్వతీదేవితో రమించెను. ఆమె తండ్రి ఆజ్ఞ ప్రకారము దేవతలు కోరిన రీతిని భోగముల ననుభవించెను.



ఒకానొకప్పుడు పార్వతీదేవితో తన నివాసభవనము నుండి వెడలుచుండగా ఆమె తల్లి యగు మేన, కులస్త్రీలు వినుచుండగా మందహాసముతో ఇట్లనెను -

'ఓ పూజ్యురాలా! నీవు ఘోరారణ్యములో వరుని కొరకై గొప్పతపస్సు చేసితివి. ఓ శుభాననా! కులహీనుడు గుణరహితు డయిన వృద్ధుని వరునిగా పొందితివి. అట్టివానిని దివారాత్రములు విడువక వానిసన్నిధినే నివసించు చున్నావు. ఓ బాలికా! నీకు పతికృపవలన ఏగుణము కలిగినది? వాని అనుగ్రహముచే నీకు ఏ అలంకారములు లభించినవి?

ఓ భద్రా! పితృప్రేమచే భోగములనుభవించుచు నాగృహమందే చిరకాలము నివసించుచున్నావు. త్రిలోకములయందు వివాహిత లయిన కన్యలు తండ్రి యిల్లు విడిచి భర్తృ గృహమునందు భర్తచే అలంకృతలైనట్లు వింటిమి' అని పార్వతీదేవితో తల్లి యగు మేన అనెను.

'నేను పితృదేవతల మానసిక కన్యకను. అమ్మా! నేను పితృలోకము నుండి వచ్చితిని. హిమవంతుడు నన్ను పరిణయమాడెను. నేను నవ్వుచు ఇట్లు పలికితిని కాని కోపము వలన కాదు. అల్లుడు విష్ణుసముడు కావున వాని యెదుట ఈ రీతిగా పలుకరాదు' అని మేన తనయయగు సతీదేవితో అనెను.

పార్వతీదేవి తల్లి పలుకులు విని తన భర్తృ నిందకు బాధపడి కోపముచే సమాధానము చెప్పక పతి సన్నిధికి వెళ్ళి తల్లి అనిన పరుష వాక్యముల సారమును సంగ్రహముగా స్నేహపూర్వకముగా శివునకు ఇట్లు తెల్పెను—

'ఓ స్వామీ! త్రిలోకాధిపతివయిన నీకు అత్తవారియింట నివసించుట ఉచితముకాదు. ప్రభూ! మన మిద్దరము ఇట నుండకూడదు. నీకు నివాసయోగ్యమయిన స్థల మింకెచటను లేదా?' అని సతీదేవి యిట్లు పలుకగా వినిన వృషభధ్వజుడు ఆమెతోకూడ వృషభారూఢుడై వెంటనే మధ్యదేశమున కేగెను.

శివుడు పార్వతీదేవితో సర్వతీర్థములను పరమ పవిత్రమయిన ప్రయాగ క్షేత్రమునుకూడ సందర్శించి తూర్పుసముద్రమువైపు ప్రవహించుచున్న గంగానదికి ఉత్తర తటమున పార్వతీదేవితో నివసించుటకు వారాణసీ పురమును నిర్మించుకొనెను.

4. వారాణసీపుర వర్ణనము :

శివుని యాజ్ఞచే విశ్వకర్మ ఐదుకోసులు విస్తీర్ణముగల వారాణసీ నగరము నందు ఉన్నత ప్రాసాదములు వందలకొలది కోటబురుజులు, ఉద్యానవనములు, బహుపుణ్య తీర్థములు నిర్మించెను. ఆ సుందర క్షేత్రమున అనేకులు నివసించు చుండిరి. అచటి శీతలములైన పావన గంగా తరంగములచే భక్తులు పాపరహితు

లగుచున్నారు. ఆ పట్టణ మధ్యమున స్వర్ణప్రాకారముతో విస్తీర్ణమై రత్నస్తంభ ఘటితమైన సౌధములో శంకరుడు హైమవతితో మధుసూదనుడు లక్ష్మీదేవితో క్రీడించినట్లు ఆనందముతో రమించెను. ఆ కాశీపట్టణమును విశ్వనాథుడు ఎన్నడును విడువడు. నరులకు ముక్తిప్రదమగు పురాతనమయిన ఆ కాశీపురము అవిముక్తక మని పేరు గాంచినది. పునర్జన్మమువలన భయపడిన ముముక్షువు లెందరో ఆ నగరమున నివాసమేర్పరచుకొనిరి. భర్తతోకూడ పార్వతీదేవి ఆ పుణ్యక్షేత్రమున నివసించుచు తల్లిదండ్రులనుకూడ స్మరింపదాయెను. ఇట్లు కొన్ని యుగములు గడచిన పిమ్మట పరమేశ్వరుడు కాశీపట్టణమున కోటిలింగములను ప్రతిష్ఠించి కైలాసగిరి కేగెను. ఆ కాశీనగరమును అనేక రాజులు పరిపాలించిరి.

ద్వాపర యుగమున వారాణసీ పురమును కాశీరాజు పాలించెను. అతడు ఉగ్రతప మాచరించి శంకరుని యనుగ్రహమునకు పాత్రుడయ్యెను. ఆ కాశీరాజు జరాసంధాది రాక్షసులను జయించిన విష్ణువునుకూడ సంగ్రామమున జయింప దలచెను. ఆ రాజు యుద్ధమున హరిని జయించుటకు శివుడు ప్రమథగణములతో వెళ్లి ఆ రాజునకు తోడ్పడుటకు శివునివలన వరమును పొందెను. పరాక్రమవంతు డయిన రాజు మదించి శంఖచక్రధరుడయిన హరిని యుద్ధమునకు ఆహ్వానించెను.

అంతర్యామి అయిన భగవంతుడు కాశీరాజునకుగల యుద్దేశమును గ్రహించి అతనిని వధించుటకు తన చక్రమును పంపెను.

ఓ ఇంద్రద్యుమ్న నృపతీ! వేయిమంది మార్తాండుల కాంతితో ప్రకాశించుచు ఉగ్రరూపమును దాల్చిన చక్రము కాశీరాజు శిరస్సును అతని బలమును ఛేదించి పిమ్మట అతని పురమును దహించెను.

అప్పుడు పశుపతి విష్ణువుయొక్క ఆశయమును మహిమను గ్రహించి చూపరులకు భీతిని కల్గించుచున్న ఆ చక్రమును దాని ప్రభావమును చూచి క్రుద్ధుడై వృషభవాహనారూఢుడై పినాకమును దాల్చి ప్రమథాది గణములతో వెళ్లి, ఉపద్రవమును కల్గించుచున్న ఎదుటనున్న సుదర్శన చక్రమును మొట్ట మొదట గాంచెను.

పూర్వము విష్ణువు శివునిభక్తికి మెచ్చి ఉత్పాతతుల్యమైన పాశుపతాస్త్రమును అతనికి ప్రసాదించెను. కాని ఆ పాశుపతాస్త్రము విష్ణువునకు ప్రతికూలముగా ప్రయోగించినపుడు నిరర్థక మగునని పురుషోత్తముడు శివునకు తెల్పెను. పరమేశ్వరుడు ఆ విషయమును జ్ఞప్తికితెచ్చుకొని పాశుపతాస్త్రము విఫలమైనచో వారాణసీ పట్టణము దగ్ధమగునని భయపడెను.



5. శివుడు నారాయణుని స్తుతించుట :

'ఓ నారాయణ! పరంధామ! పరమాత్మ! పరాత్పర! సచ్చిదానంద విభవ! నిరంజన! నీకు నమస్కారము. జగత్కారణుడవై గుణభేదములచే సృష్ట్యాది కర్మలను చేయుచున్నావు. నీ మాయచే నీ సర్వశక్తులను తేజస్సును గోప్యముగా ఉంచుచున్నావు. అట్టి మహాత్ముడవగు నీకు నా వందనములు. జీవుల దేహములందు మాత్రమే ఉందవు. కేవలము బాహ్యమునందే ఉందవు. కేవలము దూరస్థుడవు కావు. కేవలము సమీపమున నున్నవాడవు కావు. నీవు గరిష్ఠుడవు. లఘు స్వరూపుడవు. శాశ్వతుడవు. అణుస్వరూపుడవు. స్థూలమైన వాడవు. అట్టి పరంధాముడవగు నీకు నా ప్రణామములు.

ఓ నిరుపమ ప్రభావా! కోట్లకొలది బ్రహ్మలు, నావంటి మహేశ్వరులు నీకు సాటిరారు. నీ క్రీడకొరకే నీ రోమములవలన ఈ బ్రహ్మాండములు ఉద్భవించినవి. కాలాత్ముడవగు నీకు నా నమస్కారములు. నీ రూపము పరమ పూజనీయమైనది. ఓ విశ్వాత్మ! నీకు నా వందనములు.

బ్రహ్మకు సృష్టి లయములకుకూడ కాలపరిమితి ఉన్నది. మన్వంతరాది కాలవిభాగమును ఏర్పరచుటయందుకూడ నీవే సమర్థుడవు. ఓ ప్రభూ! నేను తమోగుణముచే సృష్టింపబడితిని. నీ ప్రభావమును తెలిసికొనుశక్తి నాకు లేదు. కావున నా యపరాధమును క్షమింపుము' అని యిట్లు త్రిపురదాహకుడయిన శివుడు నుతింపగా విష్ణువు చక్రరూపమును విడిచి ప్రసన్నవదనుడు, శ్రీమంతుడు, శంఖచక్రగదాధరుడై శంకరునకు ప్రత్యక్షమయ్యెను.

ఆదిశేషుడే ఆ విష్ణువునకు ఆసనమయ్యెను. తులసీమాలాధరుడగు లక్ష్మీపతి హారకేయూరకిరీటములతో ప్రకాశించుచుండెను. హరి వామోరువుపై లక్ష్మీదేవి ఉండెను. పార్వతీదేవి శివునిప్రక్కనుండెను. భయపడుచున్న గిరిజా పతితో కోపించిన విష్ణువు ఇట్లనెను—

6. విష్ణువు శివుని మందలించుట :

ఓ శంకరా! ఈ సమయములో సామాన్యుడయిన కాశీరాజుయొక్క విజయమునకై నాతో యుద్ధము చేయవచ్చితివి.

ఓ ధూర్జటీ! నీకు తెలియని నా ప్రభావము లెన్నో ఉన్నవి. నీ పాశుపతాస్త్రమును సురలుకాని, అసురలుకానీ జయింపలేరు. క్రోధ రూపమును దాల్చిన నా చక్రమును నీవు జయింపలేవు. నా శక్తిసామర్థ్యములు తెలియక ఈ జగత్తులో సంచరించుచున్నవాడవు నీ వొక్కడవే. పూర్వము నీవు బహుజన్మములందు చేసిన తపస్సులచేతను, నా కరుణవలన శక్తియుతుడవయితివి. పార్వతీదేవికూడ చిరకాలము

సుఖముగా క్రీడింపవలె ననియు, ఈ వారాణసీ నగరము శాశ్వతముగా నుండవలె ననియు కోరిక నీకున్నచో, దక్షిణ సముద్రతీరమున భూమిపైని నీలాచల విభూషితమై నా పేరితో వెలసియున్న శ్రీ పురుషోత్తమ క్షేత్రమున పార్వతీదేవితో నిర్భయముగా నివసింపుము. ఆ పుణ్యక్షేత్రము విరజమండల పర్యంతము దశ యోజన విస్తీర్ణమై క్రమముగా చిత్రోత్పలానదివరకు పావనమై విలసిల్లుచున్నది. దాని తరువాతనున్న దేశము దక్షిణార్ణవ మనబడుచున్నది.

నీలాద్రి శ్రేష్ఠమయినది కావున భక్తులకు మోక్షప్రద మగుచున్నది. చతుర్వేదములందు వర్ణింపబడిన నేను నీలమణిమయుడను. నీలాద్రికి ఉత్తర దిక్కున ఏకామ్రమను పేరుగల వనమున్నది. అచట నీవు పార్వతితో ఆనందముగ విహరింపవచ్చును. నా యాజ్ఞచే సర్వలోకములను సృజించిన బ్రహ్మదేవుడు కోటిలింగములకు పతివయిన నీకు అక్కడకూడ అభిషేక మొనర్చును. ఈ మణికర్ణిక క్షేత్రము సర్వతీర్థమయము కావున ఇట నీ యహంకారమును విడిచి పరిజనముతోకూడ నీవు పురుషోత్తమ క్షేత్రమునకు వెళ్లుము' అని విష్ణువు పలుకగా, త్రినేత్రుడు తలవంచి చేతులు జోడించి మధుసూదనునితో ఇట్లనెను—

7. హరుడు శ్రీహరితో పలుకుట :

'ఓ దేవదేవ! జగన్నాథ! ప్రణతార్తిహర! ప్రభూ! ఓ జగత్పతీ! నీ యాజ్ఞను పాలించుట నాకు శ్రేయస్కరము. నా మూర్ఖత్వము వలననే నా మనస్సు చలించి గర్వించితిని. నీ యాజ్ఞానుసారము శుభప్రదము, మోక్షప్రద మయిన పురుషోత్తమ క్షేత్రమునకు వెళ్లుటకు నన్ననుగ్రహింపుము.

పూర్వము మహాదేవ నిర్మితమైన పరమ పవిత్రమయిన ఈ మణికర్ణిక క్షేత్రమును పురుషోత్తమ క్షేత్రమును నీవే సంరక్షించుచు పాలింపుము.

బలరామ శ్రీదేవులతో కూడిన పురుషోత్తముని అర్చించుచు, బ్రహ్మ ఉమా కాంతుని స్థాపించెను. మేము ఆ పురుషోత్తమ క్షేత్రమునకుపోయి త్రిపుర సంహారకుడై ప్రకాశించుచున్న గిరిజాపతిని చూడగలము.

శివక్షేత్రమయిన ఈ మణికర్ణిక కూడ రజస్తమో గుణములను హరించును. విరజమండలము శ్రేయోదాయకమయినదే. కాని పురుషోత్తమక్షేత్రము సత్త్వ గుణ ప్రధానమయినది. కావున ముక్తిప్రదమయినదని ప్రఖ్యాతిని గాంచినది అని శంకరుడు హరితో అనెను.

పూర్వోక్తములయిన తీర్థములన్నియు ముక్తిప్రదములే' అని పురుషోత్తమ క్షేత్ర మాహాత్మ్యము, విష్ణు రహస్యము, దుష్టులకు విశ్వాసపాత్రము కాదని నారదుడు ఇంద్రద్యుమ్న నృపతికి చెప్పెను.



నారదుని వాక్యమును విని సంతుష్టహృదయుడై ఇంద్రద్యుమ్న మహారాజు పురుషోత్తమక్షేత్రమున బ్రహ్మచే ప్రతిష్ఠింపబడిన ఉమాపతిని నారదమహర్షితో చూచుటకు బయలుదేరి మధ్యాహ్న సమయమున ఏకామ్ర వనమను పేరుగల క్షేత్రము చేరుకొనెను.

ఇంద్రద్యుమ్న మహీపతి బిందుతీర్థమున స్నానమాడి ఆ తీర్థములయొక్క యందున్న పురుషోత్తముని విధిపూర్వకముగా పూజించి కోటీశ్వరాలయమునకు చేరెను. మరియు ఆ రాజు ఆ పుణ్యతీర్థజలమును ఆచమనముచేసి భగవంతుని కొరకు అనేక గజాశ్వములను, ధనరత్నములను వస్త్రాలంకారములను, ద్విజులకు సాత్త్వికధర్మబుద్ధితో దానమొసగెను. ఆ రాజు అద్వైత దర్శనుడై భువనేశ్వరుని లింగమునకు పుణ్యతీర్థ జలముతో అభిషేకమొనర్చి అతులమైన ప్రీతిని పొందెను. రాజు భక్తితో దేవుని స్తుతించి వీణాగానము గావించెను. మరియు అతడు ముకుళితహస్తుడై దేవుని ప్రసన్నుని గావించుకొనుటకు సాధన ముచు, అనన్యమనస్కుడై వృషభధ్వజుని ధ్యానించు చుండెను. పిమ్మట భగవంతుడు త్రినేత్రుడయిన పరమేశ్వరుడు రాజునకు ప్రత్యక్షమై సుస్పష్టముగా పలికెను.

కోటిలింగేశ్వరుడు ఇంద్రద్యుమ్నునితో సంభాషించుట :

'ఓ ఇంద్రద్యుమ్నమహారాజా! భూమిపైని నీవంటి వైష్ణవోత్తముడు లేడు. నీ కోరిక అల్పకాలముననే సఫలమగును' అని శివుడు అనతిచ్చి అంతర్ధానమునందెను.

కోటిలింగేశ్వరుడు నారదునితో పలుకుట :

'ఓ మునీంద్రా! బ్రహ్మదేవుడు మున్ను నుడివిన ప్రకారము అశ్వమేధ యాగములను తొలుత చేయించి, విష్ణు శరీరమైన పురుషోత్తమక్షేత్రమునందు విష్ణుహృదయ తుల్యమైన అంతర్వేది క్షేత్రమున విష్ణువుచే ఆ క్షేత్ర రక్షణమునకై నేను ఎనిమిది విధముల స్థాపింపబడితిని. శంఖాకృతితోనున్న ఆ క్షేత్రము యొక్క అగ్రభాగమునందు, నేను నీలకంఠుడనై వసించుచున్నాను. ఓ నారద మునీశ్వర! ఈ రాజును దుర్గతోకూడ అటకు పంపుము. ఇపుడు నీలరత్న మును దాల్చిన హరి అంతర్హితుడై ఉన్నాడు. అచట నా యాజ్ఞానుసారముగ నరసింహక్షేత్రమును నిర్మింపుము. మా సన్నిధియందు ఈ నృపతి వేయి అశ్వమేధయాగము లొనర్చి, హరిని తృప్తిపొందింప వలయును. పిమ్మట శాశ్వతము, బ్రహ్మస్వరూపము, అఖండమయిన ఈ వృక్షమును రాజునకు చూపింపుము. ఆ తరువాత విశ్వకర్మ నాలుగు విగ్రహములు తయారుచేయును. వాని ప్రతిష్ఠించుటకు బ్రహ్మయే స్వయముగా రాగలడు. అతడు హరిప్రీతికై

అశ్వమేధ యాగములు చేసి పాపరహితుడై వేయి సంవత్సరములుండి హరిని చూడగలడు.

జగన్నాథుడు సమస్తజగములకు అధారభూతుడు సర్వకల్మష నాశనుడు. దారు రూపమయిన తనువును దాల్చినవాడు. భక్తులకు దర్శనమాత్రమునచే మోక్షమొసంగునట్టి ఆ పురుషోత్తముని చరిత్రము బ్రహ్మకు, నాకు, నీకు కూడ తెలియదు. ఆ జగన్నాథుడు తన యాజ్ఞను పాటించిన భక్తులకు ప్రసన్నుడగును' అని కోటిలింగేశ్వరుడు నారదునితో పలికెను.

నారదుడు జగద్గురువయిన మహాదేవునికి వందన మాచరించి ముకుళిత హస్తుడై 'ఓ ప్రభూ! బ్రహ్మకూడ జగన్నాథునిగూర్చి నీవు చెప్పినట్లే నాకు తెల్పెను. బ్రహ్మదేవుడు నీవును పరమాత్మకంటె భిన్నులుకారు. ఈ ఇంద్ర ద్యుమ్న మహారాజుయొక్క అదృష్టమువలన మనోగోచరుడుకానట్టి ఈ స్వామి మువ్వురిని అనుగ్రహించుచున్నాడు. పాపకర్మల నాచరించిన వారికికూడ ఆ జగన్నాథుని ప్రసంగమువలన భవసాగరమునుండి తరింపశక్యమగును. ప్రాణి కోటిచే స్మరింపబడుచున్న పురుషోత్తముని మహిమ ఊహాతీతమయినది. బుద్ధి గోచరుడుకాని యతనియెడల ఏమాత్రము భక్తి కల్గియున్నను అతడు ప్రీతి నొందును. కొందరు వేదవాక్కులనే ప్రమాణముగా స్వీకరించి చిరకాలము అట్లే చేయుచు ఆ భగవంతుని దర్శనార్థము వేచియున్నారు. క్షుద్రుడయినను శ్రమ పడకుండ ఆచరించిన సత్కర్మచే ముక్తుడగుచున్నాడు. అవులమందను కాచుచు, జీవించువారు, అరణ్యమున జీవించువారు, గృహస్థులు, ముక్తినొందిరి. కామోప భోగములచే మత్తుడై నిరంతరము ద్రోహముచేసిన శిశుపాలుడు సభామధ్యమున ముక్తినిపొందెను. వ్యాధుడు హృదయమును చీల్చి ఉత్తమగతిని పొందెను. పూర్వము వస్త్రముచే ఆకర్షింపబడిన హరిని కుబ్జ ఇంటికి తీసికొనిపోయి మోక్షమును పొందెను. దేవకాంతలు పొందలేని ధ్యానావస్థను ఆమె పొందెను. భగవంతుడు దూరమందున్న చండాలునకు ముక్తినిచ్చెను కాని సమీపమందున్న శ్రోత్రియుడయిన పరమ భక్తునకు మాత్రము మోక్షము నొసంగలేదు.

జగన్నాథుడు మాయలచే నిన్ను బ్రహ్మదేవునికూడ వంచింపవచ్చును. తపో నిష్ఠలచే క్లేశపడి దేహబంధముగల గౌతమాది ఋషులు బ్రహ్మచర్య నిష్ఠాతత్ప రులై కల్పాంతమువరకు నివసించుచున్నారు. హరిచేష్టలు ఇట్టివి అట్టివి అని విశదీకరించి చెప్పశక్యముకాదు. ఎంతసాధన చేసినను ఎంతకాలము గడచినను బుద్ధిమంతులకయినను ఇతని చరిత్ర గోచరముకాదు. శాస్త్రములందు చెప్పబడిన ఉపాయములెన్నో కలవు. విద్వాంసులు మోక్షమునకై బహువిధ యాగములు చేయుచున్నారు. అన్నిటిలో ఉత్తమోపాయము పురుషోత్తమ క్షేత్రమునందు నివసించుటయే.



మంచిమిత్రుడు స్వామి సాయుజ్యమునకు శీఘ్రముగా పంపునట్లు, ఈ ...వి యగు హరిని దర్శించుటకు ఉపాయము లేకపోలేదు.

ఓ దేవేశ! హరి తనంతట తాను ఏ సురక్షిత ప్రదేశమున ఉన్నాడో, ...ద్యుమ్నుడు అతనితో ప్రసంగించినందువలన ఆ స్థలము సర్వజనులకు దర్శింప శక్యమగునో నీవే ఆజ్ఞాపింపుము.

ఓ వృషభధ్వజ! బలవంతుడు దారుస్వరూపుడైన ఈ హరిని పట్టుకొని ...త సమీపమున ప్రతిష్ఠించి, మహాక్రతువునందు దీక్షపూని నీ పాదపద్మ ...ధిక రాగలను' అని నారదుడు కోటిలింగేశ్వరునితో పల్కెను.

జైమిని మునులతో ఇంద్రద్యుమ్నుడు హరి సన్నిధికి వెళ్లినట్లు చెప్పుట :

'కోటిలింగేశ్వరుడు అట్లేచేయుమని నారదునకు చెప్పి క్షణకాలములో ...ర్ధానమయ్యెను. నారదుడు ఇంద్రద్యుమ్న నృపతియొక్క రథముపైని ...నుండి ఉత్తమమైన పురుషోత్తమ క్షేత్రమునకు వెళ్లెను. మరునాడు రాజు ...శించుచున్న పరిశుద్ధమైన స్థలమున కేగెను.

దైర్ఘ్యముగానుండి తటాకములతో తరువులతో కూడుకొనిన తూర్పు ...వ సముద్రతటమందు బిల్వేశుడున్నాడు. మంత్రిచెప్పినచోట సైన్యము ...వెను. ఇంద్రద్యుమ్న మహారాజు ఉచితరీతిని ఉత్తమ స్థానమున బిల్వేశ్వర ...తేశ్వరుని ప్రతిష్ఠించి, నమస్కరించి పూజించి బుద్ధిమంతుడయిన రాజు ...నుడయిన నారదునితో రథము నధిష్ఠించి నీలాచల నివాసి అయిన ...వును మనస్సునందు ధ్యానించుచు వాక్కులతో స్తుతించుచు హరి సన్నిధికి ...నె' అని జైమిని ఋషులకు విన్నవించెను.

## 13 వ అధ్యాయము

జైమిని మునులకు కపోతేశుని గూర్చి చెప్పుట :

ఇంద్రద్యుమ్న మహారాజు సేవించిన క్షేత్రమునకు కపోతేశమను పేరెట్లు ...గెను ? కపోత మెయ్యది ? ఈశ్వరు డెవ్వడు ? ఈ విషయమును విస్తరించి ...వ్పుమని మును లడుగగా జైమిని ఇట్లు చెప్పనారంభించెను.

'మునులారా! ఆ క్షేత్రమే పూర్వము కుశస్థలి అనబడుచుండెడిది. ఆ ...త్రమందంతటను వాడియైన దర్భలు ముళ్లు నిండియుండుటచేతను, వృక్షములు ...లము లేనందున ప్రాణికోటి సంచరింపలేదు. అది పిశాచములకు నివాసస్థలము ...మండెను. అచట హరికంటె వేరొక దేవుడు పూజింపబడనందున పూజనీయుడైన ...నేత్రుడు స్పర్ధవహించెను. అట్లు చింతించుచునే ధూర్జటి ఆ విష్ణువుయొక్క భక్తి

యందే మనస్సునుంచెను. హరుడు ప్రాణిసంచార రహితమైన ప్రదేశమందుండి ఆహార పానీయములను స్వీకరించక మహత్తరమయిన తపమాచరించి హరిని మెప్పించ దలచెను. రమేశుని శారదాపతిని ఏమని స్తుతింపవలెనో, సర్వబ్రహ్మాండనాథునకు తుష్టిని సంతసమును కల్గించునది ఇంక నేమున్నదో యని శంకరుడు ఆలోచించెను. బాహ్యమయిన ఏ యితర వస్తువును అతనికి తృప్తి కల్గింపదు. నిశ్చలమయిన మనస్సుతో అంతర్యాగమునందుండి, భక్తులకు ఆత్మజ్ఞానము నొసంగెడి చరాచర గురువగు హరిని ఆరాధించి, అతని యనుగ్రహము వలన సర్వులకు పూజ్యుడు కాగలడని త్రిశూలధారి భావించెను. అట్టి నిశ్చయముతో శివుడు నీలాచలమునకు సమీపమునగల పవిత్రమయిన కుశస్థలికి సర్వ ద్వంద్వ వివర్జితుడై వెళ్లి అక్కడ వాయుభక్షణము చేయుచు తీవ్రముగా తపస్సు చేసెను.

మహేశ్వరుడు అష్టమూర్తి అయినను కపోతమువలె సూక్ష్మదేహు డయ్యెను. అప్పుడు భగవంతుడగు హరి అతనికి ప్రసన్నుడై ఐశ్వర్యమును ప్రసాదించెను. దానిచే ఈశ్వరుడు విష్ణువువలె పూజాసమ్మానములు పొందు చుండెను.

పరమేశ్వరుని తపఃప్రభావమునలన కుశస్థలి బృందావన తుల్యముగా నున్నది. ఆ క్షేత్రమధ్యమున సరస్సులు, తటాకములు, నదులు శోభించుచున్నవి. అచటి నానా తరులతలు వివిధ ఋతువులందు లభ్యములగు ఫలపుష్పములు, కన్నులపండువుగా నున్నవి. మధుపానముచే మదించిన తుమ్మెదల ఝంకారము శ్రావ్యముగా నున్నది. ఆ పుణ్యస్థలము వివిధ పక్షి జంతు సంతతికి సుఖాశ్రయ మొసగినది

తీవ్రతప మొనర్చిన పశుపతి శరీరము కపోతసదృశ మగుటచే మురారి యాజ్ఞచే ఆ కుశస్థలియందు శంకరుడు కపోతేశ్వర రూపధారియై పార్వతితో సదా నివసించుచున్నాడు.

అక్కడ కపోతేశ్వరుని అర్చించువారు, స్తుతించువారు, వందనము చేయు వారు పాపరహితులై విష్ణువును చేరుకొనగలరు' అని జైమిని తపోధనులకు చెప్పెను.

2. జైమిని ఋషులకు బిల్వేశునిగూర్చి తెల్పుట :

'ఓ మునులారా ! ఇంక బిల్వేశుని మహిమను విశదీకరింతును—

పూర్వము పాతాళలోక వాసులయిన రాక్షసులు భూలోకమును భేదించి జనులను భక్షించుచు భూలోకమునందు ఉపద్రవము కల్గించిరి. అపుడు రాక్షసుల వలన బాధను పోగొట్టి విష్ణువు శిష్టరక్షణకై దేవకీగర్భసంభవుడై, భూమిని పాలించెను. కృష్ణభగవానుడు యాదవులతో పాండవులతోకూడ ఆ కపోతస్థలికి



వచ్చెను. ఆ స్వామి పుణ్యతీర్థ జలములో స్నానమాచరించి ఆ నీలమాధవునకు దూరమునుండి మనస్సుచేతనే ప్రణమిల్లి దైత్యద్వారమును సమీపించెను. అసుర సంహారకుడగు కృష్ణుడు మానవులకు ప్రవేశింప శక్యముగాని ఘోరమయిన ఆ రంధ్రమును గాంచి భ్రాంతిచే లోకములను మోహింపజేయుచు శివుని పూజా మహిమను శ్లాఘించుచు బిల్వ ఫలమును గ్రహించి దానిపైని శివుని ఆవహింపజేసి పూజించి ఆనందింపజేసెను' అని జైమిని ద్విజులతో అనెను.

3. భగవంతుడగు కృష్ణుడు బిల్వేశుని స్తుతించుట :

'ఓ త్రిగుణాతీత ! గుణత్రయ విభాగకర ! త్రయీమయ ! త్రయాతీత ! త్రికాలజ్ఞానివగు నీకు నమస్కారము. శశి సూర్యాగ్ని నేత్రుడవు, బ్రహ్మణ్యుడవు, పూతాత్ముడవు, అష్టైశ్వర్యవంతుడవు, అష్టాత్ముడవు అయిన నీకు నమస్కారము. తమోరహితుడవై, భక్తుల అజ్ఞానమును నాశనము చేయునట్టి అవ్యయరూపుడవు. నీకు నా ప్రణామములు. ఇట్లు కృష్ణప్రభువుకూడ పరమేశ్వర స్వరూపుడే కావున తన్నుతానే స్తుతించుకొనగా బిల్వేశుని కృపచే పాతాళములోనికి పోవు బిలము సులభముగా ప్రవేశింపదగినదయ్యెను. భగవంతుడు ఆ మార్గముగుండ సైన్యముతో పోయి అచటనున్న బలశాలురయిన దైత్యులను వధించి రాక్షస బాధను తగ్గించెను. శ్రీకృష్ణభగవానుడు కపోతేశ స్థలికి మరల వచ్చి వృషభధ్వజుని పూజించి రాక్షసులు రాకుండ ద్వారముకడ అడ్డుపెట్టుటకు శివుని స్థాపించెను.

మహాబుద్ధిమంతుడు, భక్తవశ్యుడు, గదాధరుడు అయిన శ్రీకృష్ణపరమాత్మ శివుని అచటి ప్రాసాదమున వసింపుమని చెప్పి, అసురులు పాతాళమునుండి బహిఃప్రదేశమునకు రాకుండ అరికట్టుటకై అట నుండుమని కోరెను. అసుర నాశనమునకుమహేశ్వరుడే సమర్థుడని అతనిని అట స్థాపించి ద్వారవతి కేగెను.

అప్పటినుండి బిల్వేశుడు భూలోకమున ఖ్యాతి నొందెను. ఆ బిల్వేశుడే ఆ పుణ్యక్షేత్రమునకు మొట్టమొదట భాగ్యవిధాత పాపహారియు అవ్యయుడు నగు పార్వతీపతిని దర్శించిన భక్తుడు విపత్తులు లేకుండ సఫలమనోరథుడగును.

ఓ మునులారా ! మీకు కపోతేశ్వర బిల్వేశ్వరుల మహిమను తెల్పితిని. ఇంకను మీరేమి వినగోరుచున్నారు' అని జైమిని మునుల నడిగెను.

## 14 వ అధ్యాయము

నారదముని ఇంద్రద్యుమ్న నృపతి కలిసి రథముపై కూర్చుండి ఎక్కడకు పోయిరి ? ఏమి చేసిరని ద్విజులు జైమినిని ప్రశ్నించిరి.

1. ఇంద్రద్యుమ్న నృపతి తనకు కల్గిన అపశకునమునకు కారణమును తెల్పుమని నారదుని అడుగుట :

ఇంద్రద్యుమ్న నారదులు ఇంద్రద్యుమ్నుని పురోహితునికి తమ్ముడైన విద్యాపతితోకూడ కపోతేశ క్షేత్రాంతమందున్న నీలకంఠుని సమీపమునకు పోయిరి.

పయనించుచున్న రాజునకు త్రోవలో అపశకునము కలిగెను. అతని ఎడమకన్ను ఎడమ భుజము మాటిమాటికీ స్పందించుట వలన నృపతి విచారించెను. అతని సామ్రాజ్యము సురక్షితముగా నున్నను, పుణ్యక్షేత్రమున వసించుచున్నను, మాధవదర్శనార్థము చేయుచున్న యాత్రశుభావహమే అయినను, అట్టి అపశకునము తనకు కల్గుటకు కారణమేదియో అజ్ఞానమునను చేయరాని పని యెద్దియో స్పష్టముగా తెల్పుమని ఇంద్రద్యుమ్నుడు సర్వజ్ఞానని యగు నారదమునిని అడిగెను.

2. నారదముని హరి పాతాలమున కేగెనని ఇంద్రద్యుమ్నునికి చెప్పుట :

బ్రహ్మ సూచించిన భావికార్యమును శుభవాక్యమును వినిన నారదుడు ఇంద్రద్యుమ్నునితో 'ఓ రాజా! విచారింపకుము. విఘ్నము కలిగిన పిమ్మట భాగ్యవంతులకు శుభమే జరుగును. నీవు సార్వభౌముడవు. ఇది విష్ణుక్షేత్రము నిజమే. నీవు ఏ హరిని దర్శించుటకై ఈ యాత్రచేయుచున్నావో, ఆ హరి అంతర్ధాన మయ్యెను. ఏ దినము నందు సాయంసమయమున హరిని విప్రుడయిన ఈ విద్యాపతి చూచెనో ఆ మరునాడే మర్త్యలోకమున కానరాకుండ స్వర్ణ వాలుకతో కూడ హరి పాతాళ లోకమున కరిగెను' అనిన మాటలు విని ఇంద్రద్యుమ్నుడు మూర్ఛపోయెను.

3. మూర్ఛపోయిన ఇంద్రద్యుమ్నుడు తేరుకొనుట :

ఆనృపతి ప్రాణమిత్రులు, పురోహితులు ఖిన్నులై కర్పూరశీతల జలమును అతని ముఖముపై జల్లిరి. అతని శరీరమునకు కర్పూర చందనాదులను పూసిరి. అతనికి చామర తాలవృంతములతో వీచిరి.

నారదమహర్షి కూడ చలించినవాడై యోగధారణ చేసి శుభము జరుగునని తెలిసికొని రాజు ప్రాణములను రక్షించెను. రాజు శీతలోపచారముల వలన తెలివి తెచ్చుకొని లేచి నారదుని పాదములపై వ్రాలి యిట్లు పలికెను.

4. ఇంద్రద్యుమ్నుడు నారదునకు తన ఆవేదనను తెల్పుట :

'ఓ నారదమునీంద్రా! ఏ జన్మాంతరము నందో నేను చేసిన దారుణమగు పాపపరిపాకము వలననే నాకీ దుఃఖము కలిగి యుండును.



ఓ మునిపుంగవా! మనోవాక్కర్మలచేత, నేనెన్నడును స్వప్నమందైన ద్విజులకు, గోవులకు అపరాధము చేయలేదు.

ఓ మునిశార్దూలా! రాజు చేయవలసిన శాస్త్రవిహితములైన నిత్య నైమిత్తిక కామ్యకర్మములను ఆచరించుటలో నేనెన్నడును లోపము చేయలేదు.

ఓ మహామునీంద్రా! దేవతలకు అతిథులకు భృత్యులకు పితృదేవతలకు నన్నాశ్రయించినవారికి బంధువులకు నేనెన్నడును అవమానము చేయలేదు.

ఓ బ్రహ్మమానసపుత్రుడా! వైష్ణవోత్తమా! నేను విష్ణుప్రీతికై ప్రయత్న పూర్వకముగా ఎట్టి అపరాధములను పగపట్టిన కాలసర్పములను విడిచిపెట్టినట్లు విడిచి పెట్టితిని.

పురోహితుని తమ్ముడయిన విద్యాపతి ఎట్టి పుణ్యముచేసినాడో కాని తన చర్మచక్షువులతోడనే భగవంతుడయిన నీలమాధవుని గాంచెను.

నా రాజ్యవిభ్రంశము తెలిసియు నీవీ కార్యక్రమమును తలపెట్టితివి. మున్నే ఈ యాత్రలో జరుగబోవు సంఘటనను తెల్పవైతివి. నేను శ్రోత్రియులకు స్థానభ్రంశము ఏలచేసితిని? వీరందరు సుఖప్రదము అయిన స్థానములను చిరకాలము విడిచిన దెందులకు? ప్రజలను విడిచి నా కొరకై నాతో నచ్చిరి. ఇంక వీరెట్లు జీవింపగలరు?

ఓ బ్రహ్మస్వరూపుడా! నేను హరిని చూడలేకపోయినచో నేను ప్రాణములతో నుండను. ఇది నానిశ్చయము. ఇది నానిశ్చయము. నేనే లేనిచో ప్రజలెట్లుందురో కదా!

కరుణామయుడవగు మునీంద్రా! నీవు నాకు శుభాశుభములను తెల్పుచు, నా కర్తవ్యమును ఎల్లపుడు శాసించుచుంటివి.

ఇపుడు నా సుతుని గైకొని మాళవ దేశమునకు పట్టాభిషిక్తుని చేయుము. నా తనయుడు ఈ ప్రజలను న్యాయముగా పరిపాలించునుగాక. నాతోనిటకు వచ్చిన రాజు లందరును నా యాజ్ఞను మన్నించి మాళవాధిపతి యగు నా సుతుని మాట ననుసరించి సంచరింపవలెను.

నేను ప్రాయోపవేశవిధి ప్రకారము నీలమాధవుని ధ్యానము చేయుచు ఈ పుణ్యక్షేత్రమున నివసించుచు ఆయుఃశేషమును సఫలము చేసికొందును.

బ్రహ్మమానసుడయిన నారదముని విలపించుచున్న ఇంద్రద్యుమ్న మహీపతిని లేవనెత్తి ఉపశమన వాక్కులతో ఓదార్చి ఇట్లు పలికెను.

5. నారదముని ఇంద్రద్యుమ్నునకు హరి లీలలను తెల్పుట :

ఓ రాజా! నీవు పండితమూర్ధన్యుడవు. వైష్ణవభక్తాగ్రగణ్యుడవు. ధైర్యసాగరుడవు. ప్రారంభింపబడిన సత్కార్యమునకు విఘ్నము వాటిల్లినను శ్రేయోదాయక మగునని తెలిసికొనలేకపోవుచున్నావే ? ఎందులకు ?

నీవు నీచర్మచక్షువులతో శరీరధారి అయిన మాధవుని దర్శింపబోవుట, నీవు నూరు జన్మలలో చేసిన పుణ్యఫలమే.

నిరంకుశ మయిన హరి లీలలను ఎవరు తెలిసికొనగలరు ?

ఓ రాజా! నేను జీవన్ముక్తుడ నయినను హరిలీలను అతిక్రమించుటలేదు. దృఢభక్తియుతుడను హరిసన్నిధి నున్నవాడను కావున నేనే మాత్రము వంచితుడను కాలేదు. బహుజన్మ లెత్తినను విష్ణుమాయను తెలిసికొనుట దానిని ధిక్కరించుట ఎవ్వనికైనను సాధ్యము కాదు. అతని మాయకు సాటియేలేదు.

పద్మోద్భవు డయిన బ్రహ్మ విష్ణునాభి పద్మస్థితు డయినను, నిత్యము హరిని స్తుతించుచున్నను ఈ హరి మాయను గ్రహింపజాలడు. మాయావి అయిన హరి స్వభావము చెప్పబడినది. నీవు భాగ్యవంతులలో శ్రేష్ఠుడవు. హరి యొక్క త్రిమూర్తులును నిన్ను అనుగ్రహించు ననుటలో సందేహములేదు.

చరాచరములను సృజించి లోకపితామహుడైన బ్రహ్మ నన్ను ఇంద్రద్యుమ్న నామధేయుడ వయిన నీకడకు శీఘ్రముగా వెళ్లుమని స్వయముగా చెప్పెను. ఓ రాజా! నీవు నీలమాధవుని చూచుటకు నీలాచలమునకు వచ్చుచున్నావు. యమునిచే ప్రార్థితుడయిన ఆ ప్రభువు అంతర్ధానమును పొందెను. అయినను నీవు విచారింపనక్కరలేదు. అది అట్లు జరుగవలసియున్నది. మరియొక విధముగా చేయశక్యము కాదు. కాని ఇంద్రద్యుమ్న మహారాజా! బ్రహ్మ నిన్ను తన ఐదవ సంతతిగా భావించుచున్నట్లు నీతో చెప్పుమని నాతో పలికెను.

ఓ భూపాలా! నీవు సహస్రక్రతువు లాచరించిన వెంటనే బ్రహ్మ నీకొరకై పరమాత్ము డయిన పురుషోత్తముని అనుగ్రహింపజేసి శ్వేతద్వీపము నుండి పురుషోత్తమ క్షేత్రమునకు తీసికొని వచ్చును. కావున నీవు ఇపుడే శ్రీపురుషోత్తమ క్షేత్రమున కేగి శ్రీవిష్ణుప్రీతికై వేయి అశ్వమేధ యాగము లొనర్చుచు అచటనే ఉండవలెనని బ్రహ్మ నీకు చెప్పుమనెను. పిమ్మట దారు తనువును దాల్చిన హరిని నీవు చర్మచక్షువులతో గాంతువు. హరి యొక్క పురుషోత్తముని, (జగన్నాథస్వామి) అవతారము నీవలన ప్రసిద్ధి గాంచునని బ్రహ్మ పలికెను తరువాత బ్రహ్మ విష్ణువు యొక్క ప్రతిమలను తప్పక ప్రతిష్ఠించును. ముందు హరి మణిస్వరూపముతో ఉన్నను, ఇపుడు నాల్గు రూపములుగా చూపిన పురోహితుడు నాతో స్వయముగా చెప్పెను.



దివ్యమైన దారుతనువును దాల్చిన శ్రీహరి మరల నాల్గురూపములతో అవతరించును. కావున ఓ రాజా! నీవు వ్యథపడవలదు. నీకోరిక తప్పక సఫలమగును. సందేహింపకుము. ఇంక నిశ్చింతగా నుండుము' అని నారదమహర్షి ఇంద్రద్యుమ్ని ఓదార్చి ధైర్యవిశ్వాసములను కల్గించెను.

మరల నారదుడు ఇంద్రద్యుమ్నునితో ఓ రాజా! శంఖాకృతిగల పురుషోత్తమ క్షేత్రము యొక్క అగ్రభాగమున దుర్గతో కూడ నీలకంఠు డున్నాడు. ఆ ప్రదేశము చదునైనది. అది అశ్వమేధ యాగములు చేయుటకు అన్నివిధముల యోగ్యమయినది. మన మందరము అటకు పోవుదము. ఆ స్థలమున అశ్వమేధయాగము లొనర్చుటకు వేయి సంవత్సరములు స్థిరముగా నుండునట్టి శాలను నిర్మింపవలెను.

నీలాద్రివాసుడయిన నృసింహమూర్తిని దర్శించి జన్మమును సఫలము గావించుకొని యజ్ఞశాలలో నీవు నిత్యము అర్చించుటకు అర్హమైన నృసింహమూర్తినే విఘ్నవినాశమునకు క్రతుఫలితము నిచ్చుటకు ప్రత్యేకముగా ప్రతిష్ఠించి మునివరులచే యథోచితముగ పవిత్ర క్రతువును ప్రారంభింప జేయుదము. ఈ పుణ్యకార్యమును చేయుటలో విలంబము శ్రేయస్కరము కాదని చతుర్ముఖుడు వక్కాణించి చెప్పినమాట' అని చెప్పెను.

## 15 వ అధ్యాయము

1. ఇంద్రద్యుమ్నాదులు నీలకంఠుని దర్శించుట :

ఇంద్రద్యుమ్న మహారాజు నారదమహర్షితోడను పురోహిత బంధుమిత్రాది పరివారముతోడను, సంతుష్టాంతరంగుడై నీలకంఠుని సమీపమునకేగి మహాదేవుని పూజించి శ్రీ దుర్గాదేవికి వందన మాచరించెను.

రాజు అధిష్ఠించిన రథము యొక్క అశ్వములు విశ్రమించుటకు విడిచి పెట్టబడినవి. రాజు జితేంద్రియులు, పాదచారులైన అనుచరులతో కూడ నీలాచలమును అధిరోహించుటకు బయలువెడలెను.

నీలాచలమునకు పోవు మార్గము నానా తరులతాకీర్ణమై వివిధ పక్షిగణాకులమై వెల్లావెదరుగ నున్న శిలలతో విషమముగా నుండి, తుమ్మెదల నాదము పథికులకు శ్రావ్యముగా నున్నది.

ఆ పర్వత నితంబ ప్రదేశము దక్షిణ సంద్రపు కెరటముల నీటితో కూడుకొని యున్నది. ఆ దుర్గమమార్గము కంటకావృతమై మహా సర్పములు కూడ దూరలేనంత భయంకరముగా నున్నది. అందే మత్తగజయూథములు కూడ

సంచరించుచున్నవి. ఆ ప్రాంతమున నున్న శ్వాపదమృగములు శశ్వత్తాఘాత మెరుగక చిరకాలము నుండి నివసించు చున్నవి. వివిధ జాతులకు చెందిన మృగయాధములు ఆ భీషణ మార్గమునందే నిర్భయముగా మసలుచున్నవి.

ఇంద్రద్యుమ్నాదులు ఆ మార్గమున పయనించుటకు యత్నించినను విఫలులైరి.

2. నారదాదులు నృసింహస్వామిని దర్శించుట :

అపుడు రాజాదులు నారదుని వలన ఆ గిరిశిఖరమును తెలిసికొని విశ్రమించిరి. అచటనే కృష్ణాగురుతరువుయొక్క క్రిందిభాగమున సర్వభయము లను పోగొట్టునట్టి దివ్య సింహశరీరధారి యగు నృహరి నివసించు చున్నాడు. ఆ నరసింహస్వామిని దర్శించినవారు మున్ను చేసిన బ్రహ్మ హత్యాది పాపముల నుండి విముక్తు లగుదురు.

ఆ సమయమున ఆదివిష్ణువు యొక్క అవతారమైన నృసింహస్వామి రూపము భయంకరముగా నున్నది.

తెరవబడిన అతని ఘోరు భయంకరములైన అతని దంతములు, పింగళ వర్ణముతో కూడిన జట, అరుణరూపము, భీతిని గొల్పు త్రినేత్రముల వీక్షణములు, దైత్యుని వక్షఃస్థలమును చీల్చుచున్న అతని దారుణ నఖములు, రక్తజిహ్వ, వికటాట్టహాసముతో కూడిన వికృతవదనము, శంఖచక్రసహిత బాహువులు, దిగంతములనే భయభ్రాంత మొనర్చుచున్న అతని నేత్రస్ఫులింగములు భూమండలమునే దద్దరిల్లజేయుచున్న అతని పాదఘట్టనము చూడ శక్యముగాకున్నను ఇంద్రద్యుమ్నుని అనుచరులు నృసింహస్వామిని నారదుని సమక్షమునఁగాంచుటచే, నిర్భయులై దూరమునుండి ఆ దేవునకు నమస్కరించిరి.

ఇంద్రద్యుమ్నమహారాజు నృసింహుని దర్శించి, నారదుడు మున్ను చెప్పిన మాటలు విశ్వసించి, భావికార్యక్రమమును చేయసంకల్పించి, నారద మునితో ఇట్లనెను :

'ఓ నారదమునీంద్రా ! కృతకృత్యుడనైతిని. నీవు ఉత్కృష్టమైన జ్ఞాన నిధివి. ఈ నృసింహస్వామి నావంటివారికి దురారాధ్యుడు, చూచుటకే భయంకరముగా నున్నాడు. మీవంటివారు మాత్రమే అతనిని సమీపించి సేవింపగలరు. మావంటివారము దూరముగా నుండి అతనికి నమస్కరింప వలసినదే. ఆ స్వామి దర్శనము వలననే నాపాపము లన్నియు నశించినవి. నేను కృతార్థుడనైతిని.

ఓ మునీంద్రా ! నీతోడనుండుటచేతనే ఈ నృసింహుని నిర్భయముగా ఇట దర్శించితిమి. అత్యుగ్రమూర్తి అయిన యా భగవంతుడు త్రిలోకేశు



డగు దైత్యరాజును చీల్చుచున్నాడు. అట్టి భీకరాకారుడగు స్వామిని అల్ప శక్తిమంతులగు నరులు ఎట్లారాధింప గలరు. ఓ మునిశ్రేష్ఠ ! కృపాసింధు వయిన అతని నీలస్వరూపముగల మూర్తి ఎటనున్నది ? దానిని దర్శించుట వలన ముక్తి కల్గునుకదా ?

ఓ విపేంద్ర ! ఏ స్థలము ముక్తిప్రదమో దానినే చూపింపుము' అనిన ఇంద్రద్యుమ్నుని వాక్కులు విని నారదుడు స్వర్ణసైకతసంవృతుడై భగవంతు డున్న పవిత్రస్థానమును రాజునకు చూపించుచు ఇట్లనెను :

'ఓభూప ! ఒక యోజనము పొడవు రెండు యోజనములు విస్తీర్ణము గల కల్పాంతస్థాయి యగు వటవృక్షము నరులకు మోక్షప్రదమగు చున్నది. ఈ వృక్షచ్ఛాయ యందున్నవాడు పాపరహితుడగును. ఈ వృక్షమూలమున ప్రాణములు విడిచినవానికి ముక్తి కల్గును. పరమ పావన మగు వటవృక్ష రూపమును దాల్చిన నారాయణుని చూచినంతనే మర్త్యుడు పావనర్తిత డగు చుండగా, వానిని పూజించి స్తోత్రము చేసినచో వాని పుణ్యము చెప్ప వలయునా ?

ఓ నృపా ! ఈ వృక్షమూలమునకు పశ్చిమదిక్కున నృసింహస్వామి, ఉత్తరదిక్కున చతుర్మూర్తిధరుడగు మాధవుడును ఉన్నారు. నిన్ననుగ్రహించుటకే భగవంతుడు మరల ఇట ఉద్భవించగలడు.

భోగభూమి అయిన శ్వేతద్వీపము నందు విష్ణువునకు తన అలయము కలదు. కర్మభూమి అయిన జంబూద్వీపమున అతనికి ఇయ్యది అతిరహస్య మయిన దగుటచే దీనిని ప్రకటించుట అతనికి సమ్మతము కాదు.

ఓ మహీపతీ ! ఈ పుణ్యస్థలమును మోక్షాధికారియే తెలిసికొను చున్నాడు. దుష్కర్మము లాచరించువారు దీనిని విశ్వసింపరు.

ఓ భూప ! భక్తులు విష్ణువు యొక్క విగ్రహమును ప్రతిష్ఠించినచో అదియు ముక్తిప్రద మగుచుండగా ఆ విష్ణువిగ్రహమే స్వయముగా వెలసినచో దాని మహిమము చెప్పవలయునా ? భగవంతుని యంతర్థాన తిరోధానములు నైమిత్తికములే.

ఓ నృప ! ప్రతి యుగము నందు భగవంతుడు సాధువులను అనుగ్ర హించుటకే మత్స్యకూర్మాది నానావిధ్యవతారములను దాల్చుచున్నాడు.

పరమేశ్వరుడు ఏనిమిత్తమై అవతరించుచున్నాడో ఆ కార్యసాధన మయిన వెంటనే తిరోధానమును పొందుచున్నాడు. కారుణ్యసాగరుడయిన విష్ణువు ఇట నిత్యము నిర్నిమిత్తముగా నివసించుచున్నాడు.

విష్ణువు శ్వేతద్వీపమున వసించుచున్నను, ఇతర స్థలముల యందు అవతరించుచున్నట్లే ; ఇక్కడ కానవచ్చుచున్నను కరుణామయుడై వటతరు మూలమున ఉద్భవించినట్లే ద్వారకాకాంచీ పుష్కరాదులయందు కూడ ప్రకాశించుచున్నాడు.

ఓ రాజేంద్ర ! నానా తీర్థముల యందు దేశముల యందు పుణ్య క్షేత్రముల యందు దేవాలయముల యందు ఆతని యంశావతారములే వెలసి యున్నవి. నీవు సంశయింపపనిలేదు.

ఓ భూపాల ! ప్రభువు తన నివాస క్షేత్రము వలెనే ఈ క్షేత్రమును క్షణమైనను విడువడు. విష్ణువు మరల ప్రకాశించుట నీ యజ్ఞము వలననే జరుగును' ఇట్లు చెప్పి మహాత్ముడైన నారదుడు ఇంద్రద్యుమ్నునకు ఆ స్థానమును చూపించెను.

ఆ నృపతి ఆ పవిత్రస్థలమునకే సాష్టాంగవందన మాచరించెను. అటనున్న దేవుడు సాక్షాత్కరించినట్లు సంతుష్టుడయ్యెను.

3. ఇంద్రద్యుమ్నుడు జగన్నాథుని స్తుతించుట :

'ఓ దేవదేవ ! జగన్నాథ ! ప్రణతార్తిహర ! పుండరీకాక్ష ! భవసాగర పతితుడనయిన నన్ను రక్షింపుము.

పరమేశ్వర ! దుఃఖౌఘధ్వంసకుడవు నీవొక్కడవే. సుఖలేశముల ననుభవించుటకై క్షుద్రులు క్షుద్రదేవతలనే సేవింతురు.

మానవునకు అనాదిగా పరంపరాయాతముగ సంప్రాప్తమగుచున్న మూడువిధములగు మహాపాపములు ప్రతి జన్మము నందు తగ్గించుటకు వీలు లేకుండ సతతము పెరుగుచున్నవి.

ప్రభూ ! నీయందు భక్తిభావము చేతనే మనుజులకు తప్పక ముక్తి లభించును. కృపానిధి వగు నీవు కర్మాధీనుడవని కొందరు మూఢులు భావించుచున్నారు.

ఓ భగవంతుడా ! నీవే ఆ కర్మములను ప్రేరేపించుచున్నావనే సత్యమును సామాన్యులు గ్రహింపలేకున్నారు. ఓ స్వామీ ! అజామిళుడను విప్రుడు తాను వరింపవలసిన వర్ణాశ్రమధర్మములను ఆచరింపకపోయినను నీనామసంకీర్తనా తత్పరుడై ఏపాపమును చేయలేదు. నీ నామస్మరణమహిమచే భవబంధ విమోచితుడై ముక్తిని పొందెను.

ఓ దేవేశ ! నీ దర్శనమునకై అన్ని ఉపాయములు తెల్పబడినవి. నీ దర్శన భాగ్యము కల్గినంతనే హృద్గత మయిన సంశయములన్నియుపోవును.

అట్టివానికి వెంటనే సంశయరాహిత్యము పాపపుణ్యక్షయ మగుట ధ్రువము.



ఆదిదేవ ! నీవే నాకు శరణము. దీనుడనయిన నన్ను రక్షింపుము. దేవా ! నేను మాతృగర్భమునందుండగా నీవు నిశ్చయించినట్లే నాకు జన్మము కలిగినది. నేను ముక్తిప్రదమగు నీమూర్తిని ఇచట చూచుటకు ఆటంకము లేకుండగ చేసి దానిని నా ఈచర్మచక్షువుతో గాంచుటకు అనుగ్రహింపుము. ఈ నేత్రముల వలన ఇంకేమి ప్రయోజనము కలుగును' అని ఇంద్రద్యుమ్నుడు కృతాంజలిపుటుడై మధుసూదనుని స్తుతించి, అశ్రుపూర్ణలోచనుడై మరల ఆ పుణ్యస్థానమునకు నమస్కరించెను.

4. ఆకాశవాణి ఇంద్రద్యుమ్నునితో పల్కుట :

ఇంద్రద్యుమ్నమహీపతి వినుచుండగా నభోమధ్యమున ఆకాశవాణి సుస్వరముతో శ్రావ్యముగా ఇట్లు భాషించెను –

'ఓ భూపాలా ! చింతింపకుము. నీవు శ్రీహరిని నీచర్మచక్షువులతో ఇట చూడగలవు. నారదుడు నీకు తెల్పిన బ్రహ్మవచనములను ఆచరింపుము' అనిన దివ్యవాక్కును, ఇంద్రద్యుమ్నుడు విని నారదుడు చెప్పినట్లు అశ్వమేధ యాగమును చేసి భగవత్ప్రీతిని పొందదలచెను. ఆ రాజు నారదుని జూచి హర్షగద్గదస్వరముతో ఇట్లు పలికెను –

ఓ మునీంద్రా ! బ్రహ్మ ఆజ్ఞాపించినదానినే నీవు తెల్పినట్లు, ఈ అశరీర వాణి కూడ నాకు ఆదేశించినది, పితామహుడు జగన్నాథుడు ఒక్కరే. వారిరువురికిని ఏమాత్రము భేదములేదు. పద్మయోనియగు బ్రహ్మకు నీవు సుతుడవు. నీ వచనము కూడ భగవద్వచనమే. శ్రేయోదాయక మగు నద్దానినే నేను ఆచరింప వలయును' అని రాజు నారదునితో అనెను.

## 16వ అధ్యాయము

1. నారదుడు సంతుష్టుడైన ఇంద్రద్యుమ్నుని చూచిపల్కుట :

లోకశ్రేయోభిలాషి అగు నారదమహర్షి చిత్తశుద్ధి, శ్రద్ధాభక్తులు కల్గి మహాక్రతువును చేయ సంకల్పించిన ఇంద్రద్యుమ్నునితో ఇట్లనెను –

'ఓ రాజా ! సత్పురుషులు చేయు కృషికి దేవతలు సాహాయ్యమొనర్తురు. చతుర్ముఖుడు నీకు తోడ్పడుచున్నాడు. కావున నీవే యిందులకు ఉదాహరణము. నీలకంఠుని సన్నిధికి పోవుదము రమ్ము.

సర్వరాక్షసులను సంహరించునట్టియు, సర్వవిఘ్నములను నివారించునట్టియు నృసింహస్వామిని పశ్చిమదిఙ్ముఖముగా మొట్టమొదట స్థాపింతును.

భగవంతుడు అంతర్హితుడయినను ఈ నృసింహస్వామి ప్రత్యక్షము. ఈతని సన్నిధిని చేయు నీ యాగము అధికఫలము నీయగలదు. నీవు ముందుగా శీఘ్రముగా వెళ్లి అచట ప్రాసాదమును నిర్మించుము. నేను స్మరించినంతనే విశ్వకర్మ తనయుడు వచ్చి త్వరలో ప్రత్యక్షముగా దేవాలయమును ప్రాసాదమును నిర్మించును.

నీలకంఠునికి దక్షిణమున గొప్ప చందనద్రుమమున్నది. ఓ రాజా! అయ్యది నూరు ధనుస్సుల విస్తీర్ణము గల ప్రదేశము యొక్క మధ్య భాగమున పెరిగినది. దానికి పశ్చిమదిశగా నున్నదే ఉత్తమ క్షేత్రము.

అక్కడ నీవు వేయి అశ్వమేధ యాగములను సల్పుము. నీవక్కడకు వెళ్లుము. నేనిట ఐదుదినము లుండి అనంతుడు జ్యోతిస్స్వరూపుడును అయిన ఈ దివ్య నృసింహస్వామిని ఆరాధించి విగ్రహమును ప్రాణేంద్రియ మనస్సహితముగా ప్రతిష్ఠించి దీపము నుండి మరియొక దీపమును వెలిగించునట్లు, మనోహరాకృతిని పొందింపగలను' అనిన నారదుని వచనమును అనుసరించి రాజు శీఘ్రముగా చందనద్రుమ సన్నిధికి ఏగెను.

దేవశిల్పి అయిన విశ్వకర్మ యొక్క కుమారుడు, సుఘటకుడు శిల్పశాస్త్ర విశారదుడు. అతడు నారదుని యాజ్ఞచే మనుష్య రూపముతో శస్త్రసూత్రధరుడై అట నుండగా రాజు వానిని చూచెను. ఆ శిల్పి దేవాలయమును నిర్మింపదలచిన ఇంద్రద్యుమ్న మహారాజును గాంచి నమస్కరించి, 'ఓ దేవా! నేను శిల్పశాస్త్రజ్ఞుడను. నీకు శుభప్రదమగు శ్రీ నృసింహాలయమును ఇపుడు నిర్మించెదను' అనెను.

2. ఇంద్రద్యుమ్నుడు విశ్వకర్మ పుత్రుడయిన సుఘటకునితో పల్కుట :

ఓ సుఘటకా! నీవు సామాన్యశిల్పివికావు. నీవు విశ్వకర్మ సుతుడవు. శిల్పశాస్త్రప్రణేతవని నారదమహర్షి నాతో పలికెను. నిర్జనమైన ఈ మహారణ్యమున ఇంతకుపూర్వము ఇట్టి పల్లెలు, పట్టణములు లేవు.

ఓ శిల్పీ! మన మిటకు వచ్చుటకు గల ఏనిమిత్తమైన సంబంధమో ? అమిత తేజస్సు గల విష్ణువునకు దేవశిల్పివి నీవే. విష్ణువును సదా ధ్యానించుచు అతని సన్నిధినే సదా నివసించుచున్న నారదమునీంద్రుడు నిన్ను స్మరించియున్నాడు. అతడే నృసింహస్వామి యొక్క విగ్రహమును తీసుకొని సాయంకాలమునకు ఇటకు రాగలడు. అందులకే నీవు ప్రాకారముతోడను, తోరణముతోడను కూడిన దేవాలయమును ప్రాసాదమును నృసింహస్వామికి నిర్మింపుము.

నృపోత్తముడు ఆ స్వామిని విధిప్రకారము పూజించి దేవాలయ నిర్మాణమునకు శిలలను సేకరించుటకు అధికధనము నిచ్చి భృత్యులను నియోగించెను.



చిరకాలమునకుగాని నిర్మింపబడలేని అత్యుత్తమ దేవాలయము, దేవశిల్పి యొక్క మహిమచే చతుర్థదినమునందే పూర్తి అయినది.

పిమ్మట నిర్మలమయిన ప్రభాతసమయమున నిత్యకర్మానుష్ఠానమునల్పిన రాజు పరివారముతోకూడ నృసింహస్వామి యొక్క విగ్రహప్రతిష్ఠను శాస్త్రవిధిగా చేయుటకు అవసరమయిన సంభారమును సంగ్రహించి నారదాగమనము కొరకు నిరీక్షించుచున్నాడు.

అపుడు ఇంద్రద్యుమ్నుడు మున్నగువారు శంఖమృదంగ మురజాది ధ్వనులను గీత మంగలవాద్యములను గజఘంటానాదములను వినిరి. ఆకాశమండలమున నిరాధారముగా జయజయధ్వనులు వినుచున్న ఇంద్రద్యుమ్నాదులు, శ్రోత్రియులు, విప్రులు, వైష్ణవులు, రాజులు, వేలకొలది జనులు ఆశ్చర్యము నొందిరి. అంతలోనే దక్షిణదిక్కునుండి సుగంధోపేతమయిన శీతలవాయువు, తుమ్మెదల ఝుంకారము, గగనతలమునుండి పుష్పవృష్టి శుభసూచకముగా ఉండగా గంగానదిలో స్నానమాచరించి, వచ్చిన ద్విజులు, వచ్చిరి. పిమ్మట బ్రహ్మసూనుడయిన నారదమహర్షి తపఃప్రభావముచే విశ్వకర్మ తయారు చేసిన నరసింహస్వామి విగ్రహమును ఆ మహర్షి పట్టుకొని దివ్యవిమానములో ఉపవిష్టుడయ్యెను. ఆ దివ్యవిగ్రహము బహువిధ మణిరత్నాలంకృతమై, దివ్యమాల్యాంబరవిరాజితమై దివ్యగంధానులిప్తమై, సుశోభితమై, మనోహరమై, తేజోమండలప్రభాయుతమై, హర్షదాయకమై, నయనానందకరమై దివ్యశిల్పియగు సుఘటకుని శిల్పకళా చాతుర్యమును వేనోళ్ల చాటుచున్నది. అట్టి నృసింహస్వామి విగ్రహమును, ఇంద్రద్యుమ్నుడు అతని అనుయాయులుచూచి సంతసించిరి.

నారదమహర్షి అంతర్ధానుడైన హరిని బహిర్గతుని చేసినట్లు సంభావించి రాజాదులు సంతుష్టులై ఆ మునిని ప్రశంసించిరి. ఆ విగ్రహమును చూచుచున్న వారికి నరసింహస్వామి వారి సన్నిధినున్నట్లే కనబడుచున్నను, అది అర్చామూర్తి అయిన నారసింహుని విగ్రహమని వారు తలంచిరి. తరువాత ఇంద్రద్యుమ్న మహారాజు లేచి నమ్రుడై స్వామి విగ్రహమునకు ప్రదక్షిణమాచరించి విగ్రహ ప్రతిష్ఠచేయు స్థలమున కేగెను. రాజాజ్ఞచే సమకూర్చబడిన ప్రతిష్ఠకుపయుక్తమయిన సామగ్రితో నారదమహర్షి శుభలక్షణముగల దేవాలయమునకు వెడలెను.

సుముహూర్తమునందు భూదేవీ లక్ష్మీదేవులతో కూడిన దేవదేవుని విగ్రహమును రత్నవేదికపై ప్రతిష్ఠింపబడిన శ్రీవిష్ణువుయొక్క యోగారూఢ తనువును ఇంద్రద్యుమ్న మహారాజు స్తుతించెను.

ధీమంతుడయిన నారదుడు, వైష్ణవులు, బ్రాహ్మణులు, నృపులు, ఆనందదాయకములైన ఉపనిషద్వాక్యములతో, స్మార్తమంత్రములతో, శాస్త్రములతోడను నృసింహస్వామిని స్తుతించిరి.

3. ఇంద్రద్యుమ్న మహారాజు నృసింహస్వామిని స్తుతించుట :

'ఓ నృసింహస్వామీ ! నీవు ఏకానేక స్థూలసూక్ష్మ బహుమూర్తివి. వ్యోమాతీతుడవు, వ్యోమరూపుడవు, ఏకరూపుడవు, వ్యోమాకారుడవు, వ్యాపకుడవు, వ్యోమస్థుడవు, వ్యోమారూఢుడవు, వ్యోమకేశుడవు, అబ్జయోనివి, నన్ను దుఃఖాంభోధి నుండి రక్షింపుము. ఉద్యోతానేక కోట్యర్కధాముడవు. నిత్యానన్నుడవు. దూరస్థుడవు. దూరమందున్నవాడవు కావు. దగ్గరనున్నవాడవు కావు.

బోధ్యబోధాత్మభావ ! జ్ఞేయుడవు, జ్ఞానగమ్యుడవయినను అగమ్యుడవు. మాయాతీతుడవు, అనుమాన ప్రమాణముచే ఊహాతీతుడవు.

కృత్స్నమయినదానికి నీవే ఆది. ఆదికి మూలకారణము నీవే. సృష్టిస్థితిలయకారుడవు నీవే. నీకు నా నమస్కారములు. దుఃఖధ్వంసమునకు మూలకారణుడవు. దేనినైనను భేదించుటకు, ఛేదించుటకు నీవు హేతువుకాదు. సంశయాతీతుడవు. ఓ జ్యోతిస్స్వరూప ! వ్యోమవ్యూహాకార నిర్మాణహేతువు నీవే.

ఓ స్వామీ ! నీ పాదపద్మములందెల్లప్పుడు స్థిరముగా నుండుటకు మూలభూతము చతుర్విధములయిన భక్తిని ప్రధానముగ నాకొసగుము. శ్రౌతస్మార్తములను అనుష్ఠానముచేయుజనులు, దీనులు భవసాగరమున బద్ధులై ఉన్నారు.

ఓ నృసింహస్వామీ ! నీవు అనంతపాదుడవు. బహుహస్తములతో నేత్రములతో శోభిల్లుచున్నావు. బహుకర్ణములు కలవాడవు. దిగంబరుడవు. సూర్యచంద్రులే నీకు కుండలములు. నీ కంఠహారము నక్షత్రమాలతో సుందరముగా చేయబడినది. నీ మూర్తి అత్యద్భుతమైనది. భక్తాభీష్టుడవయిన నిన్ను శరణు పొందుచున్నాను. నమ్రశిరస్కుడై నమస్కరించుచున్న పితామహుని కిరీటరత్నములతో నీ పాదపద్మము ప్రకాశించుచున్నది. నీ పాదాబ్జద్వయము మోపుటచే ఎట్టి స్థలమయినను పవిత్రమగుచున్నది. నీ పాదపద్మములపైని ఎవ్వని శిరస్సు మోపబడుచున్నదో అట్టి భక్తుని దివ్యపాదమును దేవకాంతలు శిరసావహించుచున్నారు. అట్టి పరమేశ్వరుడవయిన నీకు నా సాష్టాంగ దండప్రణామము అర్పించుచున్నాను.

ఓ దివ్యనృసింహస్వామీ ! నీ భక్తుల పాపసంఘములను హతమార్చుచున్నావు. నీ పాదములను ఆశ్రయించినవారికి కరుణాబ్ధిసింహుడవు. బ్రహ్మాండమంతయు నీ పాదాబ్జములచే సంఘట్ట విఘట్టమాన మగుచున్నది. నీ జూలు కంపించుటవలన భక్తుల పాపసమూహము చెల్లాచెదురగుచున్నది. నీ ప్రచండాట్టహాసధ్వనిచే మేఘఘోషకూడ తిరస్కరింపబడు చున్నది. త్రిలోకగర్భుడవగు నీకు నా వందనములు.



ఓ విష్ణుస్వరూప ! దీనానుకంపీ ! అనాథుడవగు నన్ను రక్షింపుము. నీ పాదపద్మములకు నా నమస్కృతము అర్పించుచున్నాను.

ఓ మురారి ! నిన్ను సేవించుటచే నాదేహము సంసార కారాగారమున బంధింపబడకుండును.

ఓ ప్రభూ ! నేను సహస్రాశ్వమేధముల నాచరించిన వెంటనే నా చర్మచక్షువులతో నిన్ను నీ దివ్య నిజస్వరూపమును చూచుటకు నన్ననుగ్రహింపుము.

నా క్రతుసహస్రసమాప్తి నిర్విఘ్నముగా జరుగుటకు నన్నాశీర్వదింపుము.

ఓ యజ్ఞేశ ! నీ సాన్నిధ్యము నాకు ప్రాప్తించుటకు నన్నాదరింపుము.

ప్రభూ ! నా పాపరాశి క్షీణించుటకు, ధర్మార్థకామములు కరతలామలకములగుటకు మోక్షప్రాప్తికి నరులు నిన్నాశ్రయించి స్తుతించుచున్నారు' అని ఇంద్రద్యుమ్న భూపతి చిత్తశుద్ధితో దివ్య నృసింహుని నుతించి అతని పాదపద్మములకు పదేపదే సాష్టాంగ దండ ప్రణామము లాచరించెను.

4. జైమినిమహర్షి మునులకు నృసింహక్షేత్ర ప్రభావమును తెల్పుట :

'ఓ మునీశ్వరులారా ! పూర్వము బ్రహ్మ ఇంద్రద్యుమ్నుని అనుగ్రహించుటకు సర్వలోక హితమునకు నృసింహ క్షేత్రమును నిర్మించెను. శివునితో కలిసియున్న అట్టి నృసింహస్వామిని సందర్శించినవారికి మనోవాంఛలు తీరి పునర్జన్మరాహిత్యము కలుగును;

ఇంద్రద్యుమ్నుడొనర్చిన శ్రీ నృసింహస్తుతిని పఠించినవారికి సర్వ కామ ప్రదుడయిన దివ్య సింహ స్వరూపుడు ముక్తి నొసంగును.

బ్రహ్మసుతుడైన నారదమహర్షి జ్యేష్ఠమాస శుక్లపక్షమున స్వాతీ నక్షత్ర సంయుత ద్వాదశీ తిథియందు నృసింహస్వామి విగ్రహమును ప్రతిష్ఠించెను. అట్టి స్వామి దర్శనముచేసిన వారికి సంపూర్ణముగ సహస్రాశ్వమేధ ఫలితము లభించును.

శ్రీ నృసింహస్వామికి పంచామృతములతో, క్షీరముతోగాని నారికేళజలముతోగాని సుగంధముతోగాని స్నానము చేయింపవలెను.

శ్రీ నృసింహస్వామి విగ్రహమును జపాకుసుమ మాలలతో, సుగంధ మాల్యములతో అలంకరించి ధూపదీప కర్పూర నీరాజనముతో పూజించి షడ్రసోపేత నైవేద్య మర్పించి, పరిమళద్రవ్యోపేత తాంబూల మొసగి మృదుమధుర పదకీర్తనములతో వాద్యసంగీతముతో స్తుతించి ఉచ్చైఃస్వరములతో జయజయ శబ్దోచ్చారణము గావించి ప్రదక్షిణ నమస్కారము లాచరించి, దాన ధర్మ కర్మ

లొనర్చి బ్రాహ్మణ సంతర్పణములు చేసి, నరసింహస్వామిని సంతృప్తిపరచువానికి బ్రహ్మలోక నివాసము ప్రాప్తించును.

వైశాఖమాస చతుర్దశినాడు అనిల నక్షత్రయుక్త శనివాసరమున ప్రదోష సమయమునందు నృసింహస్వామియొక్క అవతారము జరిగినది. అట్టి సమయమునందు సమాహితచిత్తుడైన భక్తుడు నరసింహుని పూజించినవానికి అనేక కోటి జన్మములం దార్జించిన పాపరాశి అగ్నిచే దహింపబడు దూదివలెనే ఆ క్షణమునందే దహింపబడును.

శ్రీ నృసింహస్వామిని సందర్శించి, స్పృశించి వాని దివ్య పాదపద్మము లకు నమస్కరించి వాని దివ్య మహిమలను కీర్తించి సాష్టాంగ దండప్రణామ మాచరించిన భక్తుడు పొర విడిచిన పామువలె, సర్వపాప విముక్తు డగును. అట్టి భక్తునకు వ్యాధులు శోకము మానసిక వ్యథ కలుగవు. అతనికి అన్ని కోరికలు తీరి హయమేధ ఫలము సమకూరును.

ఓ విప్రులారా! ఆ నృసింహస్వామి సన్నిధిని యజ్ఞము దానము ఇతర పుణ్యకార్యములు అప్పుడప్పుడు చేసినను అవి కోటి గుణితము లగును. వాని ఫలితములు శ్రీ నృసింహుని కరుణచే అనంతములై భక్తులకు ఐహికాముష్మిక సుఖములు చేకూర్చును' అని జైమిని ద్విజులకు చెప్పెను.

## 17వ అధ్యాయము

1. నారదమహర్షి నారసింహుని విగ్రహమును ప్రతిష్ఠించిన పిమ్మట ఇంద్రద్యుమ్న నృపతి విధినిర్వహణము :

నారదుడు పవిత్ర క్షేత్రమున శ్రీ నృసింహస్వామి విగ్రహమును ప్రతిష్ఠించిన తరువాత ఇంద్రద్యుమ్న మహారాజు మొట్టమొదట ఇంద్రాది సర్వ దేవతలను ఆహ్వానించి తరువాత వేలకొలది ఋషులను విప్రులను షడంగవేద క్రమముతో చతుర్వేదములను అధ్యయనము చేసిన శ్రోత్రియులను యజ్ఞవిద్య లలో కుశలు లయిన పండితులను మీమాంసాశాస్త్రకోవిదులను భాష్యసహిత కల్పసూత్రానుసారముగ సత్కర్మ లాచరించినవారిని, అష్టాదశ విద్యలయందు ప్రవీణులయినవారిని ధర్మకోవిదులను సదాచారసంపన్నులను సత్కులసంజాతు లను సత్యవాక్య పరిపాలకులను—ముఖ్యముగా వైష్ణవులను—సాదరముగా గౌరవపురస్సరముగా ఆహ్వానించెను. మరియు ముల్లోకములందలి రాజులు సిద్ధ పురుషులు సప్తర్షులు ద్విజులు ఉత్తమ వైశ్య శూద్రులు ద్వీప ప్రభువులు పిలువ బడిరి.



ఇంద్రద్యుమ్న నృపతి రెండు కోసుల విస్తీర్ణముగల మనోహర ప్రదేశములో సభ జరిపెను. ఆ సభామండపము పాషాణములతో ఎత్తుగా కట్టబడి సున్నము పూయబడినది. ఆ సభాస్థలిలో కొంత ప్రదేశము రత్నములతో మరికొంత ప్రదేశము బంగారముతోడను నిర్మింపబడినది. అందు ఉచితరీతిని కొంతభాగము స్ఫటిక మయముగ మరికొంత భాగము రజత మయముగ రూపొందింప బడినది. అందలి ఎత్తైన రత్నమయ స్తంభములు దుకూల పరివేష్టితములయి కన్నుల పండుగగా నున్నవి. అక్కడ కిటికీలు సుగంధ మాలలతో ముత్యాలహారములతో చామరములతో చారుచంద్రకాంతితో అలరారుచున్నవి. ఆ కిటికీలకు వ్రేలాడగట్టిన వట్టివేళ్ళతో అల్లిన చాపలు చందనాది జలములతో తడపబడి చల్లదనము నిచ్చు చున్నవి. ఆ సభాభవనము దరినున్న ఉద్యానవనము నానాఋతువులలో పూచిన పూవులతో నయనానందకరముగా నున్నది.

అచటి దిగుడు బావులకు స్ఫటిక సోపానములు నిర్మింపబడినవి. ఆ బావు లలో పద్మ కల్హారములు శోభాయమానముగా నున్నవి. వానిలోని తెప్పలు చక్రవాకములు హంసలు సారసపక్షులు స్వేచ్ఛగా సంచరించుచున్నవి. స్వచ్ఛమై శీతలమగు సుగంధ మధుర జలముతో నిండిన ఆ దిగుడుబావులలో వందలకొలది పక్షులు సుఖముగా విహరించుచున్నవి. ఆ దిగుడుబావులలో అంతటను నీడగా నుండుటకు చేసిన ఏర్పాటు ప్రకృతిరామణీయకముగా నున్నది.

యజ్ఞశాలలోని పూతవాయువువలెనే విశ్వకర్మ నిర్మితమైన సభాభవనము కూడ ఇంద్రద్యుమ్న నృపతికి పరమ పవిత్రమైనదయ్యెను.

ఇంద్రద్యుమ్నుని సభలో శుభదినమున రాజులు సింహాసనములపై ఋషులు ఉన్నతాసనములపై సిద్ధపురుషులు బ్రహ్మర్షిగణము అమూల్యమైన కంబళములపై దేవతలు కాంచనపీఠములపై ఉపవిష్టులైరి. ద్విజులు ఉచితాసనములపై కొందరు ఉత్తమాసనములయందు మరికొందరు ఆదేశానుసారముగ సుఖముగా కూర్చుండిరి.

ఆ సభలో ఇంద్రద్యుమ్నుడు ఋషి నృప ద్విజుల నడుమ త్రిలోకాధిపతి యగు దేవేంద్రుని ఉచిత సింహాసనముపై ఆసీనుని జేసి పురోహితునితోకూడ అతనికి సవినయముగ సుగంధ దివ్యవస్త్రముల నర్పించి యథావిధిగ పూజించుట మహేంద్రునకెంతయో ఆశ్చర్యము కలిగించెను.

తరువాత సిద్ధపురుషులను దేవతలను మునులను ఆ నృపతి గౌరవించుటను చూచిన మహాధనవంతుడగు కుబేరునకును విస్మయజనకమయ్యెను.

పిమ్మట ఆ మహీనాథుడు స్వయంసంపన్నులైన దేవతలను సకలోపచార ములతో పూజించెను. ఆ సమయమున భూపతులు నిజముగా రాజ్యప్రాప్తి కల్గినట్లు సంతసించిరి. మరల వైష్ణవులను తీసికొనివచ్చి ఉపచారము లొనర్చి అర్చించెను.

వారు సహజముగా శాంతచిత్తులైనను ఇంద్రియాధీను లయినట్లు తలంచిరి. సత్త్వ గుణప్రధానుడయిన ఇంద్రద్యుమ్న మహీపతి పిమ్మట మునులను విప్రులను క్షత్రియులను బాగుగా గౌరవించెను. అతడు ఇతరులను సన్మానించుటకు సచివులను నియోగించెను. ఆ రాజు చేతులు జోడించి అందరికి నమస్కరించు చున్నట్లు కానవచ్చెను.

2. ఇంద్రద్యుమ్నుడు క్రతు ఫలమునకై ఇంద్రుని ప్రార్థించుట :

ఇంద్రద్యుమ్నుడు నారదపురోహిత సహితుడై ఉన్నతాసన స్థితుడైన దేవేంద్రుని సమీపించి ముకుళితహస్తుడై —

'ఓ దేవేశ ! నీవే క్రతువులకు ఈశ్వరుడవు. నేను అశ్వమేధయాగము చేసి యజ్ఞపూరుషుని గాంచుటకు అనుగ్రహింపుము. ముల్లోకములయందుండు వారందరు నీ యాజ్ఞను పాలించువారే. ఓ ప్రభూ ! నేను వేయి అశ్వమేధ యాగములను చేయునంతవరకు నీవు దేవతలతోకూడ సభామధ్యమున ఉండుము.

ఓ మహేంద్ర ! నీ ఇంద్రపదవిని ఆశించి నేను యాగమును సంకల్పించుట లేదు. ఓ ప్రభూ ! సర్వులమనోవృత్తిని నీవు సర్వదా తెలిసికొనుచున్నావు. మాకు మాధవుడు శరీరధారియై ఇట మున్ను కానవచ్చియున్నాడు. ఆ స్వామి ఉపావనము నందు వాలుకలతోకూడ తిరోధానుడయ్యెను.

ఓ దేవేంద్ర ! బ్రహ్మశాసనమువలన ఆ మాధవుడు మరల ఇచట సర్వులకు కానవచ్చుటకు సహస్రాశ్వమేధ యాగములను చేయుదును. ఆ భగవంతుడు మరల ఇట ప్రకాశించినచో శ్రేయస్సు కలుగును' అని ఇంద్రద్యుమ్నుడు చెప్పగా ఇంద్రాదులు సంతసించి అశరీరమైన సరస్వతి పలికిన వాక్యములను స్మరించుచు వారిట్లనిరి—

3. ఇంద్రాదులు ఇంద్రద్యుమ్నుని సహస్రాశ్వమేధ క్రతువులను చేయుమని ప్రోత్సహించుట :

'ఓ ఇంద్రద్యుమ్న మహారాజా ! భూలోకములో నీవు సత్యవ్రతుడవు. ఇది సత్యము. నీవు చేయబోవు కార్యమును మేము పూర్వమే తలంచితిమి. త్రైలోక్య పావనమయిన ఈ కార్యమున నీకు తోడ్పడుదుము.

జగత్స్రష్ట అయిన బ్రహ్మ ఈ కార్యము విషయమై వ్యయముగా ఉద్యుక్తుడై ఉన్నాడు. ఈ భూతలమందే భగవంతుడు బ్రహ్మ కరుణవలన మరల ప్రకాశ మును పొందుటకు దారుదేహమును దాల్చునని మాకు భగవంతుని వలననే తెలిసినది.



ఓ రాజా ! ఈ లోకోపకారకమైన కార్యము విషయమై మాకును దేవేంద్రు డును కూడ ఇష్టమే. మాచే అజ్ఞాపింపబడిన కార్యము నీకును మాకును శ్రేయో దాయకము ప్రీతికారక మగుచున్నది.

ఓరాజేంద్ర ! భక్తాభీష్టప్రదుడైన వైకుంఠుని అనుగ్రహమునకై సుఖము గా సహస్రహయమేధక్రతువును చేయుము. భక్తవత్సలుడైన భగవంతుడు మాకు పరారాధ్యుడు. మేము దేవత్వమును విడిచి దైవభక్తిపరాయణులమై ఈ క్షేత్ర మందు వరరూపములతో మాధవుని ఆరాధించెదము. మానవలోకమునందు ఆచరింపబడు ఉత్తమకర్మము సత్వరముగ సత్ఫలితము నీయగలదు అని ఇంద్రాదులు ఇంద్రద్యుమ్నునితో అనిరి.

4. ఇంద్రద్యుమ్నుడు ప్రారంభించిన క్రతువిధానమును జైమిని మహర్షులకు తెల్పుట :

ఓ మునులారా ! దేవేంద్రుడు దేవతలు అట్లు చెప్పగా విని సంతుష్టాంత రంగుడై శ్రద్ధతో ఇంద్రద్యుమ్నుడు భగవంతుని పూజించెను. అతడు పితృ గణమును ఆరాధించెను. అతని గృహమునకు ఆహూతులై ఏతెంచిన సద్వి ప్రులును, సమలంకృతులయిన యాజ్ఞికులును, అగ్నిహోత్రమును హోమమున కు సిద్ధము చేసిరి. రాజు ఇష్టదేవ తయినవిష్ణువు యొక్క ప్రతిమను అక్కడ పెట్టెను. స్వస్తివాచనము ప్రారంభముకాగా నిర్ణయింపబడిన లగ్నమునకు ముందుగా ఆ సత్కార్యమునకు అవసరమయిన సామగ్రిని పురోహితుడు సిద్ధము చేసెను. ఇంద్రద్యుమ్నుడు శుభప్రదమగు వస్త్రధారణమును గావించి సపత్నీ కుడై కూర్చుండి పురోహితుని పుణ్యాహవాచనమును, వృద్ధికర్మను ప్రారంభింపు మని కోరెను.

పిమ్మట ఋత్విక్కులు సపత్నీకుడు ధర్మపత్నీసహితుడైనరాజు చుట్టు కూర్చున్నవారై సభ్యుల కోరికపైని అతని క్రతుదీక్ష శుభప్రదము జయప్రద మగుటకై కార్యక్రమము నారంభించిరి.

వారు ప్రజ్వరిల్లుచున్న త్రేతాగ్నికి నమస్కరించి త్రైలోక్య మంగళకరము, విష్ణ్వంశయుతము, సర్వాంగములయందు శుభలక్షణసంయుతమయిన అశ్వ మును సంప్రోక్షణముచేసి అభిమంత్రించి దృగీశ్వరులను అనుమతించి యాగా శ్వమును విడిచిపెట్టిరి.

పిమ్మట దీక్ష వహించిన ఇంద్రద్యుమ్నుడు వాగ్మియై రౌరవచర్మముపైని ఆసీనుడై సభామధ్యమున మృత్యుంజయుని వలె నుండెను.

ఆహూతులయిన వారందరికి భోజనము పెట్టుటకు సిద్ధముగానున్న వారికి రాజు నేత్రసంజ్ఞతో ఆజ్ఞాపించెను. దేవతలు భుజించుటకు రత్నపాత్రములు,

ముములకు, మహీపతులకు సౌవర్ణపాత్రమును, ద్విజులకు ప్రతిదినము నూతన పాత్రములను, క్షత్రియులకు రజత పాత్రములను, శూద్రులకు కంచుపాత్రములను రాజాజ్ఞచే మంత్రులు చేయించినవి భోజనశాలలో అమర్చబడినవి. ప్రతిదినము క్రతువునకు వచ్చినవారి భోజనానంతరము భోజనపాత్రలు నిర్ణీతస్థలములలో ఉచ్ఛిష్టపత్రముల వలెనె పారవేయబడుచుండెను.

యజ్ఞోత్సవములో పాల్గొనిన ఆహూతులతో పాటు వారి పుత్రులు, పౌత్రులు, ప్రపౌత్రులు, పరివారమంతటికూడ రాజాజ్ఞచే వడ్డింపబడిన పంచరసాన్నములను బహుమానపురస్సరముగా తృప్తిగా భుజించుచుండిరి. వారందరు క్రతువు జరుగుచున్నంతకాలము అచట ఒక కుటుంబమువలె మసలు చుండిరి. ఆ దేశ ప్రజలకు అధిష్ఠాతగా రాజులకు సంధాతగా ఒక నృపుడు ఇంద్రద్యుమ్నుని ఆజ్ఞచే నియమింపబడెను. పరోపకారపరాయణుడయిన నారదమహర్షి సమదర్శిగా ఉండెను. క్రతువు జయప్రదముగా పరిసమాప్తమగుటకు ఇంద్రాదులకు, సురప్రముఖులకు, దేవర్షులకు ఇంద్రద్యుమ్న మహారాజు స్వయముగ పరిచర్యలు చేసెను.

మానవులకు రెండు రకములయిన షడ్విధాన్నపానములు తయారు చేయబడుచుండెను. దేవతలభోజనమునకు మంత్ర తంత్ర విశారదు లయిన మనుజులు, మానవులభోజనములకు పాకశాస్త్రనిపుణులయిన జనులు భోజనపదార్థములను తయారుచేయుచుండిరి. దివిజులకు అమృతమే ఆహారము కావున వారు క్షుత్పిపాసల నెరుగరు. వారికి ఆక్రతు సమయమున వడ్డించిన భోజనము అపూర్వమగుటచే ఆశ్చర్యమును కలిగించెను. ఇంద్రద్యుమ్న మహారాజప్రాసాదమునందు సామాన్య మానవులకు భోజనప్రాప్తి కలుగదు. ఆ క్రతు సమయమున ఇంద్రునకు, ఇంద్రద్యుమ్నునకు కూడ విశేషముగా తోచుచున్నది.

భోజనమునకై తయారుచేసిన వంటకములలో నూతనత్వము ఆశ్చర్యానంద ముగ్ధులను గావించుచున్నది. ఆహ్వానితులపట్ల చూపబడుచున్న ఆదర సమ్మానములు వారికి ఆనందజనకముగా నుండెను. భోజన పదార్థములు పరస్పర స్పర్థతో ఉత్సాహముతో ఎక్కువరుచిగా చేయబడున్నవి.

సుగంధపుష్పమాల్యకస్తూర్యాది ప్రలేపనము, చిత్ర సూక్ష్మదుకూలములు, హృద్యము లయిన ఆసనములు, రత్నపల్యంకము గల శయ్య జాతీలవంగ కర్పూర తాంబూలము, ఆహ్వానితులకు ఆదరపాత్రమును అనుభవయోగ్యము లయినవి.

భరతముని సంప్రదాయానుసారముగ సుశిక్షితులయిన పండితుల రచనలు మనోహరములైన వివిధనృత్యములు, గీతములు, సూతమాగధులు సభాసదులు వంశకీర్తిని మనోరంజకముగా స్తుతించుట, కర్ణ నయనానందకరములై మానవులనేకాక అచటి దేవతలను గూడ సంతోషపరిచినవి.



ఒకచోటనున్న చిత్రములు మరియొక చోట గల చిత్రములకు తీసి ముగా లేవు. పాతాళలోకవాసులకుగూడ ఆక్రతుకాలమునకు పెట్టిన భోజనములు అమృతముకంటె అధికముగ తృప్తిని కల్గించుటచే తమ లోకమునకు మరలిపోవుటకు అంగీకరింపరైరి.

పాతాళలోకములో రత్నౌఘములవలె కానవచ్చు పురములుండుటచే ఆలోకము నుండి వచ్చినవారికి రవికాంతి కానరాని అట్టి నగరమునందే ఇంద్రద్యుమ్నుడు బసలు ఏర్పరచెను.

దివిజులు సుఖాసీను లగుచు క్రీడించుచు సంతోషముతో భుజించుచు శయనించుచున్నారు. వారికి ఎచ్చటను భూస్పర్శ లేకుండుట వింతగా ఉన్నది. ఇంద్రద్యుమ్నునిపురము స్వర్గము కంటె మనోహరముగా, సుఖదాయకముగా ఉండుటచే స్వేచ్ఛగా దేవతలు విహరించుచు వినోదక్రీడలు సల్పుచు భూలోకమును విడువకున్నారు. వారికి స్వర్గలోకములో కోరినపుడే సుఖము కల్గును. ఇంద్రద్యుమ్నుని పట్టణములో అభిలషింపక పోయినను సర్వత్రసుఖము ప్రాప్తించు చున్నది.

ఆదరగౌరవములతో ఆహ్వానితులయినవారు. భోజనాదులు చేయుచు ఆనందముగా ఉన్నారు. ఏ లోకము నుండి వచ్చినవా రయినను యాచింపనక్కర లేదు. కోరినవస్తువులు లభ్యమగుచున్నందున పరాఙ్ముఖులు కాలేదు.

రాజాధిరాజుల ప్రాసాదములలో క్రతుసందర్శనాభిలాషతో వచ్చినవారు స్వగృహములలో సంచరించునట్లు స్వేచ్ఛగా మెలగుచున్నారు. ఆ క్రతు సందర్భమున వారికి లభించిన ఇష్టవస్తువులు సుఖానుభూతి స్వగృహముల యందు సర్వదా ప్రాప్తించుటలేదు. కోరికకు మించిన ఏ వస్తువయినను అక్కడ సులభముగా ఎక్కువగా లభించుచుండెను. ఈవిధముగా యజ్ఞేశ్వరుని ప్రీతికై ఆనందప్రదముగా యజ్ఞము జరుగుచుండగా భూమిపైని వస్తుజాలము వ్యయమయినను స్వర్ణవృష్టి కురియుటచే మరల వృద్ధి సర్వసంపద్యుక్త మయ్యెను. ఇట్లు ఇంద్రద్యుమ్నుడు త్రైలోక్యవాసులకు ప్రతిదినము దానసమ్మానభోజనములను యథావిధిగా ఏర్పాటుచేయుట వలన జనులు పరస్పరము అశ్వమేధయాగమును గూర్చి అన్ని లోకములలో గానము చేయసాగిరి. బ్రహ్మచేతసుప్రేరితుడైశాస్త్రప్రకారము రాజర్షియైన ఇంద్రద్యుమ్నుడు చేయుచున్న యాగము యాగసంభారము. 'న భూతో న భవిష్యతి' అని ప్రజలు చెప్పుకొనుచున్నారు. అక్కడ యాచకులు లేరు. దాతలు కానివారును లేరు. దేవతలకు కూడ అచట ఆశాభంగము కలుగలేదు. అపుడు ఇంద్రద్యుమ్నుని పవిత్రక్రతువు సకల సమృద్ధితో జరుపబడినది. అశ్వమేధయాగము క్రమక్రమముగా శ్రద్ధతో సుసంపన్న మయ్యెను.

స్మృతికారులు, కల్పకారులు, శాస్త్రప్రణేతలు, సదాచారావతంసకులు, యజ్ఞానుష్ఠానకుశలులు. అగ్న్యాధానము మొదలు క్రతువు ముగిసిన పిమ్మట అవభృథపర్యంతము సక్రమముగా చేయించుటలో వారు దక్షులు. యాగకర్త అయిన ఇంద్రద్యుమ్నునికి అనుకూలముగ, సదస్యులకు సమ్మతముగ ఋత్విక్కులు క్రతు కార్యక్రమములు నిర్విఘ్నముగ జయప్రదముగ పరిసమాప్త మగుటకు సహాకరించుచుండిరి.

ఋత్విక్కులు ఉచ్చరించు మంత్రములకు స్వరలోపము గాని వర్ణ లోపము గాని ఏ సందర్భమునను కలుగలేదు.

ఎవరు విధి విధాతలో వారే కర్మప్రచారకులగుటవలనను, ప్రాయశ్చిత్త నిబంధనావళిని పాటించుటవలనను, ఆ యాగములో కర్మోపఘాతము కలుగు ప్రసక్తియే లేదు. యోగులే కర్మయోగులు. దివ్యులయిన సప్తర్షులే సదస్యులై క్రతువునకు సాక్షులుగా వ్యవహరించుచు యాగకర్మలను ప్రచారము చేయుచున్నారు. యాజ్ఞవల్క్యాది మునులే ఋత్విజులు. ఇంద్రద్యుమ్నుని సభలోని మునులు పరస్పరము కథాకథనము చేయుట, వాకోవాక్యములను, గుహ్యోపనిషత్తులను ప్రవచించుట, విప్రులు విష్ణుభక్తితత్పరులై పౌరాణికగాథలను చెప్పుట, సర్వకల్మషాపహారములయిన హరిచరిత్రములను వినిపించుట, సదస్యులకు పరమానందజనకముగా నున్నవి. ఆ రాజుచేయుచున్న క్రతువులో అగ్నుల మధ్యనున్న ఋత్విక్కులు ప్రత్యక్షముగా హవిస్సును భక్షించిరి.

ఆ అశ్వమేధక్రతువులో పాల్గొని సంతసించిన మహేంద్ర ప్రముఖులైన త్రిదశులు చిరకాలము ప్రవాసము చేయుచున్నను అమరావతిని స్మరింపరైరి. పూర్వము బ్రహ్మచే దేవతలకు అమృతమే హవిస్సుగా కల్పింపబడినది. దానిని సేవించిన సురలు ఆనందించినవారై వీర్యవంతులు చిరాయుష్మంతులైరి. ఇంద్రద్యుమ్నుడు యాగానుష్ఠాన మొనర్చుచున్నను, ఇతర భోగములను కూడ సమకూర్చుటచే వాని సన్నిధిని దేవతలు అనుభవించుచుండిరి. పాతాళలోకవాసులైన నాగరాజులు కూడ ఇంద్రద్యుమ్నుని క్రతువును చూచుటకై వచ్చి మర్త్యలోకము నందలి భోగములను అనుభవింపసాగిరి. తమ పాతాళలోకమునకు మరలిపోవుటకు వారెంతమాత్రము ఇష్టపడకుండిరి. ఇట్లు త్రిలోకనివాసులకు ఇంద్రద్యుమ్నుని యాగము ప్రీతిపాత్ర మయ్యెను.

పురుషోత్తమక్షేత్రము నందలి జగన్నాథుని యనుగ్రహమును పొందుటకై ఇంద్రద్యుమ్న నృపతి బ్రహ్మదేవుని యాజ్ఞానుసారముగ ఒనర్చుచున్న యజ్ఞము వలన అతనికేకాక సర్వలోకనివాసులకును ఆనందలబ్ధిచేకూరుటయే విశేషము.

ఇంద్రద్యుమ్నుడు బ్రహ్మచెప్పిన ప్రకారము సక్రమముగా యథావిధిగా సహస్ర హయమేధములకు ఒకటి తక్కువగా చేసెను. పిమ్మట సాహస్రిక



మేధ యజ్ఞము నొనర్చుచున్న ఇంద్రద్యుమ్నమహీపతికి ప్రతిదినమున గతి కల్గుచుండెను.

ఇంద్రద్యుమ్నుడు సోమపానము చేసిన అనంతరము సప్తదివసములు గడచిన రాత్రి యందు నాల్గవ జామున అవ్యయుడయిన విష్ణువును ధ్యానించెను.

ఆ రాజు మహాభాగ్యవశమున ఆధ్యాన సమయమున స్ఫటిక నిర్మితమైన శ్వేతద్వీపమును దానిని అన్నివైపుల చుట్టుముట్టిన క్షీరసాగరమును ప్రత్యక్షముగా అవలోకించెను. ఆ ద్వీపము నందలి మహాకల్పద్రుమముల సుగంధము పుష్పపరిమళము దిగంతములలో కూడ వ్యాపించినవి. అటనున్న ఫల పల్లవ వల్కలములలోపల పైని స్వచ్ఛమైన శంఖచక్ర చిహ్నము అలంకార ప్రాయములై యొప్పుచున్నవి. ఆ ద్వీపమధ్యమున దివ్యమణులతో మండపము నిర్మింపబడినది. సురారి మూర్తులు అరుణవర్ణముతో అలరారుచున్నవి. అందలి రత్నసింహాసనము మధ్యందిన భాస్కరుని వలె భాసించుచున్నది. ఆ శ్వేతద్వీపము క్షీరాబ్ధిశీతకల్లోలమంద వాతముచే మనోహరముగా నున్నది, దాని మధ్యభాగమున శంఖచక్రగదాధరుడు, నీలజీమూత సంకాశుడు, వనమాలా విభూషితుడు, సర్వలావణ్య నిలయుడు, సౌందర్య శ్రీనికేతనుడు, దివ్య భూషణోపేతుడు అయిన శ్రీహరిని ఇంద్రద్యుమ్నుడు చూచెను.

అచట ఆ హరికి దక్షిణపార్శ్వమున పర్వతమున్నది. అది కోటిచంద్ర ప్రతీకాశమై హిమాద్రివద్ధవళ ప్రభతో వెలుగొందుచున్నది.

ఆదిశేషుని ఫణాముకుటములు విస్తరించిన ఛత్రము వలె మనోహరముగా నున్నవి. శ్రీహరి మణికుండలయుగ్మమును చారుపీతకర్ణాభరణమును ధరించెను. స్ఫురించుచున్న హరి బాహుచతుష్టయము హలలాంగల శంఖాదులతోడను, హార కేయూరవలయ ముద్రికలతోడను అలంకరింపబడియున్నది.

ఇంద్రద్యుమ్నుడు శ్వేతద్వీపము నందు ధ్యానసమయమునందు గాంచిన శ్రీవిష్ణువుయొక్క కటిప్రదేశమునగల మేఖల దివ్యరత్నకాంతులతో విరాజిల్లుచుండెను. అతని దివ్యసుందరమూర్తి మందహాసము సునేత్రములు మనోహరముగా నున్నవి. అప్పుడు ఆదివిష్ణువునకు దక్షిణపార్శ్వమున శుభలక్షణ లక్షితమైన లక్ష్మీదేవి, వరాభయాబ్జహస్తయై పద్మాసనస్థితయై అద్భుతాకర్షణీయ విగ్రహమై శోభిల్లెను. ఇంద్రద్యుమ్నుడు ఆ హరి సన్నిధిని కృతాంజలియైన బ్రహ్మను గూడ చూచెను. నానామణిభూషితమైన చక్రము హరి వామభాగమున నుండెను. రాజు జగద్గురువు, జగన్నాథుడయిన విష్ణువును సనకాది మునీంద్రులు స్తుతించుచుండగా చూచి ఆనందించెను.

జ్యోతిర్మయము, అదృష్టపూర్వ మయిన శ్రీహరి దివ్యరూపమును ధ్యానస్థు

డయిన నృపతి హర్ష గద్గదవాక్కులతో ఇట్లు స్తుతించెను' అని జైమిని మునులతో అనెను.

5. ఇంద్రద్యుమ్నుడు ధ్యానావస్థలో చూచిన శ్రీహరిని స్తుతించుట :

'ఓ జగదాధార ! జగదాత్మస్వరూప ! కైవల్యప్రద ! త్రిగుణాతీత ! గుణాంజన ! శుద్ధనిర్మల జ్ఞానస్వరూప ! శబ్దబ్రహ్మాభిధాన ! జగద్రూప ! సంసారపతితక్రాంతదుఃఖధ్వంస ! దుర్భేద్యహృదయగ్రంథిభేదక ! చతుర్దశ భువనాగార మూలస్తంభ ! బ్రహ్మాండకోటి ఘటనాశిల్పిశేఖర ! చక్రీకరుణామృతసాగర ! సుధాధామ ! దీనోద్ధారక ! తేజస్స్వరూప ! నాదబ్రహ్మస్వరూప ! అంతఃపాపానల ! పావక ! పరమపవిత్ర ! గరిష్ఠ ! వరిష్ఠ ! ద్రాఘిష్ఠ ! నేదిష్ఠ ! దవిష్ఠ ! క్షోదిష్ఠ ! వరేణ్య ! సుపూజ్య ! నారాయణ ! జగన్నాథ ! దీనబాంధవ ! నీకు నమస్కారము. నన్ను రక్షింపుము. భవసాగరమును దాటలేక సుఖప్రదమగు నావ యగు నిన్నుచేరితిని.

ఓ రమానాథ ! నిన్ను జూచినంతనే నా క్లేశమంతయు పోయినది. ఓ చిదానందస్వరూప ! నిన్ను గాంచినవారికి దుఃఖసంక్షయము కల్గును. పరమానందదాయక ! దీనచేతస్కుడను, భవసాగరమగ్నుడ నగు నన్ను రక్షింపుము, రక్షింపుము.

ఆకాశమున మధ్యాహ్నమందు భాస్కరుడు దీపించుచుండగా, చీకటివలె, నీ పాదసన్నిధి నున్న నా దుఃఖరాశి పటాపంచమగును' అని రాజు శ్రీహరిని స్తుతించెను.

ధ్యానస్థితుడైన రాజు జగదీశ్వరుని స్తుతించి ప్రణమిల్లి ధ్యానావసానమున మరల మేల్కొనెను. ఇంద్రద్యుమ్నుడు స్వప్నాంతమున తన్ను తానే స్మరించుకొనెను.

నృపశ్రేష్ఠుడు అత్యద్భుతమైన స్వప్నానంతరము, హయమేధ క్రతువు వలన తాను కృతార్థుడనైతినని తలంచెను. సహస్ర హయమేధ యాగములు సఫలమైనట్లును, తనకు హరి కరుణ కల్గినట్లును రాజు సంతసించెను. దేవర్షియైన నారదుని వచనము ఎన్నడును వ్యర్థము కాదు.

ఇట జగన్నాథుడు నాకెట్లు ప్రత్యక్షము కాగలడని నరపతి రాత్రి శేషమును చింతాక్రాంతుడైగడపి నారదునితో తన స్వప్నవృత్తాంతమును చెప్పెను.

6. నారదుడు ఇంద్రద్యుమ్నునకు కల్గిన స్వప్నము శుభసూచక మని ప్రోత్సహించుట :

ఓ నృప ! నీవు విచారింప పనిలేదు. అరుణోదయకాలమున భగవంతుని దర్శించితివి కావున స్వప్నము నీకు పదిదినములలో సత్ఫలము నిచ్చును.



ఓ నృపోత్తమ ! అనాటికి క్రతువు సంపూర్ణ మగును కావున భగవంతుడు తనే ప్రత్యక్షము కాగలడు. పరాపర గురుడగు బ్రహ్మ నా మూలముగ చెప్పినది సత్య మగును. ఆ జగదీశ్వరుడు కూడ నీకు స్వప్నములో కానవచ్చెను. తుది యజ్ఞమును పరిసమాప్తి చేయుము.

ఓ నృపశార్దూల ! హరి సంకల్పము వలన కల్గిన యీ స్వప్నము అగ్రాహ్యము కాదు. అయినను ఇట్టి స్వప్నము భాగ్యవంతునకే కల్గుటలో సందియము లేదు.

## 18వ అధ్యాయము

1. జైమిని మహర్షులతో అవభృథస్నానమును గూర్చి తెల్పుట :

ఓ ద్విజులారా ! ఇంద్రద్యుమ్నుని అశ్వమేధయాగము సోమరసముతో వర్తిల్లెను. ఆ యాగకాలమున ముల్లోకములు ఒకే గృహము కళకళ లాడెను.

శాస్త్రవిషయములు, స్తోత్రములు, స్వర్గలోకమును తాకుచున్న వేదమంత్రముల వర్ణక్రమ సముజ్జ్వలములగు పదస్వరవిన్యాసములు ముజ్జగముల యందు వ్యాపించి వినబడుటచే ఇతర ధ్వనులు తిరోహితములయినవి. యాచకులకు, ఋత్విజులకు, సూతులకు ఆ యాగము కల్పవృక్షసదృశ మయ్యెను. ఆ యాగ విధిప్రకారము అవభృథస్నానము చేయుటకు దక్షిణసాగరము యొక్క తటప్రదేశము నందున్న నీలేశ్వరుని సమీపమున గల రేవు ఉపకరించును.

2. సేవకులు రాజునకు అద్భుతవిషయమును తెల్పుట :

ఓ దేవేశ ! మహాసముద్రము యొక్క తటప్రదేశము నందు ఒక మహావృక్షము కానబడినది. దాని కొమ్మలు సముద్రములో ప్రవేశించినవి. దాని మూలమును సాగర కల్లోలములు తాకుచున్నవి. అరుణవర్ణము గల ఆ వృక్షము నందంతట శంఖచక్ర చిహ్నములు స్నానగృహమునకు సమీపమున నున్న మాకు కానవచ్చినవి. అది మిక్కిలి అద్భుతముగ నున్నది. అట్టి వృక్షమును మేమెన్నడును చూడలేదు. ఆ తరువు ఉదయించుచున్న సూర్యుని వలె ప్రకాశించు చున్నది. ఆ తరువరిమళము తటప్రదేశమందంతటను వ్యాపించెను. ఇయ్యది సామాన్యద్రుమము కాదు. దేవలోక వృక్షము వలె కానవచ్చు చున్నది. కాని ఏదో ఒకటి దివ్యతరురూపమున అవతరించినట్లు తోచుచున్నది' అని ఇంద్రద్యుమ్నునకు సేవకులు ఆందోళనతో విన్నవించిరి.

వెంటనే ఆ అద్భుతవృక్షము వారలకు ఎందులకు దృగ్గోచర మయ్యెనని ఇంద్రద్యుమ్నుడు నారదమునీంద్రుని ప్రశ్నించెను.

### 3. నారదుడు విరుసవృత్తో నరపతికి బదులు చెప్పుట :

ఓ రాజా ! క్రతువు సఫలమగుటకు పూర్ణాహుతి చేయవలెను. మున్ను నీకు స్వప్నమున కానవచ్చిన అదృష్టము ఇపుడు ఫలించుచున్నది. శ్వేతద్వీపమున నీకు స్వప్నమున అవ్యయుడు విశ్వమూర్తి అయిన విష్ణువు కాన వచ్చెను కదా ! అతని శరీరము నుండి జారిన రోమమే వృక్షరూపమును దాల్చినది.

పరమేష్ఠి యొక్క అంశావతారము భూమిపైని చిరకాలముండును. భక్తవత్సలుడయిన భగవంతుడు తద్రూపావతారమును పొందుచున్నాడు. ఆ కానవచ్చిన ద్రుమము అపౌరుషము కావున ఇది అందరికిని చూడశక్యము కాదు.

ఓ నృపసత్తమ ! అట్టి భాగ్యవంతుడు సర్వకల్మషనాశనుడు సర్వలోకము లకు నయనానందకరుడు నీకంటె ఇతరు డెవ్వడుకలడు ? నీవు సముద్రతటమున అవభృథస్నానమును పూర్తిచేసి ఉత్తమమైన ఉత్సవమును చేసి పెద్ద వేదిక యందు సుఖ మంగళప్రదాత, తరుస్వరూపు డయిన యజ్ఞేశ్వరుని ప్రతిష్ఠింపుము' అని నారదుడు ఇంద్రద్యుమ్నునితో పలికెను.

ఈ విధముగా నారదనృపతులు ఆలోచించి, ఆనందించి దివ్యవృక్షము కానవచ్చిన స్థలమున కేగిరి. ఆ పాదపమును గాంచిన వారందరు బ్రహ్మమే ఆ రూపముతో సాక్షాత్కరించినట్లు భావించి, తమ జన్మసాఫల్య మయినట్లు జీవన్ముక్తులైనట్లు సంతసించిరి. భగవత్ప్రియుడైన ఇంద్రద్యుమ్నుడు కూడ తన స్వప్నమున జగన్నాథుని చూచి ఆనందామృతసాగర మగ్నుడైనట్లే ఇపుడును ఆనందించెను.

నృపోత్తముడు చక్షుఃశాఖలతో ఒప్పుచు చతుర్భుజములతో కూడిన ఆ వృక్షమును చూచి తన శ్రమ సఫల మయినట్లు తలంచెను. నీలమణి మాధవుడు మరుగుపడుట వలన రాజునకు కలిగిన దుఃఖము పోయెను.

రాజేంద్రుడు ఆనందాశ్రునయనుడై దేవతావృక్షమునకు పెక్కుసార్లు నమస్కరించి దక్షిణసాగర కల్లోలములచే ఊచబడిన తరువును శంఖ కాహల మురజ ఢక్కాపటహధ్వనులతో గీతవాదిత్ర నినదములతో జయశబ్దములతో ద్విజులచే తెప్పించెను. ఆ సమయమున ఆకాశము నుండి పుష్పవృష్టికురిసెను. యౌవనోన్మత్తలై సుందరాంగు లయిన వేశ్యలు అక్కడకు కృష్ణాగురు మధూ పితము లయిన ధూపపాత్రలతో వచ్చిరి. కొందరు రత్నదండములతో అలరారుచున్న చామరములతో వీచుచుండిరి. దివ్యపట్టదుకూలములతో శోభిల్లుచున్న పతాకలతో మరికొందరు వచ్చిరి. రథాశ్వములు సైన్యము ఆ



తరువును తీసికొనివెళ్లు సమయమున రాజర్షులు సకల రాజులు కూడ వెంట నడచిరి. మాగధులు తరురూపు డయిన శ్రీహరికి నమస్కరించుచుండిరి. సిద్ధులు మాధవుని స్తుతించుచుండిరి. ఆ దివ్యవృక్షరూపధారియైన మాధవుని ఋత్విక్కులు బ్రాహ్మణులు, విద్వాంసులు శ్రోత్రియులు, రాజులు, వైశ్యులు, సత్కులజులు, శూద్రులు పరిచర్య సల్పిరి.

పురాణముల యందు శ్రౌతస్మార్తములందుగల స్తోత్రములచే లోకమున వెలసిన వృక్షరూప విష్ణువును నుతించిరి. ఆ దివ్యపాదపమును పుష్పమాలలతో సుగంధముతో అలంకరించి మహావేదికపై ఉంచిరి. ఇంద్రద్యుమ్నుడు నారదుడు చెప్పినట్లు ఆ తరువును సహస్రోపచారములతో పూజించి పిమ్మట రాజు నారదుని ఎట్టివాడు జగన్నాథుని విగ్రహమును చేయును అని అడిగెను. అచింత్యమహిమాన్వితుడగు మునీంద్రుడు ఆ ప్రశ్నమును విని సర్వలోకోత్తరమగు ఆ హరి చేష్టలను ఎవ్వడెరుగును ? లోకములను సృజించిన అజునకు కూడ ఈ విషయము గోచరము కాదని నారదుడు రాజునకు సమాధానము చెప్పెను.

### అశరీరవాణి నారదాదులు వినుచుండగా భాషించుట :

ఆకాశవాణి 'అపౌరుషేయుడగు భగవంతుడు ఊహాతీతుడై రహస్యముగా నుంచిన వేదిక యందు, ఆతడే స్వయముగా అవతరించును. ఈ వేదికను పదునైదు దినములు ఇతరులు చూచుటకు వీలులేకుండ ఆచ్ఛాదింపవలెను. ఇచటనున్న వృద్ధుడు శస్త్రపాణియగు ఈ వడ్రంగిని వేదికపై ప్రవేశపెట్టి ద్వారమును యత్నపూర్వకముగా బంధింపవలెను. అది మూయబడువరకును బయట వాద్యములను మ్రోగింపవలెను. ఆ ఘటనాశబ్దమును వినువారికి చెనుడు పుట్టి సంతాన నాశనము నరకవాసము సంభవించును. ఆ వేదికలోపలికి ఎవ్వరును పోవుడును వెళ్లి చూడరాదు. అక్కడ నియోగింపబడినవాడు కాక ఇతరుడు ఆ వేదిక లోపలికి చూచినచో వానికి, రాజునకు, రాష్ట్రమునకు మహాభయము, రెండు నేత్రములకు అంధత్వము కలుగును.

కావున జగన్నాథుని విగ్రహ నిర్మాణము పూర్తికాగానే స్వయముగా వెలసిన దేవుడు స్థిరముగానుండి పలుకును" అని విష్ణువే స్వయముగా అశరీరవాక్కుతో చెప్పగా, సర్వలోక సుఖావహమగు కార్యమును ఎటు చేయవలయునో అద్దానిని నారదాదులు, ఆకాశవాణి చెప్పినట్లు చేయనిశ్చయించిరి. ఇంద్రద్యుమ్నుడు కలలో చూచిన భగవంతుని విగ్రహములను అటకు వచ్చిన వృద్ధుడైన వడ్రంగి గురువుతో తయారుచేయుటకు అంగీకరించి, వారందరు చూచుచుండగనే వేదిక లోని అంతర్ధానమయ్యెను.

మాయావంతుడగు నారాయణుడే మనుష్యులను వంచించుటకు వృద్ధుడైన వడ్రంగి వేషముతో అటకు వచ్చెనని నారదాదులు భావించిరి.

## 19 వ అధ్యాయము

### 1. భగవంతుని ఆవిర్భావము :

అటుపిమ్మట ఇంద్రద్యుమ్న మహీపతి అశరీరవాణి పల్కినట్లు చేయనారంభించెను. ఇట్లు ఒక్కొక్క దినము గడుచుచుండగా క్రతుప్రదేశమున దివ్యగంధ పరిమళము, మానవులకు దుర్లభమైన పారిజాతప్రసూనముల వృష్టి, దివ్యసంగీత నాదము, మనోహర గీతములు, సూక్ష్మబిందు సుశోభితమగు ఆకాశగంగ జల వృష్టి, వన్యగజములనుండి దివ్యసుగంధ పరిమళము, సర్వులకు లభ్యముకాని సుఖానుభూతి, యజ్ఞమునకై వచ్చిన దేవతలు, ఆనందముతోనుండుట మొదలయిన మహిమలు, దైవలీలలు సర్వులకు ఆనందాశ్చర్యములు కలిగించెను. అట ఆవిర్భవించిన హరిని చూచి ద్విజులు ఉపాసించిరి. ద్విజులు ఉపాసనాసమయమున పూర్వమున్న మాధవుని విష్ణుకాంచివలె దేవుని దివ్యచిహ్నములను గాంచిరి.

నారదుడు మున్ను తెల్పిన రీతిగా క్రమముగా పదునైదవదినమున భగవంతుడు చతుర్మూర్తియై స్వయముగా అవతరించెను. పూర్వము నారదుడు వర్ణించినట్లే భగవంతుడిపుడు ఆవిర్భవించి యున్నాడు.

### 2. భగవంతుని వర్ణనము :

జనార్దనుడు బలభద్రాసుదర్శనములతో దివ్యసింహాసనస్థుడై శంఖచక్ర గదాపద్మధారియై సన్నగరూపుడై గదాముసలచక్రాబ్జములను ధరించి భద్రాకృతితో నున్న ఫణచ్ఛత్రకముతో కిరీటకుండలములతో ప్రకాశించెను.

చారువదన అగు సుభద్రాదేవి వరాభయహస్తములతో విరాజిల్లుచుండెను. సర్వచైతన్యరూపిణి యగు లక్ష్మీదేవియే ఈ సుభద్రాదేవియై ఆవిర్భవించెను. ఈమె కృష్ణావతారమున రోహిణీగర్భమున జనించినది. బలరూపమును ధ్యానించుటవలన ఈమె బలభద్రాకారమును ధరించెను. ఆమె క్షణకాలమయినను లీలావతారమును విడిచిపెట్టుటకు సహింపదు.

ఏకగర్భ సంజాతులయిన శ్రీకృష్ణ బలరాములకు భేదము లేదు. కాని వ్యవహారము లౌకికమయినది. బలరామునకు సోదరి అనునది పౌరాణికమైన కథ మాత్రమే. విష్ణువు పురుషరూపముతో, లక్ష్మీదేవి స్త్రీరూపముతో సర్వత్ర నివసించుచున్నారు. దేవతిర్యఙ్మనుష్యాదులయందు వారిరువురికంటె పరమయినది లేదు.



అనంతుడు బలనామముతో చతుర్దశభువనములను ఫణాగ్రముచే ధరించు చున్నాడు. అతనియొక్క శక్తిస్వరూపిణి అయిన లక్ష్మియే ఈమె సోదరియై ప్రసిద్ధిపొందినది.

సుదర్శన చక్రము ఎల్లప్పుడు విష్ణుహస్తము నలంకరించి యుండును. అగ్రస్తంభ మధ్యస్థమగు ఆ రూపమే నాల్గవది. ఈ విధముగా ఆ విష్ణువే పవిత్రమగు భగవద్ధ్యానమునందే నాల్గు మూర్తులు ప్రకాశింప చేయబడినవి.

### ఆకాశవాణి ఇంద్రద్యుమ్నునికి విగ్రహములగూర్చి చెప్పుట :

లోకోపకారముకొరకై దివ్యరూపిణి యగు అశరీరవాణి రాజుతో ఇట్లనెను :

'ఓ ఇంద్రద్యుమ్న మహారాజా ! ఈ విగ్రహములను సుదృఢముగా వస్త్రములతో కప్పి చిత్రకారుడు శీఘ్రముగా ఆయా విగ్రహములకు తగిన రంగులు పూయునట్లు చేయుము.

విష్ణువు నీలాభ్రశ్యామల వర్ణుడు. బలరాముడు శంఖేందు ధవళ వర్ణుడు. సుదర్శనచక్రము రక్త వర్ణము. సుభద్ర కుంకుమారుణ.

నానాలంకార రుచిరములై విభజింపబడి వివిధభంగుల నున్న వీనిని దారు స్వరూపముతో చూచినవారికి పాపము సంభవించును. జిగురుపూసిన నారబట్టలతో వస్త్రములతో ఆచ్ఛాదించి శ్రద్ధాభక్తులతో విగ్రహములను గోప్యముగా ఉంచవలెను. కావున మొట్టమొదట ఈ తరువుయొక్క వల్కలములచే కర్మకుశలులైన శిల్పులచే దృఢముగా ఆచ్ఛాదనము చేయింపుము. ముందు పూయబడిన రంగులు తుడిపించి ప్రతి సంవత్సరము క్రొత్తగా విగ్రహములకు రంగులు పూయవలెను. వల్కలలేపమే దివ్యమయినది. సనాతనమైనది. ఎవడయినను ప్రమాదమువలన ఈ లేపమును తుడిచివేసినచో రాష్ట్రములో అధిక దుర్భిక్షము కలుగును. ఆ రంగులు తుడిచినవాని సంతతి నశించును.

ఓ రాజా ! రంగులు పూయబడని విగ్రహములను నీ వెన్నడును చూడకుము. ఎవరు అట్టివానిని చూచినను భీతచిత్తులగుదురు. పెక్కు పూతలు పూసిన రంగులతో ప్రకాశించుచున్న విగ్రహములనే చూడవలయును.

వస్త్రభూషణమాల్యాద్యలంకృతుడు సుందరవర్ణోపేతుడయిన జగన్నాథుని చూచినవాడు కోటి జన్మములం దొనర్చిన పాపములనుండి విముక్తుడగును.

ఓ రాజేంద్ర ! మంచి చిత్రములను చేయింపుము. అట్టి చిత్రములను దర్శించిన భక్తునియొక్క విచిత్రములయిన కోరికలు నెరవేరును. నిన్ననుగ్రహించుటకే భగవంతుడు అవతరించెను.

ఓ రాజా ! నీమూలముగా జగన్నాథుడు అతనిని దర్శించినవారికి ధర్మార్థ కామమోక్షములను ప్రసాదింపగలడు.

నీలాద్రిపైని కల్ప వృక్షమునకు వాయువ్యమూలలో నూరు హస్తములు దూరముగల పవిత్రస్థలములో దృఢమయిన పొడవగు దేవాలయమును/ప్రాసాదమును నిర్మింపుము. కల్పవృక్షమునకు ఉత్తర దిక్కున నరసింహస్వామికి వేయికరములు పొడవుగల దేవాలయమును కట్టించి ప్రతిష్ఠించి అచటనే ఈ మాధవుని నెలకొల్పుము.

పూర్వము ఈ పర్వతముపైని నెంచేసియున్న మాధవుని అర్చించినవాడు వైష్ణవోత్తముడయిన శబరుడు. వాని పేరు విశ్వావసువు. అనాడు అతడు పురోహితునకు కుడిభుజముగానుండి తోడ్పడెను.

ఓ మహారాజా ! వారిద్దరి సంతతివారినే ఈ జగన్నాథునియొక్క సేవ సంస్కార కార్యమునకు భావిలో జరుపబోవునట్టి ఉత్సవములకు నియోగింపవలయును' అని దివ్యవాణి రాజుతో పలికి విరమించెను.

ఇంద్రద్యుమ్నుడు ఆ అశరీరవాణియొక్క ఉపదేశమును విని ప్రహృష్ట హృదయుడై యజ్ఞవేదికయందు వేష్టనమును విడిచిపెట్టెను.

అపుడందరు రత్నసింహాసనము నందున్న రాముని కృష్ణుని సుభద్రను వాసుదేవ మనెడి సుదర్శనమును చూచిరి. అశరీరవాణి చెప్పినరీతిగా రంగులు పూయుటచే ఆ విగ్రహములు మనోహరముగా నున్నవి.

పద్మాసనస్థితు డయిన కృష్ణుడు దారుదేహమును దాల్చినను నిర్మలముగా తన తేజస్సుతో ప్రకాశించుచున్నాడు. ఆ కృష్ణుడు మందస్మితవదనారవిందుడు, ఉన్నతాయతవక్షస్కుడు, దీనోద్ధరణశీలుడు, ప్రలంబ భుజపంజరుడు, వికసిత పుండరీకాక్షుడు, హసకోణాయతాధరుడు, అతనిని దర్శించినవారి పాపసంచయమును తన దృష్టిమాత్రముననే హరించువాడు. అట్టి కృష్ణుని గాంచి ఇంద్రద్యుమ్నుడు పరమానందభరితు డయ్యెను.

బలరాముడు [బాలదేవుడు] నీలజీమూత సంకాశుడు సర్వసంతాప నాశనుడు. సాట్టహాసముఖాంబుజుడు. ఫణామండలవిస్తీర్ణుడు. వారుణీఘూర్ణితేక్షణుడు ఉద్భవించిన ఆదిశేషుడు. పీనోన్నత సువక్షస్కుడు. కొంచెము వంగినవాడు. పృష్ఠప్రదేశమున కుండలీకృతదేహుడు. కైలాస శిఖరమువలె అగ్రసంపుల్లక కుభుడు. హలచక్రాబ్జముసలధారి. వనమాలిహారకుండల కేయూర కిరీట ముకుటోజ్జ్వలుడు. అట్టి బలరాముని గాంచి ఇంద్రద్యుమ్నృపతి అమితానందభరితు డయ్యెను.



శ్రీకృష్ణబలరాముల నడుమ నున్న సుభద్ర భద్రరూపిణి. ఆమె లక్ష్మి. ఆమె పాపసాగరోత్తారకారిణి. వికచాంభోజవదన, వరాభయధారిణి. రూప లావణ్యవతి. అలంకారశోభిత. కుంకుమారుణదేహ. అపరలక్ష్మి. విష్ణువునకు వామభాగస్థిత. చక్రశాఖాగ్రనిర్మిత. బాలార్క సదృశి. తేజోమయి. అట్టి సుభద్రను చూచి భక్తాగ్రగణ్యుడైన ఇంద్రద్యుమ్నుడు ఆనందసాగర నిమగ్ను డయ్యెను.

అపుడారాజు దేహముపై స్పృహలేక కర్తవ్యమును మరచెను. అర్ధ నిమీలితనేత్రుడై బాష్పాంబువును మాత్రమే కార్చుచుండెను. ఆ నృపతి భక్తిప్లుతుడై కృతాంజలిపుటుడై ఉండెను. ఆ రాజేంద్రుని చూచి మునీంద్రుడగు నారదుడు స్మితవక్త్రుడై ఇట్లనెను –

'రాజేంద్రా ! నీవెందులకు శ్రమపడితివో అది నీకిపుడు ప్రత్యక్షమయ్యెను.

ఓ నృపశార్దూలా ! ఈ భూమిపైని నీవొక్కడవే భాగ్యవంతుడవు, పుండరీకాయతేక్షణుడు, భక్తానుగ్రహపాథోధి, సర్వజ్ఞాననిధి హరి అయిన ఈ జగన్నాథుని చూడుము. యోగులు నియతమానసులై వీనిని చూచుటకు ఎంతయో ప్రయత్నము చేయుదురు. మానవులు ఎంతయో అవధానముచేసి క్షణకాలము మాత్రమే చూచుచున్నారు.

ఓ భూప ! జనార్దనుడు దారుమయదేహమును ధరించి నిన్ననుగ్రహించుటకే ప్రత్యక్షత్వమును పొందియున్నాడు.

ఓ నృపపుంగవ ! ధరణీనాథుడు, కారుణ్యసాగరుడు అయిన ఈ జగన్నాథుని సేవింపుము. నీచే స్తుతింపబడి నీ మనోగతాభీష్టములను తీర్పగలడు.'

## 20వ అధ్యాయము

1. ఇంద్రద్యుమ్నుడు జగన్నాథుని నుతించుట :

'ఓ మురారి ! నా పూర్వజన్మముల యందు నీ పాదపద్మములను సేవించి, ఉపాసించుట లేదు. పాపకర్మల దారుణఫలితమును అనుభవించుచున్న ఈ దీనుడయిన నన్ను రక్షింపుము.

బ్రహ్మవిష్ణురుద్రేంద్రుల కిరీటమగ్నమైన భవన్నిర్మల చరణాబ్జయుగ్మమెక్కడ ? శక్ర్యద్రపమాంసమూత్రాస్థిత్వక్కులచే కప్పబడిన దీనుడనైననేనెక్కడ ?

ఓ ఈశ ! అపార సంసారపరిభ్రమణముచే శ్రమాతురుడ నయిన నేను నిన్నెట్లు తెలిసికొనగలను ?

ఓ దేవదేవ ! దుఃఖమయ జన్మమును ప్రకాశింపజేయగల ధన్యజీవులే నిన్ను తెలిసికొనగలరు.

ఓ ప్రభూ ! అనేక జన్మముల యందు చేసిన పాపఫలమును అనేక విధముల అనుభవించితిని. నా శబ్దార్జితమయిన సుఖలేశభావము, మధుస్పృక్త తిక్తము వంటిది.

ఓ దేవ ! కామార్జితమైన నా విషయోపభోగము, ఏ సుఖానుభవమునకు హేతువయినదో దాని పరిణామము వలన నాకు దుఃఖము కలిగినది. నావంటి దుఃఖి మరొకడు లేడు.

ఓ విభూ ! తుచ్ఛవిషయోపభోగరతుడనుగాక, నా పూర్వజన్మలయందు, నా మనస్సుచేతనయినను, నిన్ను ఉపాసించియున్నచో, నేను బహుజన్మలను పొందవలసి యుండెడిదికాదు కదా ! నేను అమిత దుఃఖమును మరల మరల అనుభవింపవలసినది. పితృత్వదాసత్వపితృత్వ పుత్రత్వ ప్రియత్వ మాతృత్వ ధనిత్వభావములతోడను, వధ్యత్వహింస్రత్వ పతిత్వ జాయాత్వభావములతోడను, తిర్యక్త్వ సురత్వాదిభావములతోడను, నీచోర్ధ్వభావములను, అనేక పర్యాయములు గాని నశ్వత్తుగా కాని భవాంగణమునందు తిరుగుచున్న నావే అనుభవింప బడినవి.

ఓ మురారి ! నీ పాదపద్మములకు దూరీభూతుడైన వానికి ఇది ఇష్టఫలము కాదు.

రాజ్యాంగములయిన కోశము, బలము, పృథ్వీసంపద, యౌవన రూపములు, మనసునకునచ్చినస్త్రీలు, నిష్కంటకమయిన నృపమండలము, సామ్రాజ్యము కూడ నాకు మహాభారముగా నున్నవి.

ఓ కరుణామయ ! నీ సంబంధమయిన దైవజ్ఞానములేని నేను పశువు వలె సంచరించుచున్నాను. నాకీ రాజ్యసంసారభారమును తగ్గింపుము. శాస్త్రముల యందు చెప్పబడిన భేదయోగమును సంపూర్ణముగ అనుభవించు చున్నాను.

దీనావన ! నిన్ను స్మరించినంతమాత్రమువనే ఏనుగునకు ముక్తి నిచ్చితివి సంసారకూపములో ఘటీయంత్రము వలె తిరుగుచున్న నన్ను కృపతో రక్షించుటకు నీవే అర్హుడవు. ఈ లోకములో నాకు నీకంటె వేరొక బంధువు లేడు. ప్రవాహా మునే నిర్మూలమైన తరువు వలె, నా పాపబుద్ధి, దుష్టస్నేహసంబంధము, విషయాసక్తి నా పతనమునకు హేతువులగుచున్నవి. పైనిచెప్పిన నా దుష్ప్ర వర్తనమును పోగొట్టుదువని నీ పాదపద్మములను అహోరాత్రములు ఆశ్రయించు



...న్నను. జ్ఞానులు, భక్తులు, వేలకొలది జన్మలందార్జించిన పుణ్యఫలముచే ...దానంద పూర్ణసింధువయిన నీలో చేరిరి.

అట్టి ఆత్మజ్ఞానులు, సద్భక్తులు నీఅనుగ్రహముచే సుఖలేశము గల ...ఖమును గాని. విషయేంద్రజాలమునుగాని ఏమాత్రము చూడరైరి. వారు ...లేశానుభూతికి దుఃఖహేతువు అయిన కర్మలచే బద్ధులు కాకుండిరి. ...ంతము, అద్యంతరహితము, ఏకము, ఆనందప్రదమయిన నీపాదపంకజ ...క్కడ ? నీ మాయాసముద్రమున, మమతాభ్రమణమునందు కుకర్మనక్రాయి ...క్ర మధ్యమున పడిన నేనెక్కడ ? నిరాశ్రయుడనైన నన్ను నీకటాక్ష ...క్షణముచే ఇపుడు తీరమును చేర్చుము.

నిన్నాశ్రయించిన నావంటివారికి హితమును చేకూర్చుటకు నీ కార్య ...లాపమును కొంతతగ్గించుకొని రక్షింపుము. సహజముగా కరుణా మయుడవు. ...రమేశ్వరుడవు, సూక్ష్మభూతుడవయిన నిన్ను విడిచి క్షుద్రకార్యములకై ...రుగుచున్న మూర్ఖుడనయిన నన్ను కాపాడుము.

జగదేకవంద్య ! ఓ హరీ ! ఆయాసపడుచున్న పరమదీనుడ నయిన నన్ను ...క్షింపుము. వేదాంతవేద్య ! అవ్యయ ! విశ్వనాథ ! నా పాప రాశులను తగ్గింతు ...వని నిన్ను ప్రార్థించుచున్నాను. సుఖైకహేతువు, పరమేశ్వరుడవయిన ...న్ను విడిచి క్షుద్రాశయముకల నన్ను రక్షింపుము. ప్రాణికోటి తాను కల్పించు ...న్న మోహరాత్రియందు గాఢనిద్రలో నున్నది. చివరికి జీవకోటి త్వజ్జ్ఞాన ...సూదయ కిరణప్రసారముచే మేల్కొనుచున్నది. అట్టి తేజోమయుడవయిన ...న్ను వేడుచున్నాను.

నీ వొక్కడవే అఖిలలోక కర్తవు. ఫణాసహస్రములచే సేవింపబడుచున్న ...దివ్యమూర్తివి. ఒక క్రమపద్ధతిచే బలవంతులలో శ్రేష్ఠుడవు. ఈశ్వరుడవయిన ...న్ను శరణుపొందుచున్నాను.

ఓ నాథ ! నీ హృదయపద్మమందలి స్వశక్తిచేతనే జగములను సృజించుచు, ...పోషించుచున్నావు. నీ దివ్యశక్తి భద్రరూపమును దాల్చి జగదాశ్రయముగ ...నున్నది. కావుననే నీ పాదపంకజములపై పడుచున్నాను.

ఓ దివ్యపరమాత్మ స్వరూపా ! బ్రహ్మాండమంతయు నీ అరచేతనున్నది. ...అయ్యది నీ యంశజాలముచే సృజింపబడినదే. దైత్యబలమును నాశనముచేయు ...సుదర్శనమును చక్రాభిధుడవగు నీకు నమస్కరించుచున్నాను" అని ఇంద్రద్యు ...మ్నుడు జగన్నాథుని స్తుతించి తమోగుణ ప్రభావుడై సంసార సాగరమున పడిన ...తన్ను కరుణతో రక్షింపుమని సాష్టాంగ దండ ప్రణామము లాచరించెను.

2. నారదమహర్షి జగన్నాథుని స్తుతించుట :

జయజయ నారాయణ! అపార భవసాగరోత్తారపరాయణ! సనకసనందన ప్రభృతి యోగివర విచింత్యమాన దివ్యతత్త్వ! స్వమాయావిలసితా ధ్యాన పరిణమితాశేష భూతతత్త్వ! త్రితత్త్వ! త్రిదండధర! త్రిణాచికేత త్రిమధు త్రిసువర్ణోపగీయమాన దివ్యజ్ఞానచ్ఛందోమయ! భక్తప్రియ! భక్తజనైకవత్సల! స్వమాయాజాల వ్యవహితస్వరూప!

విశ్వరూప! విశ్వప్రకాశ! విశ్వతోముఖ! విశ్వతోక్షి! విశ్వతఃశ్రవణ! విశ్వతః పాదశిరోగ్రీవ! విశ్వహస్త! నాసారసనాత్వక్కేశ లోమలింగ! సర్వ లోకాత్మక! సర్వలోక సుఖావహ! సర్వలోకోపకారక! సర్వలోక వమస్కృత!

లీలావిలసిత కోటిపద్మోద్భవ రుద్రేంద్ర మరుదశ్విసాధ్య సిద్ధగణ ప్రణతాశేష సురాసుర త్రిభువన గురువర! ఎవ్వరికిని జ్ఞానగోచరుడవు కావు. నీకు నమస్కారము' అని నారదుడు జగన్నాథస్వామిని స్తుతించెను.

ఇతర నృపతులు శ్రోత్రియులు వేదపారగులు మునులు ద్విజులు క్షత్రియులు విద్వాంసులు వైశ్యులు పురాణోక్తములగు సూక్తులతో స్తోత్రములతో కవితామాధుర్యముతో పుండరీకాక్షుని బలభద్రుని సుభద్రను సుదర్శన చక్రమును స్తుతించిరి.

పిమ్మట ఇంద్రద్యుమ్నుడు పవిత్రుడయిన పురోధసునితో వాసుదేవుని పూజకై సామగ్రిని సిద్ధము చేయింపుమని కోరెను.

నృపతిశ్రేష్ఠుడు ఆయా దేవతావిగ్రహములకు క్రమముగా నారదమహర్షి ఉపదేశానుసారముగ, మంత్రపూర్వకముగ పూజ సల్పెను. రాజు ద్వాదశాక్షర మంత్రముతో బలభద్రుని పూజించెను. అతనిని పూజించుటచేతనే ధ్రువునకు ఉత్తమోత్తమమైనస్థానము ప్రాప్తించినది.

ఇంద్రద్యుమ్నుడు వేదత్రయియందు ప్రసిద్ధమైన పరమ పవిత్రమైన పురుష సూక్తముతో శక్తికొలది నారాయణుని, దేవీ సూక్తముచే సుభద్రను సుదర్శనమంత్రముచే సుదర్శనచక్రమును సంపూర్ణమయిన భక్తితో అర్చించెను. రాజు ఆ దేవతల ప్రీతికొరకు ద్విజముఖ్యులకు భక్తితో తులాపురుష దానము, మున్నగు దానములు కావించెను. భూపతి అశ్వమేధ యాగమునకు అంగభూతముగా కోట్లకొలది గోవులను దానము చేసెను. ఇంకను నృపతి అలంకరించిన గోవులను అర్హులయిన వారికి దక్షిణలిచ్చి దాన మొనర్చెను. ఆ గోమాతృ ఖుర ఘట్టనములవలన ఏర్పడిన గోతులలో దానజలము నిండియుండుటచే ఆ ప్రదేశము మహాపుణ్యఫల ప్రదమగు తీర్థమయ్యెను. ఆగర్తములలో స్నానముచేసి పితృదేవతలకు కులదేవతలకు విధిపూర్వకముగా సంతర్పణములు చేయునరుడు సహస్రాశ్వమేధ ఫలమును పొందగలడనుటలో సందేహములేదు.



ఆ సరస్సు ఇంద్రద్యుమ్నుని నామముతోడనే పిలువబడుచున్నది. మానవులు పితృదేవతలనుద్దేశించి పిండములర్పించు చున్నారు. అట్టివాడు ఇరువదియొక్క కులముల నుద్ధరించి బ్రహ్మలోకమున వసించును. హయ మేధాంగ సంభవమయినందున ఈ తీర్థముకంటె శ్రేష్ఠమయినది లేదు. ఇంద్రద్యుమ్న సరస్సునకు సమమయినది గంగానదియే. పిమ్మట ఇంద్రద్యుమ్నుడు ప్రాసాద నిర్మాణమునకు ఉపక్రమించెను. జ్యోతిశ్శాస్త్రజ్ఞులు నిర్ణయించిన ప్రకారము, శుభకాలమున సుముహూర్తమున మంచి నక్షత్రమున ఇంద్రద్యుమ్నుడు నారదాది బ్రహ్మర్షోత్తములను ఆరాధించి, కర్మఫలసిద్ధికొరకు స్వస్తివచనములను చెప్పించి. దేవాలయ ప్రాసాద నిర్మాణస్థలమున జగన్నాథుని స్మరించుచు అర్ఘ్యము నిచ్చెను, తరువాత రాజు వాస్తుయాగ పూర్వకముగా ఆచంద్రతారకము ఆస్థానము మహిమోపేత ముగుటకు భూదేవిని ప్రార్థించి శిల్పులను పూజించెను. ఆమహీపతి ఆ విధముగా గీతవాద్యములతో మహోత్సవమును సల్పి దీనులకు అనాథలకు అవస్థులకు, కోరినప్రకారము వస్తుచయమును దానమొనర్చెను.

ఇంద్రద్యుమ్న సార్వభౌముడు సహస్రాశ్వమేధ యాగానంతరము హరియొక్క అవతారమునుచూచి సాపరివారులైన సామంతరాజులను బహుమాన పూర్వకముగా గౌరవించి తమ తమ నెలవులకు పంపెను.

భగవంతునికి దేవాలయప్రాసాద నిర్మాణములకై బహుదేశములనుండి తీసికొనివచ్చిన పాషాణములు తొలుచు పనివారికి కట్టడమునకు శ్రమించినవారికి శిల్పులకు అధికముగా ధనమునిచ్చి సంతృప్తిపరచెను. పార్థివోత్తముడు ఆనంద యుతుడై అష్టాదశ ద్వీపములయందు పౌరుషముచే ఆర్జించిన సర్వసంపదలను జగన్నాథస్వామి దేవాలయమునకే బహూకరించినట్లు ఆ సదస్సులో ప్రకటించెను. ఇంద్రద్యుమ్నుడు శ్రమపడి జైత్రయాత్రలు సల్పి సేకరించిన ధనము ఐశ్వర్యము, విష్ణుదేవస్థానమునకు వినియోగించుటవలన సఫలమగునని భావించెను. రాజు బాహుబలార్జిత లక్ష్మితో సంపదతో చరాచర గురుడగు హరిని అర్చించుటకంటె అతని అనుగ్రహము సంపాదించుటకంటె తనకు వేరొక భాగ్యములేదని భావించెను. పురుషోత్తముని వక్షఃస్థలనివాసినియగు లక్ష్మీదేవియొక్క అనుగ్రహము వలన కలిగినదే తనసంపద అని ఇంద్రద్యుమ్న మహీపతి తలంచెను. దేవతా సార్వభౌముడగు చక్రియొక్క కటాక్షము ఎవనిపై పడునో వానికి సర్వతోముఖ మగు సంపద సమకూడును. అట్టివాని జిహ్వాయందు అష్టాదశాత్మికయగు దేవి నృత్యమాడును. బ్రహ్మదేవుడుకూడ జగన్నాథుని ఆరాధించి బ్రహ్మత్వమును పొందెను. అట్లే రుద్రుడు మహేశ్వరత్వమును, ఇంద్రుడు దేవలోకప్రభుత్వమును గాంచిరి. కావున శాశ్వతుడు జగత్పూజ్యుడయిన ఆ జగన్నాథునే, నేనుకూడ ఉపాసింతును.

ఏ పుణ్యాత్ముడు సాంగోపాంగ విధిపూర్వకముగా కృష్ణుని అర్చించునో, ముజ్జన్మల రాశీభూతమయిన పాపము నశించును.

ఈ పురుషోత్తమ క్షేత్రము శ్రీహరికి కళేబరము. ఇందు హరి అహంకార యుతుడై నిత్యము ఆవిర్భావ తిరోభావములను స్థితిని ఒనర్చుచున్నాడు. ఈ పుణ్యక్షేత్రమున ప్రత్యక్షముగా శరీరధారియై జగద్గురువయిన శ్రీ జగన్నాథుని పూజించినవారు కృతార్థులై చతుర్వర్గ ఫలమును పొందగలరు. ఇంద్రద్యుమ్నుడు బహుధా కష్టపడి సంపాదించిన రాజ్యమును శ్రీహరి కైంకర్యమునకై అతని కృపాపాత్రుడగుటకు అర్పించి ధన్యుడయ్యెను.

ఆ రాజు భూలోకమునగల ఉత్తమద్రవ్యముల నన్నిటిని తెప్పించి షోడశోప చారములతో జగన్నాథుని అర్చించెను. అందువలన అతని కర్మపరిపాకమయ్యెను. అట్లుచేయనిచో అతని సామ్రాజ్యయాత్ర సఫలముకాదని రాజు తలంచెను. జగన్నాథుని నిత్యపూజలకు ద్రవ్యజాలమును సమకూర్చుట, ఆ దేవదేవునకు ఉన్నతోత్తమ దేవాలయ ప్రాసాదములు నిర్మించుట, అతని విగ్రహములను శాస్త్రప్రకారము చేయించుట తన కర్తవ్యమని ఇంద్రద్యుమ్నుడు భావించెను.

అట్లు చేయనిచో తన మానవజన్మము వ్యర్థమని ఇంద్రద్యుమ్నుడు అను కొనెను. భగవత్ప్రేరణముచే భగవత్కృపచే భగవత్ప్రీతికై తానొనర్చిన సత్కా ర్యము సఫలమగునని ఇంద్రద్యుమ్నుడు ఆనందపరవశుడయ్యెను.

## 21వ అధ్యాయము

1. ఋగ్వేదపారగుడు వేదాంతవిజ్ఞానశీలుడయిన ద్విజుడు ఇంద్రద్యుమ్ను నకు దారుమూర్తి యగు శ్రీ జగన్నాథుని మహిమ తెలుపుట :

'ఓ ఇంద్రద్యుమ్న రాజేంద్ర! వర్ణనాతీతమైన నీ పూర్వపుణ్య పరిపాకము చేతనే భగవంతుడు భూలోకమున దారుమూర్తియై వెలసెను. ఆత్మజ్ఞానహీనులు, మోహపరవశులు దారుమూర్తి అయిన శ్రీ జగన్నాథుని ఉపాసించినచో ముక్తులగు దురని వేదములు చెప్పుచున్నవి. సాగరతీరమున వెలసినట్టియు పురుష నిర్మితము కానట్టియు ఈ దారుమూర్తిని ఉపాసించువారికి తప్పక మోక్షము లభించును. అయినను ఈ స్వామిని ఆరాధించుట సులభము కాదు. ఈ పరమసత్యవాక్యమును బ్రహ్మజ్ఞాననిధి యగు నారదమహర్షియే స్వయముగా విన్నవించెను. వేదాంతము కంటె ఇతరమయినదానివలన ఈ పురుషోత్తముని ఎరుగశక్యము కాదు. విష్ణువు యొక్క ప్రవృత్తిలేనిదే వేదము ప్రవర్తిల్లదు.

ఓ భూపతీ! ప్రపంచసృష్టిజాలములో భగవంతునకు గాని ఇతరులకు గాని శ్రుతియే ప్రమాణము. వేదోక్తమార్గమున ప్రవర్తించినవానిపట్ల ఎవ్వడయినను



...మాణ్యబుద్ధి కలిగియుండునా ? కావుననే ఈ దారుమూర్త్యవతారము వేదప్రసిద్ధ ...యినది.

ఓ రాజా! సామవేదము నందు వేదాంతవేద్యుడయిన పురుషుడు స్తుతింప ...నను మానవకోటికి మోక్షప్రదమగు జగన్నాథుని ప్రతిమను గూర్చి ఆ వేదము ...న గ్రహింపశక్యము కాదు. ఈ దారుమూర్తిని దర్శించినంత మాత్రముననే ...ధమయిన అజ్ఞానము నశించి ఉత్తమమయిన శాంతి ప్రాప్తించుచున్నది. ... దారుమూర్తి యగు జగన్నాథుని అర్చనావిధానమును సువిదితము ...యు వైదికమంత్రములింతకుపూర్వమే ప్రసిద్ధముగా నున్నవి. ఉత్తమ ...యిన మనోభీష్టసిద్ధి కొరకు లోకకల్యాణము కొరకు వినియోగింప ...డునట్టి ఈ జగన్నాథుని పూజ ప్రశస్తమయినది.

ఈ భారతీయులు క్షీణపాపులగుచున్నారు. ఎంత అదృష్టము. ఎంత ...శ్చర్యము ? ఈ భారతదేశ జనులకు మోక్షమొసగుటకే జనార్దనుడు పుడమి ...నవతరించెను. భారతదేశమున గల అన్ని ప్రాంతములకంటె ఓఢ్రదేశము ...త్యుత్తమ మయినది. ఈ ఓఢ్రదేశీయులు తమ చర్మ చక్షువులతో బ్రహ్మ ...స్వరూపుడయిన శ్రీ జగన్నాథుని చూచుచున్నారు. శ్రుతిస్మృతులలో చెప్పబడిన ...ర్మమార్గము గహన మయినది. ఆకులమయిన దగుటచే ఆచరణసాధ్యముకాదు. ...ర్మమార్గము ననుసరించువారు దారితెలియనివారై ఘటీయంత్రము వలె ఆకుల ...డుచున్నారు.

విస్మయము డయిన ఈ పురుషోత్తముడు శాశ్వత మోక్షప్రాప్తికికారణభూతుడు. ...రంతరము దుఃఖభాజనులగు దురాత్ములకు ఈ దారువపుష్మంతుడగు విష్ణువే ...సుబాంధవుడు. సుఖదాతయై శ్రుతిహితములుకాని ఉపాయములచే పరమానంద ...మును ముక్తిని ప్రసాదించుచున్నాడు.

ఓ పార్థివ! ఈ పురుషోత్తమ క్షేత్రమున వేదముల యందు స్మృతులయందు ప్రోక్తము లయిన నియమములు పాటింపబడవు. వేదపారగుడు చండాలుడు అను తారతమ్యములేకయే, ఏ జనుడయినను శ్రీ జగన్నాథస్వామిని దర్శించినంత మాత్రముననే ముక్తినందగలడు. భక్తుడు కాకున్నను గతానుగతికముగ ఈ జగన్నా థుని గాంచినవాడయినను శాశ్వత మయిన సహస్రాశ్వమేధయాగ ఫలమును పొందగలడు.

ఏ నరుడయినను భక్తినియమములతో దృఢమానసుడై ఈ దేవుని సేవించినచో నిస్సంశయముగ ఆ పుణ్యాత్ముడు బ్రహ్మముతో సాయుజ్యము నందగలడు. దుఃఖాయాసబహుళము అనాయాస వినశ్వరము, పునరావృత్తి లక్షణము, అవిరతము, లౌకికము నగు క్షుద్రఫల మెక్కడ ? దర్శనమాత్రము

చేతనే, భక్తులకు పాపరాశి దవానలము, సచ్చిదానంద కైవల్యముక్తిదము దారుమయ మగు ఈ బ్రహ్మ మెక్కడ ? మహాత్ములు పొందదగిన సంపూర్ణ సత్ఫలితములను వేదానువచనముల నాచరింపలేని దురాత్ములకు గూడ ఈ పరమేశ్వరుడు ప్రసాదింపగలడు. మర్త్యలోకవాసులకు అన్యపుణ్యక్షేత్రముల యందున్న భగవంతుడు సుదూరుడు. ముక్తిప్రదుడగు విభుడు స్వక్షేత్ర మయిన ఈ పురుషోత్తమక్షేత్రమున నిత్యము నివసించుచున్నాడు.

ఓ మహాభాగ ! ఈ కారణముల వలన నీ బంధుమిత్రాది పరివారముతో ఇచ్చట నుండుము. నీవు భక్తుడవు. విద్వత్తముడవు. సాంగోపాంగముగ ఈ పురుషోత్తముని భజింపుము' అని ద్విజుడు ఇంద్రద్యుమ్నునితో చెప్పిన పలుకులు వినిన నారదుడు సంహృష్టమానసుడయ్యెను.

2. నారదుడు పురుషోత్తమ క్షేత్రమున దారుమూర్తిని అర్చించుచు వసింపుమని ఇంద్రద్యుమ్నునికి చెప్పుట :

'ఓ భూపాల ! ద్విజవర్యుడు శ్రౌతమార్గానుసారి కావున లెస్సగా పల్కెను. సృష్ట్యాది యందు బ్రహ్మనిఃశ్వాసము వలన వేదరాశి ఆవిర్భవించినది. అందలి ఉపనిషదర్థమే ఇప్పుడు ద్విజునకు సంప్రాప్తమైనది. ఈయర్థము భగవంతుడయిన ప్రజాపతికి తెలియును.

ఓ రాజా ! నేను ఇప్పుడు దానిని బ్రహ్మవలన గ్రహించితిని. నీవు కోరిన దంతయు అతని యాజ్ఞవలననే ఒనర్చితిని. దారుమూర్తిని ఆరాధించుచు, ఇట నుండుము. నేను బ్రహ్మసన్నిధి కేగి, అతని యాజ్ఞ ప్రకారము నేనొనర్చిన దానిని, ఈ పురుషోత్తమ క్షేత్రమున విష్ణువు ప్రకాశించుచున్నట్లు బ్రహ్మకు తెలియజేయుదును.

ఓ మహీపాల ! అధిక ధనమును వెచ్చించి దేవాలయమున నరసింహ స్వామిని ప్రతిష్ఠించినచో విముక్తుడవగుదువు' అని నారదుడు ఇంద్రద్యుమ్నునితో పల్కెను.

3. ఇంద్రద్యుమ్నుడు నారదునితో కూడ బ్రహ్మను దర్శింపగోరుట :

'ఓ నారదమునీంద్రా ! నేను నీతో కలిసి బ్రహ్మసమీపమునకు రావలెనని ఆశించుచున్నాను. అతనికరుణవలననే జగన్నాథస్వామి జనుల చర్మ చక్షువులకు గోచరించుచున్నాడు. జగన్నాథుని దేవాలయ ప్రతిష్ఠను గూర్చి ప్రాసాద స్థాపనోత్సవము విషయమై బ్రహ్మదేవునకు స్వయముగా నివేదింపగలను.



విధాత బ్రహ్మలోకమునుండి స్వయముగా ఏతెంచి జగన్నాథుని ప్రాసాద ప్రతిష్ఠామహోత్సవమును చేయగలడు. కావున ఓ మునీశ్వరా ! బ్రహ్మ దాతృసన్నిధికి గొంపొమ్ము. నేనిక్కడ దేవాలయగర్భప్రతిష్ఠ పరిసమాప్తి చేయుదును. పిమ్మట మనమిద్దరము బ్రహ్మకడకు పోవుదము. తారకిచట కొంతకాల ముండుము' అని రాజు నారదుని ప్రార్థించెను.

జైమిని మునులతో దేవాలయ నిర్మాణమును గూర్చి చెప్పుట :

'ఓ మునులారా ! ఆ తరువాత ఇంద్రద్యుమ్నుడు శిలలను చెక్కునట్టి శిల్పశాస్త్రవిశారదులను, ఆదరపూర్వకముగ నియమించి, వారికి సత్కార దాన సమ్మానము లొనర్చెను.

ఆ దేవాలయ నిర్మాణము దినదినప్రవర్ధమాన మయ్యెను. అల్పకాలములోనే అత్యున్నత మయిన ఆ దేవాలయ నిర్మాణము సాగుచు, చూపరులకు ఆనందాశ్చర్యములను గొల్పు చుండెను. ఆ కట్టడములకు వినియోగించిన పాషాణముల సంఖ్య గాని, కోట్లకొలది వ్యయమయిన ధనమును గూర్చి కాని చెప్పశక్యము కాదు. ఇంద్రద్యుమ్నమహారాజు నియమించిన సామంత రాజులు, వారు నియమించిన యితరులు, వారిచే నియమితులయిన పనివారు, అందరును అచట నిత్యము కలిసి పనిచేయుచుండగా వెలువడుచున్న మహారవము దశదిశలు వ్యాపించుచుండెను. ఆ నృపతి కీర్తితోపాటు, ఐశ్వర్యము గూడ సమృద్ధమయ్యెను. ఆ దేవాలయము సువర్ణమున పొదిగిన రత్నముల కాంతితోడను స్ఫటికముచే నిర్మింపబడిన భాగముల శారదాభ్ర నిభచ్ఛవి తోడను, నీలాశ్మ నిర్మిత మయిన గోడల కాలాభ్రమేదురమైన కాంతితోడను, మనోహరముగా నిర్మింపబడెను. ఆ దేవాలయమునందు ఇంద్రద్యుమ్న మహీపతి గర్భ ప్రతిష్ఠను విధిప్రకారముగావించి, వజ్రపాతాదుల నివారణకై యథోచితముగ శిల్పశాస్త్రానుసారము మణ్యాదులను స్థాపించెను. మిక్కిలి విలువయిన దేవాలయ నిర్మాణమునకు ఉపయుక్తమగు వస్తుజాలమును అచట భద్రపరచెను. ప్రతిష్ఠాప్రదమగు ఆ ప్రాసాదనిర్మాణ మట్లు జరుగునని ముల్లోకము లందలి చక్రవర్తులు కూడ ఊహింపలేకపోయిరి. కల్పాంతవాసు లయిన దివిజులు కూడ అట్టి దేవాలయమును గాంచరైరి.

ఇతఃపూర్వము ఇట్టి దేవాలయము భూలోకమున గాని, స్వర్గలోకమున గాని నిర్మింపబడలేదని ఆదిత్యులనుకొనుచుండిరి.

ఇంద్రద్యుమ్నునకు భగవత్పాదసేవ యందుగల శ్రద్ధాసక్తుల వలన, అతని సద్బుద్ధి యుక్తాభిలాష వలన ఈ దేవాలయ నిర్మాణము ఔన్నత్యముతో పరిణతి నందినది.

ఈ భూలోకమున నీతిశాలులయి సర్వశత్రువులను జయించిన రాజులుకాని సామ్రాజ్యములను జయించిన సార్వభౌములుకాని, కోట్లకొలది నానావిధ విత్తములను సంచితమొనర్చినవారు కాని, ఇట్టి అలౌకిక కర్మలను చూచుచున్నారా ? చేయుచున్నారా ? ఇంద్రద్యుమ్న నృపతికి, ముందున్న సార్వభౌములు త్రిదివేశుని ప్రీతికై అశ్వమేధ సహస్రమును చేయుటకుగాని, చూచుటకుగాని, క్రతుఫలమును వినుటకుగాని సమర్థులు కాకపోయిరి.

మానవలోకవాసి యగు ఇంద్రద్యుమ్నభూపతి, భూలోకమున చేయు క్రతువును, చూడవచ్చిన త్రైలోక్యవాసులు భోగము లనుభవించుచు, అతని కడ నుండిరి. ఆ సోమయాజిసభ బ్రహ్మలోకము వలె భాసించుచున్నది. అచట వేదములు మూర్తీభవించినవి. ధర్మము నాల్గుపాదములతో ప్రవర్తిల్లుచున్నది. సంకల్పకాములయిన దేవతలు అద్భుతమయిన ధీశక్తికలవా రయిరి. శ్రేష్ఠమయిన యీ ప్రాసాద వైశిష్ట్యము వారి బుద్ధికి అత్యద్భుతముగ గోచరించెను. ఆ ప్రాసాదము త్రిలోకవాసుల చిత్తములను ఆకర్షించుచున్నది.

ఇంద్రద్యుమ్నునకు నారదమహర్షి సహాయుడు కావున అతనికి దుర్లభమైనది ఏదియును లేదు.

సర్వాపరేశ్వరుడు, సకల జగత్స్రష్టఅగు బ్రహ్మ విష్ణుభక్తుడయిన ఇంద్రద్యుమ్న నృపతికి విష్ణువునకు వ్యత్యాసమును చూపింపలేదు. విష్ణువునకు అతని భక్తబృందమునకు భేదములేదు. ఆ రాజు ప్రాసాదాంతమున నారద మహర్షితో ఇట్లనెను –

'ఓ మునీంద్ర ! సురాసురులకు లభ్యముకాని దంతయు నాకు సుసంపన్నమయినది. స్వామీ ! సాక్షాద్భగవంతుడైన విష్ణువు యొక్క అద్వైతోపాసనము నందు రతుడవు. భగవత్తమవుతో భాషించుచున్నావు. ప్రాసాదము చిరకాలము నా మనస్సులో నిలిచిపోవును' అని రాజు పలికి నారదమునీంద్రుని పాదపద్మములకు సాష్టాంగ దండప్రణామ మాచరించెను.

నారదమహర్షి ఇంద్రద్యుమ్నుని లేవనెత్తి గౌరవించి 'ఓ నృపోత్తమా ! యథార్థముగ నీకును నాకును భేదము లేదు. నీపుణ్యముచే సాక్షాత్తు జగన్నాథుడు వెలసెను. వెంటనే వీనిని అర్చింపుము. ఇపుడే జీవన్ముక్తుడ వగుదువు. ఆ జగన్నాథుని పాదపద్మముల యందు నీ మనస్సు చతుష్పథాన్విత మైనది. అనన్య భక్తికల పురుషునకు ఇంతకంటె కావలసినది ఏమున్నది ?

ఓ ఇంద్రద్యుమ్న మహారాజా ! తీర్థయాత్రలు సల్పువారికి, మంత్రదీక్షాపరులకు, జపముచేయువారికి, దాతలకు, సోమయాజులకు, భూరి దక్షిణ లొసంగువారికి, వ్రతము లాచరించువారికి, వేదాధ్యయనము చేయువారికి



తపమాచరించువారికి పొందశక్యముకాని ఫలితము, నీకు భక్తివలననే సంప్రాప్తమయినది. ఇంక విచారింపకుము. భక్తియోగేశ్వరుడవయిన నీకు నమస్కారము.

ఓ రాజేంద్ర ! ఈ భూలోకమున ప్రకృష్టుడవై చిరకాలము నివసించుచు, జగన్నాథస్వామికి ఉపచారములు, మహోత్సవములు, ఆరాధనలు సల్పుము. బ్రహ్మదేవుని దర్శింపగోరి నీవాతని సన్నిధికి వెళ్లినపుడు ఆ ప్రభువు కూడ ఈ జగన్నాథుని యాత్రామహోత్సవముల గురించి నీకు ఉపదేశించును. స్వయముగా భగవంతుడే నీకు వరము లొసగును. ప్రాసాదప్రతిష్ఠచేయు సమయమునకు చతుర్ముఖ సప్తర్షి సహితుడనై నేను కూడ వచ్చెదను. అపుడు పరమ పవిత్రమయిన బ్రహ్మలోకమునకు మనముభయులము కలిసి పోవుదము. ఈ భూలోకము నందు నీవు తప్ప ఇంకెవ్వడు బ్రహ్మలోకమునకు పోవుటకు సమర్థుడున్నాడు' అని నారదుడు రాజుతో పలికి నభస్స్థలమున కెగసెను.

## 22వ అధ్యాయము

1. ఇంద్రద్యుమ్నుడు బ్రహ్మలోక గమనమును గూర్చి నారదునితో పల్కుట :

ఓ నారదమునీంద్ర ! నిర్లక్ష్యగమన మెట్లు సాధ్యమగును ? మనస్సు కంటె వేగముగల యీ పుష్పరథమున్నదికదా ! దీని నధిరోహించి పోవుదము. క్షణకాలము నిరీక్షింపుము. ప్రాసాదమందున్న యధికారులకు అనుజ్ఞ నొసగి జగన్నాథునకు ప్రదక్షిణము చేసి వచ్చెదను' అని రాజు నారదునితో వచించెను.

నారదుడు రాజు చెప్పినది విని అతనిని చేతితో పట్టుకొని, సుభద్రా బలరామ సహితుడైన కృష్ణునికి పదేపదే నమస్కరించుచు, బ్రహ్మలోకమున కరుగుటకై అనుజ్ఞనిమ్మని శ్రీహరిని ప్రార్థించెను.

ఇంద్రద్యుమ్నమహారాజు కూడ ఉత్సాహముతో మనోవాక్కాయ కర్మలచే జగన్నాథునకు సాష్టాంగ దండప్రణామ మాచరించి, సురల ప్రదక్షిణ మొనర్చి మనోమల విశోధనముచేయు బ్రహ్మలోక గమనమునకు అనుజ్ఞను కోరెను.

జీవన్ముక్తుడయిన నారదమునీంద్రుడు ఇంద్రద్యుమ్నుని గమనమునకు భంగకరముకాని రీతిని సర్వలోకములందు సంచరించుచుండగా, ఇంద్రద్యుమ్నుడు మర్త్యుడైనను విష్ణుభక్తి ప్రసాదమువలన బ్రహ్మాండములో అతనికి దుష్ప్రాప్యమయిన వస్తువేదియును లేదు. విష్ణుభక్తునకు లభ్యమయిన ముక్తిని ఆతడు పొందెను. నారదభూపతు లిద్దరును మహర్లోక మందున్న సిద్ధులచే సాదరముగ పూజింపబడిరి.

ఇంద్రద్యుమ్నుడు తన రాజభవనమును గూర్చి తలంపలేదు. ఆతడు క్రమముగా ఊర్ధ్వ గమనమున బోవుచు గాంచుచున్న సౌఖ్యైక భాజనములు,

నిర్ద్వంద్వములు, సద్యఃఫలప్రదము అయినవానికి ప్రాధాన్యమీయక, కర్మ భూమి అయిన భూలోకములో భగవత్ప్రీతికై తాను నిర్మించుచున్న ప్రాసాద పరిసమాప్తిని గురించి మాత్రమే ఆలోచించెను.

ఆతడు బ్రహ్మలోకమునకు వెళ్లిన సమయమున శత్రురాజులా ప్రాసాదమును ఆక్రమించుటయో, లేక వారు రాజసేవకులకు ధనమిచ్చి వారిని వశపరచుకొనుటయో చేసియుందురని భయపడెను. రాజు బ్రహ్మ లోకమున కేగుటకు ముందే శిల్పులు వేతనములు పుచ్చుకొన్నను, తాము చేయవలసిన పనులు మందముగా చేయుదురు కాని శీఘ్రముగ చేయరని రాజు విచారించెను. రాజు చతుర్ముఖుని తీసికొనివచ్చుటకు దూరముగా పోయినందున తన పరోక్షమున ప్రాసాదనిర్మాణము పూర్తికాదని భావించెను.

ఇంద్రద్యుమ్నునికంటె పూర్వము బ్రహ్మలోకమునకు వెళ్లినవారెవ్వరును, భూలోకమునకు తిరిగి రాలేదని, అతని సామంతులు దుర్బుద్ధితో ద్వేషముతో అతని రాజ్యమును అపహరింతురని ఖిన్నుడగుచున్న నృపతిని గాంచిన నారద మహర్షి త్రికాలజ్ఞు డగుటచే ఆరాజుతో ఇట్లనెను –

2. నారదుడు ఇంద్రద్యుమ్నునకు ధైర్యము చెప్పుట :

ఓ రాజేంద్ర ! ఇటు దీనమానసుడవై ఏమి చింతించుచున్నావు. మన మిద్దరము కలిసి యీ బ్రహ్మలోకమునకు వచ్చుచున్నాము. నేను చింతించుట లేదే! ఇట మానసికవ్యాధులు కాని శారీరకవ్యాధులు కాని దరిచేరవు. నీకు విచారింపదగిన దేమున్నది ?

ఓ మహీపతీ ! మానుష దేహ ధారివయ్యును, స్వయముగా బ్రహ్మలోకమునకు వచ్చి ప్రత్యక్షముగా హరిని చూచితివి. హేయమయిన సంసారమును తలంచుచు విచారింపకుము, అని నారదమహర్షి రాజుతో పల్కెను.

3. ఇంద్రద్యుమ్నుడు నారదునకు బదులు చెప్పుట :

'ఓ మునీంద్రా ! నా కుటుంబ బంధుమిత్రుల గూర్చి నేను విచారించుట లేదు. భగవంతుని ప్రీతికై ప్రాసాద నిర్మాణము కొంతకాలము క్రితమే ప్రారం భించితిని. ఈ బ్రహ్మలోకమునకు నేను వచ్చినట్లు తెలిసినచో నా సేవకులచట నుండరు.

ఓ మునీశ్వరా ! నాచే ప్రారంభింపబడిన ప్రాసాదనిర్మాణము పరిసమాప్తమై ప్రతిష్ఠ చేయవలసి యున్నది. అందులకు అంతరాయము కలుగునేమో అని నాచిత్తము దుఃఖభాజనమైనది' అని రాజు నారదునితో చెప్పెను.



ఆ నృపతి వాక్యములను వినిన నారదుడు 'ఓ ఇంద్రద్యుమ్న క్షితీంద్రా ! సామాన్య భూపతివి కావు. ప్రజాపతి సముడవు. నీ వంశమునందలి పూర్వ నృపతులలో ఏ యొక్కడును పరులకు హానిచేయలేదు. ప్రతాప యశోవిరా జితుడవగు నీవు ప్రస్తుతము బ్రహ్మలోకమునయుండగా నీ ప్రారంభించిన ప్రాసాద నిర్మాణమునకు దాని స్థితికి ఎవ్వడు భంగము కలిగింపగలడు ? సూర్యచంద్రులు గగనము సంచరించుచున్నట్లు ఈ చతుర్ముఖుడు నీవు తలపెట్టిన భగవత్కార్య పరిసమాప్తికి పర్యవేక్షకుడై నీకు తోడ్పడును.

ఓ రాజశార్దూలా ! అట్టి దైవకార్యములగూర్చి నీకు విఘ్నశంక కలుగు చున్నదా ? రాజేంద్రా ! ఆ ప్రాసాదము నీకిపుడు దూరముగనున్నను నీ కన్నుల కది దృగ్గోచరము కాదు. సాక్షాత్తు త్రిలోకాధిపతియగు ఇంద్రుడే దాని మధ్య నున్నాడు. మరియు జగన్నాథస్వామి ప్రాసాదమునకు చెరుపు చేయ దలచిన ఏ నృపతియు మనస్సులోకూడ తలంపలేడు. దానికై నీవు శంకింప నక్కరలేదు.

ఓ భూపా ! మన సమక్షమున కోటిచంద్రుల కాంతితో, కోటి సుధాసాగర ములవలె హృదయాహ్లాదజనకమైన ఈ తేజోరాశి బ్రహ్మపద్మమున ఎటుల ప్రకాశించుచున్నదో పరికింపుము' అని నారదుడు రాజుతో పల్కెను.

నారదమహర్షి, ఇంద్రద్యుమ్న మహారాజు ఈ విధముగా సంభాషించుచు బ్రహ్మలోక సమీపమునకు పోయిరి. అత్తరిని వారు దూరమునుండియే బ్రహ్మర్షులు స్పష్టముగ ఉచ్చరించుచున్న వర్ణక్రమ స్వరముగల వదమును స్వాధ్యాయ శబ్ద ములమును వినిరి. మరియు వారి కచట ఇతిహాస పురాణములును, ఛందఃకల్పము లును, గాథకలును వినబడినవి. అసంకీర్ణోజ్జ్వలమయిన పదము విభాగ పూర్వ కముగ వినవచ్చినది. కావున అదియే బ్రహ్మదేవుని పురమని నారదమహర్షి రాజుతో నుడివెను.

అచటి సభలో చతుర్ముఖుడు సుఖాసీనుడై బ్రహ్మర్షి ముఖ్యులచే, జీవన్ముక్తు లచే, నానా దైతన్యశబలులచే ఉపాసింపబడుచున్నాడు. ఈ బ్రహ్మలోకమునకు వచ్చినవారు మరల సంకటమును చేకూర్చు సంసారాబ్ధియందు బడరు. ఈ పరమేష్ఠియొక్క యీ ఉత్తమ లోకము 'సత్' అని పిలువబడుచున్నది. దానికి పైని ఏ లోకమును లేదు.

బ్రహ్మలోకమునకే కొంచెము మీదుగాను బ్రహ్మాండ కపాలమునకు క్రిందను వైకుంఠమున్నదని నారదమహర్షి ఇంద్రద్యుమ్నునకు తెల్పెను. అందే జీవన్ముక్తులు నివసించుచున్నారు. అచటనే సాక్షాత్తు యోగిచింత్యుడు, యోగీశ్వరు డయిన జనార్దనుడు సాంద్రానందాత్మకుడై చైతన్య దేహధారియై విరాజిల్లుచున్నాడు.

ఆ మహాత్ముని దర్శించిన పిమ్మట ఎవ్వరును మృత్యుసంసారమార్గమున పయనింపరు. బ్రహ్మకూడ తన ముక్తికొరకు జీవన్ముక్తులైన బ్రహ్మర్షులతోకూడ జనార్దనుని ఉపాసించుచున్నాడు.

నిర్ణీతమయిన ఆయుఃప్రమాణము పూర్తికాగానే బ్రహ్మ జీవన్ముక్తులైన బ్రహ్మర్షులతోకూడ ముక్తిని పొందును. స్తవనీయుడగు ఆ జనార్దనుడే లోకములను సృజించును. ఆ పురుషోత్తముడే మత్స్య కూర్మాది రూపములను ధరించి భువనములను రక్షించును. అతడే రౌద్రరూపమును దాల్చి లోకములను లయము చేయును. నారదమహర్షి ఇంద్రద్యుమ్నునితో ఇట్లు పలుకుచు బ్రహ్మలోకమును చేరెను. నారదమునీంద్రుడు క్షణకాలములో సమీపముననున్న సభాద్వారమున కేగెను. ఆ సభాస్థలి యందంతటను ఇంద్రాది దిక్పాలకులందరు నున్నారు. అట్లే మన్వంతరాధిపులుకూడ జనార్దనుని చిరకాలము ధ్యానించుచున్నారు. తదితరులు ద్వారప్రదేశమునందే ద్వారపాలకులచే లోపలికిపోకుండ నిషేధింపబడుచున్నారు.

ఇంద్రద్యుమ్న సహితుడు, బ్రహ్మమానసపుత్త్రుడయిన నారద మహర్షిని ద్వారపాలకుడు గాంచి సవినయముగ అవనతకంధరుడై వందన మాచరించెను.

4. ద్వారపాలకుడు నారదుని స్తుతించుట :

'ఓ నారదమునీంద్రా ! నీవు పదునాల్గు భువనములయందు తిరుగునట్టి రసికుడవు. నీ జనకుడగు బ్రహ్మదేవుని సభ నీవు లేకున్న శోభింపదు. ఈ బ్రహ్మసభయందు శ్రేష్ఠులైన మునులు బ్రాహ్మణులు బ్రహ్మవిదులు కలరు. ఇట గౌతమాది మహర్షులున్నారు. బహు తారలతో రజని చంద్రునితోకూడ యుండుట చేతనే ప్రకాశించుచున్నది' అని ద్వారపాలకుడు నారదుని స్తుతించి బ్రహ్మసభ లోనికి ప్రవేశపెట్టెను.

## 23 వ అధ్యాయము

1. నారదమహర్షి దౌవారికునికి ఇంద్రద్యుమ్ని ఘనత తెల్పుట :

'ఓ దౌవారిక ! ఈతడు ఇంద్రద్యుమ్నమహారాజు ; రాజర్షి ; మహాయశస్వి ; సార్వభౌముడు ; వైష్ణవోత్తముడు. ఇప్పుడీ నృపతి బ్రహ్మదేవుని చూచుటకై వచ్చినాడు' అని నారదుడు ద్వారపాలకునితో చెప్పెను.

2. మణికోదరుడను ద్వారపాలకుడు నారదునితో ఇంద్రద్యుమ్నునిగూర్చి వచించుట :

'ఓ నారదమునీంద్రా ! నీ వనుమతించినచో ఈ మహానుభావుడు విధాత యొక్క సమ్ముఖమునకు పోవచ్చును. నీతోవచ్చిన ఈ రాజేంద్రుడు సామాన్యుడు



ని తెలియుచున్నది. ఈ సభలో దిక్పాలకులు పితరులు మన్వంతరాధిపతులు లనుందురో, మర్త్యలోకవాసి యయిన ఈ నరేంద్రుడును అచటనే కూర్చుండ ను.

స్వామీ ! మీరే పద్మయోని కడ కేగి ఈతని రాకను తెల్పుడు. సభా రముననున్న యీ మానవేశుడు దిక్పాలురతో కలిసిపోగలడు. భగవంతు యిన చతురాననుడు గానము వినునపుడు ఏకాగ్రచిత్తుడు కాగలడు. ద్వార లకులుగ నియమితులమైన మేము సమయమును తప్పక కనిపెట్టవలయును. నీ కునకు సేవకుడయిన నాయెడ కోపింపకుము' అని ద్వారపాలకుడు నారదుని ర్థించెను.

నారదమహర్షి జగత్పతి యగు బ్రహ్మ సమీపమునకు వెళ్లి, అతనికి సాష్టాంగ దండప్రణామ మాచరించి ఇంద్రద్యుమ్నుని రాకను తెల్పెను.

విధాత తన కటాక్షముచేతనే నృపుని ప్రవేశమును అనుమతించెను. భగవంతుడగు తమ్మిచూలి నారదుని దివ్యగానమును వినుచు ఆనందపరవశుడగుటచే ఏమియు పలుకకుండెను. తండ్రి యభిప్రాయ మెరిగిన బ్రహ్మసుతుడు ఇంద్రద్యుమ్నుని సభలో ప్రవేశపెట్టెను.

రాజు శక్రాదులతోకూడ నిరీక్షించినవాడై జగత్స్రష్టను దూరమునుండి చూచి సాక్షాత్తు దారుమయుడగు హరిని తలంచెను. భూపతి చేతులు జోడించి నమస్కరించుచు, మెల్లమెల్లగా ముందుకు వెళ్లెను. నారదుని యాజ్ఞానుసారముగ ఇంద్రద్యుమ్న నృపతి హరిని స్తుతించుచు ప్రణామము చేయుచు భీతిచే త్రొట్రుపాటుపడి కొంతదూరమందుండెను. ఇంద్రద్యుమ్నుడు పవిత్రమైన లక్ష్మీపతి చరితమును గానముచేయుచుండ, చతుర్ముఖుడు వినుచు, పార్శ్వములందు పవిత్రీ శారదాదేవులు చామరములు వీచుచుండ, వేదములు పరమ పవిత్ర మూర్తులను ధరించి నుతించుచుండ ఆ బ్రహ్మ ముహూర్తకాలము అట్లే ఉండెను.

3. బ్రహ్మ ఇంద్రద్యుమ్నుని రాకకు కారణ మడుగుట :

'ఓ రాజేంద్ర ! ఈ లోకమున నిమేషాది సూక్ష్మకాలమును కల్పించుచున్నను, యుగములో క్రమము తప్పట ఇందు జన్మజరామరణములు కూడ కలుగవు. ఇటకు వచ్చినవారికి మానసిక శారీరక వ్యాధులు రావు. ఇంకను ఇక్కడ మన్వంతరాదులు యుగావర్తాదులు కల్పాంతాదులుకూడ నుండవు.

ఓ మహాసత్త్వ ! నీవు సాక్షాత్తు భగవత్ప్రియుడవు. అన్యులకు దుర్లభమయిన సత్యాఖ్యమగు లోకము నీకు తెలియును. క్షీణకల్మషులయిన మునులు ఈ సత్యలోకమునకు రావలెనని కోరుచుందురు. ప్రళయకాల పర్యంతము తపోనిష్ఠులై యుందురు. పదునాల్గు భువనములయందు సృజింపబడిన సకల ప్రాణులకు

విచిత్రములైన చైతన్యాదులకు ఈ లోకమే ఆశ్రయము. ఓ మాననీయా ! నీ విట కేలవచ్చితివో నీమనస్సులో నున్నదానిని స్పష్టముగ తెల్పుము. నన్ను చూచినచో అమృతమైనను దుర్లభము కాదు. అది కోరుదువా ?

4. ఇంద్రద్యుమ్నుడు పితామహుని ఆహ్వానించుట ;

ఓ విధాత ! నీవు భగవంతుడవు ; అంతర్యామివి కావున నీకు తెలియని దేమున్నది.? అయినను నన్ను ప్రశ్నించుట నన్ను అనుగ్రహించుటయేకదా ! నీ యాజ్ఞను శిరసావహించి నీ తనయుడగు నారదమునీంద్రుడు చెప్పినట్లు సహస్రక్రతువు లొనర్చితిని. యాగాంతమున దారుదేహమును దాల్చిన శ్రీహరి ఆవిర్భవించెను. ఆ పురుషోత్తముడు భూతభవ్య వర్తమానములకు ప్రభువు. నీ అనుగ్రహము వలననే అట్టి పుండరీకాక్షుని గాంచుచు, తన్మూలమున నీ లోకమున కేతెంచితిని. పురుషోత్తమ క్షేత్రమున ఆ పురుషోత్తమునకే ప్రాసాద నిర్మాణము నారంభించితిని.

ఓ లోకభావన ! నీవు స్వయముగా అటకు వచ్చి జగన్నాథుని ప్రతిష్ఠింతు వేని నాయెడ నీకుగల యనుగ్రహము సఫలమగును.

ఓ జగత్ప్రభూ ! ఇపుడు నారదునితో కూడ నీ పాదపద్మములను దర్శించి ఆ కార్యమునకు నిన్ను ఆహ్వానించుటకే నీలోకమునకు వచ్చితిని. నీవు జగన్నాథుడవు. నన్ననుగ్రహించి జగన్నాథుని ప్రతిష్ఠించుటకు రమ్ము. ఆ పురుషోత్తమ క్షేత్రమందలి జగన్నాథుడవు నీవే.

ఓ విభూ ! మీ యిరువురకును భేదము లేదు. ప్రతిష్ఠింపబడు జగన్నాథుడవు ప్రతిష్ఠించు జగన్నాథుడవు నీవే. తెలిసికొనదగినవాడవు, తెలిసికొను వాడవు కూడ నీవే' అని ఇంద్రద్యుమ్నుడు బ్రహ్మదేవునితో పలికెను.

5. దుర్వాసమహాముని బ్రహ్మదేవునితో సంభాషించుట :

దుర్వాసుడు బ్రహ్మదేవునకు సాష్టాంగదండప్రణామమాచరించి చేతులు జోడించి సవినయముగ ఇట్లు పలికెను.

'ఓ జగద్గురూ ! విభూ ! నీ సభాద్వారముకడ నున్న ద్వారపాలకులు లోకపాలురను మన్వంతరాధిపతులను లోనికి ప్రవేశింపనీయనందున వారు దీనజనులవలె చిరకాలము నుండి అట ఉపవిష్టులైరి. వారు నీ పాదసరోరుహములను వీక్షించుటకు ఆజ్ఞనొసంగుము' అని చెప్పెను.

6. బ్రహ్మ దుర్వాసునితో పల్కుట :

'ఓ మునీంద్ర ! లోకపాలురు మున్నగువారు మోహపరవశులై ఇంద్ర ద్యుమ్నుని రెండవ స్వర్గకలిగియున్నారు. వారి ప్రస్తావనయే లేదు. ఇంద్ర



ద్యుమ్నన్నృపతి పాపరహితుడు, జీవన్ముక్తుడు. నా సంతతిలో ఐదవవాడు, వైష్ణవుడు, విష్ణుభక్తితత్పరుడు.

ఈ లోకపాలురు మన్వంతరాధిపులు సుఖభోగములనుభవించుటకై కర్మల నాచరించి పురుషార్థములను పొందిరి. ఈ దేవతలు ఈ బ్రహ్మలోకమునకు వచ్చుటకై తపమాచరించి నన్నుపాసించి నాయనుగ్రహమునకై ఇటకు వచ్చిరి. వారు నీయనుజ్ఞను పొంది నా దర్శనమునకు రావచ్చును' అని బ్రహ్మ దుర్వాసుని తో చెప్పెను.

ఆ దేవతాదులు దుర్వాసుని వాక్యానుసారముగ బ్రహ్మలోకము నందలి సభామందిరములోనికి ప్రవేశపెట్టబడి దూరమునుండి బ్రహ్మదేవునకు ప్రణమిల్లిరి. అదేసమయమున నమస్కరించిన లోకపాలురను జగత్ప్రభువగు విధాత కటాక్షము చేతనే, అనుగ్రహించెను. అత్తరిని బ్రహ్మ సమక్షమున గానము చేయుచున్న వారిసమీపముననున్న ఇంద్రద్యుమ్నునితో చతురాననుడు సంభాషించుచుండెను.

7. బ్రహ్మ ఇంద్రద్యుమ్నునితో సాదరముగ వచించుట :

ఓ రాజా ! భగవంతుని నివాసమునకు నీవు ప్రశస్తముగ ప్రాసాదమును నిర్మించితివి. నాసన్నిధిని గానమును వినుచున్న నీయొక్క కాలము చాల వరకు గడచినది.

ఓ నృప ! నీకాలము, రాజ్యము సంతతికూడ గతించినవి. డెబ్బది యొక్క దేవయుగములు మన్వంతరము.

ఓ నరపతి ! నీ వంశము విచ్ఛిన్న మయినది. క్షితిపతు లెందరో పరమపదించిరి. తుదకు దారుమయుడగు జగన్నాథుని విగ్రహము ఆ స్వామికై నిర్మించిన ప్రాసాదము ఆ రెండే మిగిలియున్నవి. రెండవ మను వయిన స్వారోచిషునకు ఆదియుగము. నా సన్నిధినున్నవానికి మృత్యువు కాని, ముసలితనముకాని సంభవింపవు. ఋతువుల విపర్యయముకాని కాల పరిణామముకాని కలుగవు.

ఓ రాజేంద్ర ! దేవుని ప్రతిమ, ప్రాసాదము నీ యధీనము చేసికొని వేగముగ మరల రమ్ము. అటులకానిచో నేను నీవెంటనే రాగలను. ఓ మహాభాగ ! నా కంటె ముందుగ భూలోకమునకు వెళ్లి అచట అవసరమయిన సంభారమును సమృద్ధిగా సమకూర్చిన పిమ్మట నేను వచ్చెదను' అని పితామహుడు ఇంద్రద్యుమ్నమహారాజును ఆజ్ఞాపించెను. దేవతలు భీతితో చేతులు జోడించి తలవంచుకొని బ్రహ్మ యెదుట నిలుచుండిరి. బ్రహ్మ సురలను వీక్షించి 'ఓ దివౌకసులారా ! మీరందరును ఒక్కసారి వచ్చితిరేల ?

అలస్యము చేయక నేను మీకు చేయవలసిన పనిని తెల్పుదు. త్రిదశులు ధాతృవచనమును విని భయమును వీడి సంతోషముతో బ్రహ్మకు బదులు చెప్ప నారంభించిరి.

8. దేవతలు భగవంతుడయిన పితామహునితో సంభాషించుట :

'ఓ చతురానన ! పూర్వము మేము నీలాద్రి యందు మణిస్వరూపుడు అంతర్హితు డయిన భగవంతుని ఉపాసించితిమి. ఆ స్వామియే ఇంద్రద్యుమ్న నృపతి చేసిన క్రతుమధ్యమున ఆవిర్భవించినాడు. ఈ విషయమును తెలిసి కొనుటకే నీ పాదపద్మములను ఆరాధించుటకై ఇటకు వచ్చితిమి. దయతో మాకు నీవా రహస్యమును తెల్పుము' అని దేవతలు బ్రహ్మను ప్రశ్నించిరి.

9. బ్రహ్మ సురలకు దారుమూర్తియగు జగన్నాథుని గూర్చి చెప్పుట :

'ఓ సురలారా ! నేను ఈ రహస్యమును మున్నెన్నడును ఎవ్వరికిని తెలుపలేదు. దేవతలగు మీరందరు చిరకాలము క్రిందట ఇటకు వచ్చి సమావేశమై యున్నందుగుటచే మీకు ఈ యుత్తమ రహస్యమును ఎరిగించెదను.

ఓ దేవతలారా ! జనార్దనుడు పూర్వపరార్థమందు పురుషోత్తమక్షేత్రమున నీలమణితనువును దాల్చి విడువ లేదు. ఇప్పుడు నా ద్వితీయ పరార్థము సముపస్థిత మయినది. శ్వేత వరాహకల్పమున స్వాయంభువమనువు ప్రవర్తిల్లు చున్నాడు. ఈ కాలము అద్యదినమునకు ప్రాతఃకాలము. దారుమూర్తి యగు జగన్నాథస్వామి భువనముల మధ్యభాగమున వేంచేసి యున్నాడు. ఈ ప్రభువు నా యాయుఃప్రమాణముతో విరాజిల్లెను.

ఓ సురలారా ! ఈ స్వామి నాయాత్మ. నేనీతని స్వరూపుడనే. స్థావర జంగమాత్మక మయిన ఈ ప్రపంచమందు మా యిరువురకు ఏ మాత్రము భేదము లేదు. క్షీరసాగరమధ్యభాగమున శ్వేతద్వీపకల్పకమున యోగనిద్రా యుతుడై శయనించిన ఆ పురుషోత్తముడే సకలజగములకు మూలము. అతని దేహమందలి పవిత్ర రోమములే కల్పద్రుమములు. అవి శంఖచక్రాంకితములై శోభిల్లు చున్నవి.

ఓ దేవతలారా ! ఆ వృక్షముల నడుమ నున్న చైతన్యవృక్షము నేనే. సత్య పూరుషుడగు జనార్దనుడు సింధుసలిలములతో స్వయముగా ఉద్భ వించెను. శ్రీహరి త్రిలోకము లందలి భోగములనుభవించుటకై దారుదేహము ను ధరించెను. నిర్విరామముగ సృష్టిస్థితిలయ కార్యములచే ఖిన్నుడనై ఘోర సంసారనాశనమును చేయుటకు అనేక సహస్ర జన్మములందు జనార్దనుని భక్తియోగముతో ధ్యానించితిని. దుష్కరములయిన ధ్యానయోగ పద్ధతుల



లంబింపనివారికిగూడ, 'భగవంతుడగు ఆ పురుషోత్తముడు అశేషకర్మ గన మొనర్చుటకు సర్వజనుల శ్రేయస్సునకు, భక్తకోటికి మోక్ష మొసగు కు అవతరించెను. అతని శరీరము ప్రచ్ఛన్నముగా నున్నది. అతని పుణ్య క్షేత్రమును గూర్చి ప్రస్తుతము విచారింపనక్కరలేదు. ధర్మగ్రాహ్య ప్రమాణముతో డు చూడబడునో అతడే పురుషోత్తముడు. ఆ దేవుడు చతుర్వర్గప్రదుడు వున అతనినే ప్రార్థింపవలయును. భూలోకమున ఆ దివ్యమూర్తిని దర్శించిన లు క్రమముగా పాపరహితులై నిర్మలాత్ములై ముక్తిభాజనులు కాగలరు. బ్రహ్మదేవుడు విబుధులకు చెప్పెను.

సురలు పద్మసంభవుని వచనామృతమును గ్రోలి ప్రహృష్టాంతరంగులై సత్యమశాశ్వతము కావున భూలోకమున పవిత్ర క్షేత్రమున వెలసియున్న గవంతుని నియమనిష్ఠలతో ఆరాధించుటకై నిశ్చయించికొనిరి.

0. బ్రహ్మదేవుడు దేవతలను పురుషోత్తమక్షేత్రమును దర్శింపుడనుట :

'ఓ సురలారా ! ఇంద్రద్యుమ్నుని అనుగ్రహించుటకై శ్రీహరి స్వయం కాశమానుడయ్యెను. అక్కడకు మీరు పోయినచో ఆ భక్తవత్సలుడగు దేవుయొక్క ప్రతిమయే మీతో స్వయముగా సంభాషించి. వరములను సాదింపను. ఇంద్రద్యుమ్న మహారాజు నిర్మించిన ప్రాసాదమున స్వామిని ప్రతిష్ఠించుటకు నేను కూడ రాదలచితిని. మీరు కూడ అటకు వెళ్లవలయును. ఇంద్రద్యుమ్నుడు భగవంతుని విగ్రహప్రతిష్ఠకు కావలసిన వస్తువులను సేకరిం చుటకై ముందుగ భూలోకమునకు పోవును. అటకు మీరుకూడ వెళ్లి అతనికి విధేయులై సాహాయ్య మొనర్పుడు.

ఓ త్రిదశులారా ! ఇప్పటికి ప్రథమ మన్వంతరము గడచినది. మీరు భూలోకమునకేగి ఇంద్రద్యుమ్నునకు అతనిచే నిర్మింపబడిన ప్రాసాదమునందలి జగన్నాథుని ప్రతిమపై అతనికి స్వామ్యముండుటకు తోడ్పడుడు. అందుచే అత డిపుడే ఆ సత్కార్యమునకు అవసరమగు సంభారమును సంపాదించుటకై ఉద్యుక్తుడగును. ఈ కార్యక్రమమును పురస్కరించుకొని నా యాజ్ఞాను సారముగ పద్మనిధికూడ భూతలమునకు తరలును' అని బ్రహ్మ సురలకు ఆదేశించెను.

జగన్నాథుని ప్రతిష్ఠకు కావలసిన సామగ్రిని సమకూర్చగల బ్రహ్మ సంబంధమైన సిరిని గాంచిన ఇంద్రద్యుమ్నుడు హృష్టాత్ముడై బ్రహ్మాజ్ఞను శిరసావహించి క్షీణాధికారు లయిన దేవతలతో కూడ పద్మగర్భుని యనుమతిని పొంది భూలోకమున కేగెను.

## 24వ అధ్యాయము

1. ఇంద్రద్యుమ్నుడు పురుషోత్తమక్షేత్రమున నున్న జగన్నాథుని స్తుతించుట :

ఇంద్రద్యుమ్నుడు బ్రహ్మయానతిచే బ్రహ్మలోకము నుండి భూలోకమునకు వచ్చి పురుషోత్తమక్షేత్రమున నున్న జగన్నాథుని సన్నిధికి ఏతెంచి, ఉత్కంఠ మానసుడై ఘనరోమాంచకంచుకుడై సాష్టాంగ దండప్రణామ మాచరించి యిట్లు స్తుతించెను –

'ఓ బ్రహ్మణ్యదేవ ! గోబ్రాహ్మణహితంకర ! ప్రణతార్తిహర ! చతుర్వర్గ ఫలప్రద ! హిరణ్యగర్భపురుషప్రధాన వ్యక్త స్వరూప ! వాసుదేవ ! శుద్ధజ్ఞాన స్వరూప ! నీకు నాసాష్టాంగదండప్రణామములు' అని ఉచ్చైఃస్వరముతో ఇంద్రద్యుమ్నుడు జగన్నాథుని నుతించెను.

2. దేవతలు జగన్నాథుని నుతించుట :

పురుషోత్తమ క్షేత్రమునకు వచ్చిన దేవతలు జగన్నాథునకు ప్రణమిల్లి – 'ఓ విరాట్పురుష ! సహస్రశీర్షుడవై సహస్రాక్షుడవై సహస్రపాదుడవై దశాంగుళపరిమాణము కలవాడవై భూమిని సమస్తమును వ్యాపించియుంటివి. నీవే పరబ్రహ్మస్వరూపుడవు. పరమాత్మస్వరూపుడ వని కీర్తింపబడుచున్నావు. సర్వకాల స్వరూపుడవు నీవే. నీ మహిమ వర్ణనాతీతము. సర్వజీవులు నీ నాల్గవ భాగము. నీ మూడు భాగములు నాశరహితములై దేవలోకమున నున్నవి.

ఓ పురుషోత్తమ ! నీవలననే ఛందస్సులు, యజ్ఞపురుషుడు, అశ్వములు, గోవులు, మేషాదులు జనించినవి. నీ ముఖము నుండి బ్రాహ్మణులు, బాహువుల నుండి క్షత్రియులు, ఊరువులనుండి వైశ్యులు, పాదములనుండి శూద్రులు ప్రభవించిరి.

ఓ విశ్వరూప ! నీ మనస్సు నుండి చంద్రుడు, చక్షువుల నుండి సూర్యుడు కర్ణముల నుండి ప్రాణవాయువు, జిహ్వనుండి హవ్యవాహనుడు, నాభి నుండి గగనము, శిరస్సు నుండి స్వర్గము, పాదముల నుండి భూమి, చెవి నుండి అష్టదిక్కులు ప్రభవించినవి. నీవలన ఏడుసంధులు, ఇరువదియొక్క సమిధలు, చరాచరములు, సర్వభావములు ఉద్భవించినవి.

ఓ జగన్నాథ ! పరిపాలక ! ఉగ్రరూప ! సంహర్తా ! పరమేశ్వర ! నీవే యజ్ఞమవు ; యజ్ఞాంశుడవు ; యజ్ఞేశుడవు ; పరాత్పరుడవు ; పరమ మయిన శబ్దబ్రహ్మవు. నీవే విశ్వేశ్వరుడవు. ఓ జగత్పతీ ! స్వరాట్సమ్రాడ్విరాడ్రూపధారివి నీవే ! 'ఓ జగన్మయ ! ఊర్ధ్వాధోభాగములు, తిరోభాగము కూడ నీవే. యాజ్ఞికులు



...కై యజ్ఞము లొనర్చి పరమస్థానమును పొందు చున్నారు. భోజ్యము, హవిస్సు, హోత, హవనము, ఫలప్రదుడవు కూడ నీవే.

ఓ ప్రభూ ! నీవే సమస్త కర్మభోక్తవు ; సర్వకర్మాత్మకుడవు. నీవే కర్మోపకరణమవు. సకల కర్మఫలప్రదాతవు నీవే. నీవే కర్మప్రేరకుడవు. ధర్మకామార్థసిద్ధి నిచ్చువాడవు. ఓ హృషీకేశ ! నీకంటె అన్యు డెవ్వడు ...సీయగలడు ? నీకు మా నమస్కారములు. నీ వనంతుడవు. సహస్ర ...క్షివి. సహస్రపాదాక్షి శిరోరు బాహు విరాజితుడవు. నీ సహస్రనామములు ...కములు. నీవు శాశ్వత పురుషుడవు. సహస్ర కోటీయుగధారివగు నీకు మా ...నములు. ఓ విభూ ! మేము చ్యుతాధికారులమై నిన్ను శరణు పొందితిమి. ...ండరీకాక్ష ! మమ్ములను రక్షింపుము. గతిలేని మాకు గతివి కమ్ము. ప్రభూ ! సంసారపతితు డయిన జీవికి నీవే శరణము. నీ సృష్టియందు నీకు ...వ్యుడు లేడు. ఓ దీనానాథశరణ్య ! నీవే జగత్పితవు. ఓ ఈశా ! సంరక్షకా ! ...శా ! సర్వాపద్వినివారక ! ఓ జగన్నాథ ! విష్ణూ ! పరమేశ్వరా ! ...మ్ములను రక్షింపుము.

ఓ కమలాకాంతా ! అంతర్యామీ ! సర్వతేజోనిధీ ! సకల ప్రాణికోటిని ...రక్షించుటయందు నీకంటె సమర్థుడు ఇంకెవ్వడున్నాడు ? నీకు మా ...ణామములు' అని దేవతలు జగన్నాథునకు మాటిమాటికి ప్రణామము లొనర్చి ...ంచిరి.

దేవతలు నీలాచల శిఖరమును జూచి ఆశ్చర్యపడుట :

దివిజులు ఇంద్రద్యుమ్న నృపతితో కూడ బాహ్యప్రదేశమునకు వచ్చి నరసింహక్షేత్రమునకు పోయి ఆ స్వామికి వందన మాచరించి పరమభక్తితో ...ర్చించిరి. నీలాద్రిశిఖరమున ఇంద్రద్యుమ్న నిర్మిత ప్రాసాదమున జగన్నాథుని ప్రతిష్ఠించుట కవసరమైన సంభారమును చేకూర్చు పద్మనిధితో కూడ దేవతలు ...రిగిరి. సురలు అచట గగనమండల మందు వ్యాపించియున్న అత్యున్నత ...ఖరమును గాంచిరి. అది వింధ్యగిరిని భానుని గమనమును అరికట్టుటకు ...చినట్లున్నది. మరియు ఆ శిఖరము విచిత్ర ఘటనోజ్జ్వలమై బహుకాలమునకు ...తిక్రమించిన విచిత్రమైనదై సకల దిక్కులను వ్యాపించియున్నది' అని దేవతలు ...లాద్రి శిఖరమును జూచి భావించిరి.

ఇంద్రద్యుమ్నుడు జగన్నాథుని ప్రతిష్ఠించుటకు అవసరమైన సంభారమును ...ర్చి ఆలోచించుట :

'నేను ఇంతకుపూర్వమే జగన్నాథుని ప్రతిష్ఠించుటకు బ్రహ్మదేవుని ...ర్థించుటకై సత్యలోకమున కేగితిని. అల్పకాలములోనే ఉత్తమము పరిపూర్ణ

మయిన ప్రాసాదము సుందరాకారమును దాల్చుట దైవానుగ్రహము వలననే కాని మానుషప్రయత్నము వలన కాదు. సూర్యచంద్రేంద్ర రోధిక యగు మన్వంతర సమాప్తి ఎక్కడ ? అయినను దుర్లభమైన ఈ ప్రాసాదము భాసించుచున్నది.

మానుష నిర్మితములైన యీ ప్రాసాదములు వల్మీక సదృశములై యున్నవి. మొక్కలు పెరుగుటచే అవి స్వల్పకాలములోనే శిథిలము లగుచున్నవి. నాయందనుగ్రహబుద్ధిచే హరికి నివాసభూతమగు ఈ భవనము రక్షింపబడినది' అని రాజు సాహాయ్య మొనరించినవారిని ప్రశంసించెను. దారురూపశరీరుడగు జగన్నాథుడు తానే స్వయముగా అచట వెలసెనని రాజు వారికి విశదీకరించెను. అతనికై తాను ప్రాసాదమును నిర్మించినట్లును ఇంద్రద్యుమ్నుడు దేవతలు మున్నగు వారితో నుడివెను.

5. ఆకాశవాణి ఇంద్రద్యుమ్నునితో పల్కుట :

'ఓ ఇంద్రద్యుమ్న మహారాజా ! నీలాద్రిశిఖరముపైని సహస్రపాణి ప్రమాణముగల ప్రాసాదనిర్మాణమును జగదీశ్వరుని నివాసమునకై శీఘ్రముగ పూర్తి చేయుము. దీని ప్రతిష్ఠకై పద్మయోని సిద్ధ బ్రహ్మర్షి దేవతలతోకూడ స్వయముగా వచ్చును' అని ఆకాశవాణి పల్కెను.

ఈ కార్యక్రమమును నిర్వర్తించుటకు తగిన పదార్థ సంచయమును ఎవ్వరు సమకూర్తురో ఎట్లు తెలియగలదు' అని పలికిన రాజుతో భగ్నాధికారులయిన దివిజు లిట్లు పలికిరి :

6. దేవతలు ఇంద్రద్యుమ్నునితో వచించుట :

'ఓ రాజా ! సంభారమును ఎవ్వరు సమకూర్తురో మనకు తెలియదు. మన గురువు ఇపుడు మన సన్నిధిని లేడు. అతడు మనకు హితుడు. అన్యలోకమున నున్నాడు' అని చెప్పిరి.

7. పద్మనిధి ఇంద్రద్యుమ్నునికి తన రాకనుగూర్చి తెల్పుట :

'ఓ నృపేంద్ర ! బ్రహ్మచే ఆజ్ఞాపింపబడినవాడనై నీతోకూడ బ్రహ్మ లోకమునుండి ఇటకు వచ్చితిని. ఈ ప్రతిష్ఠ విషయమై నన్నేమి చేయమందువు ? ఏ వస్తుసామగ్రికై నిరీక్షించుచున్నావు ? నా విధిని నేను నిర్వర్తించుటకు సిద్ధముగా నున్నాను' అనెను.

ఈ విధముగ ప్రతిష్ఠాకార్యక్రమమునుగూర్చి ఆలోచించుచున్నవారిలో సర్వశాస్త్ర విశారదుడగు నారదుడు అగ్రగామి. అతడు బ్రహ్మదేవునిచే ఇటకు



ర్యము పంపబడెను. బ్రహ్మ నారదునితోకూడ ఇంద్రద్యుమ్న నిర్మిత ప్రాసా మును శ్రీ జగన్నాథుని ప్రతిష్ఠించుటకవసరమయిన సామగ్రిని యథాశాస్త్రముగ కూర్చుమని చెప్పెను. నారదుని శాసనమువలన పద్మనిధి ఆ సామగ్రిని కూర్చెను. బ్రహ్మ సుతుడగు నారదమునీంద్రుని దేవతలు చూచి ఆనందముతో నిలుచుండిరి. ఇంద్రద్యుమ్న భూపతి షడర్ఘ్య పూజావిధితో నారదుని జించెను.

మనుష్యాకారమును దాల్చిన సురలుకూడ నారదమహర్షికి వందన మాచ రిరి. ఇంద్రద్యుమ్న నృపతి జగన్నాథుని ప్రతిష్ఠావిధికై అవసరమగు వస్తు లము తనకు తెలియదని పురోహితుడుకూడ తనయొద్ద బాలకాలమునుండి నియు, కావున సంపాదింపవలసిన వస్తుచయమును తెల్పుమని నారదుని డుకొనెను.

## 25వ అధ్యాయము

ఇంద్రద్యుమ్నుని కోరికను మన్నించి నారదముని శాస్త్రప్రకారము క్రమాను రముగ పత్రమందు ప్రతిష్ఠావిధికి కావలసిన వస్తుసామగ్రిని వ్రాసి రాజున నగెను.

ఆ రాజు నారదుడొసగిన పత్రమును శ్రద్ధగా చదివి, ఆ పత్రమును మరి న్ని వస్తువుల పట్టికనుకూడ పద్మనిధికి ఇచ్చి ఆ వస్తువులను సంపాదింపు మని రెను.

. ఇంద్రద్యుమ్నుడు పద్మనిధిని ప్రతిష్ఠావిధికి వచ్చువారికి ఉచితములగు వసతులను నిర్మింపుమనుట :

'ఓ పద్మనిధీ ! స్వర్ణమయమయిన శాలను నిర్మింపుము. మరియు బ్రహ్మ దేవునకు దివ్యమైన సదనమును బ్రహ్మర్షులకు నిర్మలమైన వసతిని అట్లనే ఇంద్రాది సురలకు సిద్ధులకు మర్త్యలోక వాసులయిన మునీంద్రులకు రాజులకు పాతాళవాసులకు నాగరాజులకు త్రైలోక్యవాసులకు తగిన ఆసనములతోకూడిన గృహములను జాగరూకుడవై శీఘ్రముగా నిర్మింపుము. ద్రవ్యసంభారమును సేక రింపుము. భవన నిర్మాణమునందు విశ్వకర్మకూడ నీకు సాహాయ్య మొనరించును' అని రాజు పద్మనిధితో పల్కెను.

2. నారదుడు ఇంద్రద్యుమ్ననితో రథాదుల నిర్మాణమునుగూర్చి చెప్పుట :

'ఓ ఇంద్రద్యుమ్న మహీపతీ! వివిధ సంభారసులను కాలవ్యవధి ననుసరించి ప్రత్యేకముగ సేకరింపవలయును.

సువర్ణఖచితములయిన మూడు ఉత్తమ రథములను దృఢముగా తయారుచేసి, విలువయిన దుకూలరత్నమాలాదులచే అలంకరింపవలెను. జగన్నాథుని రథముపై గరుడధ్వజము, సుభద్రాదేవి శిఖరముపై పద్మధ్వజమును ఉంచవలయును. శ్రీహరికి నిర్మింపు రథమునకు షోడశచక్రములు, బలరాముని రథమునకు చతుర్దశ చక్రములు, సుభద్ర రథమునకు ద్వాదశ చక్రములు ఉండవలెను.

శ్రీ జగన్నాథుని రథ విస్తారము పదునారు హస్తములు ; బలరాముని రథ విస్తారము పదునాల్గు హస్తములు ; సుభద్రా రథ విస్తారము పంద్రెండు హస్తములు ఉండవలయును.

జగములకు ఆసనము గొప్పది. విగ్రహము తన యాసనము నందుండును. ఆసనము కదలుటవలన జగత్తులకు నాశనము చేకూరును. కావున యానముండదు. నిర్మలమయిన జ్ఞానదర్పణమునందు చరాచరమగు విశ్వమును చూడవలయును. ఆ జగన్నాథుని హస్తతలమున నిత్యము నిర్మలమగు దర్పణ ముండును.

బలభద్రుడు శేషుని అవతారము. అతని రథముపై తాళ వృక్షాకారమయిన ధ్వజముగాని హలధ్వజముగాని కట్టవలెను. బలరాముడు తాలధ్వజుడని ప్రసిద్ధి గాంచెను.

ఓ నృపా! శ్రీ జగన్నాథస్వామిని ప్రతిష్ఠావిధి చేయని రథముపైని, ప్రాసాదముపైని, మండపముమీద, పురమందున ఉంచుట నిష్ఫలమగును. కావున శ్రీహరియొక్క రథమునకు మొట్టమొదట ప్రతిష్ఠ చేయవలెను. ఆ ప్రతిష్ఠకు కావలసిన సంభారము సేకరింపవలయును. నియమానుసారముగ ప్రతిష్ఠించుట నా కర్తవ్యము.

ఓ భూపాలా! నా తండ్రియగు పితామహుని యాజ్ఞను పొంది మరల శీఘ్రముగ రాగలను' అని నారదుడు రాజుతో వచ్చెను.

నారదుని యాజ్ఞానుసారము మూడు రథములు నిర్మింపబడినవి. పద్మనిధి సంపాదించిన వస్తుసామగ్రితో విశ్వకర్మ ఒక్కదినముననే సాక్షాత్తు రవి రథముతో సమానమయిన రథమును తయారుచేసెను. ఆ రథమునకు మంచి అక్షము, చక్రములు, స్తంభములు, తోరణము, ధ్వజము, పతాకము కలవు. ఆ రథము



లముగాను, నానా చిత్రములతో మనోహరముగను, విచిత్రబంధ మిథున తలీవలయ శోభితముగ నున్నది.

మరియు ఆ రథమునందు కొంత భాగము బంగారపు రేకులు స్థాపింపబడినవి. మేఘ నిర్ఘోషముగల యీ రథమునకు వాయువేగముతో పరుగిడు అశ్వములు నూరు కలవు.

దైవజ్ఞుడు చెప్పిన శుభలగ్నమున సుముహూర్తమున మంచి తిథియందు నారదమహర్షి శాస్త్రవిధానముతో రథప్రతిష్ఠను గావించెను.

3. నారదు డొనర్చిన రథప్రతిష్ఠావిధిని జైమిని మునులకు తెల్పుట :

'ఓ మునులారా! రథమునకు ఈశాన్యదిగ్భాగమున శోభాయమానమగు శాలను నిర్మించి, దాని మధ్యభాగమున మండపమును కట్టి, దానిమీద నిర్మలమగు చతుర్హస్త పరిమితిగల చతురస్రాకారమగు ఉన్నతమైన వేదిక నిర్మింపబడినది.

పరిశుద్ధుడు ప్రాఙ్ముఖుడయిన ఆచార్యునిచే శుభప్రదమయిన ప్రతిష్ఠాపూర్వదినమున రాత్రియందు ఉత్తరదిగ్భాగమున సుముహూర్తమున స్వస్తి వచనముతో అంకురార్పణము వేయబడినది. యథావిధిగ ముప్పదియిద్దరు దేవతలకు బలి యొసంగబడినది. పిమ్మట ప్రాతఃకాలమున వేదికయొక్క మధ్యభాగమున మండలము వ్రాయబడినది. దానిపైని పద్మము లేక స్వస్తికము లేక కుంభము పెట్టవలెను. ఆ కుంభములో పంచద్రుమములతో తయారుచేసిన కషాయము, గంగాది పుణ్యనదీజలము, పల్లవములు, మృత్తిక, సర్వసుగంధద్రవ్యములు, పంచరత్నములు, సర్వౌషధములు విధిపూర్వకముగ వేయబడినవి. పిదప ఆచార్యుడు విష్ణువును స్మరించి పంచగవ్యమును ఆ కుంభములో నుంచెను.

అటు తరువాత ఆచార్యుడు నరసింహస్వామికి పట్టుబట్టలు కట్టి అతని కంఠమున శోభాయమానములగు ఫల పల్లవయుతములగు సుగంధసుమమాలలు వేసి అలంకరించి ఆ కుంభములో మంత్రపూర్వకముగా సర్వోపచారములతో హరిని ప్రార్థించి విధిపూర్వకముగ బాహ్యోపచారములతో ఆవాహన చేసి పూజించెను.

ఆచార్యుడు ఆ కుంభమునకు వాయవ్యభాగమున సమిదాజ్యచరువులతో విధి ప్రకారము, అష్టోత్తరసహస్రపర్యాయములు హోమము చేసెను. కుంభమునకు మధ్యభాగమున దాని యంతమున సంపాతములు (పక్షిగతి విశేషములు) గావింపబడినవి.

రథము పతాకాగంధమాల్యములతో శోభాయమానముగా అలంకరింప బడినది. సుగంధచందనజలముతో దాని సర్వాంగములు తడుపబడినవి. ఆచార్యుడు రథమునకు కాలాగురు ధూపమొసగి శంఖకాహళ మంగళధ్వనులతో నృసింహస్వామి ధ్వజముపైని వాయువును విధిప్రకారము ప్రతిష్ఠించెను.'

పిమ్మట ఆచార్యుడు గరుత్మంతుని రక్తస్రగ్గంధ మాల్యములతో పూజించి మంత్రమును ఉచ్చరించి ఇట్లు ప్రార్థించెను –

శ్లో॥ యో విశ్వప్రాణహేతు స్తమురపిచ హరేర్యానకేతు స్వరూపోః
యం సంచింత్యైవ సద్యః స్వయమురగవధూ వర్గ గర్భాఃపత న్తి
చంచచ్చండోరుతుండత్రుటిత ఫణివసారక్తపంకాంకితాస్యమ్
వందే ఛందోమయం తంఖగపతి మమలం స్వర్ణవర్ణం సుపర్ణమ్

బ్రహ్మఘోషలు, శంఖనాదములు, నానా వాద్యములతో మంగళధ్వనులు శ్రావ్యముగ వినబడుచుండగ ఆచార్యుడు రథశిఖరముపైని గరుత్మంతుని ప్రతిష్ఠించెను. రథమును అన్ని వైపుల పదుపుమండగా, రథోపరిభాగము నందున్న కుంభము నందలి పూతజలము పవిత్ర మంత్రోచ్చారణముతో ఆచార్యుడు మున్నగువారిపై జల్లబడినది. తరువాత పూర్ణాహుతి చేసి ఆచార్యునకు సంతుష్టికరముగు దక్షిణ సమర్పింపబడెను. ఆ కార్యక్రమము ముగిసిన వెంటనే బ్రాహ్మణులకు పాయసాది షడ్రసోపేత మగు భోజనము పెట్టిరి.

బలభద్రస్వామి యొక్క రథప్రతిష్ఠ ద్వాదశాక్షర మంత్రముతో గావింప బడినది. 'లాంగలంచ పవిరవత్' అను మంత్రమును లేదా ద్విషడ్వర్ణముగల మూలమంత్రము లాంగలధ్వజునకు వినియోగింపబడెను.

సుభద్రాదేవి రథము లక్ష్మీసూక్తపఠనపూర్వకముగా ప్రతిష్ఠింపబడినది –

'నాభిహ్రదాస్మురారే స్త్వం ! బ్రహ్మాండావళిరూపధృక్ !
ఆసనం చతురాస్యస్య శ్రియో వాసస్థిరోభవ'

అను మంత్రము నుచ్చరించి, పద్మధ్వజారోహణము చేయవలెను.

మూడు రథములకు ప్రత్యేకముగ తయారుచేసిన హవిస్సుతో హోమము చేయవలెను. ఇట్లు మూడు రథములకు ప్రతిష్ఠావిధి నొనర్చి సువర్ణము, గోవు, వస్త్రము, ధాన్యము, దక్షిణభక్తితో జగన్నాథునకు సమర్పింపవలెను.

మనోహరముగ అలంకరింపబడిన రథమునకు ప్రతిష్ఠావిధి సమాప్తి కాగానే బ్రహ్మవాద్య ఘోషలు జయ మంగళధ్వనులు వినబడుచుండగా, జగన్నాథ స్వామి విగ్రహమును రథముపై ప్రతిష్ఠించి చామరములతో వీచి, ఇతర లాంఛన



ములతో ధూపము వేసి, పుష్పవర్షము కురిపించి. ఆ రథమును బ్రాహ్మణక్షత్రియ వైశ్యులు లాగవలెను. శుభలక్షణములుగల అశ్వములు, వృషభములు, పురుషు లయిన విష్ణుభక్తులుకూడ ప్రమాదరహితముగ ఆ రథమును ఈడ్చవలెను.

అపుడు సర్వజనులకు షడ్రసోపేతమయిన, భోజనమును తృప్తిగా పెట్ట వలెను. ఆచార్యుడు రథముపైనున్న దేవతలకు బలిమంత్రము నుచ్చరించుచు –

శ్లో॥ బలింగృహ్ణాన్తు భోదేవా ! ఆదిత్యా వసవ స్తథా !
మరుతశ్చాశ్వినౌరుద్రాః సువర్ణాః పన్నగాగ్రహాః !
అసురాయాతుధానాశ్చ రథస్థాశ్చైవ దేవతాః
దిక్పాలలోకపాలాశ్చ ! యేచ విఘ్న వినాయకాః
జగతః స్వస్తికుర్వన్తు దివ్యామహర్షయ స్తథా !
అవిఘ్నమాచరంత్వేతే మాసంతుం పరిపంథినః !
సౌమ్యాభవంతు తృప్తాశ్చ దైత్యాభూత గణాస్తదా !

అని బలినొసంగవలెను.

ఆచార్యుడు మున్నగు భక్తులు వైష్ణవగాయత్రీ మంత్రమునుపవిత్ర మయిన విష్ణుసూక్తమును ఉచ్చరించుచు జగన్నాథస్వామి రథమును సమ్ముఖమికి గొంపోవలయును.

శిష్టాచారసంపన్ను లయిన వామదేవులు జగన్నాథస్వామిని స్తుతించు చుండగా, మంగళ వాద్యఘోషలు వినిపించుచుండగా, భక్తులు భక్తిప్రపత్తులతో జగన్నాథుని రథమును మెల్లమెల్లగా లాగుచుండవలెను.

### 4. జైమినిముని ద్విజులకు ఉత్పాతములను తెల్పుట :

'ఓ ద్విజులారా! రథము యొక్క దండము విరిగినచో ద్విజులకు భయము, అక్షము భగ్నమయిన క్షత్రియ క్షయము ; తులాభంగముచే వైశ్య నాశము, శమి విరిగినచో శూద్రులకు భయము కలుగును. రథముయొక్క ధురాభంగమువలన అనావృష్టి, పీఠము పగిలిన ప్రజాభయము, చక్రములు విరిగినచో శత్రుసైన్యాగమము, సంభవించును. రథము నుండి జెండా పడినచో అప్పటి సింహాసనాధిష్ఠితు డయిన రాజునకు ప్రమాదము కల్గును అతనిస్థానమున ఇతరుడు రాజగును. దేవుని విగ్రహమునకు భంగము వాటిల్లినచో రాజునకు మరణముసంభవించును. రథము ముక్కలుచెక్కలుగా విరిగినచో జానపదు లందరు నశింతురు. ఇట్టి అశుభము లయిన ఉత్పాతములు కలిగినచో మరల బలికర్మ శాంతి హోమము చేసిబ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. అన్యులకు కూడ

అన్నదానము చేయవలెను, రథమునకు తూర్పుదిక్కున ఉత్తరదిక్కునందు, మంత్రపూర్వకముగ అగ్నిని పుట్టించి (ప్రకల్పించి) సమిధలు, ఘృతము, ఆజ్యము, ముష్టిగువానితో హోమము చేయవలెను. ఆచార్యుడు దీక్షవహించి, పలాశ సమిధలతో సోమాగ్నులకు ప్రజాపతికి ప్రజలకు గ్రహములకు బ్రహ్మకు దిక్పాలకులకు తృప్తికల్గునట్లు హోమము చేయవలెను.

రథము యొక్క యేయే భాగములందు దోషము లుండునో ఆయా దోషపరిహారమునకు ఆచార్యుడు నిర్మలచిత్తుడై దీక్షపూని ప్రతిష్ఠా మంత్రముతో హోమము చేసి తదనంతరము శ్రోత్రియులగు బ్రాహ్మణులతో కూడ ఈ శాంతి వచనములను —

శ్లో॥ స్వస్తిర్భవతు విప్రేభ్యః। స్వస్తిరాజ్ఞేస్తు నిత్యశః।
గోభ్యః స్వస్తిప్రజాభ్యస్తు। జగతః శాంతిరస్తు వై।
స్వస్త్యస్తు ద్విపదేనిత్యం। శాంతిరస్తు చతుష్పదే।
శంప్రజాభ్యస్తథైవాస్తు। శంతథాత్మని చాస్తునః।
శాంతిరస్తుచ దేవస్య। భూర్భువః స్వః శివంతథా।
శాంతిరస్తు శివంచాస్తు। సర్వతః స్వస్తిరస్తునః।
త్వందేవ। జగతః స్రష్టా ప్రోష్టాచైవ త్వమేవహి।
ప్రజాః పాలయ దేవేశ। శాంతిం కురుజగత్పతే।

అని పఠింపవలెను.

భూపతికి అకారణముగ హానిచేయు దుష్టగ్రహముల నెరిగి, వానికి గృహ శాంతి చేయవలయును" అని జైమిని ద్విజులకు చెప్పెను.

## 26వ అధ్యాయము

1. జైమిని ద్విజులకు గాలభూపతి గాథను తెల్పుట :

'ఓ మునులారా! భక్తకోటి ఉత్పాతరహితమైన సుముహూర్తము నందు, ప్రాసాదసమీపము నందలి సముద్రదేశమునకు యథావిధిగ మూడు దేవతా విగ్రహములను అనగా సుభద్రా జగన్నాథ బలభద్రుల విగ్రహములను తీసికొని వెళ్లిరి.

విశ్వకర్మ ఇంద్రద్యుమ్న నృపుని యాజ్ఞానుసారముగ అత్యుత్తమ మయిన శాలను రత్నములతో నిర్మించెను. ఆ సభాకార్యక్రమమునకు అవసరమైన వస్తువులు హవిస్సులు సమిత్కుశలు నానావిధ భోజ్యములు సమకూర్చబడినవి. వివిధ గీత నృత్య ప్రదర్శనలు ప్రారంభమైనవి. పూర్వము ఇంద్రద్యుమ్నుని



సామ్రాజ్యమునందు ఎట్టి సంపదలుగలవో అట్టి సంపదలు ఇప్పుడును కలవు. ఈ దేవతా విగ్రహములు ప్రతిష్ఠకు శ్రేష్ఠులయిన విప్రులు వచ్చిరి.

ఆ సమయమునందే భూలోకమున గాలుడను రాజు చిన్నప్రాసాదమును నిర్మించి అందు శిలతోచేసిన మాధవుని విగ్రహమును ప్రతిష్ఠించి భక్తిప్రపత్తులతో పూజించుచుండెను.

పిమ్మట గాల నృపతి గూఢచారులవలన ఇంద్రద్యుమ్న మహీపతి చేయు చున్న జగన్నాథాది దేవవిగ్రహప్రతిష్ఠా కార్యక్రమమునుగూర్చి విని క్రుద్ధుడై తనసైన్యముతోకూడ నీలాచలమునకేగి, అట ఎట్టి మానవులకును స్వప్న మందైనను చూడశక్యము కాని ప్రతిష్ఠాసంభారమును గాంచి విస్మయావిష్టచిత్తుడై యుండెను.

అప్పుడు గాలనృపతి అట్టి దివ్యకార్యమును చేయుచున్న వాడెవ్వడని ప్రయత్నించి తెలిసికొనెను. ఆ మహత్తర కార్యమును చేయుచున్నవాడు ఇంద్రద్యుమ్న నృపతి అనియు, అతడు బ్రహ్మలోకమునుండి తిరిగివచ్చి, జగన్నాథుని ప్రాసాద నిర్మాణమును పూర్తిచేసి, దేవతలతో కూడ ప్రతిష్ఠావిధి చేయుటకు వచ్చెననియు, ఆ కార్యక్రమమునకు అవసరమగు సంభారమును సమకూర్చునట్టి పద్మనిధినారదులతో కూడ వచ్చెననియు, గాలనృపతి స్వయముగా తెలిసికొనెను.

అంతియేకాక గాలప్రభువు ఆ ప్రతిష్ఠావిధికి సురోత్తముడగు బ్రహ్మకూడ వచ్చునను దివ్యవృత్తాంతమును విని తాను కృతార్థుడయినట్లు భావించి, తన రాజ్యమున అంతకంటె శ్రేయస్కరమగు ఉత్తమకార్యము గతములో జరుగ లేదనియు భావిలో జరుగబోదనియు విశ్వసించెను.

మరియు గాలభూపతి అచటచేయుండి ప్రతిష్ఠాకార్యక్రమవిధిని, ఉత్స వములను తెలిసికొని ప్రతిసంవత్సరము తాను కూడ చేయించుటకై నిశ్చయించు కొనెను.

సాక్షాత్తు దారుమయుడు బ్రహ్మస్వరూపుడునగు ఈ జనార్దనుని తన దుర దృష్టవశమున ఇంతకాలము తెలిసికొనలేక పోయినందులకు తన జన్మము విఫల మయ్యెనని గాలనరపతి విచారించెను.

ఇంద్రద్యుమ్ననృపతి, జగద్గురువు, మహాభాగవతశ్రేష్ఠుడు, బ్రహ్మలోకము నుండి వచ్చినవాడు కావున గాలమహీపతి వందనమాచరించెను. ఇంద్రద్యుమ్న నిర్మితమయిన దివ్యప్రాసాదమున ప్రతిష్ఠింపబడు నారాయణ ప్రభువును దర్శించి

శరణు పొందినవిమ్మట ముక్తినిగూడ గాంచవచ్చునని గాలనరపతి దృఢముగా నమ్మెను.

ఇంద్రద్యుమ్న మహారాజు వైకుంఠవాసుడగు హరిని ప్రతిష్ఠించి తరువాత కార్యభారమును తనపైనుంచునని గాలవ ప్రభువు ఆశించెను. బ్రహ్మలోకము నుండివచ్చిన ఇంద్రద్యుమ్నుడు ధరణీతలమున నుండునా? జగన్నాథునకు పూజాది కార్యక్రమములు చేయుటకై ఆజ్ఞాపించి దేవదేవునకు ద్రవ్యనిధిని ఏర్పరచి బ్రహ్మతోకూడ మరల వెళ్లును. అని వైష్ణవుడగు గాలరాజు మంత్రులతోకూడ ఆలోచించెను. గాలభూపతి ఇంద్రద్యుమ్నుని దూరమునుండి భయముతో చూచుచు చేతులు జోడించి నమస్కరించుచు నమ్రుడై అతనిసన్నిధికి మెల్లమెల్లగా వెళ్లెను' అని జైమిని ద్విజులతో అనెను.

2. గాలవిభుడు ఇంద్రద్యుమ్న నృపతితో సంభాషించుట :

'ఓ ఇంద్రద్యుమ్నమహారాజా! నీవు రాజరాజవు. మర్త్యుడవయినను బ్రహ్మలోకమున కేగితివి. జీవన్ముక్తుడవు. ఈశ్వరుడవగు నిన్ను సామాన్య నృపుడనగు నే నెట్లు స్తుతింపగలను?

'ఓదేవా! నీ మహిమనెరుగక, అహంకారముతో సచివులతో ఆలోచించి నీతో యుద్ధము చేయుటకై వచ్చితిని. అతిమానుషము మహత్తరమగు నీ పదవిని ఇంద్రపదవిగా భావించుచున్నాను. బ్రహ్మలోకమునుండి వచ్చిన నీవిట్టి మహత్కార్యమును చేయుచున్నావు.

'ఓ నరోత్తమ! త్రైలోక్యవాసులు, దేవతలుకూడ నీ యాజ్ఞావశవర్తులై ఉన్నారు. నా మనస్సు నిర్మలముగా నుండునట్లు, నన్ననుగ్రహింపుము' అని గాలనృపతి ఇంద్రద్యుమ్నునితో పలికెను.

3. ఇంద్రద్యుమ్నుడు గాలనృపునకు జగన్నాథుని పూజాదికార్యములను అప్పగింపదలచుట :

'ఓ గాలభూపాల! నీ మాటలు ఆశ్చర్యజనకముగనున్నవి. నీవును హరిభక్తుడవే. సార్వభౌముడవు. మహీపతివి. భూస్వామ్యముగల రాజునకిది సామాన్య విషయమే. ప్రస్తుతము ఈ భూప్రదేశమునందు నీ వొక్కడవే పార్థివుడవు. మానవుల అభివృద్ధి కార్యములైనను దేవతల కార్యములయినను నృపులపైనే ఆధారపడియుండును. ఏలనన బ్రహ్మదేవుడు అష్టదిక్పాల కాంశలతో రాజును సృజించుచున్నాడు.

ఓ ప్రజాపాలనతత్పర! రాజు అల్పపుణ్యము చేసినవాడు కాడు.



ఓ రాజశార్దూల! ఉత్తమ మార్గగామియగు రాజు ఇహలోకమున కీర్తిని ధర్మమును పొందుచున్నాడు. నీవు సామాన్యుడవు కావు. విశేషించి వైష్ణవుడవు. జగన్నాథుని పూజను యథావిధిగజేసి ఏ పుణ్యాత్ముడు ప్రాసాదమున జనార్దనుని ప్రతిమను స్థాపించునో అతడు దేహబంధమును పొందక విష్ణువుయొక్క పరమ పదము పొందగలడు.

ఓ భూప! శుభలక్షణములతో దారుమయమయిన యీ మాధవప్రతిమ నిశ్చయముగ ముక్తినిచ్చును. నీవును స్వయముగ ఇట్టిదానిని ప్రతిష్ఠించితివి. నీవు తలపెట్టిన కార్యము నిర్విఘ్నముగ జరిగినది. నాకు ఈ సత్కార్యము విషయమై మన్వంతరము గడచినది. ఈ పవిత్ర కార్యము జరుగునో జరుగదో అని నాకు సంశయముగా నున్నది. ఈ దేవతామూర్తుల ప్రతిష్ఠకు చతుర్ముఖుని ప్రార్థించితిని.

ఓ నృపోత్తమా! సాక్షాత్తు దార్వవతారము యొక్క ప్రాసాద ప్రతిష్ఠావిధిని పితామహుని కంటె అన్యుడెవ్వడుచేయును? విధాత ప్రతిష్ఠావిధినిచేసి అనుగ్రహించును. ఈ నాల్గు రూపములను దాల్చిన జనార్దనుని నీకప్పగించి నేను బ్రహ్మతో ఏగెదను. జగన్నాథునకు చేయవలసిన నిత్యోపహారములు రథ యాత్రలు ఉత్సవములు జగన్నాథుడు తెల్పును. లేదా పితామహుడయినను స్పష్టము చేయును. వానిని ధర్మపాలకుడవగు నీవే తప్పక ఆచరింప వలెను'. అని ఇంద్రద్యుమ్నుడు గాలనృపతితో పలికెను.

గాలనృపతి తాను తలంచిన దానిని ఇంద్రద్యుమ్నుడాజ్ఞాపించి నందులకు పరమానందభరితు డయ్యెను.

4. జైమిని ద్విజులకు బ్రహ్మరాకకు పూర్వరంగమును వర్ణించుట :

గాలనృపతి ఇంద్రద్యుమ్నుని సన్నిధిలో కూర్చుండి అతని యాజ్ఞాను సారముగ పనులుచేయ నారంభించెను. ప్రతిష్ఠావిధికి సంభారములన్నియు సమకూడుటచే దేవతలచే పరివృతుడై సింహాసనముపై ఆసీనుడైన ఇంద్రద్యుమ్న మహీపతి ఇంద్రునివలె ప్రకాశించెను. తరువాత శుభప్రదములయిన దివ్య దుందుభిధ్వానములు మృదంగవేణు వీణాదితాలకాహలాది ధ్వనులు వినబడినవి. ఆకాశమున ఐరావతాది గజముల ఘీంకారములు, సర్వత్ర జయశబ్దములు శ్రవణ గోచరములయినవి. పుష్పవృష్టి కురిసినది. మందార మిశ్రితములైన ఆకాశగంగా సలిల కణములు చిలకరింపబడినవి. దివ్యస్రగ్లేపధూప గంధ పరిమళములు దిక్కులందు వ్యాపించినవి. వైమానికులయిన దేవతల కింకిణీజాల నిస్వనములు శ్రావ్యముగా నుండెను. రోదసీమధ్యభాగమున తేజోరాశి దేదీప్యమానముగ ప్రకాశించి

భూ ప్రదేశమునన్న చూపరులకు నయనాహ్లాద కరమయ్యెను. ప్రజలు కంటి రెప్పలు వాల్చకుండ ముందువైపుచూచిరి. ఇమ్మట వారికి ప్రజాపతియొక్క విమానము గోచరమైనది. కొందరు వందలకొలది స్వర్ణ హంసలను మూపురముల పై మోయుచుండిరి.

దిక్పాలురు చామరములు వీచుచు పితామహుని సేవించిరి. అంతటను పవిత్ర జాహ్నవీయమునాజలకణములను చల్లుచుండిరి. ఉభయపార్శ్వముల యందున్న సూర్య చంద్రులు ఆతపత్రములను ధరించిరి. అత్తరిని మలయ మారుతము మోదావహముగ వీచుచుండెను.

గౌతమాది బ్రహ్మర్షులు ఇంద్రద్యుమ్నాది నృపులు తమ మధ్యనున్న ప్రజాపతిని స్తుతించిరి. దేవగణము విధాతను జయశబ్దములతో నుతించెను. రంభాది దేవకాంతలు నృత్యము చేసిరి. హాహాహూహూ ప్రభృతి గంధర్వులు గానము చేసిరి. సిద్ధవిద్యాధర గణములు పితామహుని సాదరముగ సేవించిరి. తపస్వులు ముకుళితహస్తులై దూరమునుండి విధాతను ఉపాసించిరి. సావిత్రీ శారదలు పరమేష్ఠిని విచిత్ర ప్రబంధముల కొనియాడిరి. ఆతనిని స్తుతి పాఠములతో తృప్తిపరచగలిగినవారు ఆ ఇద్దరిని మించి ఎవ్వరున్నారు ?

బ్రహ్మ దేహము జాహ్నవీయమునాజలసిక్తమయ్యెను. నారదాది మునులు గంధర్వ సిద్ధాదులు నమ్రులయిన వేత్రహస్తులు దివ్యసోపానములందు కానవచ్చిరి.

స్వర్గవాసులయిన దేవతల సమ్మర్దము ఎక్కువయ్యెను. ఎవ్వరే మార్గమున పోవుచున్నారో బ్రహ్మయే గ్రహింపలేకపోవుచుండెను. దివిజులు జగన్నాథుని ప్రతిష్ఠాకార్యక్రమమును తిలకించుటకు తమతమ వాహనములపైని బయలువెడలి ఒకరికంటె ఇంకొకరు ముందుగా పోవలయునను యత్నముచేయుచు సమ్మర్దముచే తొట్రుపాటు పడుచుండిరి.

జగత్స్రష్ట, రక్షకుడు, సంహర్త అయిన సాక్షాత్తు జగన్మయుడగు బ్రహ్మయే వెళ్లుచుండగా, అక్కడ సురల విషయమై చెప్పవలయునా ?

ఇంద్రద్యుమ్న నృపతి జగత్స్రష్టను భయముతో గాంచి భక్తితో ప్రణమిల్లి దేవనారదగాల రాజాది సహితుడై ధరణిని చేరు సమయమాసన్నముకాగా, పరమ భక్తితో ఆ విధాతకు సాష్టాంగ దండప్రణామము లాచరించి, లేచి, ప్రహ్లాదాంతరంగుడై, పులకాంకిత సర్వాంగుడై, తాను కృతార్థుడైనట్లు భావించి, జగదీశ్వరుని సన్నిధిలో శబ్దస్వరూపుడయిన ఆ పితామహుని అవలోకించుచు, కృతాంజలియై, ఆనందసాగరమున నిమగ్నుడయ్యెను.



## 27వ అధ్యాయము

### 1. జైమిని ద్విజులకు బ్రహ్మరాకను తెల్పుట :

"ఓ మునులారా ! అంతరిక్షమునుండి వచ్చుచున్న బ్రహ్మదేవుని విమానముయొక్క పాదపీఠమునకు రత్నకాంచన నిర్మితమైన నిచ్చెన సంలగ్నమై యుండెను. పితామహుడు దిగుటకు ఆ నిచ్చెన మొదట భూమిని స్పృశించుచుండెను. అది వాల్గుబారల నిలువు, దట్టమైన సోపానశ్రేణి కలిగియుండెను.

రథ ప్రాసాదముల నడుమ మెరుపుతీగవలెనే శోభాయుతుడగు ఇంద్రద్యుమ్నుడు జనులకు అద్భుత శరీరుడై సాక్షాత్కరించెను.

ఇమ్మట గంధర్వ రాజులు, రత్నదండధరులు ప్రజలను హెచ్చరించుచు రాజు వచ్చుటకు మార్గమును సుగమము చేయుచుండిరి. దుర్వాస నారద మునీంద్రులు బ్రహ్మ హస్తములను సాదరముగ పట్టుకొని యుండగా, బ్రహ్మ తన చూపులతో జగత్తును పవిత్రము చేయుచు, విమానపుమెట్లు దిగెను. జగత్స్రష్ట దేవేంద్రునకుకూడ ఆశ్చర్యజనకముగానున్న సమలంకృతప్రాసాదమును, రథములను, రత్న స్తంభోపశోభితము, దిగంతవ్యాప్త, సర్వసంభారము సంభృతము అయిన శాలను గాంచెను.

తరువాత దేవబ్రహ్మర్షి భూపతులు అవనత శిరస్కులై వందనము లాచరించుచు, స్తుతించుచుండగ పితామహుడు రథమునుండి దిగెను. విధాత అటనున్న వారి నందరిని తన కటాక్షవీక్షణములచే అనుగ్రహించెను. అచటనున్న కోట్ల కొలది సుర నర లోకవాసులు వినమ్రులై చేతులు జోడించి ధాతకు ప్రణామము చేయుచుండిరి. అపుడు ఇంద్రద్యుమ్న మహారాజు పద్మయోని పాదపద్మములకు ప్రణమిల్లెను" అని జైమిని మునులకు తెల్పెను.

### 2. బ్రహ్మ ఇంద్రద్యుమ్నునితోకూడ జగన్నాథుని దర్శించుట :

ప్రజాపతి స్మితపూర్వభాషియై, ప్రేమతో ఒకేచోట ఒక్కమారు సంతసముతో సమావిష్టులైన పితరులను బ్రహ్మర్షులను తాపసులను సిద్ధవిద్యాధరులను యక్ష గంధర్వాప్సరసలను, నిర్దేశించుచు "ఓ ఇంద్రద్యుమ్నా ! సర్వ లోక వశీకరమయిన నీ భాగ్యమును గాంచుము. నన్ను పురస్కరించుకొని నీకొరకు అందరును ఒక్కమారు ఇట సమావేశమైరి" అని పలికి నారాయణుని రథముకడకేగి జగన్నాథునకు వందన మాచరించి, ముమ్మారు ప్రదక్షిణముచేసి ఆనందసింధువు నందోలలాడుచు, రోమాంచగాత్రుడై గద్గద స్వరముతో ప్రత్యక్షమగుచున్న తన రూపమును తన్నుతానే నుతించుకొనెను.

3. బ్రహ్మ జగన్నాథస్వామిని స్తుతించుట :

శ్లో॥ నమస్తుభ్యం నమోమహ్యం । తుభ్యంమహ్యం నమోనమః ।
అహంత్వంత్వమహం సర్వం । జగదేతచ్చరాచరమ్ ॥
మహదాది జగత్సర్వం । మాయావిలసితంతవ ।
అధ్యస్తంత్వయి విశ్వాత్మం స్త్వయ్యేవ పరిణామితమ్ ॥

ఓ జగన్నాథ! నీకు నమస్కారము. నాకు నమస్కారము. నీకు నాకు నమస్కారములు. నేనే నీవు, నీవే నేను. చరాచరాత్మకమగు ఈ జగమంతయు నీవు నేను నిండియున్నాము. మహదాది జగత్తు నీ మాయావిలసితమే. అది విశ్వాత్ముడవగు నీలోనే ఇమిడియున్నది. అది నీచేతనే పరిణామము పొందింప బడినది.

దృగ్గోచరమగు యీ జగత్తు నిన్ను తెలిసికొనునట్టి జ్ఞానము లేకుండుటవలన సత్యమనెడి భ్రాంతికల్గుచున్నది.

నీ నిజస్వరూపమును తెలిసికొనిననాడు రజ్జుసర్పాది భ్రాంతివలెనే ఈ అభాస అణగిపోవును. సత్యమువలన సత్త్వవివేకమువలన ఇయ్యది అనిర్వచనీయము.

ఓ అద్వితీయ జగద్భాన! స్వప్రకాశ! నీకు నా వందనములు. సహజానంద స్వరూపుడవగు నీయొక్క అంశమే విషయానందమయిన యీ సమస్తము. జంతు కోటి దానిచేతనే జీవించుచున్నది.

ఓ నిష్ప్రపంచ! నిరాకార! నిరాశ్రయ! స్థూల సూక్ష్మాదిమహిమాన్విత! స్థౌల్య సూక్ష్మ వివర్జిత! గుణాతీత! గుణాధార! త్రిగుణాత్మక! నీకు నా హృదయపూర్వక వందనములు. నీ మాయచే మోహితుడనగుటచేతనే సృష్టి మాత్రపరాయణుడనైతిని. ఇప్పటికిని సుఖమును పొందనైతిని. ఓ అంతర్యామి! నీకు నా ప్రణామములు. నీ నాభిపంకజమునుండి జనించిన నేను నిత్యము అచటనే నిన్ను స్తుతించుచు నీ మాయనతిక్రమించుటకు అసమర్థుడనగుచున్నాను.

స్వామీ! నిన్ను మించిన ప్రభువెవ్వడున్నాడు? నేను నీ యిచ్ఛచే సృష్టి కర్మమునందు నిమగ్నుడనై యున్నాను.

ఓ ప్రభూ! బ్రహ్మాండమునందు బ్రహ్మలు ఆరోహణ క్రమముతో ఒప్పుచున్నారు. మూడున్నర కోట్లసంఖ్యతో అలరారుచున్న త్రిమూర్తులలో ఏ యొక్కడైనను నీ యెదుట నేనెట్టున్నానో యథార్థముగ తెలిసికొనలేకపోవుచున్నాడు.



ఓ అచింత్యమహిమాన్విత! దివ్యాదివ్య స్వరూప! దివ్యరూప! జరా మృత్యువిహీన! మృత్యురూప! జ్వలదగ్ని స్వరూప! మృత్యువునకు కూడ మృత్యువయినవాడ! ప్రపన్నమృత్యునాశక! సహజానంద రూప! భక్తిప్రియా! జగత్పిత! జగన్మాత! ప్రణతార్తినాశక! నిత్యక్రియాశీలా! దీనజన కృపాసాగర! పర! పరరూపా! పరంపరా! అపారపారావారా! బ్రహ్మస్వరూపా! పరమార్థ స్వరూపా! పరంపరాపరివ్యాప్త! పరతత్త్వపరా! ప్రణతార్తినాశకా! స్వాత్మైకబాంధవా! ఓ జగన్నాథ! నా యీ సృష్టిభారమును తప్పింపుమని ఇటమున్ను ప్రార్థించితిని. అట్లు చేయుము.

ఓ సహజానందరూపా! నీవు నాయెడల ప్రసన్నుడవయిన నాకు దుర్లభమయినదేమున్నది?

ఓ కృపాంబుధీ! వాస్తవముగ మనకిద్దరికిని భేదము లేదు. నీ లీలలో భేదముండుటచే నీకంటె నన్ను భిన్నునిగా ఒనర్చినవాడవు నీవే.

అజ్ఞానతిమిరచ్ఛన్నమయిన జగత్కారాగృహాంతరమున తిరుగుచున్న జడుడు ముక్తిప్రదుడవగు నీ యనుగ్రహము లేనిదే, నీ ద్వారసమీపమునకు కూడ చేరలేడు.

ఓ జగదేకవంద్య! సురాసురాభ్యర్చిత పాదపద్మ! తాపహరైకచంద్ర! శర్మసుబోధసాంద్ర! కల్పకదూరభూత! దుష్ప్రాప్యకామప్రదకల్పవృక్ష! దీనజన శరణ్య! ప్రణతైక దుఃఖార్తిహర!

ఓ జగన్నాథ! దుఃఖసాగరోద్ధారక! కరుణాకర! కటాక్షలీలాత్రాత! రక్షింపుము, రక్షింపుము" అని పితామహుడు జగన్నాథుని వేదార్థములతో స్తుతించి ధరణీధరుడు హలధరుడయిన బలరాముని కడకేగి పరమభక్తితో వందన మాచరించెను.

4. బ్రహ్మ బలరాముని నుతించుట ;

"ఓ బలభద్ర! దేవేశ! నభస్సు నీశిరస్సు, జలము నీమేను. భూమి నీ పాదములు. అగ్ని నీముఖము. వాయువు నీ ఊపిరి. ఓషధీశుడు నీ మనస్సు. దివాకరుడు నీనేత్రములు. ఓ నాథ! దిక్కులు నీ బాహువులు. ఓ జ్ఞాన దర్పణ! నీకు నా నమస్కారములు. చతుర్దశభువనములకు మూల స్తంభమయిన ఓ హలధర! నీకు నావందనములు.

ఓ ఆశ్రిత వత్సల! భక్తపాపౌఘనాశక! అనంత వక్త్రనయన శ్రోత్ర పాదాక్షి బాహుశోభిత! అనాదిమహామూలతమస్తోమౌఘభాస్కర! త్రయీ

మయ ! త్రిదోషాపహ ! త్రిమూర్త్యవతార ! ఫణామణిఫణాకార ! క్షితిమండల ధర ! కాలాగ్నిరుద్ర ! మహారుద్ర ! నీకు నా ప్రణామములు.

ఓ భక్తవరద ! భోగతల్పఫణాచ్ఛత్రమధ్యసుప్తుడవు. వృద్ధుడవు. మహార్ణవజలమందు ఏకీభూత జగత్త్రయుడవు.

ఓ భగవంతుడా ! నీవే శేషుడవు. సహస్ర ఫణమండితుడవు. ఫణామణి గణవ్యాజసంభృతాఖిల లౌకికుడవు. సర్వులకు నీవే నాథుడవు. స్రష్టవు, భోక్తవు, పాలకుడవు. నిత్యము లోకధర్తవునీవే నావంటి వారికినీవే నిమిత్తము.

ఓ దివ్యస్వరూపా ! నారాయణా ! వేదాంతములయందు గానము చేయ బడుచున్నావు.

ఓ భగవంతుడా ! ఈ జగన్నాథుడు నీకంటె భిన్నుడుకాడు. కారణాంతరముచే భిన్నుడవగుచున్నావు. నీవు శయ్యవు. ఈ భగవంతుడగు జగన్నాథుడు శయిత. ధాదృశవు నీవు సంభాదకుడవు. రాముడే విష్ణువు. కృష్ణుడే బలరాముడు. మీ యిరువురకును భేదములేదు. ఓ జగన్మయ ! నన్ను గ్రహింపుము" అని బ్రహ్మ ప్రణుతించి పరమేశ్వరుడగు బలభద్రునకు ప్రణమిల్లెను.

5. బ్రహ్మ సుభద్రాదేవిని ప్రణుతించుట ;

బ్రహ్మదేవుడు సుభద్రాదేవియున్న రథము దగ్గరకుపోయి జగదీశ్వరిని గాంచి –

"ఓ జయదేవీ ! జగన్మాత ! పరమేశ్వరి ! కార్యకారణకర్త్రి ! సర్వశక్తి స్వరూపిణి ! సర్వహృదయనివాసిని ! జ్ఞానమోహాత్మిక ! కైవల్యముక్తిప్రద ! భద్ర ! విష్ణుమాయాస్వరూపిణి ! చరాచరమోహయన్త్రి ! హృత్పద్మాసన సంస్థిత ! విష్ణు భావానుసారిణి ! నీకు నమస్కారములు. నన్ను గ్రహింపుము. నీవే లక్ష్మివి, గౌరివి, శచీదేవివి, కాత్యాయనివి.

ఓ అఖిలాత్మిక ! ఏ సదసద్వస్తువయినను నీవే. ఏ సూక్ష్మవస్తువయినను నీవే. సర్వవస్తువులకు నీవే శక్తివి. నిన్ను స్తుతింపగల శక్తిమంతుడెవ్వడు ?

ఓ భద్ర ! నీవు సుభద్రవు. సర్వులకు భద్రదాయినివి. నీవు భద్రాభద్ర స్వరూపవు. ఓ భద్రకాళీ ! నీకు నా వందనములు.

ఓ దేవీ ! నీవు జగత్తులకు తల్లివి. ఆ నారాయణుడు తండ్రి. సర్వత్ర స్త్రీరూపమును దాల్చినదానవునీవే. పురుషరూపధారి జగదీశ్వరుడు. మీ



యిద్దరికి భేదములేదు. మీ యిరువురి కంటె వేరొక పరములేదు. విష్ణు మాయయగు నీచే మేము మాకార్యములందు నియుక్తులమైతిమి.

ఓ పరమేశ్వరి ! నీ యాజ్ఞను పాటించుచు, ప్రవర్తించుచున్నాము. నీవే ప్రాణి కోటియొక్క శ్రేష్ఠమయిన వృత్తి, ప్రవృత్తి, క్షుత్తు, నిద్ర, నీవే, ఆశవు, నీవే పూర్ణ మయిన ఆశలు కలదానవు. సర్వాశలను తీర్చుదానవు నీవే.

ఓ ఈశ్వరి ! ముక్తిహేతువునీవే. బంధహేతువునీవే. సర్వజ్ఞానప్రద ! నిత్య ! భక్తకల్పవల్లరి ! నీ పాదపద్మములకు ప్రణమిల్లుచున్న నన్ను నీకృపా పాంగ విలోకనములచే రక్షింపుము" అని బ్రహ్మ సుభద్రను ప్రణుతించెను.

పిమ్మట బ్రహ్మ సుభద్రకు దగ్గరనున్న రథముపై విష్ణువు యొక్క చతుర్థదేహమయిన సుదర్శన చక్రమునకు పరమ భక్తితో వందనమాచరించి యిట్లు స్తుతించెను.

6. బ్రహ్మ సుదర్శన చక్రమును స్తుతించుట :

"ఓ సుదర్శన ! మహాజ్వాల ! కోటిసూర్య సమప్రభ ! నీవు అజ్ఞానతిమిరాంధులకు వైకుంఠాధ్వప్రదర్శకుడవు. నిత్యము విలసిల్లు వైష్ణవస్వనికేతనుడవు. విష్ణువుయొక్క అవార్యపరాక్రమమే యా నీ సుదర్శన చక్రరూపము. నీకు నా ప్రణామములు" అని బ్రహ్మ స్తుతించెను.

పితామహుడు రథములపైనున్న దేవతా విగ్రహములకు ప్రదక్షిణము చేసెను. పిమ్మట ఇంద్రద్యుమ్ననారదులు గౌరవపురస్సరముగా చూపించుచున్న దారివే విధాత వెడలి ప్రాసాదమును చూచుటకు కుతూహలపడుచు నీలాచలము నధిరోహించెను. బ్రహ్మ సురలతో కూడ వెళ్ళి ప్రాసాద సమీపమున నున్న తనకునచ్చినట్టి మనోహరమగునట్టి శాలను గాంచెను. ఆ సుందరమందిరములో దేవతలు ఉరగులు భూపతులు బ్రహ్మర్షులు యోగులు విప్రులు. వైష్ణవులు తపస్వులు ఉపవిష్టులయిరి.

ఇంద్రద్యుమ్ననృపతి మర్యాదపూర్వకముగ ప్రతిపాదించిన పాదపీఠయుతమగు ఉత్తమసింహాసనమునందు బ్రహ్మదేవుడు ఆసీనుడయ్యెను.

వృద్ధిమంతుడగు రాజు శాంతికపౌష్టిక కర్మలనాచరించుటకు పితామహుని యాజ్ఞానుసారముగ భరద్వాజమహర్షిని ప్రార్థించి నియమించెను. ప్రతిష్ఠకు హోమములకు బలిపూజావిధికి ఏయేదేవతలు ఉద్దేశింపబడిరో వారు ధ్యానరూపమును దాల్చిరి. వారు చతుర్దిగ్భాగములందుండగా, గంధపుష్ప మాలాలంకార భూషణములచే సుపూజితులయిరి.

పిమ్మట ధీమంతుడయిన భరద్వాజుడు ప్రతిష్ఠాకర్మ నారంభించెను. ఇంద్రద్యుమ్ననృపతి ప్రత్యక్షముగ సాంగోపాంగముగ ముదముతో ముందుగ జగత్స్రష్టను పూజించి పిమ్మట దేవదేవుని సురలను త్రైలోక్యవాసులను పూజించెను. వారందరును ఇంద్రద్యుమ్నుని మూలముగ సభామధ్యభాగమున సాక్షాత్తు అవ్యయుడు, సృష్టికర్త, శరీరధారి, ప్రత్యక్షమయిన బ్రహ్మస్వరూపుడు అయిన జగన్నాథుని చూచుచు జీవన్ముక్తులయిరి.

భరద్వాజమునీంద్రుడు జగన్నాథుని విగ్రహమును మనోహరమగు ప్రసాదమును అత్యున్నతమయిన ధ్వజమును ప్రతిష్ఠించి, వానికి ప్రాణప్రతిష్ఠ చేయుమని బ్రహ్మదేవుని కోరెను. అత్తరిని బ్రహ్మ స్వయముగా స్వస్తియనము గావించి, నారదాది ఋషులతో పండితులయిన బ్రాహ్మణులతో, క్షత్రియులయిన రాజులతో, కూడుకొనియుండెను.

అపుడు గంధర్వులు మంగళప్రదములగు రాగములతో, సుస్వరముగ దివ్యకీర్తనలు గానముచేయు చుండిరి. అప్సరఃకాంతలు నృత్యము సల్పుచుండిరి. ద్విజులు శాకున సూక్తములు పఠించుచుండిరి. శంఖకాహళ మురజభేరీవాదిత్ర వీణానాదములు కర్ణపేయములుగ వినబడుచుండెను.

ఆ శుభసమయమున వారందరును స్యందనోపరిభాగమునకేగి సావధానులై సమాధియందున్న వారై భక్తితో జితేంద్రియులై రథము నుండి సోపాన మార్గమున దిగి జగన్నాథుని పార్శ్వములయందు భుజములయందు, శిరస్సున పాదముల యందు తమపాణుల నుంచి మెల్లమెల్లగా లీలావహితుడు అనామయుడయిన నారాయణుని వస్త్రముల మీదుగ తూలికలయందు ప్రాసాద సమీపమునకు గొంపోయిరి.

ఆ శుభముహూర్తమున దేవతాపుష్ప వృష్టులు కురియుచుండగా బ్రహ్మ జగన్నాథుని "లీలాదారుదేహ ! వాంఛాఫలప్రద ! సంసార సమ్మగ్న లీలోద్ధార ! అవ్యయ ! దయాసాగర ! దీనపరాయణ ! అచ్యుత ! అనన్త ! ఈశాన ! నీకు నమస్కారము. జయము జయము" అని స్తుతించెను.

నారదమహర్షి కూడ ముదాన్వితుడై వీణానాదము చేయుచు సంతుష్టుడాయెను. చంద్ర సూర్యులు భక్తితో జగన్నాథుని వెనుకనే నిలుచుండి అతని శిరస్సుపై రెండు రత్నఛత్రములను పట్టుకొనిరి. దివ్యధూపవాసనలు క్రమ్ముచుండగా జగన్నాథస్వామికి ఉభయ పార్శ్వములయందు సుందరాకారముగల భక్తులు చామరములు లీలగా వీచుచుండిరి.

ప్రాసాదద్వార సన్నిధిని రత్నస్తంభ నిర్మితమండపము నందలి సమ్ముఖాదర్శమండలమున అభిషేకమునకై ఆ నాలుగు దేవతా మూర్తులను ఉంచిరి.



పితామహుడు జగన్నాథాది విష్ణుప్రతిమలు నాల్గింటికి రత్నకుంభములందలి పుణ్యనదీ జలములతో, శ్రీ పురుషసూక్త విధిప్రకారము లోక శ్రేయస్సునకు అభిషేకము కావించెను. తరువాత దివ్యభావమడగు స్రష్ట గంధమాల్యోప శోభితములు అలంకృతములయిన ఆ దివ్యమూర్తులకు నీరాజనమునొసగి మంత్రపూర్వకముగ రమ్యమగు రత్నసింహాసనమున ప్రతిష్ఠించెను.

7. బ్రహ్మదేవుడు ప్రతిష్ఠానంతరము జగన్నాథుని నుతించుట :

"ఓ అశేషజగదాధార ! సర్వలోకప్రతిష్ఠిత ! సుప్రతిష్ఠితుడ ! అఖిలవ్యాపక ! ఓ జగన్నాథ ! ఈ ప్రాసాదమున సుస్థిరుడవుకమ్ము.

ఓ నాథ ! నీవు ప్రతిష్ఠితుడవయినందున మేమందరము ప్రతిష్ఠితులమయినట్లే.

ఓ స్వామీ ! నీ యాజ్ఞవలన, నీకరుణచేత ఈ ప్రతిష్ఠాకార్యక్రమము పరిపూర్ణమైనది" అని ధాత జగన్నాథుని స్తుతించెను.

8. జైమిని ద్విజులతో దేవతామూర్తులదర్శనమువలన కలుగు ఫలితమును చెప్పుట :

"ఓ ద్విజులారా ! బ్రహ్మదేవుడు జగన్నాథుని ప్రతిష్ఠించి అతని హృదంబుజమును స్పృశించి అనుష్టుప్ఛందస్సులో నున్న మంత్రరాజమును వేయిసార్లు జపించెను.

ఓ విప్రులారా ! వైశాఖమాస శుక్లపక్షమున అష్టమియందు పుష్యయోగమున గురువాసరమునందు దేవతామూర్తుల ప్రతిష్ఠ కావించబడినది. ఆ పుణ్య దినము సర్వపాపహరము. ఆనాడు చేసిన స్నానము దానము తపస్సు హోమము సర్వము అక్షయమగును.

ఆ పర్వదివసమున ఏ మానవులు భక్తియుతులై శ్రీ కృష్ణుని బలరాముని సుభద్రాదేవిని దర్శించెదరో వారు ముక్తినందగలరు. సందేహము లేదు.

ఏనాడు వైశాఖ మాసములో శుక్లపక్షమునందలి అష్టమీ తిథి గురువాసర పుష్యయోగయుతమగునో ఆనాడు జగన్నాథుని అర్చించినవారికి కోటి జన్మలందు చేసిన పాపము నశించును. సంశయము లేదు" అని జైమిని విప్రులకు విశదీకరించెను.

## 28వ అధ్యాయము

1. జైమిని విప్రులకు నరసింహావిర్భావమును తెల్పుట :

"ఓ విప్రులారా ! భగవంతుడగు నృసింహస్వామి మంత్రమహిమచే అద్భుతదర్శనుడై ఇంద్రద్యుమ్నాదులందరిచే చూడబడెను. ఆ భయంకరమూర్తి అంతటను ప్రజ్వరిల్లుచున్న జిహ్వతో సర్వజగత్తును నాకుచు, కాలాగ్నిరుద్రుని, తనకంటబడిన వానినన్నింటిని, మ్రింగుచున్నట్లు, రోదసీగుహను వ్యాపించి తన తేజస్సుచే తపింపజేయుచు అనేకాక్షిముఖగ్రీవాకరపాదశ్రవణములు గల ప్రభువై సర్వాశ్చర్యమయుడై కేవలము తేజోనిధియై చూపరులకు గోచరించెను. అచట నున్నవారు భయత్రస్తులై ఉద్విగ్నులై ఆ భయంకరమూర్తిని స్తుతింప లేకపోయిరి. నారదమునీంద్రుడు అట్టి వానిని గాంచి అపుడు అతడిట్లు ప్రకాశించుటకు కారణ మేమని తన తండ్రియగు బ్రహ్మను ప్రశ్నించెను.

2. నారదుడు బ్రహ్మను నృసింహస్వామిని గూర్చి తెల్పుమనుట :

"భగవంతుడవగు తండ్రీ ! భక్తులను అనుగ్రహించుటకై అవతరించిన ఈ ప్రభువు మాదు మిక్కిలి భయప్రదుడయ్యెను. అపుడిచటనున్న వారందరికి భయమధికమై ప్రళయమాసన్నమయినదను శంకకలిగినది.

ఓ జగత్పతీ ! నీవే భగవంతుని లీలలు తెలిసినవాడవు. కావున అతనిని గూర్చి తెల్పుము" అని నారదుడు బ్రహ్మనడిగెను.

బ్రహ్మ నారదవచనములు విని స్మితాననుడై సర్వోపకారకము కుతూహలజనకమగు వాక్యమును చెప్పదలచెను.

3. బ్రహ్మ నారదునకు నృసింహస్వామి మహిమను వచించి ప్రణుతించుట :

దారువపుర్ధరుడయి అవతరించిన జగన్నాథస్వామినిచూచి సాక్షాత్తు బ్రహ్మ స్వరూపుడే అని లోకులు తెలిసికొనగలరు. పరమేష్ఠి ఈతనిని మంత్రరాజముచే మంత్రించుటవలన ఈతడు మహిమాన్వితుడయ్యెనను సత్యమును సామాన్యులు కూడ గ్రహింతురు.

పూర్వము బ్రహ్మచే ఈస్వామి అభిమంత్రితుడై మహాసురుడైన హిరణ్యకశిపుని చీల్చివైచెను. అవాడు ఈ భగవంతుడు అట్టి సుదుర్దర్శమయిన రూపమును భయప్రదమయిన రూపమును దాల్చెను. అమిత తేజస్వియగు విష్ణువు యొక్క పరాకాష్ఠయగు మూర్తియే యిది. అట్టి యీ మూర్తిని అర్చించినవారు పునరావృత్తి రహిత మయిన గతిని పొందుచున్నారు" అని బ్రహ్మ నారదునికి చెప్పెను.



4. బ్రహ్మ నారదునకు నృసింహాభిముఖస్తోత్రమును చెప్పుట :

శ్లో॥ నమోऽస్తుతే దేవవరైక సింహ !
నమోऽస్తు పాపౌఘగజైకసింహ !
నమోऽస్తు దుఃఖార్ణవ పారసింహ !
నమోऽస్తు తేజోమయ దివ్యసింహ !
నమోऽస్తు సర్వాకృతి చిత్రసింహ !
నమోऽస్తుతే క్లేశ విముక్తి సింహ !
నమోऽస్తుతే దివ్యవపుర్నృ సింహ !
నమోऽస్తుతే వీరవరైకసింహ !
నమోऽస్తుతే దైత్యవిదారసింహ !
నమోऽస్తు వేదాంత వనైకసింహ !
నమోऽస్తుతే యోగి గుహైకసింహ !
నమోऽస్తుతే సింహ ! వృషైకసింహ !
నమోऽస్తు నీలాచల శృంగసింహ !"

అని బ్రహ్మ నృసింహస్వామిని స్తుతించెను.

5. జైమిని ద్విజులకు నృసింహస్వామి శాంతస్వరూపుడగుటకు హేతువును తెల్పుట —

"ఓ ద్విజులారా ! ప్రజాపతి ఆ విధముగ నృసింహస్వామిని స్తుతించి నృసింహయంత్రమును లిఖించి అతనిపైనుంచెను. సాక్షాత్తు అథర్వణోదితమగు ఆ మంత్రరాజము వైష్ణవనిర్వాణమని వేదాంతులు చెప్పిరి. ఆ మంత్రమునందు కేవలము చతుర్వేదములు శాశ్వతముగ ప్రతిష్ఠింపబడినవి. పూర్వము స్వాయంభువమనువు ఆ మంత్రమును ఈ చతుర్ముఖుని వలన దీక్షపొంది, జపించి సృష్టికార్యమొనర్చెను. ఈ మంత్రజపముచే ఆనుషంగికముగ అణిమాద్యష్ట సిద్ధులు ప్రాప్తించును. ఈ మహామంత్రము నొక్కదానినే జపించినవారికి పురుషార్థచతుష్టయ ఫలితముచేకూరును. లౌకిక వాంఛలు తీరుట విషయమై చెప్పవలయునా ? ఈ మహామంత్ర మొక్కటే సర్వక్రతుఫలమును, సర్వ తీర్థ ఫలమును సర్వదానవ్రత ఫలమును ఇచ్చును. సర్వ పాపౌఘతూలరాశికి దావానలమెట్టిదో దివ్యసింహాకృతిని దాల్చిన శ్రీహరి స్వరూపమయిన ఈ మంత్రరాజము కూడ అట్టిదే.

యతీశ్వరులీ మంత్రమును జపించుటచేతనే భవరోగరహితులగు చున్నారు. ఈ మంత్రమును స్వీకరించిన వారి దరికి గ్రహాపస్మార రాక్షసులు

ఢాకినులు భూతవేతాళ పిశాచములు సర్పములు గ్రహములు చేరవు. అట్టి మంత్ర దీక్షా పరులను చూచుటకు దుష్టగ్రహాదులు భయపడి దూరమునుండి పారిపోవును.

ఇంద్రద్యుమ్న నృపతి చతుర్ముఖునివలన ఆమంత్ర రాజమును దీక్షా పూర్వకముగ స్వీకరించెను. ఆ మంత్ర ప్రభావము వలన వజ్రపినాకధరుడు జటామండిత వక్త్రాబ్జుడు చంద్రసూర్యాగ్ని నేత్రుడు జానుప్రసారితకరసరోజ యుగ్ముడునగు నృసింహస్వామి శాంతగాత్రుడై లక్ష్మిని వక్షఃస్థలమున ధరించి మంత్రాక్షరమయమైన యోగపట్టాసనారూఢ ద్వాత్రింశద్దల పద్మముయొక్క కర్ణికాప్రణవోజ్జ్వలమధ్య భాగమున సుఖాసీనుడై అట్టహాసము చేయుచు, శ్రీ ముఖాంబుజమును వీక్షించుచు, ఇంద్రద్యుమ్న నృపతికి ప్రత్యక్షమయ్యెను.

హరి వెనుక హలలాంగల ధారియైన బలభద్రుడు దివ్యరత్నోజ్జ్వలాకృతిగల వేయిపడగలను విప్పి ఛత్రాకృతిని ధరించుటను ఇంద్రద్యుమ్నుడు గాంచెను.

విస్మయా విష్టచేతస్కుడగు ఇంద్రద్యుమ్నుడు అట్టి పురుషోత్తముని జూచి ఆనందముతో కమలాసనుని ఇట్లడిగెను.

"ఓ భగవంతుడా! మధుసూదనుని చరితము చిత్రముగా నున్నది.

ఓ లోకభావన! మావంటివారికి ఈతని చరితమెట్లు తెలియశక్యమగును? హరి యజ్ఞాంతమున దారునిర్మితమైన అట్టి రూపమును దాల్చెను. రథమునందున్న జగన్నాథస్వామిని నీవే ప్రాసాదమధ్యభాగమున ప్రతిష్ఠించితివి. అంతకుపూర్వమే ఆకాశవాణి నాతో దారుమయమగు చతుర్మూర్తులవతరించునని చెప్పెను.

ఓ ప్రభూ! సుప్రతిష్ఠితుడయిన ఒక్క స్వామి కానవచ్చుచున్నాడు. ఇది మాయా లేక యదార్థమా? స్వామీ! వినుటకు అర్హుడయినచో నాకు సత్యము నెరిగింపుము."

6. బ్రహ్మ ఇంద్రద్యుమ్నునికి దారవమూర్తియగు జగన్నాథుడు పరబ్రహ్మ మని తెల్పుట :

"ఓ రాజా! భగవంతుని ఆద్యమూర్తియే ఈ నృసింహావతారము. ఓ నృపశార్దూల! ఇయ్యది దారుమయ మూర్తి, ప్రతిమ అను అభిప్రాయము నీకు కలుగరాదు. ఇది పరబ్రహ్మాకృతి అని, నీయెడల నాకుగల అనుగ్రహమును గ్రహించి నారాయణుడు ఈ రహస్యమును నాకు వ్యక్తము చేసెను.

ఇయ్యది స్వభావముచే దారువయినను సర్వదుఃఖములను ఖండించుట వలన, అఖండానందము నొసగుటవలన పరబ్రహ్మమనబడుచున్నది. చతుర్వేద సమ్మ



తముగ భగవంతుడు దారుమయ మూర్తిని దాల్చెను. అతడే సర్వజగములను సృజించినవాడు. కావుననే తన్ను తాను సృష్టించుకొనెను.

ఓ భూప! శబ్దబ్రహ్మమునకు పరబ్రహ్మమునకు భేదములేదు. సృష్టి యందీ రెంటికిని వ్యత్యాసమున్నను లయమందిది యొక్కటే.

ఓ పరంతప! శబ్దార్థములు అన్యోన్యాపేక్షగలవి. అర్థాభావమున శబ్దముండదు. శబ్దాభావమున అర్థముండదు. అందువలన చతుర్వేదములు శబ్దములు అర్థములు.

హలాయుధుడగు బలభద్రుడు ఋగ్వేదరూపి. నృసింహస్వామి సామవేదరూపుడు. ఈ సుభద్రయజుర్మూర్తి. సుదర్శనచక్రము అథర్వణ వేదరూపము.

వేదము ఏకరాశిగా నున్నపుడు భేదరహితము. అదియే నాల్గుభాగములుగా విభజింపబడినపుడు భేదముకానవచ్చుచున్నది.

ఒక్కడే అయిన భగవంతుడు బహురూపములను ధరించెను. కావున నీవు సంశయింప పనిలేదు. ఒక్క యీ జగన్నాథస్వామి విషయమునందే కాక అన్యావతారములవల్ల కూడ ఇట్టి న్యాయమే ప్రవర్తిల్లును.

ఓ నృప! జగన్నాథుని యొక్క భేదాభేదములు నీకు విశదీకరింపబడినవి. నీకు ఎట్టి భక్తితో మనస్తుష్టి సమకూరునో అట్టి భక్తినే అవలంబింపుము. ఓ రాజా! ఈ జగన్నాథుడు సర్వరూపమయుడు. సర్వమంత్రమయుడు. ఏ భక్తుడు ఏవిధముగ ఆతనిని ఆరాధించిన, అతనికి అట్టి ఫలమునొసగును.

ఓ ఇంద్రద్యుమ్న! శుద్ధమయిన కనకము ఎవనికి ఇష్టము వచ్చిన ఆభరణముగా తయారుచేయబడునో అతనికి అది సంతోషదాయకమగును.

ఓ భూపాల! ఈ ప్రకారముగా భగవంతుడు తన మహిమచే ఇచట ఆవిర్భవించెను. ఏ భక్తునికి ఈతనిపై ఎంత విశ్వాసముండునో అతనికి అంతసిద్ధి కలుగును.

ఓ భూపతీ! విశుద్ధములయిన మనోవాక్కర్మలతో, అంతరాత్మతో దారుదేహధారియయిన యీ గోవిందునిట ఆరాధింపుము. నీవు కోరినట్లు చతుర్వర్గఫలావాప్తికి ఈ మంత్రరాజముతో ఈ విష్ణువును అర్చింపుము. దీనికంటె శ్రేష్ఠమయిన మంత్రములేదు. ఉండదు. ఈ మంత్రజపముచేసి విష్ణువును అర్చించిన వెంటనే, నీయెడల అతడు ప్రీతితో వరమునొసంగును. భక్తవత్సలుడయిన భగవంతుడు తన వైకుంఠపురవాసము నిచ్చును.

ఎన్ని యజ్ఞములు, తీర్థయాత్రలు, వ్రతములు దానములు తపము లాచరించినను భగవంతునికి ప్రీతికలుగకపోవచ్చును కాని యీ మంత్రమును జపించి, అతనిని అర్చించిన వానియెడల అతని అనుగ్రహము కల్గును.

ఓ భూప! నీలాచల మందున్న దారుమూర్తియగు విష్ణుమూర్తిని ఉపాసించదగిన తత్త్వమును నీకు వ్యక్తముచేసితిని. దీనిని వింటివిగాన ఆచరింపుము. సాగరతటమున నున్న వటవృక్షమూలమున గల నీలాచలమందు వేంచేసియున్న దారు వ్యాజామృతమయిన బ్రహ్మమును దర్శించిన వానికి ముక్తి కల్గుననుటలో సందియములేదు."

## 29వ అధ్యాయము

1. జైమిని ద్విజులకు నాల్గుమూర్తులను అర్చించువిధిని తెల్పుట :

"ఓ ద్విజులారా! కమలాసనుడు లోకశ్రేయస్సునకై ఇంద్రద్యుమ్నున కిట్లు తెల్పి తన హృదయమందు నరసింహాకృతికి ఉద్వాసనముచెప్పెను. పూర్వము విష్ణువుయొక్క ప్రకాశరూపము ప్రకటింపబడినది. మున్ను రథావరోహణమునందు నాల్గురూపములు చూడబడినవి. ఆ మూర్తులనే సింహాసనము నందుంచిరి. ఆ విగ్రహములనే అందరును గాంచిరి.

ద్వాదశాక్షర మంత్రముతో బలభద్రుని పూజింపవలెను. శుభప్రదుడగు నారాయణుని పురుషసూక్తముతో అర్చింపవలెను. సుదర్శన చక్రమును దేవీసూక్తముతోడను, ద్వాదశాక్షరమంత్రముతోడను పూజించిన భగవదనుగ్రహము లభించునని ఇంద్రద్యుమ్నునకు బ్రహ్మ తెలిపెను" అని జైమిని ద్విజులతో చెప్పెను.

2. బ్రహ్మ దారుదేహుడగు జగన్నాథునితో సంభాషించుట :

"ఓ దేవదేవేశ! భగవంతుడా! భక్తానుగ్రహకారక! ఇంద్రద్యుమ్నుడు గతించిన వేయి జన్మలలో నిన్ను భక్తితో కొలిచియున్నాడు. తరువాతనే నీ దర్శనమాతనికి లభించినది.

స్వామీ! నీ దర్శనమే సాయుజ్యకారణమగుచున్నది. ఈతడిప్పటికిని భక్తియోగముతోడనే నిన్ను పూజింపవలెనని తలంచుచున్నాడు.

ఓ జగన్నాథ! ఇంద్రద్యుమ్నుడు ఏ భక్తియోగముచే నిన్ను భావింపవలెనో, ఏయే దేశకాల వ్రతాదులతోడను వివిధోపచారలముతోడను నిన్ను పూజింపవలయునో, వానిని ఆజ్ఞాపింపుము. ఈ నృపుడు నీముఖాంబుజ గళితమగు



వాఙ్మృతరసమును పానము చేయుటకై చెప్పవాల్పక నిన్నవలోకించుచున్నాడు" అని బ్రహ్మ జగన్నాథునితో పలికెను.

3. శ్రీ జగన్నాథుని ప్రతిమ ఇంద్రద్యుమ్నునితో వచించుట :

"ఓ ఇంద్రద్యుమ్న! నీ నిష్కామకర్మలచేతను నీ దృఢభక్తిచేతను నీకు ప్రసన్నుడనయితిని. నీకంటె ఇతరునకెవ్వనికిని ఇట్టి కైవల్యసంపదలభ్యము కాలేదు.

ఓ భూప! నాయందు నీకు భక్తిస్థిరముగ నుండుటకై వరమును ప్రసాదించుచున్నాను.

ఓ రాజేంద్రా! కోట్లకొలది విత్తమును వెచ్చించి నా కొరకు ఈ ప్రాసాదమును నిర్మించితివి. ఇది శిథిలమైనను దీనిని విడువను. కాలాంతరమున ఇంకే భక్తుడయినను నా కిట్టి ప్రాసాదమును కట్టించగలడేమో! కాని నీ ప్రీతికొరకు నే నిట వసించుచున్నాను. తప్పక ఆకీర్తి నీకే దక్కును. ముమ్మాటికి సత్యము. నీకు సత్యమునే చెప్పుచుంటిని. ఈ ప్రాసాదమునకెన్నడైన ఎట్టి భంగము వాటిల్లినను ఈ స్థానమును మాత్రము విడువను. ఇచట ఈ దారుదేహముతోడనే పరుల కొరకు నివసింతును. కమలభవుడు ద్వితీయ ప్రాసాదమును పరిసమాప్తి చేయునంతవరకు ఈ ప్రాసాదమును విడువను.

ఈ స్వాయంభువమనువుయొక్క రెండవ చతుర్యుగమునందలి కృతయుగముయొక్క ప్రథమ పాదమునందు జ్యేష్ఠమాసమున దశ అనెడి క్రతువు చేయబడినది.

జ్యేష్ఠ మాసమున నేనవతరించితిని. అది పుణ్యప్రదమగు మాసము.

ఓ మహారాజ! ప్రతి పూజయందు అభివృద్ధికరమయిన నివాస స్థానమగు ఈ ప్రాసాదమున మహాస్నాన విధితో జ్యేష్ఠ మాసమున నాకు స్నానము చేయింపవలెను. నాకు స్నానము చేయించినవారికి కోటి జన్మలలో చేసిన పాపము నశించును.

ఓ రాజేంద్రా! నా స్నానవిధిని చూచువారికి సర్వతీర్థక్రతుఫలము, సర్వదానఫలము సంప్రాప్తించును.

అటనున్న మర్రిచెట్టునకు ఉత్తరమున సర్వతీర్థమయమగు కూపమున్నది. అది స్నానమునకే త్రవ్వబడినను మట్టిచే కొంతవరకు కప్పబడియున్నది. నీ వా కూపములో దిగి పరిశీలించి అది స్నానమున కుపకరించునట్లు బాగుచేయించుము.

చతుర్దశియందు విధిప్రకారము ఆ కూపమునకు సంస్కారము చేసి, రక్షకుడైన క్షేత్రపాలునకు దిక్పాలకులకు బలిదానంగవలెను. శ్రావ్యములగు శంఖకాహళమురజధ్వనులు వినబడుచుండగా ద్విజులు స్వర్ణకుంభములతో ఆ కూపము నుండి జలమును పైకి తీయవలెను.

ఓ రాజా! జ్యేష్ఠమాసమున బ్రహ్మతోకూడిన నా ప్రతిమకు, సుభద్రా బలభద్రుల ప్రతిమలకు స్నానము చేయించిన వైకుంఠలోకవాసము ప్రాప్తించును.

ఓ నృపసత్తమ! స్నాతుడనయిన నన్ను ఏ భక్తుడు చూచునో అతడు దేహబంధమును మానవ జన్మమును పొందడు. విశాలమయిన వేదికను దృఢమయిన చందనపు కర్రతో సుందరముగ చేయించి ఈశాన్య దిగ్భాగమున నుంచి దానిపైని నాకు సుభద్రాబలరాములతో మరల స్నానము చేయించి తీసికొనివెళ్లవలెను. ఏ భక్తుడు దక్షిణాభిముఖముగ తీసికొనివెళ్లుచున్న నన్ను భక్తితో గాంచునో అతడు మనస్సులో కోరిన కోర్కెలన్నియు ఫలించును.

ఓ నృపా! పిమ్మట పదునైదవ దినమున ప్రతిష్ఠించిన నన్ను విరూపముతో నున్నను, అభిరూపముతో నున్నను ఒకానొకపుడును చూడరాదు. నాకు జ్యేష్ఠ మాసమున స్నానము చేయించిన వాడు సర్వపాప విముక్తుడగుచున్నాడు.

ఓ క్షితీశ్వర! 'గుండిచా' అను పేరుగల మహాయాత్రను చేయింపుము. దానిని తలంచినంతమాత్రముననే నరుడు పాప విముక్తుడగుచున్నాడు.

'గుండిచా' అను మహోత్సవము చేయుటకు మాఘమాసమునందలి పంచమి తిథి చైత్రమాసమున శుక్లపక్షమందలి అష్టమీతిథి చాల ప్రశస్తములు. ఆ మహోత్సవమునకు విశేషించి ఆషాఢమాసమునందు పుష్యమీ నక్షత్రయుక్తమగు విదియతిథి మోక్షప్రదము. పైని చెప్పిన నక్షత్రము కుదరనిచో తిథియందైనను నా ప్రీతికొరకు ఆ ఉత్సవమును జరుపవలెను.

ఆషాఢమాస శుక్లపక్షమున పుష్యమితోకూడిన విదియ తిథినాడు నన్ను సుభద్రాబలరాములతో రథమునందుంచి ఆ మహోత్సవమును జరుపుటకు పాల్గొనునట్టి బహు సంఖ్యాకులగు ద్విజులను సంతోష పెట్టవలెను. నేను పూర్వము జన్మించిన 'గుండిచా' మండపమే సహస్రాశ్వమేధయాగములకు అపుడు వేదిక అయినది. పృథివియందు దానినిమించిన పుణ్యతమస్థాన మింకొకటి లేదు.

ఓ ఇంద్రద్యుమ్న! నాయనుగ్రహ సంపాదనమునకు ఐదు వందల సంవత్సరములు ఏ పవిత్రస్థలమున యాగము చేసితివో నాకు దానిని మించిన ప్రీతికరమయిన స్థలమింకొకటి ఈ ధరాతలమున లేదు.



చతుర్ముఖునికి ఆమోదయోగ్యమయి యిపుడు నీచే నిర్మింపబడిన యీ ప్రాసాదమువలన ఈ నీలాచలము నాకు ప్రీతిపాత్ర మగుచున్నది.

ఈ నృసింహక్షేత్రమునందలి నీ క్రతువేదిక నా జన్మస్థలమైన గుండిచా మండపము నాకు శాశ్వతముగ ఆనందదాయకము లగుచున్నవి. బహుకాలము నే నచటనుండుటచే నా కచట పరమప్రీతి కలదు. ఈ కారణముచేతనే ఈ బ్రహ్మ ప్రాసాదమునందు నా ఆత్మను ప్రతిష్ఠించెను. చతుర్ముఖుని యాభిమతానుసారముగ నీ భక్తిని పురస్కరించుకొని ఇట నిత్యము నివసింతును. ఇటకు వచ్చిన నేను తొమ్మిది దినములు గడుపుదును.

ఓ మహారాజ! అక్కడ సర్వతీర్థమయమయిన సరస్సు కలదు. నా అభీష్ట ప్రకారము ఆ సరస్తీరమున సప్త దినములు నివసింతును. అటనున్న నన్ను దర్శించిన మర్త్యులు నా నివాసమునకు రాగలరు. త్రిభువనములయందు మూడున్నర కోట్ల తీర్థములు కలవు. అవి యన్నియు నాసాన్నిధ్యమువలన ఆ సరస్సును చేరుచున్నవి. ఆ సరస్సుతో యథావిధిగ స్నానమాచరించి నన్ను భక్తితో దర్శించిన వారు మరల మాతృగర్భనరకము ననుభవింపరు. నవమ దినమున దక్షిణాశాముఖముగ వచ్చుచున్న నన్ను అడుగడుగున చూచువారు అశ్వమేధక్రతు ఫలమును ఇంద్రభోగములను అనుభవించి తుదకు నన్ను చేరగలరు.

ఓ భూపాలా! నా యుత్థానము, శయనము నా పార్శ్వములయందుండుట నా మార్గమును ప్రావరణముచేయుట పుష్యస్నానమహోత్సవము ఫాల్గుణ మాసమున నా డోలాక్రీడోత్సవము చేయవలయును. ఈయాలలో దక్షిణాభిముఖముగ పూజింపబడు నన్ను దర్శించువారు బ్రహ్మహత్యాదిపాపములవలన విముక్తులగుదురు. సంశయింపనక్కరలేదు. పుష్యఫాల్గుణ మాసములందు జరుగునట్టి ఉత్సవములలో నాకు ఒక నెల పూజలు సల్పి నా దర్శనము చేసి నాకు ప్రణామ మాచరించువారు ప్రత్యేకముగ ఎనిమిదివేల యశ్వమేధ యాగముల ఫలమును పొందగలరు. చైత్ర మాసమునందలి శుక్లపక్ష త్రయోదశీ తిథియందు కార్యక్రమము ముగింపవలెను.

చైత్ర మాసమున చతుర్దశీ తిథియందు పరుషవాక్యములతో నన్ను హెచ్చరింపవలెను. శుక్లపక్షమందు నా ఉత్సవములను తిలకించు జనులు సర్వపాప రహితులగుదురు. వైశాఖ మాసమునందు శుక్లపక్షమునందలి తృతీయకు అక్షయ అని పేరు. ఆ తిథినాడు నాకు పరిమళోపేతమగు సుగంధమును పూయవలయును. నా ప్రీతికొరకు ఎల్లపుడు ఉత్సవములు చేయువారు చతుర్వర్గ ఫలమును ప్రత్యేకముగ పొందగలరు" అని శ్రీ జగన్నాథుని ప్రతిమ ఇంద్రద్యుమ్నునకు వర మొసగెను.

4. జగన్నాథుడు బ్రహ్మతో సంభాషించుట :

"ఓ చతురానన ! నేను నీ సంతోషమునకే సర్వమును సమకూర్చితిని. నీ కోరికే నా కోరిక మన యిద్దరికి భేదము లేదు. నిశ్చయము. పూర్వము నీవు మాధవమూర్తి యగు నన్ను ప్రార్థించితివి. దాని ఫలితముగనే నేనీయవతారమును దాల్చితిని.

నన్నిచట దర్శించి పూజించి ప్రాణములను విడుచునతడు ముక్తినంద గలడు. క్రమముగా నీతోకూడ అందరును మరల సాయుజ్యము నందగలరు. ఏ మానవుడయినను దేని నాశించి నన్ను సేవించునో దానినాతడు వెంటనే పొంద గలడు. ఇట సాంగత్యమువలన రాజుకూడ ఆశించిన ఫలము నందగలడు.

ఓ పద్మజా ! నీ విపుడే సత్యలోకమున కేగుము. దేవతలు స్వర్గమునకు వెళ్ళవలెను. నీ పరిపూర్ణమగు ఆయుఃపరిమాణ పర్యంతము నేనిటనుండుట నిశ్చయము" అనిన జగన్నాథుని హితవాక్కులు వినినంతనే బ్రహ్మ, మునులు, సురలు సంతసించి దేవునకు అవనత శిరస్కులై ప్రణమిల్లి తమ నివాసమునకు అరిగిరి.

5. జైమిని ద్విజులకు జగన్నాథుని యానతిని ఇంద్రద్యుమ్నుడు పాటించినట్లు తెల్పుట :

'ఓ ద్విజులారా ! ప్రతిమారూపధారి యగు జగన్నాథుడపుడు సర్వ జనులకు హర్షమును చేకూర్చి మౌనమును వహించెను. జగన్నాథుడు తెల్పిన యాత్రలనన్నింటిని తృప్తికరముగ చేయుమని ధర్మాత్ముడు దృఢవ్రతుడు విష్ణు భక్తుడయిన ఇంద్రద్యుమ్న మహీపతికి బ్రహ్మ ఆజ్ఞాపించెను. ఈ జగన్నాథుడు సంతసించిన చరాచర జీవరాశి సంతుష్టినందగలదని బ్రహ్మ రాజునకు తెల్పెను. క్షితీశ్వరుడు బ్రహ్మ యాజ్ఞను శిరసావహించి అతనిననుసరించి పోవుచు అతని యాజ్ఞచే మరలివచ్చెను.

పిమ్మట ఇంద్రద్యుమ్న నృపతి జగన్నాథుని యానతి ననుసరించి నారద మునీంద్రుడు, పద్మనిధి సహకరించుటవలన జ్యేష్ఠస్నానాద్యుత్సవములనన్నింటిని కావించెను ;' అని జైమిని ద్విజులతో చెప్పెను.

## 30వ అధ్యాయము

1. మునులు జైమినిమహర్షిని జగన్నాథుని జన్మస్థానాదుల గూర్చి వివ రింపగోరుట :

"ఓ ఋషిపుంగవ ! శ్రీపతియగు జగన్నాథుని జన్మస్థానము అన్యములగు ఉత్సవములు ఏవిధి ప్రకారము చేయబడినవో మాకు తెలుపుము.



ఓ మునిసత్తమ ! బ్రహ్మసుతుడయిన నారద మహర్షి పూర్వము నీకు ఆ విషయములను సాకల్యముగా విశదీకరించెను. అతడు అజ్ఞానమునకు అవల నున్న బ్రహ్మమును తెలిసికొనిన మహాత్ముడు.

ఓ మునీంద్ర ! ఇంద్రద్యుమ్నుడు ఎంత అదృష్టవంతుడు. ఈ అద్భుత మంతయు అతడొనర్చిన క్రతువు ఫలితమే. ఇంతకు మున్నెన్నడును ఎచ్చటను దారునిర్మితములగు ప్రతిమలగూర్చి వినలేదు. చూడలేదు. సజీవుడగు మనుజునకువలెనే ఆ ప్రతిమలకును వస్త్రాదులతో అలంకరింపవలెను. భగవం తుని చరితమును మాటిమాటికిని స్మరించుట పాపనాశనమగును. మర్త్యలోక వాసులకు జగన్నాథుని చరితమును వినుట దుర్లభమయినను అతని మహిమలు వినుచున్న మాకు ఇంకను సంతోషము కలుగలేదు.

ఆ భగవంతుడు ఆజ్ఞాపించిన విధి ప్రకారము చేయబడు యాత్రలు చూచుట వలన మాకు అఘనాశనమై వైకుంఠవాసము ప్రాప్తించునని నిశ్చిత బుద్ధితో నున్నాము.

ఓ మహానుభావ ! సాక్షాత్తు మధుసూదనుడే యాత్రామాహాత్మ్యమును విశదీక రించెను. లోకశ్రేయస్సుకై అద్దానినే మాకును తెల్పుము" అని మునులు జైమిని నడిగిరి.

2. జైమిని ద్విజులకు జ్యేష్ఠమాసమునందు స్నానాదులు చేయుటవలన కల్గు ఫలితమును చెప్పుట :

"ఓ మునులారా ! ఇపుడు జ్యేష్ఠమాసమందు చేయు స్నానమును గూర్చి వచించుచున్నాను. వినుడు, మానవుడు నియమ నిష్ఠలతో జ్యేష్ఠశుక్ల దశమినాడు ప్రాతఃకాలముననే లేచి పంచతీర్థ విధానము ననుసరించి వ్రతమాచరించుటకు సంకల్పించి వ్రతమును పూర్తి చేయవలెను. భక్తుడు మార్కండేయసరస్సున కేగి దానిలోని జలముతో ఆచమనముచేసి శంకరుని సన్నిధికి వెళ్ళి కృతాంజలి పుటుడై వందనమొనర్చి శంకరుని ప్రార్థింపవలెను.

శ్లో॥ "అతితీక్ష్ణ మహాకాయ । కల్పాంత దహనోపమ ।
భైరవాయ నమస్తుభ్యం । అనుజ్ఞాందాతుమర్హసి"

అని భైరవుని స్తుతింపవలెను.

తరువాత వైదికములయిన పంచవారుణములతో తీర్థమును ప్రవేశించి మూడు పర్యాయములు అఘమర్షణ సూక్తమును పఠించుచు స్నానముచేసి వ్రతానంతరమున గూడ —

శ్లో॥ "నమశ్శివాయ శాంతాయ । సర్వపాపహరాయచ ।
స్నానం కరోమి దేవేశ । మమనశ్యతు పాతకమ్ ॥
సంసారసాగరే మగ్నం । పాపగ్రస్తమ చేతనమ్ ।
త్రాహిమాం భగనేత్రఘ్న । త్రిపురారే । నమోఽస్తుతే ॥

అను మంత్రమును జపించి స్నానమాచరింపవలెను. ఈ విధముగ స్నానము చేసి బహిఃప్రదేశమునకు వచ్చి ధౌతవస్త్రములను ధరించి పుండ్రములు పెట్టుకొని యథావిధిగా దేవతలకు ఋషులకు పితరులకు తర్పణములొనర్చి శివాలయములో ప్రవేశించి వృషభమును స్పృశించి —

శ్లో॥ "ధర్మశ్చతుష్పాద్యజ్ఞస్త్వం । స్వర్ణశృంగత్రయావపుః ।
గోపతేవాహరూపస్త్వం । శూలినంత్వాం నమామ్యహం

అను మంత్రముచ్చరించిన సర్వ క్రతుఫలము లభించును.

పిమ్మట భక్తుడు అఘోరమంత్రముతో వృషభ వాహనుని పూజించి పంచ బ్రహ్మ ఋక్కులతో ఉత్తమ లింగమును స్పృశింపవలెను. శివలింగమును బొటనవ్రేలితోడను పిడికిలితో శక్తిని స్పృశించి పురహరుడగు దేవుని విధి ప్రకారముగ అర్చించి స్తుతించిన వానికి దశాశ్వమేధయాగము లొనర్చిన ఫలితము చేకూరును. భక్తుడు మార్కండేయావటములో స్నానము చేసి శంకరుని దర్శించినచో రాజసూయాశ్వమేధ యాగముల ఫలము నందగలడు. నరుడు జ్ఞానవంతుడై అంతమున శివుని సాలోక్యమును పొంది జగన్నాథుని యనుగ్రహముచే క్రమముగ ముక్తిని గాంచగలడు. తరువాత మౌనముతో అనామయుడగు నారాయణుని సేవింపవలెను. ఆ హరికి దక్షిణమున నున్న విష్ణుస్వరూపమగు శ్రేష్ఠమైన వటవృక్షమును చూచుటవలన పాపములు నశించును. భక్తుడు పురుషోత్తముని చూచి స్తుతించుచు దూరమునుండి ప్రణమిల్లవలెను. పిమ్మట ప్రదక్షిణముచేసి —

శ్లో॥ "అమరస్త్వంసదాకల్పవిష్ణోరాయతనం మహత్ ।
న్యగ్రోధ ! హరమేపాపం । విష్ణురూప । నమోఽస్తుతే ॥
నమోవ్యక్తరూపాయ । మహాప్రలయస్థాయినే ।
ఏకాశ్రయాయజగతాం । కల్పవృక్షాయతే నమః ॥

అని వటవృక్ష మూలమున జనార్దనుని భక్తితో స్తుతించి యీ మంత్రమును జపించినవాడు కోటిజన్మములలో చేసిన పాపమునుండి విముక్తుడగును. భక్తుడు ఆ వటవృక్షచ్ఛాయ యందున్నను నిష్పాపుడగును.



పిమ్మట భక్తుడు హరికి ఎదుట వాహనరూపుడైయున్న గరుత్మంతునకు నమస్కరింపవలెను. తరువాత విష్ణువునకు భక్తితో ఆనందపరవశుడై నమస్కరించుచు "ఛందోమయ ! జగద్ధామ ! యానరూప ! యజ్ఞరూప ! జగద్వ్యాపక ! దివ్యదేహ ! ప్రియమాణుడవగు నీకు నా వందనములు" అని గరుడుని నుతింపవలెను. అట్టివాడు అనేక జన్మములందు చేసిన పాపములనుండి విముక్తుడగుచున్నాడు.

అటు తరువాత భక్తుడు వాఙ్మనఃకర్మ నియతుడై అట్లు ధ్యానించుచు దేవాలయమున ప్రవేశించి దేవునకు మువ్మారు ప్రదక్షిణముచేసి తన యథిమతానుసారముగ ద్వాదశాక్షర మంత్రముతోగాని పురుషసూక్త విధానముతోగాని భగవంతుని పూజింపవలెను.

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులందరు జగన్నాథుని పూజించుటకు అర్హులు. ఇతరులు స్వామిని భక్తితో దర్శించి హరి గరుడుల నామ సంకీర్తనము చేసిన తత్ఫలము నందగలరు. భక్తుడు పరమేశ్వరునకు పంచోపచార విధితో పూజింపవలెను.

## శ్రీ జగన్నాథ స్తోత్రము

భక్తుడు శ్రీ జగన్నాథునకు వందన మాచరించుచు —

శ్లో॥ "దేవదేవ ! జగన్నాథ ! సంసారార్ణవతారక !
భక్తానుగ్రాహక ! సదారక్షమాంపాదయోర్నతం ॥
జయకృష్ణ ! జగన్నాథ ! జయసర్వాఘనాశన !
జయాశేషజగద్వంద్యపాదాంభోజ ! నమోఽస్తుతే
జయ బ్రహ్మాండకోటీశ ! వేదనిఃశ్వాసవాతక !
అశేషజగదాధార ! పరమాత్మన్నమోఽస్తుతే ॥
జయబ్రహ్మేంద్రరుద్రాదిదేవౌఘ ప్రణతార్తిహృత్ ।
జయాఖిల జగద్ధామన్నంతర్యామిన్నమోఽస్తుతే ॥
జయనిర్వ్యాజకరుణాపాథోధే దీనవత్సల !
దీనానాథైకశరణ ! విశ్వసాక్షిన్నమోఽస్తుతే
సంసారసింధు సలిలే । మోహావర్తే సుదుస్తరే
షడూర్మికులదుష్పారే । కుకర్మగ్రాహదారుణే ॥
నిరాశ్రయే నిరాలంబే । నిఃసారే దుఃఖఫేనిలే ।
తవమాయాగుణైర్బద్ధమవశంపతితంతతః
మాంసముద్ధరదేవేశ ! కృపాపాంగవిలోకనైః ।

తత్రమగ్నం మరశ్రేష్ఠ ! సుప్రసాద ప్రకాశక !
ఏకఏవ జగన్నాథ ! బంధుస్త్వంభవభీరుణాం
బుభుక్షావిపిపాసాచ । ప్రాణస్య మనసఃస్మృతా ॥
శోకమోహౌ శరీరస్య । జరామృత్యుర్వపుర్వపః ।
త్వత్ప్రతిష్ఠా త్వాదృశోనాస్తి । యోదీన పరిపాలకః ॥
అవతీర్ణోసిలోకానా మనుగ్రహ ధియా విభో !
పూర్ణకామస్య తే నాథ । కిమన్యత్కారణంక్షితౌ ॥
త్వత్పాదపద్మ మాసాద్య । న చింతాస్తి, జగత్పతే ।
యతస్తే చరణాంభోజం । చతుర్వర్గైక సాధనమ్ ।
దర్శనాత్సర్వలోకానాం । సర్వవాంఛా ఫలప్రదమ్ ॥"

అని స్తుతింపవలెను.

పిమ్మట సీరధ్వజుడగు బలరాముని శేషమంత్రముతో పూజింపవలెను.

భక్తుడు బలభద్రుని ద్వాదశాక్షర మంత్రముతోగాని ప్రణవాక్షరమును అతని నామమునకు ముందుగా చేర్చియైనను ఏకాగ్రమానసుడై నమస్కరించి అర్చింపవలయును.

బలభద్రస్తుతి

శ్లో॥ "జయరామ ! సదారామ ! సచ్చిదానంద విగ్రహ !
అవిద్యాపంక రహిత ! నిర్మలాకృతయేనమః ॥
జయాఖిల జగద్భార ధారణక్రమవర్జిత !
తాపత్రయ వికర్షాయ । హాలంకలయసేవదా ॥
ప్రపన్న దీనత్రాణాయ । స్ఫుటనేత్ర సరోరుహ !
త్వమేవేశ ! వరాశేషకలుషక్షాళనప్రభుః ॥
ప్రసన్నకరుణాసింధో ! దీనబంధో నమోస్తుతే ।
వరాచరఫణాగ్రేణ ధృతాయేన వసుంధరా ॥
మాముద్ధరాస్మాద్దుష్పారా । ద్భవాంభోధేరతారతః ।
సరాపరాణాంపరమ ! పరమేశ ! నమోస్తుతే ॥"

అని ముసలధారి, నాగరాజు అయిన బలరాముని స్తుతింపవలెను.

పిమ్మట జగములకాది కారణభూతురాలు భద్రలోచనయగు సుభద్రాదేవిని పూజింపవలెను.



సుభద్రా స్తవము

శ్లో॥ "జయదేవి ! మహాదేవి ! ప్రసీద భవతారిణి !
సుఖారణి శ్రితవతాం । జయసంతుష్టకారిణి ॥
కార్యంకార్య స్వరూపాణాం । కారణానాంచ కారణం ।
ధారణాం ధార్యమాణానాం । త్వామాదిం ప్రణమామ్యహం ॥
వక్షఃస్థలస్థితాంవిష్ణోః । శంఖోరస్థాంగధారిణీం ।
పద్మయోని ముఖాబ్జస్థాం । ప్రణమామి జగత్ప్రియాం ॥
సృష్టిస్థితి వినాశాది । కర్మణాం పరమాత్మనః ।
త్వమేకా శక్తిరతులా । త్వాంవినా సోపినేశ్వరః ॥
త్వాంసర్వలోక జననీం । విష్ణుమాయాం తపస్వినీం ।
సుభద్రాంభద్రరూపాంతాం । మూలభూతాం నమామ్యహం ॥"

అని సుభద్రాదేవిని నుతించిన పిమ్మట పురుషోత్తముని సాగరస్నానమునకు ప్రార్థింపవలెను.

పురుషోత్తమ స్తుతి

శ్లో॥ నమస్తే భగవన్ ! విష్ణో ! జగద్వ్యాపిన్ చరాచర !
నిర్విఘ్నం సిద్ధిమాయాతు । సింధుస్నానం మమ ప్రభో !
నమస్తే జగతాంవీశ ! శంఖచక్రగదాధర !
దేహిదేవ ! మమానుజ్ఞాం । తవతీర్థ నిషేవణాత్ ॥

అని భక్తుడు స్తుతించుచు విష్ణువద్దకు మౌనముగా వెళ్ళవలెను.

పరిత్యతిని స్మరించుచు, సమాహిత చిత్తుడై మార్గమందున్న ఉగ్రసేనుని అనుజ్ఞకై ఇట్లు ప్రార్థింపవలెను.

'ఓ ఉగ్రవిక్రమ ! బలవంతుడ ! ఓ ఉగ్రసేన మహాబాహూ ! సుప్రసన్ను డగు హరివరమును పొంది సముద్రతటమునందున్నాను.

ఓ తీర్థరాజకృతస్నాన సుసంపూర్ణ ఫలప్రద ! సముద్రస్నానముచేయుటకు అనుమతినిమ్ము" అని ప్రార్థించి పిమ్మట భక్తుడు దానితరువాతనున్న స్వర్గ ద్వారమునకు పోవలెను. దేవతలు ఆ ద్వారమునుండి పురుషోత్తమక్షేత్రము నకు భూతల స్వర్గమందున్న జగదీశ్వరుని దర్శనమునకు ప్రతిదినము వచ్చు చున్నారు. స్వర్గమునుండి దిగివచ్చుటకై ఏర్పడిన మార్గమునుండి వచ్చి అచట నున్న మీ యిరువురికి (ఉగ్రసేన సముద్రులకు) నమస్కరించుచున్నాను. సత్కర్మలకు సాక్షీభూతులయిన మీరిద్దరు సాగరాంభఃసముత్పన్నులు,

శ్రేష్ఠులు, సర్వగుణాన్వితులు మీ యిరువురి నడుమ తెరువబడిన స్వర్గద్వారమును నకు పోవుదును" అని ప్రార్థించి పుణ్యతీర్థసన్నిధికి వెళ్లవలయును.

భక్తుడు దూరమునుండి ఆ పవిత్రక్షేత్రమును గాంచి అధిక పాపమునుండి విముక్తుడగుట నిశ్చయము. మరియు భక్తుడు పాదకరప్రక్షాళనము చేసికొని ఆచమనముచేసి పరిశుద్ధమగు ఆసనమున ప్రాఙ్ముఖుడై కూర్చుండి తనయెదుట చతురస్రము, చతుర్ద్వారము చతుష్స్వస్తిక కోణకమగు మండలమును వ్రాసి దాని మధ్యభాగమున సుందరమగు అష్టదళపద్మమును విరచింపవలెను.

## మంత్రన్యాస విధి

భక్తుడు అష్టాక్షర మంత్రమును చేతులయందు శరీరమునందున్యాసముచేయవలెను. మంత్రశాస్త్ర పండితులు ఆరువర్ణములతో షడంగములన్యాసమును చెప్పిరి. ఆస్తికుడు ఆ మంత్రాక్షరములను కుక్షియందు, పృష్ఠభాగమున, పాదములందు, పిక్కలయందు, తొడలమీద, పిరుదులయందు, పార్శ్వములయందు, నాభియందు, బాహుయుగ్మమున, హృదయమున, కంఠమునందు, చంకలలోను, ఓష్ఠములయందు, కర్ణములయందు, నేత్రములయందు, చెక్కిళ్లపైని, నాసికాపుటములయందు, కనుబొమలయందు, లలాటమున, శిరస్సునందు యథాక్రమముగ న్యసించి, నిశ్చలుడై సర్వాక్షరములతో వ్యాపకన్యాసమునుకూడ చేయవలెను.

పిమ్మట సాధకుడు మూలమంత్రముతో ఇరువదియైదుసార్లు ప్రాణాయామత్రయమునుకూడ చేయవలెను.

## కవచము

సాధకుడు భక్తితో సర్వపాపనోదనమగు దివ్యమైన యీ కవచమును బంధింపవలెను.

శ్లో॥ "పూర్వేమాంపాతుగోవిందో । దక్షిణే మధుసూదనః ।
ప్రద్యుమ్నః పశ్చిమేపాతు । హృషీకేశ స్తథోత్తరే ॥
ఆగ్నేయ్యాంనరసింహస్తు । నైరృత్యాంమధుసూదనః
వాయవ్యాం శ్రీధరఃపాతు । ఐశాన్యాంచ గదాధరః
ఊర్ధ్వంత్రివిక్రమఃపాతు । అధో వారాహరూపధృత్ ।
సర్వత్రపాతు మాందేవః । శంఖచక్రగదాధరః ।
నారాయణోమనఃపాతు । చైతన్యంగరుడధ్వజః ।
పాతుమేబుద్ధ్యహంకారౌ । త్రిగుణాత్మాజనార్దనః ।
ఇంద్రియాణి సదాపాతు । దైత్యవర్గనికృంతనః ॥"

ఈ విధముగా కవచమును బంధించిన పురుషుడు నిష్పాపుడగుచున్నాడు.



సాధకుడు భక్తిప్రపత్తులతో మానసిక షోడశోపచారములచే పురుషోత్తముని యథావిధిగా పూజించి అనామయుడగు దేవదేవుని మండలమందు ఆవాహనముచేసి యథాశక్తిగ యథావిధిగ ఉపచారములచే పూజించి పుణ్యతీర్థముయొక్క, దేవదేవునియొక్క, ఆత్మను స్మరించుచు, బద్ధాంజలిపుటుడై ఈ సుదర్శన మంత్రమును పఠింపవలెను.

## సుదర్శనచక్రము

శ్లో॥ "సుదర్శన ! నమస్తేఽస్తు । కోటిసూర్యసమప్రభ !
అజ్ఞానతిమిరాంధస్య । విష్ణోర్మార్గంప్రదర్శయ ॥"

అని భక్తుడు ప్రార్థించి పుణ్యతీర్థజలసమీపమునకు భూమిపై మోకాళ్లతో ప్రాకుచు భక్తితో ప్రణామము చేయవలెను.

## పుణ్యతీర్థస్తుతి

శ్లో॥ "తీర్థరాజ ! నమస్తుభ్యం । జలరూపాయవిష్ణవే ।
జీవనాయచజంతూనాం । పరంనిర్వాణహేతవే ॥

అగ్నిశ్చతే యోనిరిలాచదేహో
రేతోధావిష్ణో రమృతస్యనాభిః
ఉపైమితేరూపమనన్య హేతు
మానందపంపన్న మనుప్రవిశ్య"

అను ఈ మంత్రమును భక్తుడు పఠించుచు జలమధ్యభాగమును ప్రవేశింపవలెను. మరియు జగన్నాథుని స్మరించుచు, తీర్థరాజమును ఆవాహనము చేయవలెను. స్నానమాచరించిన భక్తుడు ఫలితమును పొందుటకై లోపలనున్న జలాధిపుని నారాయణయుతమగు అఘమర్షణ సూక్తమును ముమ్మారు పఠింపవలెను. వారుణమంత్రమును ఐదు పర్యాయములు పఠించి ఆవాహనాదులు చేయవలెను. అభిషేచనము చేయు నప్పుడు షడంగన్యాసములను పాటింపవలెను. ప్రథమముగ ఆవాహనము, తరువాత సన్నిధానము చెప్పబడినది. స్నానము చేసినవానికి ఇష్టఫలప్రాప్తికై సాన్నిధ్యమును పరికల్పింపవలెను. అంతఃశుద్ధికొరకు తదభిమంత్రిత జలమును పానముచేసి ఆచమనమును చేయవలెను. బాహ్యావయవశుద్ధికొరకు కుశజలముతో మార్జనముచేయవలెను. భక్తుడు బాహ్యాంతరంగశుద్ధికొరకు మూడు దోసిలుల మంత్రపూత జలము శిరస్సుపైని పోసికొనవలెను. సాగరములోను జలమధ్యమున జపము చేయకూడదు.

సాధకుడు కోటిజన్మములందు చేసిన పాపములు ఆ జలములో కొట్టుకొని పోవుచున్నట్లు అఘనాశనమయినట్లు భావించుచు ముమ్మారు స్నానము చేయవలెను. అతడు రేవి విధిప్రకారము ఆచమనము చేసి

శ్లో ॥ "త్వమగ్నిర్జగతాంనాథ! రేతోధాఃకామదీపనః।
ప్రధానం సర్వభూతానాం। జీవానాం ప్రభురవ్యయ!
అమృతస్యారణి స్త్వంహి। దేవయోనిరపాంపతే!
వృజినం హరమేసర్వం। తీర్థరాజ! నమోఽస్తుతే।
జన్మకోటి సహస్రేషు। యత్పాపంపూర్వ మర్జితం।
తదశేషంలయం యాతు। దేహమేబ్రహ్మశాశ్వతం॥"

అని మంత్రమును జపించి ప్రార్థించి స్నానమాచరించి ఒడ్డునకువచ్చి ఆచమనము చేసి, శుక్లవస్త్రములను ధరించి ఉజ్జ్వలాకారముగల పుండ్రములను శంఖచక్ర గదాపద్మతిలకములను భక్తుడు ధరించవలెను.

తర్పణములు

భక్తుడు దేవతలను పితృదేవతలను యథావిధిగ భగవద్భావనతో స్మరించుచు నిశ్చలమనస్కుడై వారికి తర్పణములు చేయవలెను.

పిమ్మట భక్తుడు పూర్వముచెప్పిన రీతిగా మండలమును విరచించి ఉత్తరాభిముఖుడై మూలమంత్రముతో జగన్నాథుని పూజించవలెను.

శ్రీ జగన్నాథునకు షోడశోపచారపూజ

శ్లో ॥ నారాయణం చతుర్బాహుం। శంఖచక్రగదాధరం।
ధరారమాభ్యాంసహితం। కేవలంవాద్విజోత్తమాః॥
ధ్యాత్వాంతర్యాగసంతుష్టం। బహిరావాహయేత్తతః।
ఆగచ్ఛ పరమానంద! జగద్వ్యాపిన్ జగన్మయ!
అనుగ్రహాయదేవేశ! మండలేసన్నిధింకురు।
చరాచరమిదంసర్వం। జగదత్రప్రతిష్ఠితం।
తదంతస్థస్త్వమేవేశ! ఆసనంకల్పయామి తే
యన్యపాదాంబుజే ధాతే। ధర్మేణ బ్రహ్మరూపిణా।
పునాతి తత్పవాగంగా। జగత్పాద్యం దదామ్యహాం
అనర్ఘ్యరత్నఘటిత। మాడామణికరోత్కరైః।
బ్రహ్మాదయఃపాదపద్మం। చింతయంతి దినేదినే।
అనర్ఘ్యాయజగద్ధామ్నే। అర్ఘ్యమేతద్దదామ్యహాం



అచాంతస్త్రీరరాజో వై। యేనాగ త్స్యస్వరూపిణా
తస్మైసువాసితం వారి। దదామ్యాచమనీయకం।
యఃప్రాప్యమధుసంపర్కం। చక్షర్జలరూపిణం।
అశేషామువికర్షాయ! మధుపర్కం దదామ్యహాం।
యఃక్రోడరూపమాస్థాయ। ప్రణయార్ణవవిప్లుతాం।
ఉజ్జహార ధరామేతాం। స్నపయామితమంభసా
బ్రహ్మాండకోటయోయస్య। విశ్వరూపస్యసంవృతిః।
ఆచ్ఛాదనాయసర్వేషాం। ప్రదదే వాససీశుభే।
వినాయేనానుష్ఠితోఽపి। యజ్ఞఃస్యాదకృతోధ్రువః
తస్మైయజ్ఞేశ్వరాయేదం। ముపవీతంప్రకల్పయే।
యదంగసంగమాసాద్య। శోభంతేభూషణాని వై।
విశ్వాలంకృతయేతస్మై। భూషణాని ప్రకల్పయే।
యదంగసంస్పర్శమరు। త్పంగాన్మలయజాద్రుమాః
సుగంధరససంపన్న స్తస్మై। గంధానులేపనం॥
యస్యసంచింతనాదేవ। సౌమనస్యంహతాంహసాం।
తస్మైసుమనసాంమాలాం। సుగంధాంపరికల్పయే।
యంచి త్తేస్థిరమాదాయ। భవాగ్నివరిధూపనం
జహతితస్మైప్రపదే। సుగంధం ధూపముత్తమం॥
స్వతేజసాఖిలమిదం। దీపితంయస్య భాసతః।
తస్మైదీపప్రదీప్తాయ। దీపమేతందదామ్యహాం॥
చరాచరం జగత్సర్వము త్తి। యాయశ్చభావయేత్।
అనేనచ పునఃపుష్టి। తస్మాదన్నం నివేదయే।
యదీయంముఖరాగేణ। సహజాఖిలేవచ
మోహితాఃసురసుందర్య స్తస్మైతాంబూలముత్తమం
ప్రదక్షిణప్రక్రమణాద్యవాంగణ వివర్తనం
హంతియఃకరుణాంభోధి స్తంవమామిజగద్గురుం
మంత్రాస్తుకథితా హ్యేతే। ఉపచారైఃపృథక్పృథక్।
ఆవాహ్యచింతయేద్దేవం। బహిఃసంస్థితమాత్మవః।
రత్నసింహాసనం దత్వాతత్రాపీనం విచింతయేత్।
పాదపద్మద్వయేదద్యా। త్పాద్యంశ్యామాకపంకజైః
దూర్వాపరాజితాభ్యాంచ। పంస్కృతం మూలమంత్రణాత్।
సౌవర్ణైరాజతేవాపి। తామ్రేవాశంఖ ఏవవా।
అర్ఘ్యంసంస్కృత్య విధివద్వారిచందనపుష్పకైః॥
యవదూర్వాకుశాగ్రైశ్చ। వడసిద్ధార్థకైస్తిలైః।

దూర్వాకుశాగ్రైర్దేవస్య। మూర్ధ్నిసించేత్తదగ్రతః।
సావశేషంక్షిపేద్భూమావేషోఽర్ఘ్య విధిరీరితః॥

జాతీ ఫలములతో లవంగములతో సంస్కరింపబడిన జలమును భగవంతునికి ఆచమనమునకు ఈయవలయును. పిమ్మట మధుపర్కమును సమర్పింపవలయును.

నిర్మలమయిన కాంస్యపాత్రలో మధుసర్పిర్యుతదధిగవ్యములను సమర్పింపవలయును. మరియొక కాంస్య పాత్రలో కప్పియుంచిన జలము స్నానమున కుచితమయినదని చెప్పబడినది. శుభప్రదములగు పట్టుబట్టలను భగవంతునికి అర్పింపవలయును.

జగన్నాథుని విగ్రహమునకు యథాశక్తిగ హారకేయూరముకుట గ్రైవేయాది భూషణములను ఉచితరీతిని అలంకరింపవలయును.

పట్టసూత్రనిర్మితమయిన ఉపవీతమును దూదితో తయారుచేయబడిన వస్త్రద్వయమును దేవునకొసగవలెను. గంధచందనముతో చంద్రచందన కస్తూరీ కుంకుమముతోకూడిన అనులేపనమును జాతీపంకజచంపకతులసీదళములతో అల్లిన మాలను మరియు అశోకసుర పున్నాగనాగ కేసర కేసరములతో ఇతర పరిమళోపేతకుసుమములతో కట్టిన మాలను మరియు మంచి ముత్యములను పుష్పములను దేవుని శిరస్సుపైని ఉంచవలెను.

దేవుని విగ్రహముయొక్క ముంగాలువరకు మాలను కంఠమునుండి తొడలవరకు మాల్యమును, కేశమధ్యమున పూదండను ఉంచి తలపైని పుష్పములను జల్లవలెను. గుగ్గుల్వగురూశీర సితాజ్యమధుచందనములతో కూడిన పరిమళముగల ధూపమును, వత్తిలోపల కర్పూరమును పెట్టి దానిని గోఘృతమునందు లేక, తిల తైలమునందుంచిన దీపమును భగవంతునికి అర్పింపవలెను. పరిపక్వమయిన అన్నమును, సుగంధోపేత గోఘృతముతో అభిఘరించి పలు రకములయిన పిండివంటలు, రుచికరములగు కూరలు, పచ్చళ్లు, రసవంతములగు ఫలములు భగవంతునికి నివేదింపవలెను.

భక్తుడు భగవంతునికి ధూపదీపనైవేద్యములు, స్నానము, అర్ఘ్యము, మధుపర్కములు, వస్త్రయుగ్మము, యజ్ఞోపవీతము, సమర్పించునపుడు ఆచమనము చేయవలెను. ఔపచారికముగ ఇతర కార్యక్రమమును చేయునపుడు కేవలము జలమునే ఉపయోగింప వచ్చును.

నైవేద్యానంతరము ఆచమనము కర్పూరలవంగైలా జాతీక్రముకసంయుతము, సుగంధ చందన యుక్తమగు తాంబూలమును భగవంతునకు సమర్పింపవలయును. పిమ్మట భక్తుడు ఏకాగ్రతతో అష్టోత్తర శతసంఖ్యాకమగు మూల



మంత్రమును జపించి పురుషోత్తముని స్తుతించి ప్రదక్షిణ మాచరించి ప్రార్థింపవలెను.

శ్రీ జగన్నాథ స్తుతి

శ్లో॥ "దేవదేవ! జగన్నాథ! సర్వతీర్థ ప్రవర్తక!
సర్వతీర్థమయశ్చాసి! సర్వదేవమయ! ప్రభో!
త్వత్ప్రసాదాన్మయా తీర్థరాజే స్నానం హి యత్కృతం॥
తదస్తుసఫలందేవ! యథోక్తంఫలదోభవ।
సింధురాజస్త్వంచవిభో! ద్రవరూపోఽన్యసంశయం
పాపాలయే నిమగ్నంమాం। పరిత్రాహినమోఽస్తుతే॥"

అని భక్తుడు స్తుతించి, పుణ్యతీర్థమున స్నానముచేసి దేవేశుడయిన నారాయణుని పూజించిన సర్వతీర్థఫలమును పొందును. కోటిగోవులను దానముచేయుట వలన, కోటి క్రతువులొనర్చుటవలన, కోటి బ్రాహ్మణులకు భోజనము పెట్టుటవలన, కోట్లకొలది మహాదానములు చేయుటవలన ఆయా కర్తలకు ఏ పుణ్యము లభించునో ఆ పుణ్య తీర్థమున స్నానము చేసినవానికి ఆ పుణ్యము కల్గును.

సముద్రస్నాన ఫలితము

భక్తుడు ఆ సాగరతీరమున గావించిన ధ్యానదాన తపో జపములవలన శ్రాద్ధకర్మమువలన, సురపూజనమువలన కోటిగుణితమగు ఫలితమును పొందగలడు.

ఏ మానవుడు ఆ సముద్రమున స్నానమాచరించి సురలను పూజించి పితృదేవతలకు తిలోదకము లర్పించునో, అతని వంశమువారికి సర్వ పాతకములు నశించి అనిష్టములు పోవును.

అన్యతీర్థమున చేసిన పాపము ఆ సాగరతీరమున వసించినచో నశించును. ఆ సింధుతీరమున చేసిన పాపము సింధుస్నానముచే పోవును.

ఆ వారిధియందు స్నానమాచరించినవానిని యమకింకరులు చూచి సింహమును గాంచిన మృగమువలె పారిపోవుదురు.

ఆ జలధిలో స్నానముచేసినవానిని యముడు చూచినను భీతుడై వానికి నమస్కరించి, పూజించి వానియెదుట నుండలేక పోవును.

దేవతలు మనుష్యజన్మమునంది పరిశుద్ధ తనువులను దాల్చి ఆ సముద్ర స్నానము నిత్యముచేయుటకై తహతహలాడుచుందురు.

దుష్టుని పాపరాశి మేరుపర్వతమంతయున్నను దూదికొండ అగ్నిచే దహింపబడునట్లు ఆ సముద్రస్నానమువలన దగ్ధమగును.

ఏ జనుడు సాక్షాత్తు విష్ణుస్వరూపమగు ఆ సాగర జలమునందు స్నాన సమయమున నారాయణుని స్మరించునో బ్రహ్మ హత్యచేసిన వాడయినను సురా పానముచేసిన వాడయినను గోహత్యచేసిన వాడయినను పంచపాతకి అయినను పాప విముక్తుడగుటలో సంశయములేదు.

అచట ఆ సముద్రస్నానమువలన కోటి కపిల గోవులు దానముచేసిన ఫలితము కల్గును. ఆ సముద్రస్నానముచేసిన వాని కులము తరించును.

ఆ సాగర స్నానముచేసిన వానికి, సర్వతీర్థములయందు స్నానముచేయుట వలన, సకల దేవాలయములయందు దేవతలకు పూజచేయుటవలన కల్గు పుణ్యము లభించును.

ఏ భక్తుడయినను తన జన్మము సఫలము చేసికొనదలచినచో అతడు సముద్రమునకేగి అచట పితృదేవతలకు తర్పణములు చేయవలెను. సురలను పూజింపవలెను. అట్లొనర్చినవానికి షడంగ పదక్రమసహితములగు నాల్గు వేదములు సులభగ్రాహ్యము లగును. కురుక్షేత్రమున చేయు దానములు, సులభతరము లగును.

ఆ పారావారములో స్నానము చేసినవానికి కష్టతరములయిన చాంద్రాయణ వ్రతములు తపస్సులు అగ్నిష్టోమాదియజ్ఞములు, బహు దక్షిణలిచ్చుట సుసాధ్యములగును. అచటి సింధుజలముతో పితృతర్పణము చేయుట అందరికి లభ్యముకాదు.

ఆ సాగరమున మనుజుడు ఒక మాసము పితృతర్పణములు చేసి శ్రాద్ధ పిండప్రదానములు చేసినచో, ఆ సత్కర్మలవలన సుసంతుష్టులయిన పితరులు విమానముల నధిరోహించి సూర్యకాంతితో బ్రహ్మలోకమునకు శీఘ్రముగా పోగలరు.

ఆ మహత్తర కార్యములనుచేయనారంభించిన భక్తుడు ఆద్యంతముల యందు శ్రీ జగన్నాథస్వామిని యథావిధిగా పూజించి ఆ పుణ్యతీర్థమున అభిషే చనముచేసినచో తప్పక ముక్తిని పొందగలడు. అట్లు పరిశుద్ధుడగు పురుషుడు ఆ పుణ్యతీర్థమును విడిచి శ్రీకృష్ణునకు బలరామునకు సుభద్రాదేవికి నమస్కరించి వారి రూపములను ధ్యానించుచు, తాను కృతకృత్యుడయినట్లు భావించుచు, అచటి నుండి వెళ్లవలయును" అని జైమిని ద్విజులకు తెల్పెను.



## 31వ అధ్యాయము

1. జైమిని ద్విజులకు ఇంద్రద్యుమ్న సరఃస్నానమును గూర్చి చెప్పుట :

"ఓ ద్విజులారా! ఇంద్రద్యుమ్న సరస్సుకూడ అశ్వమేధ యాగమునకు అంగభూతమే. ఆ సరస్తీరమున హరి నరసింహాకారముతో నివసించుచున్నాడు. ఆ నృసింహస్వామిని యథావిధిగా ఇట్లు ప్రార్థించి ఆ సరస్సులో స్నానము చేయవలెను.

శ్లో॥ "నరసింహ! నమస్తుభ్యం। యస్యతేక్షేత్ర ఉత్తమే।
సహస్రంవాజిమేధస్య। క్రతోశ్చక్రే నృపోత్తమః॥
ఇంద్రద్యుమ్నః ప్రసాదాత్తే। తస్యక్రత్వంగసంభవే।
సరసిస్నాతుమాయాతో। మామను జ్ఞాపయప్రభో!"

పిమ్మట భక్తుడు సరస్తీరమునకు వెళ్లి శౌచాచామ క్రియలొనర్చి, నమస్కరించుచు ఈ మంత్రమును జపింపవలయును.

శ్లో॥ "అశ్వమేధాంగగోకోటి। ఖురక్షుణ్ణమహీతలః।
తన్మాత్రఫేనాదానాంభః। పూరితాఖిలపావనః॥
స్నాతుంతవాగతః పుణ్యే। సర్వతీర్థమయేజలే।
పూర్వజన్మ సహస్రోత్థం। పాపంస్నానాద్విమోచయ॥"

అను మంత్రమును జపించి, భక్తుడు సరస్సులోనికి దిగి, వారుణమంత్రమును ఐదు పర్యాయములు, అఘమర్షణమంత్రమును ముమ్మారు జపించుచు, అంతర్జలములో స్నానముచేయవలెను.

శ్లో॥ "అశ్వమేధాంగసంభూత। తీర్థసర్వాఘనాశన।
జన్మకోటిభవంపాపం। త్వయిస్నానాద్వినశ్యతు॥

అను మంత్రమును ముమ్మారు జపించి సరస్సునందలి జలములో మూడు పర్యాయములు స్నానముచేయవలెను. పిమ్మట విష్ణుగాయత్రీ మంత్రముతో నరసింహావతారమును దాల్చిన హరిని స్మరింపవలెను.

ఉదకమేనారశబ్దవాచ్యమగుచున్నది. హరి మొట్టమొదట జలమునందే నివసించెను. కావున హరిని స్మరింపవలయును.

భక్తుడు దేవతలకు పితరులకు తర్పణములిచ్చి పిమ్మట పశ్చిమాభిముఖు డగు నరసింహస్వామిని దర్శింపవలెను. ఈశ్వరుని, లేదా, పశ్చిమాభి ముఖుడగు హరిని సందర్శించినవానికి కోటిజన్మములందు చేసిన పాపములు

నశించును. పూర్వము నారదమహర్షి ప్రోక్తమయిన అథర్వణమంత్రముతో నృసింహస్వామికి యజనము చేయవలెను.

ఆ మంత్రమునే ఇంద్రద్యుమ్ననృపతి చిరకాలము ఉపాసించెను. నృసింహావతారునివిషయమై ఆ మంత్రము వంటిది ఇంకొకటిలేదు. ఈ అథర్వణ మంత్ర జపమువలన నృసింహుడు తుష్టినొందును. ఈ మంత్రమును ఉచ్చరించి బ్రహ్మ జగన్నాథుని దారు విగ్రహములను ప్రతిష్ఠించెను. పూర్వోక్తములైన ఉపచారములతో సుగంధముగల కుసుమములతో అరుణవర్ణముతో అలరారు జపాప్రసూనములతో నరకేసరిని పూజింపవలెను. నృసింహస్వామికి కర్పూరాగరు చందనాదులతో పూయవలెను. స్వచ్ఛమయిన ఆవు నెయ్యి అభిఘరించిన పాయసము కర్పూరఖండసంయుక్తమోదకములు నేతితోచేసిన పిండివంటలు నానావిధ మధుర రసోపేత ఫలములు శర్కరాదధిమిశ్రిత శాల్యన్నము నృసింహస్వామికి నైవేద్యముచేయవలెను. ఏ మానవుడు నృసింహస్వామిని చూచి స్పృశించి నమస్కరించి పూజించునో అతడు తన యభీష్ట సిద్ధినిపొందగలడు సంశయములేదు. అట్లు చేయువాడు దేవత్వము, అమరేశత్వము, గంధర్వత్వము, ఈశత్వము, వశిత్వము, సార్వభౌమత్వము – వీనిలో ఎద్దానిని మనస్సులో కోరినను, అద్దానిని పొందగలడనుటలో సంశయము లేదు.

2. జైమిని ద్విజులకు పంచతీర్థవిధానమును తెల్పుట :

మనుజుడు విష్ణుభక్తియుతుడై నిష్ఠావరుడై ఐదు దినములు పంచతీర్థ విధానమును ఆచరించినచో పంచభూతమయమగు దేహమును మరల ధరింపడు. అనగా అతనికి పునర్జన్మము కలుగదు. భక్తుడు ఇంద్రద్యుమ్నసరస్సులోని జలములో పౌర్ణమాసియందు ఉషఃకాలమున పూర్వోక్తవిధిప్రకారము స్నానమాచరించి శుద్ధాహారుడై జితేంద్రియుడై దైవప్రీతికొరకు ఏకభుక్తవ్రతమును పంచదివసములు పాటించి పిమ్మట ప్రాసాదమును ప్రవేశించి మంచస్థుడగు పురుషోత్తముని బలరాముని సుభద్రాదేవిని చూచినచో పాపకంచుకములనుండి విముక్తుడగును.

సర్వతీర్థమయమయిన కూపమునుండి తీసిన సుగంధోపేతమగు జలముతో జ్యేష్ఠమాసమున స్నానము చేయించిన హరిని దర్శించిన భక్తునకు హృదయ మందు ఎట్టి పాపసంబంధము జనింపదు.

3. జైమిని ద్విజులకు రథయాత్రావిధిని చెప్పుట :

చతుర్దశియందు తృణకాష్ఠమయము దృఢమగు వేదికను సుందరముగ చేయించి దానికి సున్నము పూయవలెను. లేక, చిరస్థాయిగా నుండు



నట్లు రాతితో మంచమును చేయింపవచ్చును. దేవదేవుడగు జగన్నాథుని స్నానము విషయమై ధనపరమయిన మోసము చేయరాదు.

జగన్నాథాది దేవతాప్రతిమలను చూచుటకు నానావృక్షగణాకీర్ణమై దక్షిణానిలశీతలమై ఉల్లసత్సింధుకల్లోల శాద్వలముపై సంస్కరింపబడి సముచ్ఛ్రిత మహామూల్యవితానకరశోభితమై విరలమగు ఆచ్ఛాదనమును తయారుచేయ వలెను. జగన్నాథునికి స్నానమునకై పారిజాతవిభూషితమైన స్వర్గంగాజలమును తీసికొని బ్రహ్మతోకూడ బ్రహ్మర్షులు సురలు వచ్చెదరు. వారు పరమేష్ఠి వచనానుసారముగ బ్రహ్మదేవునితో కూడ మంచస్థుడగు జగన్నాథునకు స్నానమును చేయించెదరు.

జగన్నాథుడు దేవతల జయశబ్దములతోడను స్తుతులతోడను వంద నీయుడు. కావున మాల్యచామర భూషితమై నానామణిస్రజాహారి దుకూలకృత తోరణమై సుగంధధూపసురభి చందనాంభః సముక్షితమగు వేదికను చేయింప వలెను. ఇట్లు వేదిక దక్షిణదిక్కున ప్రతిష్ఠించి కూపమునుండి నీరు తోడి స్వర్ణమయకలశములను శాస్త్రప్రకారము ఉంచి వానిలో సువాసితమగు జలమును పావమాన్యమంత్రముతో నింపవలెను. ఈ కార్యక్రమమంతయు చతుర్దశితిథినాడు అర్ధరాత్రి సమయమున ఆచరింపవలెను.

ఇంద్రద్యుమ్నునిచే ఆహ్వానింపబడిన బ్రాహ్మణ క్షత్రియవైశ్యులు బల రాముని విగ్రహమును ముందుగా నడుపుచు దానివెనుక జగన్నాథుని విగ్రహమును మెల్లమెల్లగా నడుపుచు ఆ హరి విగ్రహమునకు నిరంతరము చామరములతో తాలవృంతములతో వీచుచుందురు. జగన్నాథుని విగ్రహము నకు పూసిన చందనాది లేపనమును తీయరాదు. ప్రతిదినము హరిప్రతిమకు సుగంధలేపనము పూయుటచే అది పుష్టిగా గోచరించును. గంధపు పూతను తీసినచో కృశాంగమగు విగ్రహము పుష్టిగా నుండదు. భగవంతుని ప్రతిమ లకు ప్రమాదము లేకుండ తీసికొనివెళ్లవలెను. సుభద్రాబలభద్ర జగన్నాథుల విగ్రహములలో ఏది క్రిందపడినను రాజునకు రాజ్యమునకు కూడ భయముకల్గును ఆ ప్రతిమలను క్రిందనుపడవైచిన వారికిని వారిసంతతికిని దుఃఖము సంభవించును. అట్టి దుర్మార్గులు శాశ్వతముగ నరకమందుండుట తప్పదు. మూఢులు దైవద్రోహులు దారు మయమగు ఈ ప్రతిమ చిరకాల మెట్లుండుననెడి విశ్వాస రాహిత్యముచే సర్వకర్మబహిష్కృతులై నరకమునకు పోవుచున్నారు. మూఢు లకు, నాస్తికులకు, కృతఘ్నులకు, హతాత్ములకు, ధర్మకార్యాచరణలో అవిశ్వాసము కలుగును. ఏ సామగ్రికి ఎంత అదృష్టమున్నదో దానితోనే ప్రాసాదము, దేవప్రతిమలు నిర్మింపబడినవి. ఆ యదృష్టానంతరము ప్రాసాదము దేవప్రతిమలు క్షీణించును. ఈ ద్రుమము ఎవ్వనిచేతను నిర్మింప

బడలేదు. అదేవృద్ధి పొందినది. ఏ ప్రతిమ వరమునీయదో, అది ప్రతిమ కాదు.

పూర్వము దివ్యప్రతిమలు నిర్మింపబడినను మన్వంతరాదులు గడచినను, సర్వ నరులకు' నరాధిపులకు దేవతలకు, ఆ దేవతా విగ్రహముల పైని, భక్తి ప్రపత్తులు దృఢవిశ్వాసము ఆ నాటినుండి వృద్ధిపొందుచున్నవి.

స్వారోచిష మన్వంతరమున కృపానిధియగు హరి ఆవిర్భవించెను. వైవస్వతమన్వంతరమున ఇరువది యేడవ మహాయుగమున (చతుర్యుగమున) ద్వాపరయుగాంతమున కృష్ణార్జునులు ఉభయులును అటకువచ్చి మూడు దినములు నియమముతో మధుసూదనుని భక్తితో పూజించి, స్తుతించి ద్వారకా పురమునకు మరలిపోయిరి.

ప్రతి యుగమునందు ఈ విష్ణువుయొక్కఅవతారములు మానుష దేహమును దాల్చి ధర్మస్థాపనము గావించి, మరల తన స్థానములో లీనమగుచున్నవి.

పూర్వము ఈ బ్రహ్మచే కోరబడినందున ఆ భగవంతుడు అనుగ్రహించి దారు రూపధారియై పరార్థపర్యంతము ఉండును. శుద్ధ సత్త్వస్వరూపుడుగా భావింపబడుచున్న యీ విష్ణువు సర్వదా వరదుడగుచున్నాడు. భగవంతుని పైని ఎవ్వనికి ఎంత విశ్వాసముండునో అతనికి అంత సిద్ధికలుగును. కారణాంతరముచే, దేవునిపైని విశ్వాసము తగ్గిన మనుజుడు దృఢభక్తికల్గుటకు యత్నించినచో తగిన ఫలితమును పొందగలడు. ఆ యత్నమువలన ఫలము సుదుర్లభమగును. పూర్వము మనకు అంబరీషవిమోచనమును గూర్చి సాకల్యముగ తెల్పబడినది. కావున నరుడు పరమాత్మస్వరూపుడగు ఆ జగన్నాథుని యందు దృఢభక్తినికల్గి పురుషోత్తమ క్షేత్రమునందు నివసింపవలయును. అందువలననే ఉత్తమమయిన ఈ శ్రీకృష్ణ వేదికను భక్తితో తీసికొనవలయును.

సుభద్రా బలభద్రులకును శ్రీ జగన్నాథునకు చేసిన రీతిగా పరిచర్యలు చేయవలెను. వారికిని ఛత్రధారణము చామరములు వీచుట, కాలాగురు ధూపమిచ్చుట, మంగళవాద్యములు వాయించుట, రాత్రులందు జరిపించు మహోత్సవములందు దీపికాశ్రేణులు ఏర్పరచుట మున్నగు రాజోపచారములు చేయవలెను.

శ్రీ జగన్నాథుని విగ్రహమున కప్పబడిన పట్టువస్త్రములకు ప్రమాదము వాటిల్లినదను శంకతో అవి దూరముగా దాచబడినవి. శ్రీ జగన్నాథుని ముఖము గమన వేగముచే పైకి ఎత్తబడుటవలన సురలు తమ దృష్టి మరలుటచే, హరి స్వర్గలోకమునకేగుచున్నట్లు శంకించినవారై "జయరామకృష్ణ, జయభద్ర" అని పల్కిరి. బ్రాహ్మణాదులు అర్ధరాత్రమున లీలగా భగవంతుడు జన్మించిన జ్యేష్ఠ



మాసమున అతనికి అభిషేకము చేయుటకు స్వామి విగ్రహమును వేదిక దగ్గరకు గొంపోవుచుండిరి. స్వర్గమున దేవతలు 'నేనే ముందు నేనే ముందు' అనునట్టి శబ్దము, జయశబ్దయుత దేవదుందుభి ధ్వనులు వినబడినవి.

## 4. శ్రీ జగన్నాథుని స్నానవిధి :

పిమ్మట మంచమందున్న బ్రహ్మ స్వరూపమయిన విగ్రహముయొక్క ముఖము తప్ప మిగిలిన సర్వాంగములను అచ్ఛాదనము చేసి నైవేద్యము తప్ప శేషించిన పూర్వోక్తములైన ఉపచారములతో జగన్నాథుని పూజించి శాంతి మంత్రముల నుచ్చరించుచు సముద్రజ్యేష్ఠా మంత్రముతో అచటి కుంభములందలి జలముతో ఆ దివ్య విగ్రహములకు స్నానము చేయింపవలెను. అచటనున్న మనుజులు కృతకృత్యులగుటకు అభిషేకము చేయించుచున్నవారిని స్నానము చేయింపబడుచున్నవారిని గాంచుటచే, వారికి మరల మాతృ గర్భోదకముచే స్నానముచేయుట ప్రాప్తింపదు.

భగవంతుడగు జగన్నాథుని జ్యేష్ఠమాస స్నానమును యాత్రావిధిని చూచువారు భవసాగరమున మునుగరు. హరిస్నానవిధిని గాంచుచున్నవారు గతములో తెలిసికాని తెలియకకాని చేసిన పాపసంచయము వెంటనే నశించును. ఇదియంతయు పరమసత్యము. శ్రీపతికి జ్యేష్ఠమాసమున చేయు మహోత్సవమును వాని రూపమును తిలకించువారికి సర్వసంతాపశమనము కలుగును. అశేషమల నాశనము కలుగును. శ్రీహరియొక్క స్నానవిధానమును అవలోకించువారు చేసిన ప్రాయశ్చిత్తార్హములయిన పాపములన్నియు క్షీణించును. ఈ సత్కార్మకంటె ఇతరమయినది అనాయాసముగ ముక్తినీయజాలదు.

కోటి గుణితములై కోటి జన్మోపపాదితములైన స్నానదానతపఃశ్రాద్ధజప యజ్ఞాదులవలన కలుగు పుణ్యములు, జ్యేష్ఠమాసమున శ్రీహరిజన్మ దివసమున ఆ భగవంతునికి జరిగిన స్నానమును చూచుటవలన కలుగు పుణ్యమునకు తుల్యములు.

మానవుడు భక్తితో శ్రీ జగన్నాథుని స్నానమును ఒక్క సంవత్సరము చూచినను ఇహలోక సంసారమువలన దుఃఖింపడు. శ్రీ జగన్నాథుని స్నానవిధిని ఎవ్వడు చూచునో ఆతడు శ్రద్ధతో అధిక దక్షిణ లిచ్చి పుణ్యక్రతువులు చేసినట్లు, మహాదానములు చేసినట్లు, ద్విజులకు భోజనము పెట్టినట్లు, గయలో శ్రాద్ధములు చేసినట్లు, పుణ్యకాలమున తీర్థాదులలో తపస్సు చేసినట్లు, కోటి తీర్థములందు, అర్ధోదయాది పుణ్యకాలములందు స్నానములు చేసినట్లు భావింపవచ్చును. ఇది ముమ్మాటికి సత్యము. ఇంతకంటె శ్రేయస్కరమగు కర్మకలదని శాస్త్రములందు చెప్పబడలేదు. పురుషోత్తముని మంచమందుంచి స్నానము చేయించుటకు చూచు

నరునకు, స్నానముకంటె నూరురెట్లు పుణ్యము లభించుననుటలో సంశయము లేదు. వేదికయందుండి స్నానముచే, తడిసిన జగన్నాథుని చూచునట్టి మానవుడు సాంద్రానందార్ద్రచిత్తుడై ఏ మాత్రము పాపము లేనివాడగును.

నరునకు జగన్నాథుని స్నానదర్శనమువలన లభించు పుణ్యమే, ఆ స్వామి వేదికయందున్నపుడు చూచినను కలుగును. ఒక్క జగన్నాథుడే అచట మూడు విగ్రహరూపములతో కానవచ్చుచున్నాడు. వారిలో ఏ యొక్కరి విగ్రహమును దర్శించినను భుక్తిముక్తి ప్రదమగును.

శ్లో॥ "జయస్వరామభద్రేతి । జయభద్రేతియోవదేత్ ।
జయకృష్ణ ! జగన్నాథ ! జయేత్యుచ్చారయేన్ముదా ॥"

అని భక్తులు ఆనందముతో పలుకుచుండవలెను. జగన్నాథుని స్నానకాలమున అట్లు వచించువానికి ముక్తికల్గును. స్వామికి స్నానవిధి జరుగుచున్నపుడు అట నున్నవారికి శ్రద్ధానందయుతుడగు భక్తుడు ప్రత్యేకముగ దక్షిణలొసగవలయును. భక్తుడు శ్రద్ధతో బ్రాహ్మణులకు షడ్రసోపేతమగు భోజనమును వస్త్రాలంకార ముల నిచ్చి దీనానాథులనుకూడ తృప్తిపరపలెను.

5. శ్రీ జగన్నాథుని స్నానము చూచువారికి కలుగు ఫలము :

శ్రీ జగన్నాథుని స్నానమును చూచుటకు వచ్చినవారు జీవన్ముక్తులగుట నిశ్చయము. రాజు అట్టి భక్తులను హరి ప్రీతికొరకు గౌరవింపవలెను. ఏ పురుషు డయినను స్త్రీయైనను జగన్నాథుని స్నానావశిష్టమగు పూతజలముతో, భద్రా సనముపైనుండి స్నానము చేసినయెడల కల్గుఫలితములు చెప్పబడుచున్నవి. చిరరోగార్తుడు అపమృత్యువును జయించును. అపుత్రులు, మృతపుత్రులు, అయినవారు, పుత్రసంతతి కలవారగుదురు. నిర్ధనుడు సర్వలోకములలో సుభగుడై ధనవంతుడగును. గర్భిణీస్త్రీ దీర్ఘాయుష్మంతుడు, గుణవత్తరుడగు పుత్రుని కనును. ఏ ధర్మాత్మునకయినను, శ్రీ జగన్నాథుని స్నానమును చూచుట వలన కలుగు పుణ్యఫలము, గంగానది సర్వతీర్థములలో స్నానము చేయుటవలన కల్గు ఫలము సమానమని చెప్పబడినది.

## 32వ అధ్యాయము

1. జైమిని ద్విజులకు దక్షిణామూర్తి దర్శనమునుగూర్చి తెల్పుట :

'ఓ ద్విజులారా ! దక్షిణామూర్తి దర్శనమువలన అశ్వమేధయాగఫలము లభించును. ఆ దేవుని యథాశక్త్యుపచారములతో, గంధమాల్యాదులతో పూజించి నానావిధ దివ్యభక్ష్యభోజ్యాదులను నివేదింపవలెను.



బలరాముని శ్రీకృష్ణుని సుభద్రను గీతనృత్యాదులతో శ్రద్ధగా ఆకర్షణీయము లగు పూజాద్రవ్యములతో అర్చించి, ఉత్తమ విప్రులకు భగవద్భక్తులకు వస్త్ర చందన మాల్యాదుల నొసగి సత్కరింపవలెను. పిమ్మట ఆ మూడు దేవతా మూర్తులను దక్షిణాభిముఖముగ తీసికొని వెళ్లవలెను. శ్రీ జగన్నాథస్వామికి పూర్వము చేసినట్లే ఉత్సవము చేయవలెను. ఆ సమయమున దక్షిణాభిముఖముగ పయనించుచున్న జగన్నాథస్వామిని చూడవలయును. జగన్నాథునితోకూడ వెళ్లుచున్న సుభద్రను స్త్రీగాని, పురుషుడుగాని చూచినచో ప్రాకృత మానుషత్వ మును వీడి, దివ్యత్వమును గాంచును.

దేవతలు జగద్గురువగు జగన్నాథస్వామికి స్నానము చేయించి భవనాశన మగు దక్షిణ దిక్కువైపు పయనించుచున్న శ్రీకృష్ణుని చూచుటకు ఆకాశము నందు అంతవరకు వేచియుండిరి. ధర్మశాస్త్రములయందు ఏయే ధర్మకర్మము లున్నవో, వానిని గాంచుటకు దక్షిణాభిముఖముగ పయనించుచున్న శ్రీ జగ న్నాథుని చూచువారికి, స్వామి స్నానదర్శనములవలన కల్గు పుణ్యము సమగ్రముగ ప్రాప్తించును.

జగన్నాథుడు స్నానానంతరము దక్షిణాభిముఖముగ పయనించుచుండగ చూచువాడు జగన్నాథునకు సుభద్రాబలభద్రులకు నీరాజనమిచ్చిన తరువాత ప్రాసాదములో ప్రవేశించినపుడు చూడకూడదు. ఈ విషయమింతకు ముందు విస్తరించి చెప్పబడినది.

2. జైమిని విప్రులకు జగన్నాథుని స్నానమును చూచుటవలన కలుగు ఫలమును చెప్పుట :

ఓ విప్రులారా ! జ్యేష్ఠపంచకవ్రతము అత్యుత్తమమయినదని శాస్త్రపారగు లయిన ఋషులు చెప్పిరి. శ్రౌతస్మార్త పురాణోక్త వ్రతములలో ఇదియే ఉత్తమ మయినది. మొదట ఈ వ్రతము విషయమై పరమేష్ఠియే చెప్పెను. ప్రధాన వ్రతములలో ఇది శ్రేష్ఠమయినది కావున జ్యేష్ఠపంచకమనబడుచున్నది. సముద్రము జ్యేష్ఠఫలదమే. జగన్నాథుడు కూడ జ్యేష్ఠఫలప్రదుడే. జగన్నాథుని సంవత్సరము దర్శించిన ఫలము స్వామివేదికను చూచుటవలన లభ్యమగుచున్నది. స్వామివేదికను చూచుటవలన కలుగు ఫలితము, జ్యేష్ఠమాసమున స్వామిస్నానవిధిని గాంచినచో లభించును. పూర్వోక్తమయిన జ్యేష్ఠమాసస్నానవిధిని గాంచినందున కలుగు ఫలము సమగ్రముగ ప్రాప్తించుననుటలో సంశయములేదు.

### జ్యేష్ఠమాస స్నానఫలము

జ్యేష్ఠమాసమున శుద్ధపూర్ణిమాయుక్త గురువారమున చంద్రగురులు, జ్యేష్ఠానక్షత్రైకాంశలో నున్నపుడు, అదిశుభయోగము. అట్టి మహాజ్యైష్ఠి సర్వ

పాపప్రణాశిని అగుచున్నది. ఆ శుభయోగమున సర్వక్షేత్రములు, సర్వతీర్థములు సప్తసాగరములు, క్రతువులు, మహాదానములు, తపస్సులు, అష్టాదశవిద్యలు వివిధ వ్రతములు పురుషోత్తమ క్షేత్రమును పొందుచున్నవి. అవి సామూహికముగాను, ప్రత్యేకముగాను ఒక్కొక్క క్షేత్రమును ప్రవేశించి, జ్యేష్ఠస్నానమును చూచువానికి అవకాశమిచ్చుటకు అట్టి పుణ్యాత్ముల నవలోకించుటకు, పరస్పరము మహాజ్యేష్ఠయోగమున పురుషోత్తమ క్షేత్రమును చేరుచున్నవి. భగవంతునికి ప్రీతికరమగు మహాజ్యైష్ఠిమహాపుణ్యప్రదము. ఆ మహాజ్యైష్ఠిపర్వదినమున కృపార్ణవుడు దేవేశుడు సుస్నాతుడయిన జగన్నాథుని పూజించి, దర్శించిన వానికి సర్వపాపముల నుండి విముక్తి కల్గును.

## జ్యేష్ఠపంచకవ్రత ఫలము

భక్తుడు జ్యేష్ఠశుద్ధదశమి యందు ప్రాతఃకాలమున యథావిధిగ స్నానసమాచరించి వైష్ణవద్విజుడగు పురోహితుని ఏర్పరచుకొని ఇట్లు సంకల్పము చేయవలెను.

## వ్రతసంకల్పము

శ్లో॥ "దేవదేవ! జగన్నాథ। సంసారార్ణవతారక!
అద్యారభ్యవ్రతందేవ! యావజ్జైష్ఠీచసాతిథిః॥
తావద్వ్రతంకరిష్యామి ప్రీతయేతవకేశవ!।
సర్వతీర్థాభిషేకంచ। ప్రత్యహంవ్రతభోజనమ్॥
మూర్తీనాంతవపంచానామేకస్యాపిప్రపూజనమ్।
ఏకస్మిన్దివసేదేవ! త్రిసంధ్యంత్వత్ప్రసాదతః॥
సమాప్యతాంవ్రతమిదం। సఫలంచాస్తుతేప్రభో!"

అని సంకల్పింపవలెను. పిమ్మట భక్తుడు ఐదు పుణ్యతీర్థములలో స్నానముచేసి ఇంటికివచ్చి సంస్కరించిన స్థలముపైని కర్ణికతో ఒప్పు అష్టదళపద్మమును వేయవలెను. దాని మధ్య పుణ్యతీర్థోదకముతో నింపిన కుంభమును ఉంచవలెను. దానిపైని చందన ఫలములతో కూడిన రాగిరేకును మూతపెట్టవలెను. అక్షతలతో నింపిన పాత్ర కంఠమున గుడ్డతో కట్టవలెను. ఆ పాత్ర మధ్యమున సువర్ణముతో చేసిన శ్రీ జగన్నాథుని ప్రతిమను స్థాపింపవలెను. ఆ స్వామి విగ్రహము శుభాంగావయవములతో శాంతస్వరూపముతో వామ భాగమున శ్రీదేవితో విరాజిల్లవలెను. ఆ స్వామికి కొంచెము వెనుకను దక్షిణ భాగమున గరుత్మంతుని విగ్రహము ఉంచవలెను. ఊర్ధ్వభాగమున శంఖచక్రధరుడు పద్మాసనస్థుడగు శ్రీ జగన్నాథుని స్థాపించి ఆచార్యుడు సర్వోపచారములతో



పూజించి దేవుని నీలోత్పలమాలతో భక్తిపూర్వకముగా, అలంకరింపవలెను. ఈ విధముగా దశమి తిథియందు పూజించు వానికి దశకోటి పాపములు నశించును.

పిమ్మట ఈ మంత్రమును –

శ్లో॥ "మధుసూదన! దేవేశ! నమస్తే మాధవీ ప్రియ!
కృపావారాంనిధే పాహి పతితంమాంభవార్ణవే!।"

అని ఉచ్చరించి, ఏకాదశి తిథియందు చతుర్బాహుడు శంఖచక్రగదాధరుడు ఐదు బంగారు మాడలతో నిర్మింపబడిన పద్మాసనస్థుడయిన, నారాయణుని లేక, అందులో సగము బంగారముతో నిర్మింపబడిన నారాయణుని పద్మ మాలతో పూజింపవలెను.

శ్రీ జగన్నాథస్వామికి స్వచ్ఛమైన పాయసమును, రంభాఫలములను నానావిధనైవేద్యములను అర్పించి, సంతోషముతో –

శ్లో॥ "నారాయణ! నమస్తేఽస్తు భవసాగరతారణ!
త్రాహిమాం పుండరీకాక్ష! శరణాగతవత్సల!
ఏకాదశేంద్రియకృతం। పాపరాశిమనుత్తమం।
అనాది భవనిర్వ్యూఢం। నాశయేత్వాజితఃప్రభుః"

అని ప్రార్థింపవలెను.

ద్వాదశి తిథియందు స్వర్ణనిర్మితమైన యజ్ఞవరాహమూర్తిని చందనాగురు కర్పూరలేపనములు పూసి చంపకమాలతో అలంకరించి, అర్చించి, నానావిధాపూపసారములను భక్ష్యభోజ్యఫలములను నైవేద్యముచేసి –

శ్లో॥ "ప్రళయార్ణవసంమగ్నాం। ధరణీంధృతవానసి।
కిన్నశక్తో మమోద్ధారే। పతితస్యాంఘ్రిపంకజే।
తన్మాముద్ధర గోవింద! నిమగ్నంశోకసాగరే॥"

అని స్తుతించి ప్రార్థింపవలెను.

గతజన్మములో సంవత్సరములో ఘోరపాపములు, లేక, అల్పపాపములు చేసినవారు నారాయణుని ద్వాదశితిథియందు అర్చించినందువలన తత్పాపఫలమును పొందరు.

భక్తియుక్తుడగు నరుడు త్రయోదశితిథియందు, శంఖచక్రగదాధరుడు, నాల్గుబంగారు మాడలతో నిర్మింపబడి పద్మమందున్న ప్రద్యుమ్నుని ముందు చెప్పిన ఉపచారములతో పూజించి పూర్ణచంద్రునివలె సముజ్జ్వలమగు అశోకపాటలీమాలతో అలంకరించి, స్వామికి పక్వాన్నమును మనోహరమగు పక్వఫలమును నైవేద్యముచేసి చేతులు జోడించి, నమస్కరించుచు –

శ్లో॥ "దేవ! ప్రద్యుమ్న! కామానాంపూరక కామరూపధృక్।
కామాశ్చసఫలాఃసన్తు। కామపాల! నమోఽస్తుతే॥

అని ప్రార్థింపవలెను.

భక్తుడు చతుర్దశితిథియందు, లక్ష్మీదేవిని వక్షఃస్థలమున ధరించిన నృసింహ స్వామి, జటోజ్జ్వలుడు, వ్యాత్తాననుడు, యోగపట్టాబ్జసంస్థితుడు, తీక్ష్ణమైన నఖములు కలవాడు, సర్వాపద్వినివారకుడు, శుభలక్షణుడు, నాల్గుహేమ నిష్కములతో నిర్మితమైన విగ్రహము కలవాడు, కనకాకృతితో విరాజిల్లువాడు. అట్టి స్వామికి భక్తితో నైవేద్యము అర్పించి, జపాకుసుమాది మాలలతో జాతీ పుష్పస్రజములతో అలంకరించి, పుష్పాంజలులిచ్చి, సప్రదక్షిణముగ ప్రణమిల్లి –

శ్లో॥ "యథాహిరణ్య కశిపుం। లోకానాం హితకామ్యయా।
వ్యాదారయస్తథాపాపసంఘం నాశయ పూజితః॥"

అని నృసింహస్వామిని భక్తుడు ప్రార్థించి భూమిపైని దండమువలె వ్రాలి, ప్రణామముచేసి, పంచదినాత్మకమగు ఈ వ్రతమును నిర్వర్తించి, దివారాత్రములు ఐదేసి దీపములు వెలిగింపవలెను. పంచవస్త్రయుగ్మములు, పంచ ఛత్రపాదుకాయుగము, యజ్ఞసూత్రములు, గల ఐదు కలశములను ఫలాన్వితములైన ఐదు కలశలను, భోజనానంతరము శ్రద్ధతో బ్రాహ్మణులకీయవలెను. రాత్రియందు జాగరగీతములతో, పురాణపఠనముతో, వాసుదేవుని ఆనందపరచి, కానుకలర్పింపవలెను.

భక్తుడు పౌర్ణమాసియందు ఉషఃకాలముననే స్నానముచేసి శ్రీకృష్ణుని దర్శనమునకేగవలెను. బలరాముని కృష్ణుని సుభద్రను, యథావిధిగ పూజించి శాస్త్రప్రకారముగ స్నానముచేయించి, దర్శించి, సముద్రములో మరల స్నానముచేసి, ఇంటికి వచ్చి, కుంభములోగల విష్ణువుయొక్క మూర్తులను మంత్రపూర్వకముగ పూజించి, వానికి పశ్చిమ దిశలో యథావిధిగ అగ్నినుంచి పురోహితుడు ఆయామంత్రములతో అగ్నికార్యమును చేయవలెను.

ప్రణవము మొదలు చతుర్థ్యంతము, నమశ్శబ్దాంతమువరకు నామమును చెప్పవలెను.

దేవతలకు మూలమంత్రమును, హోమకర్మమునందు స్వాహా అనుదానిని అంతమందు చెప్పవలెను. చరువునకును, ఆజ్యమునకును, సమిధలకు, పలాశములకు, వేరువేరుగా ఒక్కొక్క దేవతనుద్దేశించి, నూరు పర్యాయములు చొప్పున మంత్రమును ఉచ్చరింపవలెను. ఒక్కొక్క దేవునకు నూరు పుష్పములు చొప్పున హోమముచేయవలెను. పిమ్మట పూర్ణాహుతిచేసి పురోహితునకు దక్షిణ ఈయ



వలెను.ఆచార్యునకు బంగారు కొమ్ములు వెండి డెక్కలు, వివిధోపకరణములుగల ధేనువును, సువర్ణమును దక్షిణగా అర్పింపవలెను.

మహార్ఘ్య వస్త్రదానములిచ్చి గురువును తృప్తిపరచవలెను. అన్ని అలంకారములతో అలరారు ప్రతిమలనుకూడ గురువునకు సమర్పింపవలెను. ఘృతయుక్తపాయసాదులతో బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. ఇది ఉత్తమమయిన జ్యేష్ఠపంచక వ్రతమనబడుచున్నది. ఈ వ్రతమును భక్తితో ఆచరించిన వానికి జగన్నాథుని స్నానదర్శనములవలన కల్గు ఫలము సమగ్రముగ లభించును. ఏకాదశి ఆ వ్రతదీక్షాకాలములో మధ్యనువచ్చినచో అది నిర్జల అనబడును. ఆ తిథినే యథావిధిగ భక్తితో పాటించినవారికి వారి జీవితకాలములో వచ్చు ఏకాదశులన్నింటిని పాటించిన ఫలితము చేకూరును.

## 33వ అధ్యాయము

### 1. జైమిని ద్విజులకు మహావేదీ మహోత్సవమునుగూర్చి తెల్పుట :

అజ్ఞానియైనను మహావేదీ మహోత్సవ మహిమచే జ్ఞానతేజో విరాజితుడగును. వైశాఖ శుద్ధ తృతీయ పుణ్యతిథి. రోహిణీనక్షత్ర సంయుతమైన తృతీయ తిథి పరమ పవిత్రమైనది. శుచియగు రాజు ఆ తిథియందు ఆచార్యుని నియమింపవలెను.

ఆచార్యుడు అనుభవముగల ఒక వడ్రంగినిగాని, లేదా ముగ్గురినికాని ఎంచుకొని వారికి గౌరవపూర్వకముగ వస్త్రాలంకారాదులర్పించి, మంచి చెట్లున్న వనమునకు గొంపోయి, వనమధ్యమున మంత్రవేత్త మంత్రముతో అగ్నిని సృష్టించి, సంపాతాజ్య విమిశ్రితమైన ఆజ్యమును నూరు సార్లు హోమము చేసి అటనున్న ప్రతి వృక్షము మొదట, ఆజ్యమును అభిఘరింపవలెను. దిక్పాలురకు క్షేత్రపాలునకు బలియిచ్చి వనస్పతికి పాయసాన్నముసు, నూరు పర్యాయములు హోమము చేయవలెను.

పిమ్మట ఆచార్యుడు గొడ్డలి పట్టుకొని మంత్రము నుచ్చరించుచు, గరుడధ్వజుని స్మరించుచు, ఆజ్యమును సంస్కరించిన వృక్షమూలములందు చిన్నచిన్న ముక్కలు ఛేదింపవలెను. అచట మంగళవాద్యములు వాయించుచుండగా ఆచార్యుడు వడ్రంగిని నియమించి స్వగృహమునకు వెళ్లవలెను. లేదా, రథ నిర్మాణమునకు అచటనే దొరికిన కలపను సృష్టించిన అగ్నితో సంస్కరించి విఘ్న రాజమహోత్సవమును చేసి, రథమును తయారుచేయుట ప్రారంభింపవలెను.

జగన్నాథుని రథమునకు దృఢమైన లోహముతో తయారుచేసిన పదునారు చక్రములు, పదునారు బండికంటియాకులు, దృఢమైన బండికన్నులు, బండినొగ లుండవలెను. ఆ రథము విచిత్ర ఘటనాకక్షపుత్తలీపరివేష్టితమై, నానా విచిత్రములగు ఇక్షుఖండములతో విరాజిల్లి నాల్గు తోరణములతో, నాల్గు ద్వారములతో శోభిల్లి, నానా విచిత్రములగు హేమపట్టములతో ప్రకాశించి, ఇరువదిరెండు బారల పొడవు కలదై పతాకతో అలరారుచుండవలెను.

ఆ రథమునకు స్థూల దేహము, పొడుగు ముక్కు, కుండలములు గల గరుడుని రక్తచందనముతో నిర్మింపవలెను. ఆ గరుడుడు ముక్కుతో పామును పట్టుకొని సర్వాలంకార భూషితుడై రెక్కలు విప్పి ఆకాశమున ఎగురుచున్నట్లు చిత్రింపవలెను. దైత్యదానవ సంఘమునకు బలదర్పనాశనమును చేయు గరుత్మంతుని దేహమును బంగారు రేకుతో అందముగా కప్పవలెను.

అట్టి గరుడధ్వజమును రథముపై నుంచవలెను. జగన్నాథస్వామికి సుందరమగు ఆసనముతో ఒప్పునట్టి ఇట్టి రథమును నిర్మింపవలెను.

బలభద్రునకు చతుర్దశ రథాంగములతో రథమును చేయింపవలెను. అతని లాంగల ధ్వజమునకు పదునాల్గు భదము లుండవలెను.

సుభద్రకు పండ్రెండు చక్రములుగల రథమును తయారుచేయింపవలెను. రథధ్వజము పద్మకాష్ఠ నిర్మితమయి ఉండవలెను.

ఇంద్రద్యుమ్న మహారాజు ఆ విధముగా సుభద్రాబలభద్ర జగన్నాథులకు రథములు చేయించి పూర్వమువలె ప్రతిష్ఠావిధిని కావింపవలెను. బ్రాహ్మణులను శాస్త్రప్రకారము గౌరవింపవలెను. జగదీశ్వరునకు బ్రాహ్మణులు జంగమ తనువులు.

ఆషాఢమాసములో శుక్లపక్షమున విష్ణువునకు ప్రీతికరమగు శుభతిథియందు ముందువలె ప్రతిష్ఠాకార్యక్రమము చేయవలెను.

పక్షి, పిల్లి, ముంగిస, అశుచియగు మనుజుడు ఆ రథముపైకి ఎక్కుట అశుభము. మూడు దినముల తరువాత రథములకు ఉత్తరదిశలో మండపమునందు అంకురార్పణము చేయవలెను. ఏ అపశకునములు జరిగినను పూర్వోక్త విధి ప్రకారము శాంతి చేయవలెను.

రథములు మహావేదిని చేరుటకు రాజమార్గమును పరిశుభ్రము చేయవలెను. మార్గమున కిరువైపుల మండలము ఏర్పరపవలెను.

రాజమార్గమున కిరుప్రక్కల పరిమళోపేత పుష్పగుచ్ఛములతో, మాలలతో గుల్మాదులతో, ఫలములతో, పట్టుబట్టలతో, చామరములతోకూడ అలంకరించి, ఆ మార్గము సుపుష్పితారణ్య రాజివలెనె ప్రకాశించునట్లు చేయవలెను. ఆ మార్గ



ములో నేలపైని బురదలేకుండ, నడుచుటకు వీలుగ చదునుగ, నిర్మలముగ, సుగంధయుక్తముగ ఉండవలెను. దిక్కులందు సువాసన వ్యాపించునట్లు ధూపాత్రలను దగ్గరదగ్గరగా ఉంచవలెను. యంత్రములద్వారా చందనోదకమును చిలికింపవలెను. పుష్పవృష్టికొరకు ఆయా ఋతువులలో పూచునట్టి నానావిధ పుష్పములను సంగ్రహింపవలెను.

మహావేదీ మహోత్సవములో, సుందరాకారమునకు అనువగు ఆభరణములను దాల్చిన నటనర్తకులు, గాయనీగాయకులు, భేరీఢక్కామృదంగాదులను వాయించువారు, చిత్రములతో ఒప్పునట్టి పతాకలు స్వర్ణరజత నిర్మితములైన పెక్కు ధ్వజములు ధరించినవారు, భూమిపైని నడచువాహనములు బాగుగా అలంకరింపబడిన ఏనుగులు, గుర్రములు మొదలగునవి పాల్గొనుటకు శుచివ్రతుడగు మహారాజు ముందుగా తగిన శ్రద్ధతీసికొని ఆ మహోత్సవమును దిగ్విజయముగా జరిపింపవలెను.

ఆషాఢ మాసమున శుక్లపక్షమున పుష్యమీ నక్షత్రయుక్తమగు విదియ తిథియందు అరుణోదయ సమయమునందు జగన్నాథుని పూజింపవలెను.

బ్రాహ్మణ వైష్ణవయతి తపస్వులతోకూడ రాజు చేతులు జోడించి, జగన్నాథుని రథయాత్రకు ఇట్లు విజ్ఞాపనము చేయవలెను.

'ఓ ప్రభూ ! పూర్వము క్షితిపాలుడయిన ఇంద్రద్యుమ్నుని ఎట్లు ఆజ్ఞాపించితివో అట్లే రథముపైకి గుండిచామండపముపైకి దయచేయుము. నీ అపాంగ విలోకనముచే దశదిశలు పవిత్రమగుగాక ! స్థావరజంగమము లన్నియు ముక్తిపదమును పొందునుగాక !

"జగన్నాథ ! లోకానుగ్రహమునకే ఈ అవతారమును దాల్చితివి. కావున ప్రీతితో భూతలముపైని చరణమును నిల్పి రమ్ము" అనవలెను.

అపుడు దారిలో మనోహరమగు కర్పూర చూర్ణమును చల్లవలెను. ద్విజులు శాకున సూక్తములు, కొందరు మంగళగాథలు, కొందరు జయజయశబ్దములు, మరికొందరు "జితంత" అను మంత్రమును గట్టిగా ఉచ్చరింపవలెను. ఉభయ పార్శ్వములయందు పెక్కు స్వర్ణదండములు వరుసగా కట్టవలెను. స్వర్ణపాత్రపరిక్షిప్త కృష్ణాగురు ధూపములతో నిండిన స్వర్ణపాత్రములను రణత్కంకణ మంజులమగునట్లు లీలగా ఊపవలెను. సర్వ దిక్కులు, వ్యోమాంగణము పరిమళోపేతముగ చేయవలెను. గోవిందనామ స్మరణానంతరము చర్చరీ ఝర్ఝరీ వేణువీణామధుర ధ్వనులతో గానము చేయవలెను.

ఇట్టి ఆనందసమయమున బలరాముని రథము ముందు వెళ్లుచుండగా, సుభద్రా కృష్ణుల రథములను విప్రులు, క్షత్రియులు, వైశ్యులు తీసికొని వెళ్లవలెను.

జగన్నాథ స్వామికి ఇరుప్రక్కల ఛత్రములు ముక్తాహారముగల చీన తోరణము రత్నధ్వజము, హేమదండములు, ధరించినవారు నడువవలెను. ఆ స్వామి దర్శనమునకు వచ్చినపుడు ఆ స్వామికి సేవచేయుచున్నపుడు రాజు, నాల్గువర్ణములవారు, ఇతర కులములవారు, దీనులు, ధనికులు, మహాత్ములు, అందరును ఏ వ్యత్యాసములేకుండ సమానముగా నుండవలెను.

తూలికా స్తరణములందు లీలగా ఉన్న ఆ దేవతా విగ్రహములను శాంత స్వభావముగల భక్తులు రథము కడకు గొంపోవలెను.

నృత్య గీతవాద్య మంగళధ్వనుల కోలాహలముతో మహోత్సవమును ఏర్పరచి జగన్నాథస్వామి విగ్రహమును కరములతో పట్టుకొని రథమును త్రివ్వుచు బలరాముని శ్రీకృష్ణుని సుభద్రను రథమధ్యభాగమున ఉంచవలెను.

చారు చంద్రాత పాఢ్యమై కింకిణీ తూలికలతో మాల్యచామర భూషితమై సారముగల కృష్ణా గురుజధూప పూరితమై ఒప్పుచున్న మండపమునందు తూలికలపైని ఆ మూడు దేవతా విగ్రహములను, భద్రముగానుంచి వివిధములైన నూతనవస్త్రములతో మాలతో అలంకరించి, అన్ని ఉపచారములతో గాఢభక్తి భావముతో ఆ దివ్యమూర్తులకు పూజచేయవలెను. త్రిలోకేశ్వరుడే స్వయముగా రథముపైని ఆనందముగా ఉపవిష్టుడయిన ఈ యాత్రా క్రమమును మించిన మరియొక యాత్రావిధి చూడ సాధ్యముకాదు. ఈ జగన్నాథస్వామి పూర్వ మాజ్ఞాపించిన రీతిగా ఈ కార్యక్రమము ప్రతిసంవత్సరము రథయాత్రోత్సవము చేయుచుండవలెను.

ఆ మహావేదీ మహోత్సవమునందు రథముపైని ఉపవిష్టుడై యాత్ర సాగించుచున్న భగవంతుని భక్త్యానందములతో చూచుచున్న వారికి శ్రీ హరి నివాస స్థానమయిన వైకుంఠపురములో నివాసము ప్రాప్తించును.

విష్ణువునకుచేయు ఉత్సవములలో దీనిని మించి శాస్త్ర సమ్మతమైన ఉత్సవ మింకొకటిలేదు. దేవతలు స్వర్గమునుండి వచ్చి పురుషోత్తమ క్షేత్రమున జరుగుచున్న ఈ రథ విహారమును మహావేదీ మహోత్సవమును చూచి జగన్నాథుని యనుగ్రహమునకు పాత్రులై దివికి ఆనందముతో మరలిపోదురు.

2. మహావేదీ మహోత్సవమాహాత్మ్యము :

భక్తులు ఆ మహోత్సవమును స్మరించినంత మాత్రముననే గత జన్మములలో చేసిన పాపములు నశించును.

రథమున వేంచేసి మహావేదికి యాత్ర సల్పుచున్న పురుషోత్తముని బలభద్రుని సుభద్రను చూచిన భక్తులు బహు జన్మములలో చేసిన పాపములు పోవును.



పురుషోత్తముని రథచ్ఛాయ ఎవనిపైని పడునో, అతని బ్రహ్మ హత్యా పాపము పోవును. ఆ రథోత్సవ రేణువులు ఎవనిపైని పడునో, అతని ముప్విధములైన పాపములు క్షీణించును. అతనికి పవిత్ర గంగానదీస్నానము వలన కల్గు సత్ఫలితము సంభవించును.

రథము వెళ్లుచున్న దారిలో మేఘవృష్టి కురియుటవలన బురదగా ఉన్నను జగన్నాథుని దివ్యదృష్టిచే మార్గము గమన యోగ్యముగా నుండును. ఆ రథ యాత్రలో హరికి సాష్టాంగ వందనము చేయుచున్న వైష్ణవోత్తములు అనాది వ్యాధ పాపములను విడిచి మోక్షమును పొందగలరు. ఇంకను అచట దేవతా విగ్రహములకు నమస్కరించువారికి అసంఖ్యాకములయిన గోదాన కన్యాదానము వలన, అశ్వమేధ యాగములు చేయుటవలన కలుగు ఫలితములు లభించును.

దేవతలు యాత్రాకౌతూహలమువలన ముందు పోవుచున్న దేవేంద్రుని అనుసరింపవలెను. సనాతనము దారు బ్రహ్మమై ముందుకు పోవుచున్న ఆ రథమును గాంచుచున్న వారికి ప్రతి పదమునందు, అశ్వ మేధ యాగఫలము సమకూడును. వేదపండితులు వైదికమంత్రములతో మోక్షప్రదుడగు జగన్నాథుని స్తుతించుచున్నారు. కొందరు కవులు ఇతిహాసపురాణాదులలోని స్తోత్రములతో స్వీయ రచనలతో శ్రీ కృష్ణుని స్తుతించుచున్నారు. ఆ పుండరీకాక్షుని స్తుతించువారు విగత కల్మషులై వైష్ణవ యోగమును అభ్యసించి నారదాది మహర్షులతో ఆనందింతురు. వాసుదేవుని సన్నిధిలో జయ శబ్దముతో స్తోత్రము చేయువారి సర్వపాపములు పోవును. ఆ రథోత్సవ సమయములో లయ తాళములు తెలియక నృత్యము చేయువాడు, గీత మాధుర్యము లేకున్నను గానముచేయువాడు అచటి వైష్ణవోత్తముల సంసరమువలన ముక్తిపొందుననుట తథ్యము.

ఆ పురుషోత్తముని నామములను కీర్తించువాడు, ఆ స్వామి వేంచేసియున్న రథమును అనుసరించువాడు ముక్తినందగలడు. మహాభక్తుడు "జయకృష్ణ ! జయకృష్ణ ! జయకృష్ణ !" అని గుండిచానగరమునకు పయనించుచున్న కృష్ణుని కీర్తించినచో, వానికి మాతృగర్భవాసమువలన కలుగు దుఃఖము కలుగదు.

ఏ భక్తుడు రథాగ్రభాగమునందుండి చామరములతో, వ్యజనములతో పుష్పగుచ్ఛములతో, పురుషోత్తమునకు వీచునో, ఆతడు ఆరథమును అనుసరించుచున్న దేవతలతో ప్రకాశించుచు గంధర్వాప్సరోగణముచే వీజ్యమానుడై మహేంద్రాసన సంస్థితుడై ప్రళయకాల పర్యంతము అతులభోగములను అనుభవించును. పిమ్మట బ్రహ్మలోకమునందుండి ముక్తుడగును. శ్రీకృష్ణునికి ముందు పుష్పవృష్టిని కురిపించువారు, మనోగతములయిన మనోరథములన్నిటిని పొందుచున్నారు.

ఏ భక్తులు హరినామ సహస్రమును ఉచ్చరించుచు, రథమునకు ప్రదక్షిణము చేయుదురో వారికి సురలు నతశిరస్కులై ప్రదక్షిణము చేయుదురు. అట్టి పరమపవిత్రులయిన భక్తులు విష్ణుతుల్య పరాక్రమముతో వైకుంఠపురములో నివసింతురు.

దేవర్షి పితృగణసేవితమై మహాపుణ్యప్రదమయిన ఆ మహావేదీ మహోత్సవ సమయమున స్వీయమాయచే అనుగతమై త్రిధావిభక్తమైన ఒకే బ్రహ్మము సాక్షాత్తు దారుస్వరూపముతో జగత్ప్రభువు సంతుష్టాంతరంగుడై రథారూఢుడై మహావేదీ మహోత్సవమునుగూర్చి వెళ్లుచున్నాడు.

ఆ శుభసమయమున భూమండలమున ఆ మహోత్సవము జరుగును. ఇంద్రుడు పురోగామి కాగా, దేవతలు స్వాభిమానమును వీడి జగన్నాథుని రథమున కిరుపార్శ్వములయందు వరుసగా నిలుచుండి, ఆయాదివ్య పరిజనముతో మహాయాత్రలో పాల్గొనుచున్నారు. వారందరికి చతుర్దశభువన సృష్టికర్త పరమేశ్వరుడగు ప్రపితామహుడే అగ్రేసరుడు.

రథము నధిష్ఠించి మహోత్సవములో ఊరేగుచున్న జగన్నాథుని దర్శించుటకై ఆ పరమేష్ఠికూడ బ్రహ్మలోకమునుండి వచ్చి, ఆ స్వామిని వేదబుక్కులతో స్తుతించుచు, సనాతనుడయిన భగవంతునికి మాటిమాటికి ప్రణమిల్లుచుండును. బ్రహ్మ విష్ణువుకంటె భిన్నుడు కాకపోయినను సర్వులు మహోత్సవముయొక్క మహిమ నెరిగినవారై బ్రహ్మననుసరింతురు.

మహావేదీమహోత్సవముకంటె శ్రేష్ఠమయినది లోకములో ఇంకొకటి లేదు. ఆ ఉత్సవములో పాల్గొనుట గొప్ప అదృష్టము. కావున సర్వపాపములు నశించి సర్వతీర్థఫలము చేకూరును. శ్రీకృష్ణుని ప్రీతికై అచట దానముచేసిన వానికి లభించుఫలము అక్షయమై మేరుదానముతో సమానమగును. గుండిచాలయమునుగూర్చి పయనించుచున్న జగన్నాథుని ఎదుట చేయబడు దానము అక్షయమగును. ఆ స్వామి ప్రీతికై కానుకలు భక్ష్యభోజ్యములు సమర్పించినను లేక ద్విజునకు అర్పించినను సర్వకామప్రదములగు అక్షయ పుణ్యములు లభించును.

ఏ భక్తులు జగన్నాథునికి ముందు నడుచుచు అతని ముఖాంబుజమును చూచుచు మాటిమాటికి నమస్కరించుచు, పంకధూళిచే పరిప్లుతులగుదురో వారు బహుజన్మములందలి అభేద్యమగు పాపకవచమును విడిచి క్షణకాలములో ముక్తిఫలమును పొంది వైకుంఠములో నివసింతురు. వారికి సర్వక్రతువు లాచరించుటవలన సకల తీర్థములందు మునుగుటవలన దానములు చేయుటవలన కల్గు ఫలితము లభించును. భగవద్భక్తి భావముగలవారికి ఇంతకంటె శ్రేష్ఠమగు పుణ్యము లేదు.



ఇట్లు సుభద్రా బలరామసహితుడై భక్తవత్సలుడు, దయామయుడు, భగవంతుడగు కృష్ణుడు ఉత్తమరథముపైని కూర్చుండి నాల్గుదిక్కులయందు ప్రకాశించుచు దివ్యదేహమునుండి సృష్టించిన పూతవాయువుతో జనుల సర్వదేహతాపములను నశింపజేయుచున్నాడు. అజ్ఞానులకు విశ్వాసరహితులకు విశ్వాసమును కలిగించుటకై సహజముగ ముక్తిప్రదుడయినను, యాత్రారంభములను చేయుచున్నాడు. జగన్నాథుడు దేవమర్త్యసమూహముతో యాత్రసాగించుచు, మధ్యాహ్నమందలి సూర్యుడు యాత్రలో మార్గమధ్యమందు పయనించుచున్నవారి లలాటములను తపింపజేయుచుండగా ఆయాసపడువారి దేహములు ఉత్సవరజస్సుచే కప్పబడుచుండును. ఆ యెండతగ్గుటకు పంచామృతములతో పుష్పకర్పూరవాసితములగు శీతజలముతో దర్పణములపైని అభిషేకము చేయవలెను.

సుభద్రాకృష్ణబలరాములకు నీటితో కొనలుతడిపిన చామరములతో శీతలములగు వ్యజనములతో విసరవలయును.

పురుషోత్తముని పూజించి, శీతలమగు పానకము, హృద్యములగు ఖండశర్కరలు, ఖర్జూరము నారికేళఫలములు నానా రంభాఫలములు, పాలుతో చేసిన పిండివంటలు, పనసతొనలు తీయని చెరకు రసము, నానావిధమధుర ఫలములు, శీతలజలము, పక్వతాంబూలపత్రములు, కర్పూరలవంగాదులు నైవేద్యము చేయవలెను. ఆ శుభసమయమున ద్విజశ్రేష్ఠులు జనార్దనునిచూచి యథాశక్తిగ పూజించినచో వారికి సంసారము వలన కల్గు బాధలుండవు. వారు బ్రహ్మలోకమున నివసింతురు.

సత్పురుషులు మూడు రథములందున్న మూడుదేవతావిగ్రహములకు, మూడు, నాల్గు లేక, ఏడుపర్యాయములు ప్రదక్షిణలు, దశప్రణామములు చేసి, దేవతావిగ్రహములయెదుట చేతులు జోడించి ఆసీనులగుదురు. పూర్వము అబ్జభవుడగు బ్రహ్మ రథమునందున్న ముగ్గురు దేవతలకు ఏ స్తుతులచే తృప్తి కల్గించెనో, ఆస్తుతుల చేతనే దేవేశుడగు పరమేశ్వరుని నేటిభక్తులు నుతించుచున్నారు. అట్టి వారు శాశ్వతముగ బ్రహ్మలోకమున నివసింతురు.

పిమ్మట అపరాహ్ణ కాలమున దక్షిణానిలముచే విసరబడిన జగన్నాథుని వేణువీణాది నాదములతో గీతములతో మెల్ల మెల్లగా తీసికొని పోవలెను.

జగన్నాథస్వామి రథోపవిష్టుడై యాత్ర సాగించుచుండగా, వందిమాగధులు స్తుతిపాఠములతో, కళావిలసితములయిన మధురికాస్వనములతో, నిరంతర పుష్పవర్షముతో, చామరాందోళనలతో సేవించిన సమయమున సూర్యభగవానుడు అసంగతుడయ్యెను. వేలకొలది దీపములు దివటీలు

ప్రకాశించుచున్నందున శేషించిన మార్గములో వారు ప్రయాణము చేసిరి. ఈ దీపకాంతులతో రథావరోహణము మండపారోహణము చూపరులకు కన్నుల పండుగగుటచే, మనోహరమగు గుండిచామండపమున జగన్నాథుని ఆసీనునిగా చేయవలెను.

మనోహరమయిన వెన్నెలలో సుందరమాల్యచామరభూషితమైన, రత్న స్తంభమయమైన స్వర్ణవేదికామధ్యమున సుధాలేపనముజ్వలము, సాధుసోపాన ఘటితము, చతుర్ద్వారోపశోభితము, త్రైలోక్యాడంబరయుతమయిన మహా క్రతువేదికయందు దారుదేహమును దాల్చిన పురుషోత్తముడు దర్శనమిచ్చెను.

## 34వ అధ్యాయము

### 1. జైమిని ద్విజులకు జగన్నాథుని పూజావిధిని తెల్పుట :

అశ్వమేధాంగమైన సరస్సునకు నృసింహస్వామికి దక్షిణ భాగమున భగవంతుడగు జగన్నాథుడు మరల అవతరించినట్లు ఆసీనుడయ్యెను. జగన్నాథ స్వామి సురాసురులకు కూడ ఊహాతీతమైన దివ్యరూపముతో ప్రకాశించెను. భక్తులు పురుషోత్తముని ప్రీతికి పూజోపహారములతో అర్చించి భక్ష్య భోజ్యాదులు నివేదనము చేసి, పుష్పోపహారములర్పించి, గీతనృత్యములుచేసి, వివిధ సుగంధములతో, అనులేపకృష్ణాగురుజధూపములతో, గంధతైల ప్రదీపములతో జగన్నాథుని ఆనందింపచేయవలెను.

జగన్నాథస్వామి ఆబిందు తీర్థతటమందు ఏడుదినములుండుటకు అంతకు పూర్వమే ఇంద్రద్యుమ్నమహారాజునకు స్వయముగా ఇట్లు వరమిచ్చెను.

"ఓ రాజేంద్ర ! నీతీర్థతీరమున ప్రతివత్సరము నివసింతును. నేనచట నున్నపుడు సర్వతీర్థములట నుండగలవు. ఏభక్తులు తీర్థౌఘపావనమయిన తీర్థమున యథావిధిగ స్నానముచేసి, గుండిచామండపమున నున్న నన్ను సుభద్రను, బలరాముని ఏడుదినములు చూచెదరో, వారు నా సాయుజ్యమును పొందగలరు.

పిమ్మట మహాపుణ్యప్రదము సర్వపాపప్రణాశనము సర్వతీర్థైకఫలదము, విష్ణుప్రీతికరమయిన ఆ తీర్థములో స్త్రీ పురుషులు అప్రమత్తతతో స్నానముచేసి, యథావిధిగ పితరులకు దేవతలకు తర్పణములిచ్చి తటమందున్న నరసింహుని పూజించి నమస్కరించి, శౌచాచమనము చేసి మహావేదికి వెళ్లి భక్తితో ఏడుదినములు పూర్వమువలెనె పూజించి నమస్కరింపవలెను. అట్టి స్త్రీపురుషులు ప్రాకృత మానవులు కారు. వారు విష్ణు శాసనమువలన విష్ణు



సాయుజ్యమును పొందుదురు. జగన్నాథుని పగటిపూట దర్శనము చేయగా వచ్చినపుణ్యముకంటె రాత్రి వేళ చేసిన దర్శనమువలన పదిరెట్లు ఫలితము చేకూరును. జగన్నాథుని సన్నిధిలో చేసిన సత్కర్మ స్వల్పమయినను అధికమయినను కోటిరెట్లు కాగలదు. అచట ఏభక్తుడు తులాపురుషదానములు, మహాదానములు చేసినను, లేక ఒక్కదానము చేసినను తనకున్న సర్వము దానము చేసినట్లగును. అచటి దానమెద్దియైనను మేరుసమమగును. అచటి ద్విజులందరు వ్యాససములగుదురు. జగన్నాథుడు మహావేదికి వెళ్లినచో అట్టి యోగము దుర్లభమగును. అర్ధోదయాది యోగములు స్కందునిచే చెప్పబడినవి. మహావేద్యాఖ్యయోగమునకు పదునారవకళ తగదు. యావజ్జీవము ధరణిపైని గయాశ్రాద్ధమువలన లభ్యముకాని ఉత్తమ పితృకార్యమును పితృదేవతాప్రీతికి ఆచరింపవలెను" అని జగన్నాథుడు ఇంద్రద్యుమ్నునకు తెల్పెనని, జైమిని ద్విజులకు చెప్పెను.

### 2. జైమిని ద్విజులకు పితృకార్యమును గూర్చి తెల్పుట :

"ఓద్విజులారా ! స్వర్గలోకమునగాని, నరకలోకమునగాని తిర్యక్కులుగా నున్నను, మనుష్యులుగా నున్న పితృపితామహులందరు కలిసి నూర్గురు పురుషులుగా చెప్పబడిరి.అట్టివారు సుతులు చేయవలెనని అభిలషించెడి శ్రేష్ఠమైన పితృకార్యమును గూర్చి చెప్పుచున్నాను. వినుడు.

పితరులకు ప్రీతికరమయిన పితృనక్షత్రము మఘ. ముదాన్వితులగు పుత్రులచే అచటచేయబడిన శ్రాద్ధము పితరులకు ప్రీతిని కల్గించును. అభ్యుదయకారిణియగు పంచమితిథికూడ శ్రేష్ఠమయినది. తిథినక్షత్రములు రెండు కలిసినచో తిథిమహాపుణ్యతమమగును. ఆ మహాపుణ్యతిథియందు పుత్రులు శ్రాద్ధకర్మచేసినట్లయిన పితరులకు ముక్తి కల్గును.

సర్వతీర్థమయమయిన జగన్నాథుని సన్నిధియందు పరమపవిత్రమయిన నీలకంఠనృసింహుల మధ్య ప్రదేశమున పరమదుర్లభమయిన యోగమునందు శ్రద్ధగా శ్రాద్ధమును చేయవలెను. నూర్గురు పితరులకు పిండప్రదానము చేసి, వారిని ఉద్ధరించినవాడు బ్రహ్మలోకమునందు నివసించును. భాస్కరుడు మందీభూతుడయిన కుతపకాలము ప్రశస్తమయినది.

శుచియయినవాడు పితరులకు కనకమును అర్పించుటకు అశక్తుడయినచో తిలలతో తర్పణముచేసి ఉత్తమప్రీతికరమగు పితృకర్మచేయవలెను. అట్లు చేయలేనిచో పితరుల మృతతిథియందు విప్రులకు భోజనము పెట్టుటకాని భోజ్యమూల్యము నిచ్చుటకాని చేయవలెను. ఒక్క గుణవంతునకు వెయ్యిసార్లు భోజనము పెట్టవలెను. ఈ పుణ్యక్షేత్రమున పవిత్రయోగకాలమున గుణాగుణ విచారణ చేయనక్కరలేదు. ఆ సుదుర్లభమయిన యోగమున ద్విజులందరు మునిసములే.

ఆషాఢమాసమునందలి శుక్లపక్షమున పచ్చుపంచమితిథి పితృదైవత నక్షత్రము. ఆ నక్షత్రమునందే జగన్నాథుడు మహావేదీ సమాగమము చేసెను. ఇంద్రద్యుమ్న సరోవరమునందు ఈ మూడు కలిసినచో పితరులకు అక్షయ ప్రదమగు చతుష్పాద యోగమనబడుచున్నది. ఇచట శ్రాద్ధకర్మమును చేయువారు, ఆ కార్యమును పూర్తిచేసి సర్వతోముఖాభివృద్ధిని పొందగలరు.

ఓ ద్విజులారా! ప్రసంగవశమున మీకు ఇంకొకటి చెప్పుచున్నాను వినుడు. చతుర్యుగములందు భాద్రపదమునందలి అమావాస్యతిథియందు పితరులకు చేయు శ్రాద్ధముయొక్క ఫలము శ్రద్ధతో గయలో చేసిన వెయ్యి శ్రాద్ధములవలన కలుగు ఫలమునకు సమానము. దానము, హోమము, జపము సర్వపాపములను హరించును. జగన్నాథస్వామి మండపమునందున్న ఏడు దినములలో ఒకదాని కంటె ఇంకొకటి శ్రేయోదాయకమయినది.

ఆషాఢశుక్లతృతీయ యందు ప్రాతఃస్నానము చేయవలెను. మానవుడు ఇంద్రద్యుమ్న సరస్తటమందు ఉత్తమమయిన, నృసింహక్షేత్రమునందు విధిప్రకారము సంకల్పించి, సర్వవ్రతఫలప్రదము సర్వపాపప్రశమనము భగవత్ప్రీతి వర్ధనమగు వనజాగరణము అనువ్రతమును ఆచరింపవలెను. భక్తియుతుడగు మనుజుడు సప్తదినములయందు మౌనియై త్రికాలములయందు మూడు సవనములు ఆచరించి భక్తితో కుంభమునందు త్రిసంధ్యలలో జగన్నాథుని పూజింపవలెను. గోఘృతముతో గాని తిలతైలముతోగాని దీపమును వెలిగింపవలెను. భక్తుడు నియమమును పాటించుచు, హరిసన్నిధిలో పెట్టిన దీపమును ప్రయత్న పూర్వకముగ అహర్నిశలు కాపాడవలయును. ఆతడు పగటివేళ మౌనముతో నుండి రాత్రులందు జాగరూకుడై ఉండవలెను. ప్రతి నిత్యకృత్యానంతరము భగవత్సంబంధమైన మంత్రమును జపించుచు, ఏడుదినములు ఉపవాసముతో గడపవలెను. అష్టమ దివసమున ప్రాతఃకాలమున ప్రతిష్ఠావిధిని ఆచరింపవలెను. ఆ పుణ్యతీర్థమున స్నానమాచరించి గృహమునకు వచ్చి తూర్పుదిక్కున సర్వతోభద్రమగు మండలమునందు కుంభమును పెట్టవలెను. ఆ మండలమున హృషీకేశుని ఆవాహనముచేసి ఉపచారములతో పూజింపవలెను. దానికి పశ్చిమదిశలో యథావిధిగ సంస్కరింపబడిన చదునైన స్థలములో గృహ్యోక్తప్రకారముగ బ్రాహ్మణులతోకూడినవాడై అగ్నిహోత్రమును ఆసాదించి అగ్నికార్యమును చేయవలెను. అగ్నియందు సమిధలు ఆజ్యము చరువు ప్రత్యేకముగ నూరు మార్లుకాని మొత్తముపై వెయ్యి పర్యాయములుకాని హోమము చేయవలెను. గాయత్రీ మంత్రముతోగాని, వైష్ణవీమంత్రముతోగాని హోమము చేయవలెను. హోమానంతరము సద్విప్రునకు ధేనువును, వస్త్రమును, హిరణ్యమును దక్షిణగా ఈయవలెను. పిమ్మట విశ్వసాక్షియగు జగన్నాథుని ప్రీతికై విప్రులకు



భోజనము పెట్టవలెను. విధి ప్రకారము ఈ ఉత్తమవ్రతము నాచరించిన వారికి పురుషార్థములు ప్రాప్తించి మనోభీష్టము నెరవేరును. స్త్రీ శ్రద్ధతో వేదీ మహోత్సవమును వ్రతమును ఆచరింపవచ్చును. ఆ వ్రతము చేసిన స్త్రీకి ఆ ఫలమే లభించును. రథయాత్రావిధిని చేయువానికి ఎట్టిఫలితము లభించునో, ఆ వ్రతమాచరించువానికిని అట్టి ఫలమే ప్రాప్తించును: అని జైమిని ద్విజులకు తెల్పెను.

## 35వ అధ్యాయము

1. జైమిని ద్విజులకు రథమును రక్షించు విధిని తెల్పుట :

"ఓ మునులారా! భూతప్రేతపిశాచములు మొదలగు దారుణ ఘోరశక్తులు రథములను బాధింపకుండుటకు మహర్షులకు, మనకు సమ్మతమయిన విధి ప్రకారము ప్రతిదినము శ్రీ జగన్నాథస్వామిని బలభద్రుని సుభద్రను ధ్వజమందున్న వారిని గంధపుష్పాక్షతాద్యుపచారములతో గీత నృత్యాదులతో ధూపదీపనివేదనలతో పూజింపవలెను.

దిక్పాలురకొరకు పాయసాన్నము ప్రతిదినము బలియీయవలెను. రథములను రథము లెక్కుటకై ఉపయోగించునట్టి సాధనములనుకూడ సంరక్షింపవలెను. అశుచియగు మానవుడుకాని గ్రామ్యపశువులు పక్షులుగాని రథముపై ఉండకూడదు. అష్టమదివసమున దక్షిణాభిముఖముగ రథముల నుంచి వానిపై మూడు విగ్రహములనుంచి వానికి వస్త్రమాల్యపతాకలతో, చామరాదులతో అలంకరించి నవమితిథియందు దేవతావిగ్రహములను ఉంచవలెను. దక్షిణాభిముఖ మయిన యాత్ర సుదుర్లభము. భక్తి శ్రద్ధాసక్తులుగలవారు రథయాత్రకు తగిన ప్రయత్నము చేయవలెను. ఇంతకుముందు చెప్పినది ఈ రథయాత్ర, రెండును ముక్తిప్రదములు. జగన్నాథునియొక్క యాత్రాప్రవేశములు ముఖ్యమయిన ఉత్సవముగా పరిగణింపబడుచున్నది. పూర్వవృత్తాంతము తెలిసినవారు ఈ రథయాత్ర తొమ్మిది దినములు చేయవలెను. మూడు అవయవములుగల ఈ యాత్ర సంపూర్ణమయినదని చెప్పబడుచున్నది. అట్టి వారికి మహావేదీమహోత్సవము సుసంపూర్ణఫలప్రదము. గుండిచామండపము నుండి దక్షిణాభిముఖముగ పయనించుచున్న రథముపైగల జగన్నాథుని బలభద్రుని సుభద్రను చూచువారికి ముక్తి కల్గును. ఆ ముగ్గురు దేవతలు దక్షిణాభిముఖులయినను, ఉత్తరాభిముఖులయినను సమాన ఫలమునే ఇత్తురు.

జగన్నాథస్వామి దక్షిణాభిముఖముగ పాదములతో వెళ్లుచున్నను, రథముపైనుండి పయనించుచున్నను చూచునట్టి భక్తులకు అశ్వమేధయాగ ఫలము

లభించును. దైవభక్తి తత్పరులు రథమునకు ముందుండి దేవతావిగ్రహములను చూచి స్తుతించుచు నమస్కరించుచు. పుష్పవృష్టికురిపించుచు నాట్యము చేయుచు, ఛత్రచామరములు వీచుచుండవలెను.

రథమునందుండి దక్షిణాభిముఖముగ నీలాచలమునకు వచ్చుచున్న జగన్నాథుని సుభద్రను బలరాముని దర్శించువారికి ముక్తిప్రదము కామ కల్ప వృక్షమగు వైకుంఠపురనివాసము లభించును.

సాగరతీరమున రథోపవిష్టుడై తిరుగుచున్న జగన్నాథుడు తనకభిముఖముగా నుండి నమస్కరిచుచున్నవారిని కరుణాపాంగములతో చూచుచు, నీలాచలము నందున్న ప్రాసాదమునకు పయనించును. ఆ స్వామి సర్వతీర్థములకు నిధి, సర్వదానకల్పతరువు. అట్టి పురుషోత్తముని స్తుతించుచు, నమస్కరించుచున్న శ్రద్ధాభక్తియుతులు బ్రహ్మలోకమున నివసింతురు. వారు తిరిగి భూలోకమునకు రారు. ఇది నిశ్చయము.

మునులు ఈ మహావేదీమహోత్సవమును గూర్చి మనకు తెల్పిరి. దానిని స్మరించినంతనే భక్తుడు నిర్మలచిత్తుడగును. భక్తుడు ప్రాతఃకాలముననేలేచి ఆ ఉత్సవమును గూర్చి స్మరించినను లేదా వినినను, లేదా జ్ఞప్తియందుంచు కొన్నను, ఇంద్రలోకమునకేగును.

భక్తులు జగన్నాథుని ప్రతిమను శ్రద్ధతో నెలకొల్పి ఈ యాత్రా విధిని నిర్వర్తింపవలెను. అట్టి భక్తుడు జగన్నాథుని అనుగ్రహముచే గుండిచోత్సవ ఫలమును పొంది పిమ్మట వైకుంఠవాసమును చేయుననుటలో సందియములేదు.

ఏ మానవుడయినను శ్రద్ధాభక్తి సమన్వితుడై యథాశక్తిగా ధనమును వెచ్చించి, బ్రహ్మచెప్పిన పరమపవిత్రము రహస్యమయిన ఈ మహాయాత్రోత్సవమును చేసినను, చేయించినను లేక, చూచినను ఇహపరసుఖములనుభవించి ముక్తిని పొందగలడు" అని జైమిని ద్విజులకు చెప్పెను.

## 36వ అధ్యాయము

1. జైమిని ద్విజులకు శయనోత్సవమును గూర్చి తెల్పుట :

" ఓ ద్విజులారా! జగన్నాథస్వామి పూజకు ప్రతిసంవత్సరము వర్షా కాలములో ఆషాఢమాసము మొదలు కార్తీకమాసమువరకు నాల్గుమాసములు శ్రేష్ఠమయినవి.

పురుషోత్తమక్షేత్రమున నివసించిన వారికి కాశీక్షేత్రమున నియమ నిష్ఠలతో బహుయుగములు నివసించుటవలన కలుగు ఫలమే కలుగుచున్నది.



పురుషోత్తమ క్షేత్రమునందు పవిత్రమగు జగన్నాథుని సన్నిధిని పైని ప్పిన చతుర్మాసములలో ఏ ఒక్కదినము గడపినను, విష్ణుసన్నిధిని చతుర్మాన ములలో అన్నిదినములు గడపుటవలన కలుగు ఫలము, మరియు, వేయి శ్వమేధయాగములు చేయుటవలన కల్గుఫలము ప్రత్యక్షముగా లభించును.

భక్తుడు పవిత్రమయిన సాగరజలములో స్నానముచేసి, శ్రీ పురుషో త్తముని దర్శించి, చాతుర్మాస్యవ్రతమునారంభించిన వానికి, ఆనందము కల్గును.

భక్తుడు పురుషోత్తమ క్షేత్రమున నివసించి, చాతుర్మాస్యదీక్ష సాగించినచో గవంతుని కటాక్షవీక్షణమువలన ముక్తి కల్గును.

మానవుడు శ్రౌతస్మార్తాది కర్మలను విడిచి శ్రీ పురుషోత్తమ క్షేత్రమున వసింపవలెను.

శ్రీహరి చతుర్మాసములందు శేషతల్పముపైని పవ్వళించినపుడు అన్య క్షేత్రములందు నివసింపడు.

పురుషోత్తముడు వైకుంఠమున నివసించినట్లే పురుషోత్తమ క్షేత్రమున పండ్రెండు నెలలలో చతుర్మానములందు కానవచ్చుచు, మూర్తిమంతుడు ముక్తి ప్రదుడు అగుచున్నాడు.

ఆ క్షేత్రమున అష్టమాసములుండి జగన్నాథుని ప్రతిదినము చూచుటవలన కల్గు ఫలమే చాతుర్మాస్యములో ఒక్క దినమున అతని దర్శనము చేసినందువలన కల్గును. సర్వక్షేత్రములలో సంవత్సరకాలము పూర్తిగ గడుపుటవలన కలుగు మహాపుణ్యము, పురుషోత్తమ క్షేత్రమున చాతుర్మాస్యనివాసమువలన లభించును. సర్వపాపములు చేసినవాడైనను, సర్వాచార భ్రష్టుడయినను, పురుషోత్త క్షేత్ర మున నివసింపవచ్చును. ఏ నరుడు పురుషోత్తమ క్షేత్రములో ఒక్క చాతుర్మా స్యమున నివసించినను, అతడు సర్వపాపవిముక్తుడై, అంతర్బాహ్య నైర్మల్య మును పొందగలడు. అట్టివాడు నరసింహస్వామి కరుణచే వైకుంఠములో నివసించును. కావున మనుజుడు విష్ణువునకు అన్ని విధముల ప్రీతిని చేకూర్చునట్టి వర్షర్తువులో చతుర్మానములు పురుషోత్తమ క్షేత్రమున నివసింపవలెను. సత్పురుషుడు జన్మసాఫల్యమొనర్చుదానినే చేయవలెను. ఇతర కర్మమును చేయ రాదు.

జగన్నాథస్వామికి ఆషాఢశుక్లైకాదశియందు శయన మహోత్సవమును చేయవలెను. అచట మండపమును, దానిపైని శయనాగారమును నిర్మింపవలెను. జగన్నాథుని యెదుట రత్నపల్యంకికోపరిభాగమున అతనికి శయ్యను ఏర్పరుప వలెను.

ఆ శయ్యపైని మృదుచీనోత్తరములను కప్పి తలగడలు పెట్టవలెను. శయ్య పైని కర్పూరధూళి చల్లి ఛిద్రములు లేని వస్త్రమునకు చందనము పూసి మంచి ద్వారములు గల్గి నానా చిత్రములతో శోభిల్లు శయనాగారమును వెన్నెలలో నిర్మింపవలెను. సువర్ణముతో, రజతముతో, ఇత్తడితో లేక శిలతో చేసిన మూడు విగ్రహములు ఒకదానికంటె ఇంకొకటి బాగుగా శ్రద్ధతో చేయవలెను. ఆ మూడు దేవతావిగ్రహముల పాదమూలమున యథాతథముగ ఆ దేవతల ఉత్సవ విగ్రహములనుంచి పూజింపవలెను. శేషించిన పుష్పాదులను వానిపైని పెట్ట వలెను. పూజాంతమున ఉత్సవ విగ్రహములకును మూల దేవతలగు కృష్ణాదు లకును భేదము లేదని భావింపవలెను.

శ్లో॥ "ఏహ్యేహి భగవన్దేవ ! సర్వలోకైక జీవన !
స్వాపార్థం చతురోమాసాన్సర్వ కల్యాణ వృద్ధయే ॥"

అని, ఆ ముగ్గురు దేవతలను ప్రార్థించి, ఆ విగ్రహములయందున్న పుష్పమాలలను ఉత్సవ విగ్రహముల పైనుంచి, మంగళ్యస్తుతి గీతులతో శయ్యాగృహ ద్వారము నకు ఆ విగ్రహములను గొంపోయి, మూడు ఘటికల కాలముంచవలెను. ఆ విగ్రహములకు పంచామృతములతో స్నానము చేయింపవలెను. పిమ్మట ఆ విగ్రహములకు సుగంధ చందనములను పూసి వస్త్రాభరణాదులతో అలంకరించి, యథావిధిగ పూజించి, నమస్కరించుచు —

శ్లో॥ "జగద్వంద్య ! జగన్నాథ ! జగత్త్రాణ పరాయణ !
హితాయ జగతామీశ ! చాతుర్మాస్యాన్తనాగమాన్
సుప్త్వాప్రశమయారిష్టాశ్చ క్రేణ సహ పూజితః ॥
ఏహ్యేహిశయనాగారం । సుఖమత్ర స్వపప్రభో !"

అను మంత్రముతో పురుషోత్తముని స్తుతించి పరుండబెట్టవలెను. జగన్నాథుని శయనమందిర ద్వారమును గట్టిగ బంధింపవలెను. జగన్నాథుని నిద్రింపజేసిన వానికి ఉత్తమ సుఖము కల్గును. వర్షాకాలములో నాల్గుమాసములు జగన్నాథుడు శయనించి యున్నపుడు భక్తుడు అనేక వ్రతములతో, సత్కాలక్షేపముతో, ఆ కాలమును గడపవలెను. అట్లు చాతుర్మాస్య వ్రతమును విధిగ పాటించు భక్తుడు విష్ణు లోకమున ఆకల్పాంతము నివసించును.

2. జైమిని విప్రులకు చాతుర్మాస్యవ్రత నియమములు చెప్పుట :

"ఓ విప్రులారా ! చాతుర్మాస్య దీక్ష నవలంబించిన భక్తుడు మంచముపైని పక్కమీద పరుండరాదు. అసత్యమాడరాదు. మాంసము, పరాన్నము, పొట్ల, ముల్లంగి, వంగ భక్షింపరాదు. మధుపానము చేయరాదు. తినరాని వస్తువులు, తెల్లఆవాలు, చిరుసెనగలు ముట్టరాదు. అలసందెలు, ఉలవలు, ఆశుధాన్యములు



భక్షింపరాదు. దీక్షాపరుడు శ్రావణాది చతుర్మాసములలో క్రమముగా కూరలు, పెరుగు, పాలు, గారెలు ఆహారముగా స్వీకరింపవలెను. చర్మపాదుకలు ఉపయో గింపకూడదు.

మనుజుడు నియమరహితుడై వర్షాకాలమునందలి నాల్గుమాసములు గడపి నచో అతని పాపశాంతికొరకు కార్తీకమాసమునందైనను నియమమును పాటింప వలెను.

శ్లో॥ "నమః కృష్ణాయ హరయే । కేశవాయ నమోనమః ।
నమోఽస్తు నారసింహాయ । విష్ణవేపాపజిష్ణవే ।
సాయంప్రాతర్దివామధ్యే । కర్మాంతేషు చ యో జపేత్ ॥
తస్య పాపాని ఘోరాణి । చితాని బహుజన్మసు ।
నిర్దహత్యేవ సర్వాణి । తూలరాశిమివానలః ।
ఏకాహారో యతాహారో విష్ణునిర్మాల్యభోజనః ।
ఆషాఢీమవధింకృత్వా । కార్తిక్యవధియోభవేత్ ।
నక్తభోజీభవేద్వాపి । స్వర్గస్తస్యాల్పకం ఫలం ।
తైలాభ్యంగం దివాస్వాపం । మృషావాదంచవర్జయేత్ ॥
ఆషాఢశుక్లైకాదశ్యాం । సంక్రాంతౌ కర్కటస్యవా ।
ఆషాఢ్యాం, వా, నరోభక్త్యా । గృహ్ణీయాన్నియమంవ్రతీ ।
సర్వపాపహరందేవం । ప్రపూజ్యమధుసూదనం ।
తదగ్రేప్రతి సంకల్ప్య । వ్రతార్చన జపాదికం ।
ప్రార్థయేత్పరమానందం । కృతాంజలి పుటోవ్రతీ ।
చాతుర్మాస్య వ్రతందేవ ! గృహీతంత్వత్ప్రసాదతః ।
తవప్రసాదాన్నిర్విఘ్నం । సిద్ధిమాయాతుకేశవ !
వ్రతేస్మిన్యద్య సంపూర్ణే । పరలోక గతిర్భవేత్ ।
తన్మేభవతు సంపూర్ణం । త్వత్ప్రసాదాదధోక్షజ !"

అని చాతుర్మాస్యదీక్షాపరుడు, పూర్వోక్తనియమమునందుండి తన మనోబుద్ధు లను జగన్నాథునకర్పించి చాతుర్మాస్యవ్రతము నాచరింపవలెను. జగన్నాథుని ప్రీతికై ప్రతిమాసాంతము ఉపవాసముచేసి విప్రులకు భోజనము పెట్టవలెను. ఆ విధముగ చేయలేని భక్తుడు కార్తీకమాసమున ఉత్తమవ్రతమును ఆచరింపవలెను. ఆ నెలలో జగన్నాథుని పూజించి తర్పణములు చేసి, పిమ్మట విష్ణుభక్తితో ద్విజోత్తములకు పాయసభక్ష్యములతో భోజనము పెట్టి యథాశక్తిగ కనకము, వస్త్రములు దానమీయవలెను. కార్తీక మాసములోకూడ వ్రతముచేయలేని భక్తుడు పూర్వోక్తవిధి ప్రకారము చేయవలెను.

3. జైమిని విప్రులకు చాంద్రాయణ వ్రతమునుగూర్చి చెప్పుట :

భక్తుడు విష్ణుప్రీతికి కృచ్ఛ్రచాంద్రాయణ వ్రతమును ఆచరింపవచ్చును. భక్తుడు పాలుత్రాగి శాకాహారమును భుజించినచో ఈ లోకమున ఉత్తమ భోగము లనుభవించి, శాశ్వత మోక్షము నందగలడు.

4. జైమిని ద్విజులకు భీష్మపంచక వ్రతమునుగూర్చి వచించుట :

చాంద్రాయణ వ్రతమాచరింపలేని భక్తుడు ఉత్తమమయిన భీష్మపంచక వ్రతమునాచరింపవచ్చును. నియమవంతుడు దేవదేవుడగు జగన్నాథుని ప్రీతికై వన్యవృత్తి నవలంబింపవచ్చును. ఈ వ్రతము భగవత్ప్రీతికారకమని చెప్పబడినది. సర్వపాపప్రశమనము, విష్ణులోక గతిప్రదమగు నీవ్రతము ఆయుర్యశోవృద్ధి నొసగి మనోభీష్టములు చేకూర్చి వ్రతిని ధన్యునిగా జేయును.

"ఈ వ్రతములు ఇతరవ్రతములు భగవద్భక్తిహీనులకు విఫలములని తెలిసికొనవలెను. మరియు మహాక్రతువు లొనర్చుటచే కల్గుఫలము, తీర్థములలో గ్రుంకుటవలన లభించుఫలము, సాత్త్వికములయిన తపోదానములవలన ప్రాప్తించు ఫలము, ఒక్క విష్ణుభక్తివలననే సమగ్రముగ నియమవంతుడు పొందగలడు" అని ఋషులు మనకు తెల్పిరి.

ఏ భక్తులు శయనోత్సవమును చూచుచున్నారో, ఆ మహోత్సవమును చేయుచున్నారో వారు మాతృగర్భనరకమును అనుభవింపరు. శ్రీ జగన్నాథుని సన్నిధిలో ఈ వ్రతమును చేయుటకు ప్రతిజ్ఞచేసి, వ్రతపరిసమాప్తి చేసిన భక్తుడు బ్రహ్మలోకమున శాశ్వతముగ నివసించును.

## 37వ అధ్యాయము

1. జైమిని ద్విజులకు దక్షిణాయనమునుగూర్చి చెప్పుట :

"ఓ ద్విజులారా ! సంక్రాంతికి పూర్వము ఇరువది కళలని చెప్పబడినవి. సత్కర్మలు చేయువారికి దక్షిణాయనము పుణ్యకాలము. జగన్నాథునకు పంచామృతములతో శయనమునకువలెనే అభిషేకముచేయవలెను. స్వామి సర్వాంగములకు అగురుకర్పూరచందనములు పూయవలెను. సుగంధ మాల్యాలంకారములతో పరమేశ్వరుని పూజించి స్వామికి మనోహరములగు వస్త్రములు ధరింపజేసి, నానా భక్ష్యములు నివేదనచేసి కర్పూరతాంబూలమును అర్పింపవలెను.

స్వామికి దూర్వాంకురాక్షతలు నీరాజనము సమర్పించి వందనము చేయవలెను. పడతి మాంగల్యగీతనృత్యాదు లొనర్పవలెను.



ఏ భక్తుడు పూజితుడు పూజ్యమానుడగు పురుషోత్తముని చూచునో వానికి నూరురెట్లు పూజాపుణ్యము కల్గును. ఆ దక్షిణాయన పుణ్యకాలమున అర్చింపబడిన శ్రీపతిని దర్శించు భక్తులు సర్వపాప విముక్తులై విష్ణులోకమునకేగుదురు. జగన్నాథుని రథయాత్ర ముక్తిప్రదము. ఆ రథోత్సవదినములలో దర్శనముచేసిన భక్తులకు భగవంతుడు తప్పక ముక్తి నొసగును. మూర్ఖులకు విశ్వాసము కల్గించుటకు పాపుల పాపములు హరించుటకు ఈ యాత్రాకార్యక్రమము విష్ణువుచే చెప్పబడినది. ఈ జగన్నాథుని పూజాదులవలన కల్గు పుణ్యము శ్రమపడుటచే లభ్యమగుచున్నదని మూర్ఖులు భావించుచున్నారు. జగన్నాథుని భోజనమునకు భోజనశాల పరిశుద్ధము చేయవలెను.

2. జైమిని ద్విజులకు బలి నైవేద్యములగూర్చి చెప్పుట :

వైష్ణవాగ్నితో ఉత్తమమగు చరువును తయారుచేసి జగన్నాథునకు పాకసాధనమయిన వైశ్వదేవమును చేయవలెను. శుచియైన భక్తుడు బ్రహ్మకు ప్రజాపతికి వాస్తుపతికి విష్ణువునకు, విశ్వకర్తకు పవిత్రాగ్నిలో హోమము చేయవలెను. శ్రౌతస్మార్త క్రియాపరుడు రాజుచే నియమింపబడిన ఆచార్యుడు ఈశాన్య దిక్కున ద్వారపాల ప్రచండులకు, క్షేత్రపాలునకు ; దక్షిణమున విరూపునకు, ఖగపతికి ; నైరృతిమూలలో దుర్గాసరస్వతులకు ; తూర్పుదిక్కున మహాలక్ష్మీ మహేంద్రులకు నైవేద్యము చేయవలెను. ఉత్తర దిక్కున పారిషదులకు, పశుపతికి, పశ్చిమ దిక్కున నారదునకు ; ఆగ్నేయమున అగ్నికి ; వాయవ్యమున విశ్వసాక్షికి, పంచవాయు రూపుడగు విశ్వకర్తకు మధ్యభాగమున బలిదానము చేయవలెను. బలికర్మమునందు ప్రత్యేకముగ ఆద్యంతములయందు బలికర్మ చేయవలెను. బలి నొసగిన పిమ్మట ఆ యగ్నిలో ఉత్తమమగు పాకమును చేయవలెను. త్రిసంధ్యలయందు భగవంతుని పూజకు చరువుకావలెను. త్రైవర్ణికుడగు నృపుడు వేడిగానున్న చరుసంస్కారకాంగములను, భక్ష్యభోజ్యాదికములను భగవంతునికి నివేదన చేయరాదు, లక్ష్మీదేవి స్వయముగా పవిత్రులయిన ఆర్యులకు శూద్రులకు. పరిసేవకులకు లౌకికరీతిగా వండుచున్నది. నారాయణుడు శరీరధారియై ఆమెతోకూడ నిత్యము భోజనముచేయుచున్నాడు. పాపహరమగు ఆ నైవేద్యము శిరస్సుపైని ఉంచుకొనినచో అమృతమగును. దానిని భక్షించినచో మద్యపానాది మహాపాప నాశనమగును. ఆ నైవేద్యమును ఆఘ్రాణించినచో మానసికమైన పాపము, దానిని చూచినచో దృష్టివలన కలుగు పాపము నశించును. దానిని ఆస్వాదించుటచే శ్రవణేంద్రియములతో చేసిన పాపము పోవును. దానిని స్పృశించినచో చర్మముతో చేసిన పాపము అసత్యము పలుకుటవలన కలుగు పాపము నశించును. ఆ నైవేద్యమును శరీరమునకు పూసికొనినచో శారీరకమైన పాపము నశించును.

భక్తుడు పవిత్రమైన జగన్నాథుని నైవేద్యమును పితృదేవ కర్మముల యందు వినియోగించుటచే పితరులు, సురలు తృప్తిపొంది విష్ణులోకమునకు వెళ్లుచున్నారు. హవ్యకవ్యములయందు ఆ నైవేద్యముకంటె పవిత్రమయిన వస్తువు లేదు. దివిజులు నరులరూపమునుదాల్చి జగన్నాథుని నైవేద్యమును తినుచున్నారు.

3. జైమిని మునులకు శ్వేతరాజ వృత్తాంతమును తెల్పుట :

"ఓ ద్విజులారా ! త్రేతాయుగమున దేవదేవుడయిన చక్రికి అభిమాన పాత్రుడయిన శ్వేతుడను మహారాజు కలడు. అతడు వ్రతము నవలంబించి పురుషోత్తమునియందు మహాభక్తియుతుడయ్యెను.

ఇంద్రద్యుమ్న నృపతి జగన్నాథస్వామికి భోగములు తయారుచేయించినట్లే శ్వేతమహారాజుకూడ స్వామికి సంతసముతో పరిశుద్ధములు షడ్రసోపేతములగు వివిధ భక్ష్యభోజ్యములను ప్రతిదినము వండించెను. మహాపండితుడు, భక్తాగ్రేసరుడయిన శ్వేతనృపతి బహువిత్తమును వెచ్చించి విచిత్రములైన పుష్పమాలలు వేసి. సుగంధమును పూసి, అనేక దివ్యగీతవాద్య ధ్వనులు, నృత్యములు చేయించి. సమయానుకూలముగ రాజోపచారములు చేసి, వైష్ణవ శాస్త్రోక్త చిత్ర భోగములను సమర్పించెను.

శ్వేతరాజు ప్రాతఃకాల పూజాసమయమున జగన్నాథస్వామిని చూచుటకు వెళ్లెను. ఒకానొక దినమున శ్వేతరాజు పూజ్యమానుడయిన దేవుని గాంచెను. ఆ రాజు సంతోషముతో చేతులు జోడించి ప్రాసాదద్వార సమీపమున ఉండెను. అతడు స్వయముగా భగవంతునికి చేసిన ఉపచారములు, అర్పించిన ఉపాయనములు చూసి కొంచెము ధ్యానావస్థలో ఉండి 'మనుష్యుడు సమర్పించిన వానిని భగవంతుడు స్వీకరించునా ?' అని మనస్సులో తలంచెను. దేవతలకు దివ్యోపచారములతో పూజింపలేని నియమవంతులు మానసోపచారములతో భగవంతుని పూజించుచున్నారు. భావదుష్టమయిన బహిర్యాగము భగవంతునికి ఆనందమీయదు" అని శ్వేతరాజు ఆలోచించుచు, దివ్యాసనస్థుడగు శ్రీపతి సర్వావయవాలంకృతయగు లక్ష్మీదేవితోకూడ వివిధ భక్ష్యభోజ్యములు భుజించుట గాంచెను. ఆ భక్ష్యపదార్థములుకూడ ఆ రాజునకు భగవత్ప్రీతి రూపముగానే గోచరించుటచే అతడు కృతార్థుడయినట్లు తలంచెను." అట్లు ఆ రాజునకు ధ్యానసమయములో కానవచ్చినవే కళ్లు తెరచిన తరువాత కనబడినవి. అదిమొదలు శ్వేతరాజు పరమానందమును పొందెను. ఆ రాజు భగవంతుని ఆశీస్సులు పొంది, నియమనిష్ఠలతో తన రాజ్యములో అకాలమృత్యువు నశించుటకు మరణించినవారి ముక్తికొరకు తపమాచరించెను.



4. శ్వేతరాజునకు నృసింహస్వామి సాక్షాత్కరించుట :

శ్వేతరాజు ఆశ్రితులకు కల్పవృక్షమయిన మంత్రరాజమును నిత్యము జపించుచు, దురితాపహుడగు నృసింహస్వామిని నూరువత్సరముల తరువాత దర్శించెను. ఆ నృసింహస్వామి యోగాసనమునందుండగా ఆతని వామభాగమున లక్ష్మీదేవి ఉండెను. దివ్యాలంకృతగాత్రుడు, స్ఫటికామల విగ్రహుడు. స్మితాననుడగు నృసింహస్వామి దేవసిద్ధముక్త భక్తులచే స్తుతింపబడెను. శ్వేతరాజు అట్టి నృసింహస్వామినిగాంచి విస్మయభీతులతో భ్రాంతికల్గి హర్షగద్గద వాక్కుతో 'ప్రభూ ! అనుగ్రహింపుము' అని పలుకుచు నేలపై వ్రాలెను.

తపస్సు చేసి కృశించి అకల్మషుడైన శ్వేతరాజు నృసింహస్వామికి నమస్కరించుచుండగా భక్తవత్సలుడగు స్వామి వానితో ఇట్లనెను :

5. నృసింహస్వామి శ్వేతరాజునకు వరమిచ్చుట :

"ఓ వత్సా ! లెమ్ము నీ భక్తిచేతనే నేను ప్రసన్నుడనైతినని తెలిసికొమ్ము. నీ యిష్టమువచ్చిన వరమును కోరుకొమ్ము" అని స్వామి పలుకగా. శ్వేతరాజు విని లేచి, నమ్రుడై నమస్కరించుచు. "స్వామి ! దుర్లభమైన నీ యనుగ్రహము నాపై కలిగినది కావుననే నేను సాయుజ్యమును పొంది, నీ సన్నిధినేయుందును. నీ సన్నిధిని నేనున్నంతకాలము నా రాజ్యమున ఏ మనుజుడు అకాలమున మరణింపరాదు. సకాలములో మరణించిన నరుడు ముక్తిని పొందవలెను" అని శ్వేతరాజు పలుకగా నృసింహస్వామి విని ఇట్లనెను.

ఓ శ్వేతా ! నీ కోరిక తీరునుగాక ! నీవు సహస్రవత్సరములు సర్వసమృద్ధిగల నీ రాజ్యమును అనుభవించి నాకు దక్షిణభాగమున ఉండుము. నా ప్రసాదమును నీవు భుజించినచో శేషించిన నీపాపరాశి నశించిన పిమ్మట నిర్మలాంతఃకరణుడవై నా సాయుజ్యమును పొందగలవు.

వటవృక్షమునకును, సాగరమునకును మధ్యభాగమున సుదుర్లభమైన ముక్తి స్థానమున ఆద్యమగు నా విష్ణ్వవతారమయిన మత్స్యస్వరూపమునకు ఎదుట స్ఫటికామల విగ్రహుడవై నివసింపుము. నీవు శ్వేతమాధవుడను నామముతో భూలోకమున ఖ్యాతిని పొందగలవు. మీ యిరువురి నడుమ ప్రాణములు విడిచిన మానవులు, పశుపక్ష్యాదులు కీటకములు ముక్తిని పొందుననుటలో సందేహము లేదు, అచట అమరులే మరణమును కోరుచున్నారు. ఇంక మానవుల గూర్చి చెప్పవలెనా ? నీకు ఉత్తరదిక్కున పాపహరమగు సరస్సు కలదు. అందుస్నానము చేసి ఆ జలమును స్పృశించిన మనుజుడు మీ ఉభయుల దృష్టి ప్రసారము చే పూతమైన సరస్సుయొక్క దక్షిణ తటమున మృతినొందినచో

ముక్తుడగుచున్నాడు, ఈ క్షేత్రమంతయు ముక్తి ప్రదమే. మూఢాత్ములకు విశ్వాసము కల్గుటకు ఇది ప్రధానక్షేత్రమని చెప్పబడుచున్నది, నీ రాజ్యమునందు ఏ జనులు నా నిర్మాల్యమును భుజింతురో వారికి ఎన్నడును అకాల మరణము సంభవింపదు" అని ప్రాసాదాంతర్భాగమున నున్న నృసింహస్వామి శ్వేతరాజునకు వరమిచ్చి, అంతర్హితుడయ్యెను.

## 38వ అధ్యాయము

1. జైమిని ద్విజులకు జగన్నాథస్వామి ప్రసాదఫలితము చెప్పుట :

ఓ ద్విజులారా ! సమస్త జగముల సృష్టిస్థితిలయములు చేయునట్టి వైష్ణవ శక్తి సాటిలేనిది. అట్టి లక్ష్మీదేవి అంతట వ్యాపించియున్నది. భగవంతుడగు నారాయణుడు ఆరగించిన అమృతోపమమగు సుపక్వాన్నమును అనగా, ఉచ్ఛిష్టమును భుజించు భక్తుల సర్వపాపములు నశించుచున్నవి. భూమండలమున దానికి సమమయిన పుణ్యవస్తువు లేదు. ఆ ప్రసాదము పాపుల సంపర్కమువలన అపవిత్రముకాదు. లక్ష్మీదేవి సాన్నిధ్యముననున్నవన్నియు పరిశుద్ధములగుచున్నవి. విష్ణ్వాలయమున ఆ ప్రసాదమును పతితులు స్పృశించినను, అది అపవిత్రముకాకుండ, విష్ణుతుల్యమగుచున్నది.

శ్రీ జగన్నాథుని దేవాలయమునకు వచ్చిన వ్రతులు, విధవలు, సర్వాశ్రమ వర్ణములవారు, దీక్షవహించినవారు, ఆహితాగ్నులు. దరిద్రులు, లోభులు, గృహస్థులు, ప్రభువులు, ఈ దేశస్థులు, విదేశీయులు శ్రీ జగన్నాథునికి నివేదింపబడిన ప్రసాదమును తినుటకు అహంకారముతో వెనుకాడరాదు. స్వామి ప్రసాదమును తినినవారు పవిత్రులగుచున్నారు. జగన్నాథుని ప్రసాదమును భక్తితోగాని, లోభముచేతనో, సంతోషముగానో, ఆకలిచేతనో, తృప్తిగా తినినవారు పాపవిముక్తులై ఐహికాముష్మిక సుఖములు పొందుచున్నారు. మరియు శ్రేష్ఠము, శుభప్రదమయిన స్వామి ప్రసాదము సర్వరోగోపశమనమును, పుత్ర పౌత్రాభివృద్ధిని, దారిద్ర్యహరణమును, విద్యాయుర్ధనవృద్ధిని చేకూర్చుచున్నది. ఆ పవిత్ర ప్రసాదమును భక్షించిన వారిపట్ల జగన్నాథునకు అమిత ప్రేమాభిమానములు కల్గుచున్నవి.

ఏ మూఢులు పండితమ్మన్యులై అమృతమగు ప్రసాదమును నిందింతురో అట్టి అపరాధులను దండధరుడగు యముడు క్షమింపక శిక్షించును. ఇచట అతని శిక్షకు గురిఅయినవారికి దుర్గతి తప్పదు. అట్టి ప్రసాదమును దూషించిన మూర్ఖులు అతిదారుణము, మహాఘోరమగు కుంభీపాకమున పచనము చేయబడుచున్నారు. ఎవ్వరయినను ఆ ప్రసాదమును క్రయ విక్రయములు చేయరాదు.



భక్తుడు "నిత్యము జగన్నాథస్వామి ప్రసాదమును తినుటకు ముందు నేను దేనిని తినుటలేదు" అని ప్రతిజ్ఞచేయవలెను. ఇట్టి సత్యప్రతిజ్ఞచేయువాడు ఆ ప్రసాదమును నిత్యము భక్షింపవలెను. అట్టి నరుడు సర్వపాపవినిర్ముక్తుడై శుద్ధాంతఃకరణుడై పరిశుద్ధమగు వైష్ణవస్థానమును తప్పక పొందుచున్నాడు. సంశయములేదు. అట్టి పవిత్ర ప్రసాదమును నిలవచేసినను బాగుగా ఎండ పెట్టినను, దూరదేశమునకు తీసికొనిపోయినను, ఇష్టానుసారముగ ఉపయోగించినను, దోషములేదు.

"కోడినోటినుండి ఆ ప్రసాదము క్రిందపడినను, అద్దానిని బ్రాహ్మణుడైనను తినవచ్చును. ఇతరుల విషయమై చెప్పవలయునా ? ఉపవాసము చేయుచున్నను, ఉపవాసముచేయకున్నను, అశుచియైనను, అనాచారుడయినను, మనస్సుచే పాపమాచరించుచున్న వాడయినను, ఆ ప్రసాదము దొరికినవెంటనే దానిని తినవలెను. దీనివిషయమై విచారణ చేయకూడదు. జగన్నాథుని నైవేద్యాన్నము గంగాజల తుల్యమయినది. ఆ ప్రసాదమును చూచినంత మాత్రమున స్వర్గప్రాప్తి, భక్షణము వలన అఘనాశనము కల్గును.

పవిత్రమగు వైష్ణవాగ్నియందు జగద్ధాత్రియగు లక్ష్మిచే పచనముచేయబడిన ఆ అన్నమును చక్రపాణి యుగమన్వంతరాదులందు ప్రతిదినము తినుచున్నాడు.

సప్తద్వీపధరా మధ్యభాగమున పురుషోత్తమ క్షేత్రమునందలి జగన్నాథుని సాన్నిధ్యమువంటిది ఇంకొకటి లేదు. ఈ నీలాచలమునందులీలామానుష చేష్టలతో దారు రూపమును దాల్చిన పరబ్రహ్మము సర్వులకు నయనగోచరమయి, ప్రకాశించుచున్నది. ఇట్టి పరబ్రహ్మ స్వరూపమెచ్చటను కానరాదు. ఇట్టిదానిని గూర్చి వినబడలేదు.

పరమాత్మ, పరబ్రహ్మస్వరూపుడు, ప్రవృత్తి రూపుడయిన జగన్నాథ స్వామికి ప్రవృత్తి రూపశక్తియగు లక్ష్మి ఆహవిస్సును ప్రవర్తింప చేయుచున్నది. అట్టి పవిత్రమగు హవిస్సును జగన్నాథుడు తినుచున్నాడు. అది ముక్తికారణమని చెప్పుటలో చిత్రమేమున్నది ?

అల్పపుణ్యము కలవారికి స్వామి ప్రసాదము విషయమై విశ్వాసము కలుగకున్నది. వేదాచార ప్రధానములగు యుగములందే, జగన్నాథుని ప్రసాద మహిమము తెల్పబడినది.

2. జైమిని విప్రులకు కలియుగ ప్రభావమును చెప్పుట :

కలియుగమున వేదమహిమము, విశేషముగా వినబడకున్నది, ఘోరమయిన కలియుగమున, ధర్మము మూడువంతులు తగ్గిపోవును. ధర్మము ఒక్క

పాదముతో ఏదియొకచోట భయపడుచు సంచరించుచున్నది. కలియుగమునందలి జనులు అసత్యవంతులు, దాంభికులు, శఠులు, తరచుగా, ధర్మవిముఖులు, జిహ్వాచాపల్యము కలవారు, స్త్రీలోలురు, అగుచున్నారు. అట్టివారు తపమాచరింపరు, వ్రతము సేయరు, మరియు కలియుగ జనులు అధర్మపరులు, హింసాతత్పరులు, చిత్తచాంచల్యము కలవారై ఉత్తమకార్యములు చేయరు. పరులను నిందింతురు. అట్టివారు ప్రసంగవశమునగాని, సంతోష పూర్వకముగగాని పరులకార్యమును భగ్నముచేయుచున్నారు. వారు తలపెట్టిన క్షుద్రకార్యసాధనకై పరులకార్యములకు విఘ్నము కల్గించుచున్నారు. అట్టి నీచులు తనయింటనున్న ధర్మపత్నితో రమింపక పశుచేష్టలుచేయుచు, నిందింపబడుచున్న పరస్త్రీల యెడల అనురక్తులు కాగలరు.

### ద్విజులు

కలియుగమున ద్విజులు అగ్నిహోత్రాదులను, వ్రతములను, ఇతర పుణ్యకార్యములను చేయకున్నారు. మరియు వారు వేదపఠనము చేయక పారలౌకిక కర్మములనొనరింపక ఏదో విధముగ మోసగించి సంపాదించిన ధనముతో జీవితమును గడపుచున్నారు. అట్టివారి జీవితము ఫలప్రదము కాదు.

### భూపతులు

కలియుగమున ప్రభువులు నిత్యము ప్రజారక్షణ విముఖులు, పన్నులు వసూలుచేయుటయందే ఆసక్తి కలవారు. పాపిష్ఠులు, చౌర్యవృత్తికలవారు.

కలియుగమున కొందరు వర్ణసంకరముచేయుదురు. రాజులు పరధనాదులను హరింతురు. శూద్రులు నృపులను సేవింతురు, ప్రజలు శ్రౌతస్మార్తాది సత్కర్మములను ఆచరింపరు. నరులు పరలోకమునకు నిర్దేశింపబడిన దానధర్మాది కర్మములను చేయక, ఇతరుల ధర్మములనాచరింతురు. ద్విజులకు మనోవాక్కర్మలచే హితమును కోరవలెను.

### బ్రాహ్మణులు

"బ్రాహ్మణుడు నాశరీరము. బ్రాహ్మణులు దేనిచే సంతుష్టులగుచున్నారో, దానిచే నేనును సంతోషించుచున్నాను. మనుజుడు బ్రాహ్మణుని యెడల జనార్దనుని యెడల సమభావము కలిగియుండవలెను. ద్విజులు ఏ వాక్యమును పలుకుదురో భగవంతుడు అదే వాక్యమును స్వయముగ పల్కును. బ్రాహ్మణుడు ఏ విధముగా ప్రవర్తించుచున్నను, అన్ని వర్ణములలో శ్రేష్ఠుడు. దేవేశుడు సాక్షాత్తు భగవంతుడ



యినను, బ్రాహ్మణ ప్రియుడగుచున్నాడు. జనార్దనుడు బ్రాహ్మణుని కొరకే ఎల్లపుడు అవతారమును దాల్చుచున్నాడు. వారిని రక్షించుటకే, ప్రతియగమున దుష్టులను శిక్షించుచున్నాడు. బ్రహ్మసృష్ట్యాదిని ముందుగా బ్రాహ్మణులను సృజించెను. అన్ని వర్ణములవారు వారి వంశములలోగల పూర్వాపరములను తెలిసికొనుచున్నారు. కావున కలియుగమున బ్రాహ్మణుడు విష్ణువే. అన్ని వర్ణములవారికి బ్రాహ్మణుడు విష్ణువు, ఆ ఉభయులు అన్యులకుగతి. బ్రాహ్మణులకు మాత్రము హరియే గతి, కలియుగమున సర్వులకు హరియేగతి అగుచున్నాడు.

ధనికుల గృహములందు, దరిద్రులనివాసములందు పల్లెలలో పట్టణములలో కూడ విష్ణునామ స్మరణము కీర్తనము చేయవలెను. క్షేత్రజ్ఞుని స్థానము. పుణ్యక్షేత్రమయిన నీలాచలమునందు సర్వజీవులకు జీవభూతుడగు విష్ణువు దారుమయమగు శరీరమును ధరించి కలికల్మషనాశనమునకు, తన దర్శనముచేసి తన్నునుతించి, తన ప్రసాదమును భుజించిన దుష్టులకు సైతము ముక్తినిచ్చును. ఇంద్రుడు జగన్నాథునకు నైవేద్యము పెట్టిన ప్రసాదము వ్యాపించియున్నది. జగన్నాథుని యితర మూర్తులందు కూడ నైవేద్యమున్నది. ఆ ఉచ్ఛిష్టమును విమోచనముచేయుటకూడ పవిత్రకార్యముగ చెప్పబడుచున్నది.

భగవంతుడు ఈ పురుషోత్తమ క్షేత్రమున నైవేద్యమును ఆరగించి, తన నేత్రములతో ఇతర స్థలములను చూచుచున్నాడు. పూర్వము యోగులు విష్ణువును ఆశ్రయించి అతని ఉచ్ఛిష్టమును తినుటవలన అతని మాయను జయించుటకు వరము నిమ్మని ప్రార్థించిరి. ప్రశాంతచిత్తులకు హరి అనాయాసముగ ముక్తినిచ్చుచున్నాడు.

### 3. జైమిని ద్విజులకు జగన్నాథుని లీలలు వేదప్రోక్తములని చెప్పుట :

ఓ ద్విజులారా! హరి లక్ష్మీదేవితో పురుషోత్తమ క్షేత్రమున శయనాసన భోగాది క్రీడలు సల్పుట వేదప్రోక్తమని భక్తులు గ్రహింపవలెను. వేద విరుద్ధమయిన కర్మ ఎన్నడును ఆచరణయోగ్యముకాదు. విష్ణువు వేదమును రక్షించుటకే ప్రతి యుగమున అవతరించుచున్నాడు. భగవంతుడు ప్రమాణ భూతుడు. ఆతడు ప్రమాణవిరుద్ధమయిన దానినెట్లాచరించును ? ఆతడే ప్రమాణవిరుద్ధముగ ప్రవర్తించినచో, లోకులుకూడ అతనినే అనుసరింతురు. నియతమయిన వేదార్థము ఆచారము చేతనే శాశ్వతమయినదగుచున్నది.

### 4. జైమిని ద్విజులకు శాండిల్యుని వృత్తాంతమును తెల్పుట :

ఓ ద్విజులారా! పూర్వము మధ్యప్రదేశమున జన్మించిన శాండిల్యుడను ద్విజుడు పురుషోత్తమ క్షేత్రమునకు వచ్చెను. అతడు శిష్టాచారములచే విమలుడు,

శాస్త్రార్థజ్ఞానముకలవాడు. ఆ విప్రుడు కాయవాఙ్మనస్సులచే సర్వదా శాంతుడు దాంతుడు, గృహస్థాశ్రమ ధర్మమును నిర్వర్తించుచున్నాడు. ఆ ద్విజుడు తీర్థ విధిప్రకారము జగన్నాథుని అర్చించుటకై మూడు రాత్రులచటనుండెను. అతడు, సోమయాజి. గృహస్థులు శాస్త్రప్రకారము యజ్ఞశేషమును భుజింపవలెనను నియమముచే, అతడు జగన్నాథునకు నివేదించిన ప్రసాదము వరులు పచనము చేసినదని తినలేదు. ఈ క్షేత్రమున దేవతలచే సంస్కరింపదగినది దేవయోగ్య మయిన దెట్లగును? నైవేద్యము అయోగ్యమయినందున అగ్రాహ్యమయినదని తలచి, ఆ శ్రోత్రియుడు నైవేద్యమును భుజింపనందున, అతని అనుచరులుకూడ భుజింపలేదు. అందుచే శాండిల్యుడు వ్యాధిగ్రస్తుడై శారీరకమైన బాధపడెను. భగవద్ద్రోహముచేసిన ఆ ద్విజుడు అతని కుటుంబమువారు బాధపడుచుండిరి.

ఆ విప్రుడు నిర్నిమిత్తముగ తనకు తనకుటుంబమునకు సర్వావయవ భంజకమగు బాధఎట్లు కలిగినదని మనస్సులో విచారించెను. ఇట్లాలోచించు చుండగా మూడురాత్రులు గడచినపిమ్మట అతనిబుద్ధికి ఇట్లుతోచెను. "ఇట్టివ్యాధి కుటుంబములోని వారందరికిని ఒక్క పర్యాయమురాదు. ఈ పురుషోత్తమ క్షేత్రమున మేమేమి ద్రోహము చేసితిమి? ఈ వ్యాధికి నేనేబాధ్యుడనా ?" అని శాస్త్రతత్త్వార్థదర్శకుడైన ద్విజుడు తలంచి పిమ్మట నారాయణుని ధ్యానము చేసి తరువాత స్తుతించెను" అని జైమిని ద్విజులకు తెల్పెను.

5. శాండిల్యునకు స్వప్నములో కల్గిన అనుభూతి :

"ఓ పురుషోత్తమా ! ధర్మనిర్ణయ హేతువులగు చతుర్దశవిద్యలన్నియు నీముఖపద్మమునుండి వచ్చినవే. అట్టి నీ వాక్యములననుసరించి ధర్మమునాచ రింపవలెనని, శాస్త్రార్థమువలన నిశ్చయింపబడినది. ఆ ధర్మరక్షణమునకే ప్రతి యుగమునందును అవతారమును దాల్చుచుంటివి. ఆ శాస్త్రార్థమునుల్లంఘించి ప్రవర్తించువాడు నీకు ద్రోహముచేసినట్లే.

ఓ దేవదేవేశ! మనోవాక్కర్మలచేత అర్థకామముల విషయమై ధర్మ శాస్త్రమునతిక్రమించి, నేను ప్రవర్తింపలేదు.

ఓ దేవ! అనేక సహస్రజన్మలలో సంచితమయిన నాపాపసంచయము నీ దర్శన దవాగ్నిచే దహింపబడునని ఇటకువచ్చితిని.

ఓ ప్రభూ ! నీకు ప్రియమైన శాస్త్రమార్గమున ప్రవర్తించుచున్న నే నే యపరాధము చేసితిని ? అహేతుకముగ ఉగ్రమగు వ్యాధి నా సర్వాంగములను బాధించుచున్నది.



ఓ కృపాసాగర ! తెలిసియో తెలియకో, నీపాదసరసీరుహసన్నిధిని నేనొనర్చిన అపరాధమును క్షమింపుము.

పాదముల తొట్రుపాటుచే భూమిపైని పడినవారికి భూమియే అవలంబ మగుచున్నది.

స్వామీ ! నీయెడల అపరాధముచేసిన వారికి నీవే శరణము. నీకు నేచేసిన అపరాధమువలన కల్గిన పాపమును నీవే క్షమింపుము.

ఓ దేవా! వహ్ని సంతాపమువలన పుట్టిన పుండు వహ్నిసంతాపము వలననే పోవును. ప్రారబ్ధమైన నా పాపబీజమువలన కలిగిన ఈ దుర్దశను, మోక్షైక హేతువగు నీ లీలా పాంగముచే శమింపజేయుము.

ఓ జగన్నాథ ! శోకసాగరమున పతితుడయిన నన్ను ఉద్ధరింపుము. నీ దృష్టి పథమున పయనించుచున్న నరుడు శోచ్యుడగునా ?

ఓ నిసర్గకరుణాసముద్రా! నీ దృష్టిపథమున నున్నవాడు సదానందాబ్ధి నిమగ్నుడై విచారింపడు. దేనిని కోరడు.

ఓ దేవేశ ! అల్పభాగ్యుడనగు నేను నా నేత్రములచే నిన్ను చూడలేక పోవుచున్నాను.

ఓ జగన్నాథ ! ఈ భయము నా మోక్షమునకు అంతరాయము కల్గించుచున్నది. నీ సేవకుడను, ద్రోహిని అయిన నన్ను సదా అనుగ్రహింపుము. సేవ్యసేవక సంబంధముచే నన్ను క్షమింపుము" అని స్తుతించిన వెంటనే అతని దేహపీడ పోయినది.

6. జైమిని ద్విజులకు శాండిల్యుని స్వప్నమును తెల్పుట :

"ఓ ద్విజులారా ! పిమ్మట భక్తవత్సలుడు, గోవిందుడయిన నృసింహ స్వామి, దివ్యసింహాసనాసీనుడై, దివ్యాలంకార భూషితుడై, లక్ష్మీదేవి అందించిన పరమాన్నమును స్వీకరించుచు, గ్రాసావశేషమును పాత్రలపై మాటిమాటికి విసరుచు, ఆమె అతనిచేతికి అందించుచున్న భోజ్యవస్తువును ఆలస్యముగా తిను చుండెను. రమాదేవి విలాసహాసములతో స్వామిచేతిలో పెట్టుచున్న భక్ష్యాదులను ద్విజోత్తముడగు శాండిల్యుడు చూచుచు విస్మయావిష్టుడై నైవేద్య నిరాకరణ మూలముగ ఆత్మకృత దోషమును స్మరించుచుండెను.

7. శాండిల్యుడు స్వప్నములో నృసింహస్వామిని స్తుతించుట :

"ఓ స్వామీ ! నీవు సర్వజ్ఞుడవు. అల్ప ప్రజ్ఞకల నే నెక్కడ ? నీవు మహదహంకార భూతతత్త్వ విసర్జకుడవు. నే నెక్కడ ?

ఓ ఈశా! భవన్మాయా మూఢమనస్కులయినవారు నిరంకుశమ్ము అనిర్వాచ్యము, సృష్టిలయాత్మకమగు నీ యిచ్ఛను ఎట్లెరుగగలరు?" అని స్తుతించుచున్న ద్విజశ్రేష్ఠుని శరీరమందంతట, నృసింహస్వామి ఉచ్ఛిష్టమున, చేతితో భుక్తశేషమును చల్లెను.

స్వామి చల్లినవి అమృత సేచనముతో సమానముగ శ్రీమంతుడగు ముని జీవన్ముక్తుడయినట్లు బ్రాహ్మణుడు దివ్యదేహముతో ప్రకాశించెను. భక్తియొక్క మహిమమును భక్తులే గ్రహింతురు.

శ్రోత్రియ పుంగవుడయిన శాండిల్యుడు పరమాత్ముడగు నృహరిచేతనున్న ఉచ్ఛిష్టమును తిని కృతార్థుడయినట్లు భావించెను" అని జైమిని మునులకు తెల్పెను.

"సాధారణమయిన ధర్మశాస్త్రము ఈ పురుషోత్తమ క్షేత్రమున అనుసరణీయము కాదు. ఈ ధర్మము భగవంతునిచేతనే చెప్పబడినది. ధర్మము ఆచార ప్రభవము. ధర్మమునకు అచ్యుతుడు ప్రభువు" అని శాండిల్యుడు ఆలోచించుచు, కుటుంబమునకు స్వామి ప్రసాదమును స్వయముగా తీసికొని వెళ్లెను. అప్పుడే అతని ధ్యానమునకు భంగము కల్గినది.

శాండిల్యుడు మేల్కొని విస్మితాశయుడై ఆ స్వప్నమునుగూర్చి ఆలోచించెను" అని జైమిని ద్విజులకు చెప్పెను.

8. జైమిని ద్విజులకు శాండిల్యుని పశ్చాత్తాపమును తెల్పుట :

"ఓ ద్విజులారా! శాండిల్యుడు జగన్నాథుని ప్రసాదమును స్వీకరింపకుండుట దైవద్రోహముగా భావించి ఇట్లు వగచుచున్నాడు.

శాండిల్యుడు 'ఓ జగన్నాథా! నీ నైవేద్య మహిమము నెరుగక దానిని భుజింపక భగవంతుడవగు నీయెడల అపచారము చేసితిని. ఇదియే నేనుచేసిన ద్రోహము.

స్వామీ! నీ పదాంబుజములే చతుర్దశ భువనములుగల బ్రహ్మాండము. ధర్మద్రవమను నీ పాదజలముచే బ్రహ్మాండమును పవిత్రము చేయుచున్నావు. అట్టి నిన్ను ఇంద్రాదులు ఉత్తమములగు దివ్యోపచారములచే పూజించుచున్నారు. నీవు ఈ పురుషోత్తమ క్షేత్రమున మనుష్యకృతములగు భోజ్యవస్తువులను భుజించుచున్నావు' అని శాండిల్యుడు వగచి, ఆశ్చర్యపడి స్వప్నలబ్ధమయిన నైవేద్యముతో తన కుటుంబమునకు మార్జనచేసెను.



పిమ్మట అతని కుటుంబసభ్యులు రోగవిముక్తులై ఆ ద్విజుని సువాక్యములు విని సంతుష్టులై పునర్జన్మము కల్గినట్లు భావించి, ఉత్తమమగు పురుషోత్తమ క్షేత్రమునిట్లు ప్రశంసించిరి" అని జైమిని ద్విజులకు వచించెను.

9. శాండిల్యుని కుటుంబసభ్యులు పురుషోత్తమ క్షేత్రమును ప్రశంసించుట :

"సప్తద్వీపావనీతలమున పురుషోత్తమ క్షేత్రమునకు సదృశమయినది యింకొకటి లేదు. అచట పురుషోత్తముడు నరులకు తన ప్రసాదము నిచ్చి పాప విముక్తిని కల్గచేయుచున్నాడు. పురుషోత్తమ మాహాత్మ్యముగల క్షేత్రమింకొకటి పరమ దుర్లభము. ఆ క్షేత్ర మహిమచే భక్తులకు స్వర్గము, భోగము, ముక్తి సులభముగ లభించుచున్నవి. ఈ క్షేత్ర ప్రభావమువలన భవారణ్యమునందు ఆర్తులయినవారికి నానా భోగోపతృప్తులకు ఆనందము ముక్తి కల్గుచున్నవి. ఈ విధముగ వారిలోవారు పరస్పరము సంభాషించుకొనుచు, సంతోషించుచున్నారు. వారు జగన్నాథుని ప్రసాదమును పంచుకొని భుజించిరి.

పిమ్మట శాండిల్యాదివిప్రులు రోగముపోయి పాపరహితులై తరుణాదిత్య వర్చస్సుతో దేవతలవలె నిర్మలముగా ప్రకాశించుచున్నారు. నైవేద్యమాహాత్మ్యమును వినినవాడు పాపాత్ముడయినను ముక్తిని పొందును" అని జైమిని ద్విజులకు నైవేద్యమును తినుటవలన కల్గిన ఫలితమును చెప్పెను.

10. జైమిని ద్విజులకు నిర్మాల్యఫలమును చెప్పుట :

"ఓ ద్విజులారా! నిర్మాల్యగ్రహణఫలమును చెప్పుట సాధ్యము కాదు. సాక్షాత్తు బ్రహ్మ స్వరూపుడయిన జగన్నాథుడు శరీరమందు నిర్మాల్యము ధరించుచున్నాడు. భగవంతుని అంగములను పుష్పచందనమాల్యాదులతో అలంకరించి సకాలములో తొలగింపబడినదే నిర్మాల్యము, జగన్నాథుని విగ్రహమునందలి మార్జనమును శిరస్సుపైని ధరించినచో కోటి తీర్థములయొక్క అభిషేకఫలము నిచ్చును. ఆ నిర్మాల్య భక్షణము గురుభార్యా సంగమ జనిత పాతకమును నాశనము చేయుచున్నది. ఈ జగన్నాథునిమూర్తికి లేపనము చేయుట మంచిది. స్వామికి శ్రీ ఖండాగురు కర్పూరకస్తూరీ కుంకుమాదులపూత ఉత్తమమయినది.

ఇంద్రద్యుమ్న నృపతి జగన్నాథుని దేహమందు పిష్టలేప తైలముతో చందనాగురు దారువుతో ప్రతిదినము పూసి, సంవత్సరాంతమున దానిని తీసివేయుచున్నాడు. గంధాదుల పూతను తీసివేయునపుడు చూచుట మంచిది కాదు. లేపనమునకు లేపనమునకు వ్యవధి ఉన్నచో మరల పిష్టమును పూయవలెను. స్వామి శరీరాంగములకు ఇతర లేపము శ్రేష్ఠము కాదు" అని జైమిని ద్విజులకు తెల్పెను.

11. జగన్నాథుని విగ్రహమునుండి అర్ధ్రచందనాది లేపనమును తీసినవానికి కుష్ఠవ్యాధి నంభవించుట :

"ఓ ద్విజులారా! జగన్నాథుని సేవకై నియుక్తుడైన భక్తుడు స్వామి విగ్రహమునుండి సుగంధముగల అర్ధ్రచందనాది లేపనమును తీసి నృపకుమారున కీయగా, అతడు లేపనపరిమళమునకు సంతసించి అతడు తన వక్షఃస్థలమునకు పూసికొనెను. అందువలన అతని గుండెలపైని శ్వేతవర్ణముతో కుష్ఠవ్యాధి ప్రారంభమయ్యెను. ఆ నృపకుమారునకు అర్ధ్రమయిన స్వామి శరీర లేపనము తీసి యిచ్చిన భక్తుని చేతికి కుష్ఠవ్యాధి సంభవించెను. స్వామి విగ్రహముపైని నంవత్సరకాలము సుగంధ లేపనము చేసినచో పుణ్యము కలుగును. నిర్మాల్యము లలో ప్రధానమయినదానిని వాసన చూచుటచే పాపవినాశనమగును" అని జైమిని ద్విజులకు తెల్పెను.

12. జైమిని ద్విజులకు దమనకుడను దైత్యునిగూర్చి తెల్పుట :

"ఓ ద్విజులారా! పూర్వము సముద్రజలమున సంచరించుచున్న దమనకుడను దైత్యుడు మాయాబలపరాక్రముడై జనులను బాధించుచుండెను. బ్రహ్మ ప్రార్థనచే మాయావియగు విష్ణువు మత్స్యావతారమును దాల్చి సముద్ర జలములో ప్రవేశించి, ఆ రాక్షసుని వెదకి పట్టుకొని సాగరతటమున హతమార్చెను. దైత్యుడు చైత్రశుక్ల చతుర్దశి తిథియందు భూమిపైని మృతుడయ్యెను. భగవంతుని కరస్పర్శవలన అతడు పరిమళముగల తృణమయ్యెను. ఆ తృణమును వన మాలతో కలిపి హరి హృత్ప్రదేశమున దాల్చెను. దాని పరిమళమధికకాల ముండుటచే హరి దానియెడల ప్రీతికల్గి యుండెను. ఆ తృణపరిమళము సర్వ పుష్పసౌరభావహమగుచున్నది. అద్దాని వర్ణముకూడ భగవంతుని మూర్తికి తగినదై శోభిల్లుచున్నది. ఆ తృణమాల భగవంతునకు పరమ ప్రీతికరమగు చున్నది. ఆ మాల వాడిపోయినను చెడిపోవుటలేదు. ఆ తృణముతో కట్టిన మాలను విష్ణువునకు సమర్పించినచో అది హరికి పరమ ప్రీతికరమై ముక్తిప్రద మగుచున్నది.

హరి శరీరమునుండి తీసిన ఆ మాలను భక్తితో ధరించిన భక్తుడు వేయి అశ్వమేధయాగముల ఫలమును పొందుచున్నాడు" అని జైమిని ద్విజులకు తెల్పెను.

తులసీదళ మహిమ

విష్ణు శరీరమునుండి తీసిన తులసీమాలను ఏ భక్తుడు శిరస్సుపైని కంఠమున, హృదయమునందు ధరించుచున్నాడో ఆ తులసీపత్ర సంఖ్యగల అశ్వమేధ యాగముల ఫలమును పొందుచున్నాడు.



హరి నిర్మాల్యమయిన తులసీపత్రమును ఏ భక్తుడు తినునో అతడు వేయి జన్మముల పర్యంతము విష్ణులోకమునందు నివసించును.

హరికి నైవేద్యముగా అర్పించిన తులసీదళ మిశ్రితమైన అన్నములో ఒక్కొక్క పర్యాయము తినినది సోమపానము ఫలమే కలిగించును.

ఏ భక్తుడు యావజ్జీవము అట్టినైవేద్యము భుజించునో! అతడు తప్పక మోక్షమును పొందుననుటలో సందేహము లేదు.

నారాయణుని అర్ఘ్యశేషాదికము, ఆచమనోదకము, పాదోదకము, స్నాన జలము, పానముచేసిన భక్తులకు, పాపనాశనము సర్వతీర్థాభిషేకఫలము, గ్రహ నాశనము, దారిద్ర్యనాశనము, దైత్యభూత భేతాళనాశనము, శవాద్యమేధ్య నంస్పర్శదోషనాశనము, సర్వదీక్షావ్రత ఫలప్రదము, ఐశ్వర్యవర్ధనము, అకాల మృత్యుహరణము, వ్యాధిహరము, సురాపానాది పాపనాశనము చేకూర్చుచున్నది. అట్టి పవిత్రములైన హరి పాదోదకాదులను, సేవించిన సర్వ కర్మాధికారికి సూతకమున్నట్లు వినినను, అశౌచములేదు. భక్తుడు హరికి ప్రీతికరములయిన నిర్మాల్యములను యావజ్జీవము వినియోగించినను, ఒక పర్యాయము ఉపయో గించినను, విష్ణువుయొక్క కరుణవలన ముక్తుడగుచున్నాడు.

లోకానుగ్రహ కాంక్షతో పురుషోత్తమ క్షేత్రమున అవతరించిన విష్ణువు లక్ష్మితో కూడ క్రీడించుచు, భక్తులకు అనాయాసముగ మోక్షమునిచ్చు చున్నాడు. మరియు ఆ పురుషోత్తముడు అతని నిర్మాల్యపాదతీర్థ నైవేద్యములను సేవించిన వారికి అతనిని దర్శించి, వందనమాచరించినవారికి, పూజాద్రవ్యాదులను సమర్పించినవారికి, మోక్షము నొసంగుచున్నాడు" అని జైమిని ద్విజులకు, పురుషోత్తముని నిర్మాల్యాదుల మాహాత్మ్యమును విశదీకరించెను.

## 39వ అధ్యాయము

1. జైమిని ద్విజులకు చాతుర్మాస్య వ్రతవిధిని, యాత్రాంతర ఫలములను వివరించుట :

"ఓ ద్విజులారా! పురుషోత్తముడు నానాగుణ వికాసములతో, నానారూప చేష్టలతో, నానారూప విలాసములతో, జగన్మయుడు, సర్వాత్మ స్వరూపుడయి ప్రకాశించుచున్నాడు.

అహంకారమువలన కలుగు అనర్థములు

అహంకారరహితులకే కర్మఫలము లభించుచున్నది. అహంకారము కలవారు భవమను కారాగారమున బంధింపబడుచున్నారు.

బుధ్యహంకారయుక్తుడగు నరుడు ప్రారంభించు కర్మముయొక్క శుభఫలమును పొందుచున్నాడు. గుణభేదముచే బుద్ధి త్రివిధములు. ఆ మూడు తెగలలో సాత్త్వికులు ఫలావాప్తి పరాఙ్ముఖులయి మోక్షేచ్ఛతో, భగవత్ప్రీతి కొరకు కర్మలనాచరించుచున్నారు. రెండవతెగకు చెందినవారు, పరులయెడల స్పర్థతో, కీర్తిని కాంక్షించుచు, అధికధనమును వెచ్చించుచు, ఆయాసపడి రజోగుణ ప్రధానమయిన కర్మల నాచరించుచున్నారు. మూడవతెగకు చెందినవారు గతానుగతికముగ ప్రయోజనము నాశించి, ప్రసంగమువలన ఫలమును అపేక్షించి, తామస గుణప్రధానమయిన కర్మములు చేయుచున్నారు.

సాత్త్వికులు జగన్నాథుని ధ్యానముచేసినను దర్శించినను, స్వామివారి యోగక్షేమములను పరికించుచు ముక్తినొసగుచున్నాడు.

రాజసులు, తామసులు మూఢులై ఫలాపేక్షతో ఉత్సవాదులే వారికి ఫలము నిచ్చునని తలంచుచున్నారు.

మరికొందరు సామూహికముగ అధికశ్రమతో ఆచరించు కర్మము, సత్ఫలితము నొసగునని వారు సులభపద్ధతిని అవలంభించు చున్నారు. అట్టివారిని ఉద్ధరించుటకు, దురాత్ములకు విశ్వాసము కలిగించుటకు యథావిధిగ యాత్రోత్సవమును ప్రతిసంవత్సరము చేయుచుండవలెను.

జగన్నాథుని జన్మస్నానము, మహావేదికోత్సవము, రెండు మహా యాత్రలు స్మరించిన మనుజులకు పాపనాశనమగును.

## పార్శ్వపర్యాయణోత్సవము

దక్షిణాభిముఖుడయిన స్వామి దర్శనము, దక్షిణాయనమున శయనోత్సవము, సర్వపాపహరములగు చున్నవి. జగన్నాథునికి ప్రదక్షిణము చేయుట శయనించిన స్వామిని త్రిప్పుట, కృష్ణపక్షమునందలి ఏకాదశి తిథియందు స్వామియొక్క శయనాగారద్వారప్రదేశమునకు మెల్లగావెళ్లి మంచముపైని పవ్వళించిన జగన్నాథునకు ఆనందముతో వందనమాచరించి, ఆచ్ఛాదనముచేసి మెల్లగావెళ్లి ఉపచారములతో పూజింపవలెను.

జగన్నాథుని పాదపద్మములకు నమస్కరించి ఉపనిషద్వాక్యములతో స్తుతించి —

శ్లో॥ "దేవదేవ! జగన్నాథ! కల్పానాంపరివర్తక !
పరివర్తమిదంసర్వం। యేనస్థావర జంగమమ్ ।
యదిచ్ఛాచేష్టితైరేవ। జాగ్రత్స్వప్న సుషుప్తిభిః।
జగద్ధితాయ సుప్తోఽసి పార్శ్వేన పరివర్తయ।



పరివర్తనకాలోఽయం। జగతః పాలనాయ తే।
తవాజ్ఞాఽయంచ శక్రోఽపి। ధ్వజే తిష్ఠన్సముత్సుకః।
ద్రష్టుంత్వత్పాదకమలం। విముంచన్జలదైర్జలమ్।
మహీతలంపాలయంతి। ప్రజాపాలన హేతుకమ్॥

అను మంత్రమును జపించుచు, స్వామిని ఉత్తరాభిముఖముగ నిద్రింపజేయవలెను. స్వామికి చామరవ్యజనములతో కూడ ఉపచారములు చేయవలెను. అతని విగ్రహమునకు సుగంధ చందనములను పూయవలెను. ఇక్షురసాదులతో తయారుచేసిన పాయసమును జగన్నాథునకు నివేదనము చేయవలెను. మినుములతో చేసిన భక్ష్యములు, పాయసఘృతాపూపములను హృద్యమగు తాంబూలము జగన్నాథస్వామికి శయ్యాగృహ ద్వారమందు మెల్లగా నైవేద్యము చేయవలెను.

జగన్నాథుని స్నానము, జపము, హోమము, తపస్సు, జాగరణము, ఉపవాసము, నియమము వ్రతాంతమున ద్విజసంతర్పణముతో కూడిన సాంగ వ్రతమును ఆచరించిన భక్తుడు, విష్ణులోకమున నివసించును. అట్టి భక్తుడు మనస్సులో కోరిన కోర్కెలు ఫలించును.

పైని చెప్పిన పార్శ్వపర్యాయణోత్సవము తిలకించిన జనులకు అనాయాసముగ అక్షయమగు సుఖము లభించును.

## ఉత్థాపన మహోత్సవము

జగన్నాథస్వామిని కౌముద్యాఖ్య మహోత్సవమునందు పుష్పమాల్యానులేపనములతో అలంకరించి పూజించి పౌర్ణమాసియందు రాత్ర్యుత్సవమును చేసి అక్షక్రోడాదులు సల్పి నారికేళాదులు పిష్టముతోచేసిన భక్ష్యభోజ్యవస్తువులు నివేదనము చేయవలెను.

మరునాటి ప్రభాత సమయమున కార్తీకవ్రత మాచరించుటకు సంకల్పము చేసి శుక్లపక్షమున ఏకాదశియందు బాగుగా నిద్రించిన జగన్నాథస్వామిని మేల్కొల్పవలెను. ఆ నిశామధ్యమున జగన్నాథుని పూర్వోక్త విధిచే పూజించి —

శ్లో॥ "ఉత్తిష్ఠ దేవదేవేశ ! తేజోరాశే ! జగత్పతే !
వీక్షస్వసకలందేవ ! ప్రస్తుతం తవమాయయా ।
ప్రఫుల్లపుండరీక శ్రీహారిణా నయనేనవా।
త్వయాదృష్టం జగదిదం । పావిత్ర్యం పరమేష్యతి "

అను మంత్రమును మెల్లగా ఉచ్చరించుచు, మేల్కొల్పి, వేణువీణాదుల స్వనములతో, వందిమాగధసూతులస్తుతులతో, మంగళస్వనములతో, శంఖకాహళ

మురజవాదనములతో, నృత్యగీతములతో, జయశబ్దములతో, స్తోత్రములతో జగన్నాథస్వామిని నృత్యమండపమునకు తీసికొని వెళ్లి సుగంధతైలమును పురుషోత్తమునకు పూసి, పంచామృతములతో, నారికేళ జలములతో, ఫలరసములతో స్నానము చేయించి, సుగంధామలకమును యవకల్కమును పూయవలెను. తులసీ చూర్ణముతో గంధచందనము పుష్పాధివాసిత జలముతో, కర్పూర సహిత తోయముతో, కలశోదకముతో, కుశోదకముతో, రత్నతోయముతో, గంధ జలముతో స్నానముచేయించిన జగన్నాథుని ఏ భక్తులు సంతోషముగ చూచుచున్నారో వారు బహుజన్మోపార్జిత పాపరహితులగుచున్నారు. పిమ్మట జగన్నాథుని వక్షఃస్థలమున అత్తరువు పన్నీరు చల్లవలెను. జగన్నాథుని పాదము మొదలు శిరస్సువరకు సర్వాంగములయందు చందనముతో కూడిన కుంకుమాగురు కస్తూరీ కర్పూరమును పాటలోదక సంపిష్టమును కాలాగురు రసమును పూసి చంద్రచూర్ణసంయుతమగు మాలతీమాలను మెడలో వేసి జగన్నాథస్వామిని పూజించి నీరాజనమీయవలెను. తరువాత భక్తుడు చేతులు జోడించి హర్షముతో –

శ్లో॥ "చరాచరమిదం సర్వం । త్వదేక శరణం విభో !
అనుగ్రహామృతాలోకైః । పావయస్వ జగద్గురో !"

అని స్వామిని ప్రార్థింపవలెను. భక్తులు నృత్యగీతవాద్య కార్యక్రమములను చూచుచు రాత్రి గడపవలెను. ఏ భక్తులు శయనమునుండి లేచిన గదాధరుడగు దేవుని చూచుచున్నారో వారు మోహమయమగు నిద్రను విడిచి శాంతమయిన జ్యోతిని పొందుచున్నారు. వారు మనస్సులో కోరిన కోర్కెలు తీరును. మరియు వారికి సహస్రాశ్వమేధయాగములు చేసిన ఫలము, కపిలగోవులను దానముచేసిన ఫలము, సర్వతీర్థములలో స్నానము చేసినందువలన కల్గు పుణ్యఫలము సమకూడును. చాతుర్మాస్య వ్రతమును ఆచరించి, కార్తీకమాసమున పారణము చేయవలెను.

భక్తుడు నియతాత్ముడై స్వర్ణముతో చేసిన దామోదరుని విగ్రహమును సాలగ్రామశిలయందుంచి, భగవంతుని చక్రమూర్తిని పూజింపవలెను. గృహములో ఒక మూలలో శుభ్రమగు మండపమును ఏర్పరింపవలెను. ఆ గృహమునందలి గోడలకు సున్నము పూసి చిత్రదుకూలములతో స్తంభములను, చామరములతో గృహమును అలంకరించి కాలాగురు ధూపము వేయవలెను.

గృహమధ్య భాగమున రంగులతో స్వస్తికాకారమగు మండలమునుచేసి, దాని తుదను శుభప్రదమయిన కరిదంతముతో చేసిన మంచమునుంచి దానిపైని పట్టుపరుపులు, తలగడలు వేసి, వానిపైని పురుషోత్తముని విగ్రహము ప్రతిష్ఠింపవలెను. కరములందు శంఖచక్రములు ధరించిన చతుర్భుజుడగు విష్ణువు తన వక్షఃస్థలమందున్న పద్మస్థితయగు లక్ష్మీదేవిని వామపాణితో ఆలింగనము చేసికొని దక్షిణపాణితో భక్తులకు వరమొసంగుటకు ప్రసన్నుడై యున్నాడు. అతని నాసిక, లలాటము, నేత్రములు, చెవులు, వక్షఃస్థలము భక్తులకు ఆనందజనకములుగా నున్నవి. దివ్యపీతాంబరధారి, సర్వలావణ్యశోభితుడు, సర్వాలంకార భాసమానుడగు హరికి పద్మకరయగు లక్ష్మి తాంబూలము నొసగుచున్నది. అట్టి లక్ష్మీనారాయణులకు పంచామృతముతో స్నానముచేయించి, వాసయుగ్మముతో అలంకరింపవలెను. యథావిభవ విస్తరములతో ఉపచారములతో హరిని పూజింపవలెను. తామ్రప్రతిమలతోగాని, మృణ్మయములయిన పాత్రలలోగాని ఆవునేతితో దీపములను వెలిగింపవలెను. తైలపూరితములైన నూరు దీపవృక్షములను ప్రజ్వలింపజేయవలెను. బ్రహ్మదేవుని నారదాదులను దేవర్షులను అచట పూజింపవలెను. విష్ణుస్వరూపులైన బ్రాహ్మణులను పూజింపవలెను. దామోదరునకు వస్త్రయుగ్మము నర్పించి, గంధము పూసి, పుష్పమాలలు మెడలో వేసి, పవిత్ర తీర్థజలములతో అభిషేకము చేసి, యథోచితముగ పూజావిధానమును గావించి, భక్ష్యభోజ్య ఫలములను నివేదింపవలెను.

"తద్విష్ణోః" అను మంత్రముతో బ్రహ్మాదులను ఆరాధింపవలెను. భక్తులు వేణువీణాది గీతములతో, పురాణపఠనముతో, జాగరణముతో మహోత్సవమును చేయవలెను. విమలమైన ప్రభాత సమయమున అగ్నికార్యమును ఆచరింపవలెను. అష్టాక్షర మంత్రముతో, సమిదాజ్య చరువులతో, మధుసమ్మిశ్రితములయిన లాజలతో హోమము చేయవలెను. పిమ్మట లక్ష్మీదేవికి శ్రీ సూక్త విధానముతో అష్టోత్తర శత సంఖ్యాకముగ పూజ సల్పవలెను. పిదప బ్రహ్మాదులలో ఒక్కొక్కరికి, తిలలతో అష్టాహుతులతో హోమము చేయవలెను.

బ్రహ్మ, నారదుడు, దక్షుడు, వసిష్ఠుడు, గౌతముడు, సనత్కుమారుడు, అత్రి, భరద్వాజుడు, కశ్యపుడు, దుర్వాసుడు, అగస్త్యుడు, మహాదేవుడు, వైష్ణవులు. వీరు విష్ణుస్వరూపులని ప్రఖ్యాతి గాంచిరి. సంశయింపనక్కరలేదు. ఈ విప్రులను పూజించినచో విష్ణువు ఆక్షణమునందే సంతసించును. హోమాంతమున విప్రులకు భోజనము పెట్టి ఆచార్యునకు దక్షిణ ఈయవలెను. భక్తులు సువర్ణ భూషితమగు ధేనువును, వస్త్రములను, ధాన్యమును, వాసుదేవుని ప్రీతికై దానము చేసి ద్విజశ్రేష్ఠులకు భక్తితో అన్నము పెట్టవలెను.

శ్లో॥ "ఓం దామోదర ! జగన్నాథ ! త్వన్మయం విశ్వమేవహి !
త్వదాధార మిదంసర్వం । త్వంధర్మః సర్వభావనః ॥
త్వత్ప్రసాదాద్వ్రతం చీర్ణం । సుసంపూర్ణం తదస్తుమే ।
దామోదరః ప్రదాతాచ । గృహీతాచవృషధ్వజః ।
ప్రదీయతే జగన్నాథః । ప్రీయతాంమే జగద్గురుః ॥"

అను మంత్రము జపించుచు సర్వోపచారములు చేసిన దామోదరుని విగ్రహమును ఆచార్యునకు సమర్పింపవలెను. ఆ కార్యక్రమమును ముగించి, ఆచార్యుని భక్తితో పూజించి స్తుతించి సంతృప్తి కల్గింపవలెను. ఆచార్యుడు పరితుష్టుడయినచో మాధవుడు తుష్టుడగును. శేషించిన ఆయావస్తువులు విప్రులకొసగవలెను. పిమ్మట ఈ చాతుర్మాస్య వ్రతమును యథావిధిగ పరిసమాప్తి చేసిన నరుడు ఇష్టులతో శిష్టులతో, స్వబంధువులతో కూడ భుజింపవలెను. అట్టి వ్రతముచేసిన జనుడు యథోక్త ఫల సంపన్నుడై విష్ణులోకమున కేగును. చాతుర్మాస్య వ్రతముకంటె ఉత్తమ మయినది శ్రుతిస్మృతి పురాణములలో చెప్పబడలేదు. దీని ననుసరించినంత మాత్రమున నరుడు కృతకృత్యుడగును.

ఆ వ్రతమువలెనే విష్ణువునకు ప్రీతికరమైన వ్రత మింకొకటి లేదు.

ఈ చాతుర్మాస్య వ్రతము ననుష్ఠించినవానికి కల్గు ఫలము, వేయితిల పాత్రలను, పెక్కు గోవులను, నూరు కృష్ణాజినములను, ఉత్తమ కన్యలను దానము చేయుటవలన లభించు ఫలముతో సమానము. మరియు అట్టి పుణ్య వ్రతము ననుష్ఠించిన మానవునకు మూడున్నర కోట్ల తీర్థములలో స్నానము చేసిన ఫలము ప్రాప్తించును. అంతియేకాక ఆ వ్రతికి ఏయేకోరికలున్నను తీరగలవు" అని జైమిని ద్విజులకు తెల్పెను

## 40వ అధ్యాయము

1. జైమిని ద్విజులకు ప్రావరణోత్సవ విధానమును వచించుట :

'ఓ ద్విజులారా! మార్గశీర్ష శుక్లపక్షమున షష్ఠి తిథియందు జరుపబడు ప్రావరణోత్సవమును భక్తితో ఏ నరుడు చూచునో, అతడు వైష్ణవలోకమున నివసించును. ఆ ఉత్సవ విధానమును చెప్పుచున్నాను. వినుడు.

ఆ వ్రతవిధానము తెలిసిన వ్రతి, పంచమి తిథియందు, రాత్రిపూట వాసోధివాసము చేయవలెను. అతడు దేవుని విగ్రహమునకు ముందు మండపమున అష్టదళాన్వితమగు పద్మమును వేయవలెను. వివిధ దిక్కులయందు దిక్పాలురను క్షేత్రపాలుని, గణాధిపుని, చండప్రచండులను, నాల్గు దిక్కుల బయటపూజింపవలెను. భక్తుడు ఆ మండపమధ్యభాగమున గల పాత్రను తీసికొని, వస్త్రజలముతో, ప్రోక్షణచేయవలెను. అతడు 'ద్యుతానస్వేతి' అను మంత్రము నుచ్చరించుచు, దివ్యవస్త్రముతో ఆ పాత్రను ఆచ్ఛాదింపవలెను. ఆ భక్తుడు ఇరువదియొక్క వస్త్రములకు ధూపమువేసి, వైష్ణవమంత్రము నుచ్చరించుచు, ఆ మండపమధ్యమున పెట్టవలెను. అతడు ఆ వస్త్రములపైని ఇంకొక వస్త్రమును కప్పి, దానిని స్పృశించి, పురుషోత్తముని స్మరించుచు –



శ్లో॥ "ఆచ్ఛాదకో యోజగతాం। తేజసా విష్ణురవ్యయః।
వసనాత్తస్యవస్త్రం త్వం। వసవాసే జగత్పతేః॥

అను మంత్రమును జపింపవలెను. ఆ వస్త్రసమూహమునకు 'ఇంద్రఘోషస్వ' అను రక్షను చేయవలెను. భక్తుడు జగన్నాథుని విగ్రహమును గంధపుష్పములతో పూజించి, సర్వలేపనము చేసి, నృత్యగీతములతో, ఆ రాత్రిని గడపవలెను. ఆ జనుడు పిమ్మట అరుణోదయకాలమున ప్రాతఃసంధ్యాకాలమున పూర్వము వలెనే సుసమాహితుడయి, దూదితో, నారతో, తయారుచేసిన ఆ వస్త్ర సమూహము, పూజింపబడి ఆచ్ఛాదింపబడినందున, దానిని బయటకు తీసికొని రావలెను.

ఆ భక్తుడు ఛత్రధ్వజపతాకలతో, చామరాందోళనములతో, గీతవాదిత్ర నృత్యములతో పుష్పములు చల్లుచు, ప్రాసాదముచుట్టు మూడుపర్యాయములుప్రదక్షిణముచేసి, జగన్నాథుని విగ్రహమును ముమ్మారు ప్రదక్షిణము చేయింపవలెను. అతడు ఆచ్ఛాదితమయిన వస్త్ర సమూహమును, తీసికొని, వీక్షణాదులతో సంస్కరింపవలెను. ఆ నియతవ్రతుడగు భక్తుడు ఆ మూడు దేవతావిగ్రహములకు శీతప్రావరణములతో ముఖములు తప్ప, మిగిలిన సర్వాంగములను ఏడేసి వస్త్రములతో అలంకరింపవలయును.

ఆ భక్తుడు జగన్నాథునకు తాంబూలమును కర్పూరలతికమును, సమర్పించి నైవేద్యముపెట్టి దూర్వాక్షతలతో పూజించి, హారతియీయవలెను.

హేమంతము ప్రారంభముకాగానే, ఏ భక్తులు నృసింహస్వామిని మంచి వస్త్రములతో కప్పుదురో, ఆ కప్పుటను చూచుచుందురో, వారికి మోహావేశముండదు. మరియు అట్టి పుణ్యాత్ములకు ఎన్నడును ద్వంద్వ వాతశీతోష్ణ భయము కలుగదు. దేవాధిదేవుడయిన విష్ణువునకే ఈ ప్రావరణోత్సవము. ఆ ఉత్సవమును భక్తితో ఎవ్వరు చూచుదురో, వారికి అన్ని కోరికలు తీరును. భగవంతుని ఉద్దేశించి బ్రాహ్మణులకు గురువులకు ఇతర దేవతలకు దీనానాథులకు సత్కారపూర్వకముగ సంతోషముతో శీతబాధానివృత్తికి మంచివస్త్రములనొసగవలయును. భగవంతుడు ప్రీతుడైవానికి ఉత్తమవరము నిచ్చును" అని జైమిని ద్విజులకు చెప్పెను.

## 41వ అధ్యాయము

1. జైమిని విప్రులకు పుష్యస్నానోత్సవమును గూర్చి చెప్పుట :

"ఓ విప్రులారా! పూర్వము బ్రహ్మతెల్పిన పుష్యస్నానోత్సవమును గూర్చి చెప్పుచున్నాను. వినుడు.

పుష్యమాసములో పుష్యమీ నక్షత్రముతో కూడిన పౌర్ణమాసియందు జగన్నాథునకు పౌష్యస్నానోత్సవమును చేయవలెను. ఈశాన్యదిక్కున ఏకాదశి తిథియందు అంకురార్పణము చేయవలెను. అట్లే జగన్నాథస్వామి దేవాలయమున స్వామి ప్రతిమయందు ఆ కార్యక్రమము ప్రతిదినము చేయవలెను. అచ్చట ప్రతిరాత్రి నృత్యోపహారములు చేయించి బలియీయవలెను. అచట చతుర్దశితిథి యున్న రాత్రియందు ఎనుబదియొక్క సుందర సువర్ణకుంభములను అమర్చవలెను. ఆ కుంభములలో ఇరువదియొక్క కుంభములు ఆవునేతితో పూర్తిగ నింపవలెను.

జగన్నాథుని విగ్రహమున కెదురుగ సర్వతోభద్రమండలమును ఏర్పాటు చేయవలెను. దానిమధ్యభాగమున స్వచ్ఛమయిన, బృహదాధారముగల దర్పణమును పెట్టవలెను. ఆ నాటిరాత్రి గీతనృత్యములతో జాగరణము చేయవలెను. ఆ స్వామికి, బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు ప్రత్యేకముగ వేయిసార్లు పాలాశసమిధలను, చరువును, నేతిని వినియోగించి అగ్నికార్యము చేయవలెను.

పురుషోత్తమునకు అతని మంత్రములతో హోమముచేయవలెను. అద్దములోని స్వామి ప్రతిబింబమునకు ఉపచారములతో పూజింపవలెను. పిమ్మట పురుషసూక్తవిధానముతో కుంభములను అభిమంత్రింపవలెను. ఆ కుంభములందలి అచ్ఛిద్రహవ్యఘృత ధారలతో పురుషోత్తమునకు స్నానము చేయింపవలెను.

పిమ్మట పావమానీయక మంత్రములతో దేవులకు కుంభములందలి ఘృతముతో, శ్రీసూక్తవిధానముతో గాయత్రిని. గంధజలముతో శ్రీ సూక్త విధానముతో వైష్ణవిని అర్చింపవలెను.

జగన్నాథునకు సహస్రధారలతో స్నానముచేయించి నిర్మాల్యమును తీయవలెను. జగన్నాథుని విగ్రహమునకు చందనగంధములను పూయవలెను. ఆయా దేవతావిగ్రహములకు యథాస్థానముగ శోభాయమానములగు వస్త్రాభరణాదులనుపెట్టి సుగంధపుష్పమాలలతో అలంకరింపవలెను.

జగన్నాథునియొక్క చక్రాద్యష్టాయుధములను అతని విగ్రహమునకు ముందుగ పెట్టవలెను. లక్ష్మీసహితుడగు పురుషోత్తమునకు రత్నచ్ఛత్రమునువేసి అన్నికానుకలు అర్పించి పూజింపవలయును. ఆ శుభసమయమున స్నిగ్ధగంభీర నాదములుగల శంఖములను పూరింపవలయును. సుందరాంగులయిన వేశ్యలు చామరాందోళములను ధరింపవలెను. కొందరుయువతులు నృత్యము సల్పుచుండవలయును, మరికొందరు నారీమణులు మంగళగీతములు పాడుచుండవలెను. వందిమాగధులు స్తుతిపాఠములు గానముచేయుచుండవలెను. ద్విజులు జయ శబ్దమును ఉచ్చరించుచు పురుషోత్తముని దూర్వాక్షతలతో ముమ్మారు పూజింప



వలెను. అతినిర్మలములగు స్వర్ణపాత్రలతో ఆవునేతితో దీపములు ప్రజ్వరిల్ల జేయవలయును. అపుడు జగన్నాథునకు కర్పూరయుత వర్తులతో నీరాజనమీయవలెను. మనోహరమగు సువర్ణపాత్రమునందు హృద్యమగు తాంబూలము మెల్ల మెల్లగా నమలుటకు వీలుగా తయారుచేసి పెట్టవలెను.

పిమ్మట ఆచార్యునకు దక్షిణలొసగి బ్రాహ్మణులను పూజింపవలెను. ముదాన్వితులగు భక్తులు పుణ్యోపేతమగు పుష్యస్నానోత్సవమును గాంచినచో, వారి కోరికలు తీరి వైష్ణవపదమును చేరగలరు. రాజ్యభ్రష్టుడు సార్వభౌమాధికారసహితమగు రాజ్యమును పొందగలడు, అపుత్రులు, చనిపోయిన పిల్లలు గలవారు దీర్ఘాయుష్మంతులగు పుత్రులను బడయగలరు. మరియు పుష్యస్నానముచేసినవారికి దారిద్ర్యనాశనమై బ్రహ్మవర్చస్సు, జన్మసాఫల్యము కల్గును" అని జైమిని విప్రులకు తెల్పెను.

## 42వ అధ్యాయము

1. జైమిని ద్విజులకు మకర సంక్రమణ విధిని చెప్పుట :

"ఓ ద్విజులారా! భాస్కరుడు మకర రాశిని సంక్రమించి ఉత్తర దిక్కునకు వెళ్లదలచినపుడు ఉత్తరాయణమనబడుచున్నది. ఆ సంక్రమణమునకు ఇరువది కళలగును. ఆ పుణ్యకాలము పితృదేవద్విజులకు ప్రియమైనది. పురుషోత్తమ క్షేత్రమునందలి పుణ్యతీర్థములో యథావిధిగ స్నానమాచరించి నారాయణుని పూజించి, కల్పవృక్షమునకు నమస్కరించి, జగన్నాథుని ఆలయములోనికివెళ్లి ముమ్మారు ప్రదక్షిణముచేసి, శ్రీపురుషోత్తముని మంత్రపూర్వకముగా పూజించి, బలభద్రుని సుభద్రనుకూడ ఆయామంత్రములతో అర్చింపవలయును. ఉత్తరాయణమున జగన్నాథుని దర్శించిన భక్తునకు పునర్జన్మ రహితమగు ముక్తి కల్గును.

### మకరసంక్రమణ విధానము

భక్తుడు సంక్రాంతికి పూర్వదివసమున నూతనమయిన సుకుట్టితమైన శాలిని ప్రాసాదమున కెదురుగ స్థాపించి దానిపైని వస్త్రమును కప్పవలెను. దానిని దూర్వాసర్షప పుష్పములతో పూజించి 'కృష్ణస్త్వామభిరక్షతు' అని మంత్రింపవలెను. అచట రాత్రి గడచిన పిమ్మట భక్తుడు జగన్నాథుని సన్నిధికి పూజను గురించి ఉత్సవవిగ్రహమును తీసికొనివచ్చి ఏకాగ్రతతో ఉపచారావశిష్టములతో ఆరాధింపవలెను. తరువాత ఆ ఉత్సవవిగ్రహమును నిర్మాల్యవసనమాలలతో అలంకరింపవలెను. ఆ ఉత్సవవిగ్రహమును, సుభద్రాబలభద్ర జగన్నాథుల విగ్రహములను ముమ్మారు త్రిప్పవలెను. ఆ దేవతావిగ్రహములను పల్లకిలో పెట్టి

ప్రాసాదద్వారమునకు తీసికొని వెళ్లవలెను. త్రివిక్రముడు, త్రైలోక్యక్రమణుడు అయిన జగన్నాథుని మూడు క్రమములచేతను, లీలగా, ప్రాసాదములో త్రిప్పవలెను. అట్లు ముమ్మారు చేసి మరల మెల్లగా దీపికాశతముచే వెలుతురు వచ్చిన చోట ఛత్రధ్వజపతాకలను పట్టుకొని నృత్యముచేయుచు, వాద్యగీతములతో జగన్నాథుని స్తుతించుచు, దర్శనము చేయుటకు వచ్చినవారి పాపములు పోయి వారు మహాత్ములగుదురు. ఆ ఉత్సవములో పయనించుచున్న జగన్నాథుని అనుసరించువారు అడుగుతీసి అడుగువేయునపుడు అశ్వమేధయాగ ఫలమును పొందుదురు. స్వామియొక్క ప్రథమ భ్రమణము చూచిన భక్తుడు పంచమహాపాతకముల నుండి విముక్తుడగుచున్నాడు. రెండవ భ్రమణమునుకూడ చూచిన భక్తుడు మలినీకరణములనుండి విముక్తుడగుచున్నాడు. మూడవ భ్రమణమునుకూడ చూచిన భక్తుడు అపాత్రీకరణములచే విముక్తుడగుచున్నాడు. నాల్గవ భ్రమణమును చూచిన భక్తుడు ఉపపాతకములనుండి విముక్తుని పొందుచున్నాడు.

మరల ప్రభాత సమయమున జగన్నాథస్వామికి గంధచందనాదులు పూసి, యథావిధిగ వస్త్రాలంకారమాలలతో అలంకరింపవలెను. భక్తుడు భగవంతునకు యథాశక్తిగ ఉపచారములతో సంతుష్టిపరచి పూజింపవలెను. జగన్నాథునకు నీరాజన మొసగి మూటకట్టిన బియ్యము, బంగారు పాత్రలలో దధిఖండాజ్యములు కొబ్బరిముక్కలు అల్లము వేసి, కలిపి ప్రాసాదముచుట్టు ముమ్మారు త్రిప్పి జగన్నాథుని సమీపమునకు తీసికొనివచ్చి గంధపుష్పాక్షతలతో కూడిన బంగారు పాత్రలను వరుసగా స్వామికి ఎదురుగా అమర్చవలెను.

శ్లో॥ "జీవనం సర్వభూతానాం । జనకస్త్వం జగత్ప్రభో !
త్వన్మయాః శాలయోహ్యేతే । త్వయైవ జనితాః ప్రభో !
లోకానుగ్రహణార్థాయ । గృహీతోచిత విగ్రహ !
తవప్రీత్యై కృతానేతా న్గృహాణ పరమేశ్వర !
త్వయితుష్టే జగత్సర్వమనేన ప్రభవిష్యతి ॥
స్వాహాకార స్వధాకారవషట్కారా దివౌకసాం ।
ఆప్యాయనా భవిష్యంతి । తైరేవాప్యాయితం జగత్ ।
రక్షసర్వం జగన్నాథ ! త్వన్మయం సచరాచరం ॥"

అని జగన్నాథుని ప్రార్థించి శాలిస్తంభములను నివేదింపవలెను. మరియు వరి బియ్యముతో వండిన కర్పూరఖండచూర్ణయుక్తములైన భక్ష్యభోజ్యములను మంచి వాసనవేయుచున్న దధికుంభములను నివేదింపవలెను. జగన్నాథుని సన్నిధిలో గల బ్రాహ్మణులను భక్తితో పూజింపవలెను. వారికి దైవభావముతో శాల్యాదుల నీయవలెను.



పూర్వకల్పములో కశ్యపుడు సృష్టిచేసి భగవత్ప్రీతికొరకు ఈ మహోత్సవమును చేసెను. కశ్యపుడొనర్చిన ఈ మహోత్సవమును చూచువారు అన్ని కోరికలు తీరుటవలన విచారింపరు. అట్టి పుణ్యాత్ములు దేవతలతోకూడ కల్పాంతమువరకు ఉండి మోక్షమును పొందుదురు.

ప్రతిదినము పాకశాల పరిశుభ్రముచేసి అగ్నిసంస్కారముచేసి, వైశ్వదేవము చేయవలెను. జగన్నాథుని భోజనముకొరకు అధానసంస్కృతాగ్నియందు దివ్యరూపిణియగు లక్ష్మీదేవి తిరోహితయై ప్రతిదినము వంటచేయుచుండును.

పరమాత్ముడయిన జగన్నాథునియొక్క పుణ్యతమోత్సవమునందు తులా పురుషదానాదులు చేసినచో, కోటిరెట్లు ఫలితము చేకూరును. భక్తులు ఆ పురుషోత్తమక్షేత్రమున ఉత్తరాయణ పుణ్యకాలమున చేసిన స్నానము, దానము, తపస్సు, హోమము, స్వాధ్యాయము, పితృతర్పణము, అక్షయములగుచున్నవి" అని జైమిని ద్విజులతో అనెను.

## 43వ అధ్యాయము

1. జైమిని విప్రులకు డోలారోహణమునుగూర్చి చెప్పుట :

"ఓ విప్రులారా ! ఫాల్గుణమాసమున ఉత్తమమయిన డోలారోహణమును చేయవలెను. ఆ మాసమున గోవిందుడు లోకానుగ్రహమునకు క్రీడించుచున్నాడు. జగన్నాథుని ఉత్సవవిగ్రహమునుచేయించి గోవిందనామముతో ఆహ్వానింపవలెను. స్వామిప్రాసాదమున కెదురుగ పదునారుస్తంభములతో చతురస్రాకారము నాల్గు ద్వారములుగల మండపముపైని వేదికకూడ ఉండవలయును. ఆ మండపము మాల్యచామరధ్వజశోభితమై చంద్రకాంతితో శోభిల్లవలెను. ఆ మండపమునందలి వేదికపైని శాపర్ణీకాష్ఠనిర్మితమైన భద్రాసనము నిర్మింపవలెను. ఆ ఫాల్గుణ మాసోత్సవమును ఐదుదినములుకాని మూడు దినములుకాని చేయవలెను.

### వహ్న్యుత్సవము

ఫాల్గుణ శుద్ధ చతుర్దశి తిథియందు రాత్రి డోలామండపమునకు ముందు వహ్న్యుత్సవము చేయవలెను. ఈ యాత్రాంగము గోవిందుని అనుగ్రహమువలన జరుగుచున్నది.

ఆచార్యుని నియమించుకొని మథించుటవలన ఉద్భవించిన అగ్నిని సిద్ధము చేసి నేలను పరిశుభ్రముచేసి ఎత్తుగ సమముగనున్న గడ్డికుప్పపైని ఆ అగ్నిని పెట్టవలెను. ఆ అగ్నిని యథావిధిగ పూజించి కూష్మాండవిధితో హోమము చేయ

వలెను. ఆచార్యుడు గోవిందుని పూజించి ఆ విగ్రహమును త్రిప్పవలెను. ఆ యాత్ర ముగియువరకు అగ్నిని రక్షింపవలెను.

చతుర్థశి తిథియందు శుభలక్షణోపేతమయిన గోవిందుని విగ్రహమునకు వస్త్రమును ఆచ్ఛాదనచేసి జగన్నాథునికి అగ్రభాగముననుంచి పురుషోత్తముని పూజింపవలెను. ఉత్సవవిగ్రహమునకు సర్వోపచారములతో పూజచేయవలెను. ఆ స్వామి విగ్రహముపైనుంచిన వస్త్రమును, మాలను తీసి, మంత్రపూర్వకముగ పరంజ్యోతిని ధ్యానించుచు ఉత్సవవిగ్రహముపైని పెట్టవలెను. ఆ విగ్రహమే సాక్షాత్తు పురుషోత్తముడు అగును. ఆ విగ్రహమును స్నానమునకై మండపమునకు రత్నాందోళికలో తీసికొని వెళ్లవలెను.

ఆ ఉత్సవ సమయమున నానాతూర్యధ్వనులు, శంఖధ్వనులు, జయశబ్దములు, స్తోత్రములు శ్రావ్యముగా నుండవలయును. ఆ విగ్రహముపైని పుష్పవృష్టి కురిపింపవలెను. అపుడు ఛత్రచామర ధ్వజపతాకలు దీపపంక్తి కన్నుల పండుగగా నుండవలెను.

గోవిందుని మహోత్సవమునకు, పితామహాది దేవతలు ఋషిగణములతో కూడ వచ్చుచున్నారు. భద్రాసనమందున్న వస్త్రాచ్ఛాదిత విగ్రహమునకే మహాస్నానవిధిపూర్వకముగ ఉపచారములతో పంచామృతములతో స్నానముచేయింపవలెను. స్నానాంతమున గంధజలముతో, శ్రీసూక్త విధానముగ ఆ విగ్రహమునకే అభిషేకము చేయవలెను.

ఆ గోవింద విగ్రహమునకు ప్రోక్షణము చేసి వస్త్రాలంకారమాలలతో అలంకరించి, నీరాజనమిచ్చి, పూజించి, ప్రాసాదము చుట్టు ఏడు పర్యాయములు త్రిప్పి డోలామండపమునకు తీసికొనివెళ్ళవలెను. ఆ విగ్రహమునే పరిభ్రమము చేసిన మార్గమునందు పతాకాతోరణాదులతోకూడ మండపమునకు క్రిందిభాగమున మరల ఏడు పర్యాయములు త్రిప్పవలెను. ఆ విగ్రహమునే మండపముపైని ఏడు సార్లు స్తంభవేదికయందు ఏడు మార్లు త్రిప్పవలెను. యాత్ర ముగిసిన తరువాత ఆ విగ్రహమునే ఇరువదియొక్క పర్యాయములు త్రిప్పవలెను.

భగవంతుని యీ లీలలగూర్చి చతుర్ముఖుడే చెప్పెను. పూర్వము ఈ యాత్రావిధి రాజర్షియగు ఇంద్రద్యుమ్నునిచే చేయబడినది.

ఫలపుష్పములతో వంగినశాఖలతో పరికల్పింపబడి, రమ్యమయిన బృందావన మధ్యభాగమున మత్తభ్రమర నాదముతో, మధురమైన కోకిలా రావముతో, నానాపక్షిగణాకులమై హృద్యమై సుందరాలంకృతమై నానాగురు ధూపపరిమళోపేతమై దిగంత వ్యాప్తకేతకీ గంధవిరాజితమై మల్లికాశోక పున్నాగ చంపకశోభితమై చారుతోరణయుతమై కాననమధ్యస్థల నిర్మితమై, మాల్యవనన



చామరములతో శోభిల్లుచు, అలంకరింపబడిన మండపము ప్రకాశించుచుండగా. ఆ మండపమధ్యభాగమునకు, రత్నఖట్వాందోళికయందు గోవిందుని విగ్రహము పెట్టవలెను.

ఆ గోవిందుడు రత్నకిరీట విరాజితుడు తారహారశోభిత వక్షస్కుడు, అనర్ఘ్యరత్నఘటిత కుండలోద్భాసిత కర్ణయుగభాసమానుడు, ఆతని సర్వావయవములయందు దివ్యాభరణములు శోభాయమానములై ఉండును. ఆ స్వామి వికచాంబుజ మధ్యస్థయైన లక్ష్మీసహితుడై ప్రకాశించును.

ఆ గోవిందుడు శంఖచక్ర గదాపద్మధారి, వనమాలి, సుప్రసన్నుడు, పీన వక్షఃస్థలోజ్జ్వలుడు.

ఆకాశమునుండి బ్రహ్మాదిసురలు తలలువంచి, చేతులు జోడించి, భక్తితో, జయశబ్దములతో గోవిందుని స్తుతింతురు.

గంధర్వాప్సరఃకిన్నర సిద్ధచారణులు మున్నగు దివ్య గాయనీ గాయకులు, గానముతోడను, కొందరు నృత్యగీత వాదిత్రములతోడను, మరికొందరు నేత్రాంబుజ సహస్రములతో గోవిందుని అర్చించుచు, ఆతనిని సంతసింపచేయుదురు. ఇంక కొందరు అన్నిదిక్కులయందు గంధచందన రజస్సును ఆనందముతో జల్లుదురు. ఆ మండపముపై గోవిందుని విగ్రహమును ఉంచి పూజింపవలెను.

ఆ గోవిందుడు వల్లవీ బృందమధ్యస్థుడు. కదంబతరుమూలవాసి, వనాంతరమున హావహాస్య విలాసములతో క్రీడించుచున్నవాడు గోపీగోపకులు మోయుచున్న పల్లకిలో ఆసీనుడు. భక్తులు అట్టి జగన్నాథుని స్మరించుచు, రక్తశుక్ల పీత వర్ణములుగల కర్పూరచూర్ణములు, గంధచూర్ణములు, అన్ని దిక్కులయందు జల్లవలెను, ఆ జగన్నాథుని దివ్యవస్త్రములతో మాలలతో అలంకరించి గంధ ధూపములతో ఆనందింపజేసి, చామరములు వీచి, గానముచేసి, స్తుతించి, అర్చించి, ఊయలలో కూర్చుండబెట్టి ఏడు పర్యాయములు మెల్లమెల్లగా, ఊపవలెను. ఆ శుభసమయమున జగన్నాథుని జూచునట్టి భక్తులకు ముక్తికల్గును. వారు గతములో బ్రహ్మహత్యాది పంచమహాపాతకములు చేసినచో, అవి నశించును. సంశయింపనక్కరలేదు. సర్వపాపహరుడయిన జగన్నాథుని ఈ విధముగ ముమ్మారు ఊయలలో ఉంచి ఊపవలెను.

ఆ జగన్నాథుడు జనుల భక్తికి మెచ్చి అనుగ్రహించి భుక్తిముక్తులొసగుచున్నాడు. అతనిలీలలు సహజముగానుండి, అఘమును, అజ్ఞానమును, హరిం

చును, అతని రెండవ డోలోత్సవమును చూచినచో గోహత్యాది పాతకములు పోవును.

భక్తుడు ఆ భగవంతుని మూడవ ఉత్సవమును గాంచినచో సకలపాప విముక్తుడగును. డోలాయితుడయిన జగన్నాథుని దర్శించినవారు సర్వపాప రహితులగుదురు. మరియు అట్టి పవిత్రోత్సవమును జూచినవారు ఆధ్యాత్మిక ఆధిభౌతిక, ఆధిదైవిక ప్రతిబంధకములనుండి విముక్తులగుదురు.

నృపుడు ఈ డోలాయాత్రను చేయించిన చక్రవర్తియగును. బ్రాహ్మణుడు ఈ ఉత్సవమును చేయించినచో చతుర్వేది, జ్ఞానవంతుడు అగును" అని జైమిని విప్రులకు చెప్పెను.

## 44వ అధ్యాయము

1. జైమిని మునులకు జ్యేష్ఠపంచకవ్రతమును గూర్చి వచించుట :

"ఓ విప్రులారా! జ్యేష్ఠపంచక వ్రతము లేక మూర్తిపంజర వ్రతమును గూర్చి చెప్పుచున్నాను. దీనినే సాంవత్సర వ్రతమనికూడ అందురు. సంవత్సరాది దినమున, ఫాల్గుణమాసమున పౌర్ణమాసియందు ఆద్యంతరహితుడైన విష్ణువునకు పండ్రెండు మూర్తులుండును. అవి విష్ణ్వాది నామములతో ప్రసిద్ధములు. ఆ నామములతో విష్ణువునకు ప్రతిమాసమునందు పూజచేయవలెను. పండ్రెండు మాసములలో ఆ మూర్తులలో ఒకొక్కదానికి ప్రతిదినము పండ్రెండు రకముల పుష్పములతో పూజించి పండ్రెండు రకముల ఫలములను నైవేద్యము చేయవలెను.

అశోకము, మల్లిక, పాటలము, కదంబకము, కరవీరము, జాతిపుష్పము, మాలతి, శతపత్రము. ఉత్పలము, వాసంతి, కుందము, పున్నాగము, అనునవి పండ్రెండు రకముల పువ్వులు. అవి విష్ణువునకు ప్రీతిపాత్రములు. వీనితో హరికి ప్రతిదినము పూజచేయవలెను.

దాడిమ, నారికేళము, ఆమ్రము, పనస, ఖర్జూరము, తృణరాజము, ప్రాచీనామలకము, శ్రీఫలము, నాగరంగము, క్రముకము, కరమంగకము, జాతీఫలము, ఈ పండ్రెండు ఫలములు విష్ణువునకు ఇష్టమయినవి. హరికి ప్రతిదినము ఈ



ఫలములు, మధురములైన భక్ష్యభోజ్యచోష్యలేహ్యములు నివేదన చేయవలెను. జగద్గురువగు హరికి ఆ సనాద్యుపచారములుచేసి, ఇట్లు స్తుతింపవలెను.

### కేశవాది ద్వాదశనామస్తుతి

శ్లో॥ "సర్వవ్యాపి న్జగన్నాథ! భూతభవ్యభవత్ప్రభో!।
త్రాహిమాం పుండరీకాక్ష! విష్ణో! సంసారసాగరాత్ ॥
ఏకార్ణవజలేరౌద్రే। నిరాలంబే పురామధుం।
అవధీర్విశ్వరక్షార్థం. మధుసూదన! రక్షమాం।
త్రీన్విక్రమాన్క్రమిత్వాయో! హత్వాదైత్యబలంమహత్।
త్రైలోక్యంపాలయామాస। త్రివిక్రమ! నమోఽస్తుతే॥
కృత్వావామనకం రూపమృగ్యజుఃసామగర్భకం।
మోహయిత్వాదుత్భం రూపం। తస్మైమాయావినేనమః॥
యఃశ్రియంధారయేన్నిత్యం। హృదిభక్తేభ్యఏవచ।
దదాత్యపిశ్రియంతస్మై। శ్రీధరాయనమోఽస్తుతే॥
ఇంద్రియాణామధిష్ఠాతా। యఃసర్వేషాం సదాప్రభుః।
సుఖైకహేతుర్భక్తానాం। హృషీకేశ! నమోఽస్తుతే॥
యన్నాభిపద్మసంభూతం। జగదేతచ్చరాచరం।
విధాతురాసనంనిత్యం। పద్మనాభ! నమోఽస్తుతే॥
యస్యైతత్త్రిగుణైర్బద్ధం। జగదేతచ్చరాచరమ్।
దామ్నాబద్ధః స గోప్యాతు। దామోదర! నమోఽస్తుతే॥
త్రైలోక్యవిప్లవకరం। హతవాన్కేశిదానవం।
ఈశితా సర్వసౌఖ్యానాం। త్రాహి కేశవ! మాం ప్రభో! ॥
స్రష్టా ససర్జ భూతాని। జగతామాదికారణం।
అచింత్యమహిమన్విష్ణో! నారాయణ! నమోఽస్తుతే॥
మాయయాయస్యవిశ్వంవై। మోహితం యదనాద్యయా।
సర్వధర్మస్వరూపాయ। మాధవాయ నమోనమః॥
జ్ఞానినాం జ్ఞానగమ్యస్త్వ। మగతీనాంగతిప్రదః।
సంపూర్ణమస్తు గోవింద। త్వత్ప్రసాదాద్వ్రతం మమ॥

భక్తుడు ప్రతిమాసము పూజానంతరము ముకుళితహస్తుడై, పరమభక్తితో, జనార్దనుని సేవించి ఒక సంవత్సరము మూర్తిపంజరవ్రతమాచరించి సంపూర్ణఫల సిద్ధికి, ప్రతిష్ఠావిధినికూడ చేయవలెను.

భక్తుడు యథాశక్తిగా సువర్ణముతో విష్ణువుయొక్క ద్వాదశమూర్తులను చేయించి, ద్వాదశకుంభములలో పెట్టవలెను. ఆ కుంభములలో గంధపల్లవ జలముపోసి వానిని వేరు వేరుగా, అమ్ర పాత్రములలో ఆచ్ఛాదించి, వానిపైని శ్వేతవస్త్రములుకప్పి, ఆ కుంభములను సర్వతోభద్రమండలమునందు అష్ట దిక్కులలో ప్రతిష్ఠించి కుంభములలోని మూర్తులకు పూజచేయవలెను. మొట్ట మొదట ఆ మూర్తులకు పంచామృతములతో స్నానము ద్వాదశాక్షరమంత్రముతో ఉపచారములుచేసి గీత వాదిత్రనృత్యాదులు సల్పి, బ్రాహ్మణులను పూజించి పంద్రెండు వస్త్రయుగ్మములు, ఛత్రపాదుకాయుగళములు, అర్పింపవలెను. ఇట్లు ప్రాతఃకాలమున వహ్నికర్మచేయించి, ప్రతిమూర్తికి సమిదాజ్యచరువులతో మూడువందల పర్యాయములు, తిలలతో అష్టోత్తర సహస్రము, వ్యాహృతులతో హోమముచేసి, ఆచార్యునకు భోజనానంతరము దక్షిణ ఈయవలెను. పిమ్మట నూటయిరువది నల్గురు బ్రాహ్మణులకు భోజనముపెట్టవలయును.

కుంభములతో, చామరాదులతో, ఉపచారపరికరములతోకూడ ఆ స్వర్ణ దేవతామూర్తులను ఆచార్యునకు అర్పింపవలయును. భక్తుడు ఈ ఉత్తమ వ్రతము నాచరింపవలెను. సర్వకాలములందు గుండిచాద్యాత్రలు పంద్రెండు విష్ణువునకు పరమప్రీతికరములు. వానిని చూచినందువలన కల్గు పుణ్యము ఈ వ్రతమువలన లభించును.

ఏ భక్తుడు ఈ వ్రతము నాచరించుచున్నాడో వానికి ఇంద్రపదవి, సార్వ భౌమత్వము, చక్రవర్తిత్వము, అష్టైశ్వర్యములు, దేవదేవుడగు విష్ణుమూర్తి కరుణచే ప్రాప్తింపగలవు. పూర్వము నారదమహర్షి ఈ పుణ్యతమవ్రతమును పంద్రెండు వత్సరములాచరించి జీవన్ముక్తుడయ్యెను. ఇతరవైష్ణవులనేకులు ఈ వ్రతమును పూర్వము చేసిరి. దీనిని మించిన భగవత్ప్రీతికరమగు వ్రతమింకొకటి లేదు. ధర్మబద్ధమయిన యీ వ్రతము నాచరించినవారికి యశస్సు, ఆయుర్దాయము, బ్రహ్మజ్ఞానము, వంశవృద్ధికల్గును. జితేంద్రియులయిన మునులు కూడ ఈ ఉత్తమ వ్రతము నాచరింతురు.



## 45వ అధ్యాయము

1. జైమిని మునులకు వాసంతిక అని పిలువబడుచున్న దమనభంజికమను యాత్రను గూర్చి చెప్పుట :

"ఓ మునులారా ! నేను చెప్పనారంభించిన పంద్రెండు యాత్రలలో శేషించిన రెండు యాత్రలను గూర్చి చెప్పుచున్నాను. వినుడు.

భక్తులు వాసంతిక యాత్రను చేసినను, చూచినను పురుషోత్తముడు సంత సించును. మున్ను దమనకాహ్వయమగు తృణమును గూర్చి చెప్పితిని. చైత్ర శుక్లత్రయోదశి తిథియందు ఆ తృణమును సమూలకముగ తీయవలెను. దాని మధ్యభాగమున శుభప్రదమయిన పద్మసంజ్ఞగల మండలమును చేయవలెను. ఆ మండలమధ్యభాగమున శ్రీ సత్యభామాసహితుడైయున్న విష్ణువుయొక్క ఉత్సవ విగ్రహమును పెట్టి దానికి యథావిధిగ పూజ అర్ధరాత్రియందు చేయవలెను.

పూర్వము హరి దమనాసురుని అర్ధరాత్రివేళ చంపెను. గోవిందుడు ఆ రాక్షసుని చంపి పరమప్రీతితో వాని అంగమునుండి పుట్టిన తృణమును పొందెను.

భక్తుడు ఆ త్రయోదశితిథియందు తృణమును దైత్యునిగా భావించుచు చేతులు జోడించి

శ్లో॥ "అవధీర్దమనందైత్యం ! పురాత్రైలోక్యకంటకం !
సఏవేత్థంపరిణతః । పురతస్తవతిష్ఠతి ॥
అస్యోత్పత్తౌతదాప్రీతిరాసీద్యా తవ మాధవ !
అధునాపి తథైవాస్యాం । ప్రీతిర్దమనభంజనే ॥"

అని పలికి, భక్తుడు తృణమును విష్ణువు యొక్క ఒకచేతిలో ఉంచవలెను. శేషించిన రాత్రిని నృత్యగీతాదులతో గడపవలెను. పిమ్మట సూర్యోదయము కాగానే తృణపురస్సరుడయిన విష్ణువును జగన్నాథుని సమీపమునకు తీసికొని పోవలెను.

తరువాత పూర్వ విధిప్రకారము జగన్నాథుని ఉపచారములతో పూజింప వలెను.

శ్లో॥ "హిరణ్యకశిపుంహత్వా । హ్యంత్రమాలాంతదంగజామ్ ।
కృత్వాకంఠేయథాఃప్రీణాస్తథేదమ్ దమనం తృణమ్ ।
తవ ప్రీత్యైతు భగవన్మయా దత్తం తవాంగకే ॥"

అని ఉచ్చరించి, హరిశిరస్సుపై శుభప్రదమయిన గంధతృణమును పెట్టవలెను. అపుడు ప్రీతికరమయిన హరిముఖాంబుజమును గాంచిన భక్తుడు భవదుఃఖ పరిక్షీణుడై అనుత్తమమగు సుఖమును పొందుచున్నాడు. భక్తుడు విష్ణుశిరము నందున్న ఆ తృణమును తీసికొని తన శిరస్సుపైనుంచుకొనినచో, సర్వపాప వినిర్ముక్తుడై వైకుంఠపురమున శాశ్వతముగనుండగలడు" అని జైమిని మునులకు తెల్పెను.

## 46వ అధ్యాయము

1. జైమిని మునులకు అక్షయయాత్రను గూర్చి తెల్పుట :

"ఓ మునులారా ! వాసనాబద్ధచేతస్కులైన మూఢులకు కూడ అక్షయ ప్రదమగు యాత్రను గూర్చి చెప్పుచున్నాను. వినుడు.

వైశాఖ మాసమున శుక్లపక్షము విదియ తిథియందు అర్ధరాత్రమున వేదికతో కూడిన చతుష్కోణాకారమయిన మండపమును ప్రతిసీరా సమముగ నిర్మింపవలెను. దానికి సున్నముపూసి ధౌతవస్త్రమును అచ్ఛాదింపవలెను. దానికి మెట్లు కట్ట వలయును. అది వెన్నెలతో ప్రకాశించుచుండవలెను. ఆ మండపమధ్యభాగమున సుందరమయిన భద్రాసనమును అమర్చవలెను. దానిపై పట్టుదుప్పటి పరుచ వలెను. దానిపై స్వర్ణపాత్రను పెట్టవలెను. దానికి పశ్చిమదిశలో శుచియగు ఆసనము పై బ్రాహ్మణుడు కూర్చుండవలెను. మరియొకపాత్ర యందు ఇరువదియైదుగిన్నెల చందనమును, సువాసనగల కుంకుమము, పాటల పుష్పజలముతో పరిశుద్ధ మయిన అగురుస్నేహము రెండు పలములు ఒకపాత్రలో కలిపి, పూర్వపాత్రలో పోయవలెను. ఆ పాత్రను మొగలిరేకులతో కప్పి, చీనవస్త్రమును చుట్టవలెను. ఆ పాత్రను గరుడముద్రతో "గంధస్తేసోమ" అను మంత్రముతో ప్రోక్షింపవలెను.

ఇట్లు మండపమునందు వస్త్రాచ్ఛాదితమైన పాత్రను పెట్టవలెను. దానిని అరుణోదయకాలమున జగన్నాథుని సన్నిధికి తీసికొనివెళ్లవలెను. ఆ పాత్రను శంఖచామరచ్ఛత్రాదులతో దేవాలయమున త్రిప్పి, జగన్నాథుని సమక్షమున ఉంచి, పురుషోత్తముని పూజింపవలెను. ఆ పాత్రపై కప్పిన వస్త్రమును తీసి దానిపై జగన్నాథుని దివ్యదృష్టి ప్రసరించునట్లు చేయవలెను. పవిత్రమైనమంత్ర ముతో ఆ పాత్రను ప్రోక్షణచేసి, తాడనముచేసి, సమముగా చేయవలెను.



జగన్నాథుని గంధపుష్పాక్షతలతో పూజించి ఆ స్వామిసర్వావయవములందు, మెల్లగా మెత్తగా, శ్రీసూక్తవిధానముతో పాత్రలోని సుగంధ ద్రవ్యములతో కూడిన లేపనమును పూయవలెను. అపుడు వైష్ణవులు పురుషోత్తముని జయ శబ్దములుచ్చరించుచు, హరిని నుతింపవలెను. ఆ భగవంతుని వివిధసూక్తులతో, ఉపనిషద్వాక్యములతో స్తుతింపవలెను.

జగన్నాథునకు వేణువీణాదిధ్వనులతో నృత్యగీతవాద్యములతో ఛత్రచామర వ్యజనోపచారములతో సంతోషము కల్గించి కానుకలర్పించి, తదియ తిథియందు ఉదయముననే సుగంధద్రవ్యములు పూయవలెను. జగన్నాథుని స్మరించి నంతమాత్రముననే జనులతాపములు నశించును. ఆ పుణ్యకాలమున చూచినవారి తాపములను స్వామి హరించును. జగన్నాథుని మహిమలు ఇట్టివి, అట్టివి అని ఊహింపశక్యముకానివి.

పిమ్మట జగన్నాథునకు సూక్ష్మవస్త్రములు, పుష్పమాలలు భక్ష్యభోజ్యాది పానకములు హృద్యములగు నానావిధ ద్రవ్యములు శుభప్రదములయిన గవ్యములు తాంబూలము అర్పించి, జగన్నాథస్వామిని పూజింపవలెను. ఆ శుభసమయమున కృష్ణుని ఏజనులు భక్తితో చూచెదరో, వారికెన్నడును పునర్జన్మము కలుగదు. వారు విష్ణుస్వరూపమును పొంది విష్ణులోకమున నివసింతురు.

ఓ విప్రులారా ! పూర్వము కలియుగమున దక్షుడను ప్రజాపతి, ఆధ్యాత్మి కాది సంతాపములతో అతి దీనులయిన మానవులను గాంచి, అటకువెళ్లి కృపా యుక్తుడయి, మహిమనుచూపెను. నేను చెప్పినట్లే యథావిధిగ చైత్రమాసమున శుక్లపక్షతృతీయతిథియందు జగన్నాథుని విగ్రహమునకు చందనము పూసి ఇట్లు స్తుతించెను.

2. దక్షప్రజాపతి జగన్నాథుని స్తుతించుట :

శ్లో ॥ "దేవదేవ ! జగన్నాథ ! సహజానందనిర్మల !
సంసారార్ణవసమ్మగ్నాంస్త్రాహి నః పరమేశ్వర ! ॥
నానావిధైశ్చ సంతాపైః । సంతప్తాన్మానవానిమాన్ ।
మమానుకోశబుద్ధ్యావై । శుభదృష్ట్యాఽమృతేనచ ॥
సంతర్పయ తృణాంచ్ఛపాకాన్క్షణమేఽఘ నమోఽస్తుతే !
కలికల్మషసమ్మూఢా । నుద్ధర్తుంజగతాంపతే ।
అవతారోఽయమేతస్మి । న్నీలాచల గుహాంతరే ।

చిరకాల ప్రరూఢానాం। దుస్త్యజానాంమహాంహసామ్।
రాశిందగ్ధుంత్వమేవేశో। దీనానాథ! కృపాకర!
త్వద్దర్శనమహాయోగే। యమాద్యష్టాంగవర్జితే।
యేషాంమతిఃసముత్పన్నా చతుర్వర్గైకసాధనే॥
నతేశోచంతి దుష్పారే। భవారణ్యేమహాభయే।
కర్మానపేక్షం దేవేశ! నాత్మజ్ఞానం విమోచకమ్।
ఇదంతే దర్శనంనాథ! వినా కర్మాపి మోచయేత్॥
జయకృష్ణ! జయేశాన! జయాక్షర! జయావ్యయ!
ప్రసీదానుగృహాణేమాన్దీనాన్మూఢాన్విచేతనః॥"

అని, ఇట్లుస్తుతించి, ఈశ! రక్షింపుము, అని ముమ్మారు పల్కి, జగన్నాథుని పాదపద్మములపై పడెను.

3. జగన్నాథస్వామి దక్షప్రజాపతితో పలుకుట :

"ఓ వత్సా! నీకుదుర్లభములైన రెండు వరములిచ్చితిని. నాయనుగ్రహముచే నీవుకోరినది జరుగును. అల్పపుణ్యము చేసిన వారికి, నాయనుగ్రహము దుర్లభము. నీకీవిషయము తెలియును. నీవు నాయంగ జాతుడవు. నన్ను నీవు ప్రార్థించితివి. నాయుత్సవమును సల్పినచో నీకు సంతోషమును చేకూర్తును. ఈ అక్షయయాత్రను ఎవరు భక్తితో చూచెదరో వారు ఆ సమయమున కోరినది జరుగును.

ఓ దక్షా! చందనము పూయుట ఎట్లు సంతాపహరణమో, అట్లే ఈ అక్షయయాత్రోత్సవము సంతాపత్రయనాశనము నాచే ప్రేరేపింపబడినందున నీవు ఈ ఉత్సవమును చేయుదువు. నీవు తలంచిన ప్రకారము నిశ్చయముగా, దీనజనోద్ధరణము జరుగుటచే నేను సంకల్పించితిని.

ఓ ప్రజాపతీ! నీవు కోరిన దంతయు ఈయగలను. గుండిచాది మహాయాత్రలు పండ్రెండును పావనములైనవే. ఒక్కొక్కయాత్ర ముక్తి నొసగును. అన్నియాత్రలు ధర్మకామార్థములనిచ్చునవే. ఆ యాత్రలలో ఏయొక్క దానిని భక్తితో చూచినను అతడు భవాబ్ధినిదాటి విష్ణుపదమును చేరును, అనిచెప్పి జగన్నాథుడు అంతర్ధానమయ్యెను" అని జైమిని మునులకు తెల్పెను.



దక్షప్రజాపతి జగన్నాథుని యాజ్ఞానుసారముగ, నీలాచలమున సంవత్సర కాలముండి మహోత్సవములను గాంచెను. అతడు కౌశికుని ఉత్తమకులమందు సర్వజ్ఞుడు బ్రహ్మణ్యుడై ఉత్సవములయందు లోకములను, యథావిధిగ ప్రవర్తింపచేసెను. ఇట్టి యాత్రోత్సవములు చూచుటవలన విశ్వాసరహితులకు విశ్వాసముకల్గును. ఈ జగన్నాథుడు సాక్షాత్తుపరబ్రహ్మస్వరూపుడు. లోకానుగ్రహమునకే, విష్ణువిట్లవతరించియున్నాడు. ఏ భక్తుడు ఏ విధముగా జగన్నాథుని దర్శించినను, స్వామి వానికి ముక్తినిచ్చుట నిశ్చయము. స్త్రీలకు కూడ జగన్నాథుడు మనోభీష్టములను నెరవేర్చును.

మధుసూదనుడు సత్యప్రతిజ్ఞుడై పురుషోత్తమ క్షేత్రమున ఉన్నాడు. స్వామి తన్ను దర్శించినవానిని భవసాగరసంభవమైన శోకము నుండి తరింపజేయుచున్నాడు. వ్రతములు చేసినందు వలనను, తపోదానములు చేసినందువలనను, క్రతువులొనర్చుటవలనను, అష్టాంగ యోగములు, సాంఖ్యయోగమునభ్యసించుటవలనను ఏయే ఫలితములు సమకూడునో, శ్రీపురుషోత్తమ క్షేత్రమునందలి పుణ్యతీర్థములో స్నానమాచరించి, దారుమయబ్రహ్మస్వరూపుడగు జగన్నాథుని దర్శించి, స్తుతించి, పూజించినను, భక్తులకు అట్టిఫలితములే చేకూరును.

## 47వ అధ్యాయము

1. మునులు జైమినిని జగన్నాథుని విభూతిని గూర్చి చెప్పుమనుట :

"ఓ జైమిని మునీంద్రా! నీవు భగవంతుడవు. సర్వశాస్త్రజ్ఞుడవు. పరమాద్భుతము, పాపహరము, యాత్రారూపమయిన పురుషోత్తముని మాహాత్మ్యమును తెల్పితివి. జగన్నాథుడు భక్తుల పూజలకు సంతసించి వారి యభీష్టములు నెరవేర్చును. 'స్వామి భూత్యుపాసనచే భూతిప్రదుడు' అను విషయమును మాకు విశదీకరింపుము" అని మునులు జైమినిని అడిగిరి.

2. జైమిని జగన్నాథుని మహిమలను మునులకు తెల్పుట :

"ఓ మునులారా! ఈ జగమునందు విష్ణువుయొక్క విభూతులన్నియు చరాచరములు. విభూతి, భూతిప్రదుడుకూడ ఆ పరమేశ్వరుడొక్కడే. నరుడు భగవంతునియెడల యెట్టి భావముతో ప్రవర్తించుచున్నాడో, అతనికి తదనుగుణమయిన జన్మమునే భగవంతుడు ప్రసాదించుచున్నాడు. ఇవ్విధమయిన

భగవంతుని మహిమ మార్చుట శక్యముకాదు. ఏ భక్తుడు భగవంతుని ఏ విధముగా ఉపాసించుచున్నాడో, అతడు అట్టి ఫలితమునే పొందుచున్నాడు. ధర్మాది చతుర్విధపురుషార్థములు నాల్గింటికి దారుదేహధారియగు ఆ జగన్నాథుడే ఏకైకమార్గము.

## ధర్మస్వరూపము

ధర్మము యొక్క మార్గము గహనమైనది. బహుశాసనములచే సంకీర్ణమైనది. ధర్మముయొక్క తత్త్వమును నిశ్చయించుటకు ఎవ్వడును సమర్థుడుకాడు. అర్థకామములు రెండును ధర్మమూలములని స్థూలముగా చెప్పవచ్చును. జనులు వానిని ఆచరించునట్లు భగవంతుడు చేయుచున్నాడు. భగవంతుడగు విష్ణువే ధర్మము. ఈ జగత్తంతయు, ధర్మమూలము, ధర్మమునకు లోకమునకు ప్రభువు జనార్దనుడే. పురుషార్థమయుడగు భగవంతునియందు భక్తికలవారు సర్వదా ఆనందముతో వర్ధిల్లుదురు.

భక్తులు విష్ణువును వివిధములగు కోర్కెలతో ఉపాసించుచున్నందున ఆ భగవంతుడు విభిన్నదేహములనుదాల్చి, విభిన్ననామములతో స్తుతింపబడి ఆయా భక్తుల మనోభీష్టములను నెరవేర్చుచున్నాడు.

ఆదివిష్ణువు భక్తులకు శక్రస్వరూపుడై త్రైలోక్యైశ్వర్యములను, బ్రహ్మస్వరూపుడై వంశవృద్ధిని, సనత్కుమారుడై దీర్ఘాయువును, పృథురూపుడై సంపదలను, వాచస్పతియై గంగాది తీర్థఫలములు, భాస్కరుడై అంతస్తమోనాశనమును, అమృతాంశుడై అతుల సౌభాగ్యమును, వాక్పతియై అష్టాదశ విద్యాతత్త్వజ్ఞానమును, యజ్ఞేశ్వరస్వరూపుడై అశ్వమేధాది యజ్ఞఫలమును, కుబేరస్వరూపుడై సర్వసంపదలనిచ్చుచున్నాడు. దయాసాగరుడగు విష్ణువు ఆ నీలాచలముపై నివసించుచు, దీనానాథులను అనుగ్రహించుటకు దారుమయ దేహమును దాల్చియున్నాడు.

ఓ మునులారా! మీరు ఆ పురుషోత్తమ క్షేత్రమునకేగి, సుసమాహితులై, అచట నివసింపుడు. శ్రీశుని పాదాబ్జయుగళమును ఆశ్రయింపుడు. మీరు శాశ్వతములయిన ఐహికాముష్మిక భోగములను వాంఛింపుడు. మీ జీవితాంతమున ముక్తిని పొందుడు" అని జైమిని విప్రులకు చెప్పెను.



# 48వ అధ్యాయము

1. మునులు ఇంద్రద్యుమ్నుని గూర్చి తెల్పుమని జైమినిని కోరుట :

"ఓ జైమిని మునీంద్రా! జగన్నాథుడు ఇంద్రద్యుమ్నమహీపతికి ప్రాసాద ప్రతిష్ఠానంతరమిచ్చిన వరములను గూర్చి జగన్నాథుని ద్వాదశ యాత్రలను గురించి చెప్పియుంటివి. పిమ్మట మహాబుద్ధిమంతుడు, విష్ణుభక్తుడు అవస్థితుడయిన ఆ మహీపతి ఏమిచేసెనో దయతో విన్నవింపుము.

2. జైమిని మునులకు సమాధానము చెప్పుట :

"ఓ మునులారా! ఆ ఇంద్రద్యుమ్ననృపతి సాక్షాత్తు బ్రహ్మస్వరూపుడయిన జగన్నాథునివలన వరములు పొందిన తరువాత, తాను కృతకృత్యుడయినట్లు భావించెను.

ఇంద్రద్యుమ్నుడు జగన్నాథుని ఆజ్ఞానుసారముగ పుణ్యమోక్షప్రదములయిన పండ్రెండు యాత్రలు చేయించి, జగన్నాథుని వివిధోపచారములతో బహుధా అర్చించి, స్వామి ఆజ్ఞాపించిన దానినే గాలరాజునకు యథావిధిగ తెల్పి, ధర్మన్యాయసమన్వితముగ మధురవాక్కులతో ఇంద్రద్యుమ్నుడు ఇట్లు పలికెను" అని జైమిని మునులతో పల్కెను.

3. ఇంద్రద్యుమ్ననృపతి గాలరాజుతో పల్కుట :

"ఓ గాలరాజా! నీవు బహుశాస్త్రాదుల నభ్యసించి, ధర్మనిష్ఠను పొందితివి. భగవంతునియందు నీకు మనోవాక్కాయకర్మములచే దృఢమైన భక్తికలదు. భగవంతుడు ఈ చరాచర జగత్తునకు గురువు. ఈ విశ్వమంతయు అతని యిష్టానుసారము వృద్ధిక్షయములు పొందుచుండును. జగదీశ్వరుడు నన్ననుగ్రహించునట్టి లక్ష్యముతో జగన్నాథస్వామి రూపముతో, పురుషోత్తమ క్షేత్రమున అవతరించియున్నాడు. స్వామి దీనజనులనుద్ధరించుటకు చిరకాలమునుండి ఇట వెలసియున్నాడు. నీవు భక్తిశ్రద్ధా సమన్వితుడవై జగన్నాథుని యాజ్ఞను పాటింపుము.

ఓ భూపాలా! ఈ భగవంతుడు కేవలము ప్రతిమాస్వరూపుడే అని భావింపకుము. త్రిలోకవాసులగు బ్రహ్మాదిసురనర గంధర్వాదులు జగన్నాథుని

ప్రాసాదప్రవేశమును గాంచుటకు పురుషోత్తమక్షేత్రమునకు వచ్చుట నీవు ప్రత్యక్షముగా జూచితివి. విశ్వమూర్తి అయిన జగన్నాథుని చూచిన మనమందరము పరవశులమైతిమి.

జగన్నాథుడు సాక్షాత్తు చరాచరమయుడయినను లోకానుగ్రహమునకు దారుస్వరూపమును దాల్చెను. ఈ స్వామి భక్తుల కోర్కెలు తీర్చుటకు దివినుండి భువికి వచ్చిన కల్పవృక్షమని తెలిసికొనుము.

ఏయే భక్తులు ఏయే కోరికలతో ఈ పురుషోత్తముని ఉపాసింతురో ఆ ఫలితమును పొందుదురు. యతీశ్వరులు ఈ భగవంతుని నిజతత్త్వమును తెలిసికొనుటకు ఎన్ని విధములుగా యత్నించినను జ్యోతిస్స్వరూపుడగు జగన్నాథుని తెలిసికొనలేకపోవుచున్నారు.

పరిశుద్ధాత్ములు, ధర్మనిష్ఠులు, అనన్య భక్తియుక్తులు, ఊర్ధ్వరేతస్కులు, అయిన యతులకు, యోగులకు జగన్నాథుడే పరమపదము నొసగును.

గ్రీష్మకాలములో లోతైన శీతల జలాశయములో మునిగినవాని తాపము పోయినట్లు కరుణాసాగరుడైన పురుషోత్తముని దర్శించినవానికి అదేవిధముగ త్రితాపదుఃఖము పోవును.

జగన్నాథుడు శరణాగతదీనులకు ఉపకృతి చేయునట్లు వారి తలిదండ్రులు, దారాసుతమిత్రులు ఉపకారము చేయలేరు. అందువలన భక్తిముక్తిప్రదుడయిన యీ జగన్నాథుని సేవింపుడు. సామాన్యప్రజలతోకూడ మీరు సంపూర్ణయాత్రలు చేయుట శ్రేయస్కరము.

ఓ నృపోత్తమా! పూర్వము నృపులకు సాధారణమయిన ధర్మమార్గము నిర్దేశింపబడినది.

ఓ గాలరాజేంద్రా! మహోపచారములతో నృసింహుని సేవింపుము. నీవు త్రిసంధ్యలయందు స్వామిని పూజించి శ్రేష్ఠమయిన నిర్వాణమును పొందుము" అని ఇంద్రద్యుమ్నుడు గాలరాజుతో పల్కెను' అని జైమిని మునులతో అనెను.

4. జైమిని మునులతో జగన్నాథ క్షేత్ర మాహాత్మ్యమును వినుటవలన కల్గు ఫలమును చెప్పుట :

"ఓ మునులారా! నృపసత్తముడగు శ్వేతుడు కృతాంజలిపుటుడై గుణాన్వితమగు మాలవలెనే ఆ దైవవాక్కును గ్రహించెను.



ఇంద్రద్యుమ్నుడు పురుషోత్తముని సేవించి నారదునితోకూడ బ్రహ్మలోకమున కేగెను. మీకు పుణ్యప్రదమయిన ఈ పురుషోత్తమ క్షేత్ర మాహాత్మ్యమును చెప్పితిని. ఆ పురుషోత్తమ క్షేత్రమున నిత్యము నివసించిన దారురూపుడయిన బ్రహ్మస్వరూపుని మాహాత్మ్యమును ఏ భక్తుడు వినునో, ఆతడు అశ్వమేధయాగ ఫలమును పొందగలడు. కుమారస్వామి చెప్పిన అర్ధోదయ యోగమువలన కల్గు ఫలముకంటె విష్ణుమాహాత్మ్య కీర్తనమువలన కోటి గుణితమగు పుణ్యము లభించును. ప్రాతఃకాలమునందు ఈ జగన్నాథ క్షేత్ర మాహాత్మ్యమును వినువానికి నూరు కపిలగోవులను దానముచేసిన పుణ్యము కల్గును. మరియు గంగాపుష్కరజలముతో స్నానముచేసిన పుణ్యము లభించును. ఈ రహస్య విషయములు పురాణములందున్నవి. వీనిని వినిన భక్తులకు యశస్సు, ఆయుర్దాయము, పుణ్యము, సంతానవృద్ధి, మోక్షము, సర్వపాప నాశనము కల్గును" అని జైమిని మునులకు తెల్పెను.

## 49వ అధ్యాయము

1 జైమిని మునులకు పురాణశ్రవణ ఫలమును తెల్పుట :

"ఓ మునులారా! పురాణ పఠనముచేయు విప్రుడు శాంతస్వభావుడు. సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞుడు, వర్చస్వి అయి యుండవలెను. భక్తులు పౌరాణికుని సగౌరవముగ ఆహ్వానించి, పురాణపఠనము నిర్విఘ్నముగా జరుగునట్లు శ్రద్ధాభక్తి సమన్వితులు కావలయును.

పౌరాణికుడు విష్ణుస్వరూపుడని పురాణగ్రంథము విష్ణుస్వరూపమని శ్రోతలు ఆస్తిక్యబుద్ధితో భావింపవలయును. పౌరాణికుడు పురాణపఠనారంభమున వ్యాస మహర్షికి సకలోపచారములతో పూజచేయవలయును. భక్తులు పౌరాణికుని ప్రతి దినము ఉత్తమాసనముపై కూర్చుండబెట్టవలయును.

ప్రతిదినము శ్రోతలు పరిశుద్ధమయిన సమమయిన స్థలమున కూర్చుండి పురాణమును శ్రద్ధతో వినవలయును. వారు పురాణశ్రవణ సమమయిన దురాలోచనలు లేకుండ, వ్యర్థప్రసంగములు చేయకుండ, ఆస్తిక్యభావముతో నుండవలయును.

పురాణపఠనముచేయు పండితుడు శుచియై శుక్లవస్త్రధారియై, ఫాలభాగమున బొట్టుపెట్టుకొని, విష్ణుధ్యానము చేసి శ్రోతలకు, ఆతనిపై భగవంతునిపై విశ్వాసము కల్గింపవలయును.

శ్రోతలు ప్రతిదినము పురాణశ్రవణానంతరము “జయకృష్ణ! జగన్నాథ! హర!”—ఇత్యాదినామములతో భగవంతుని స్తుతింపవలెను.

శ్రోతలు, ఆస్తికులు, దైవభక్తులు పురాణపఠనము పరిసమాప్తికాగానే పురాణము చదివిన విప్రునకు వస్త్రదక్షిణాదు లీయవలెను.

పూర్వము పురాణపఠనము గావించిన విప్రునకు రాజులు సాలంకృతములు, సులక్షణోపేతములయిన ఏనుగులను, బ్రాహ్మణులు ఉత్తమ గ్రంథములను, అర్చాకరండకములను, వస్త్రాదులను, వైశ్యులు రత్నాభరణాదులను, ఇతరులు ధాన్యకనకములను గోవులను బహూకరించుచుండిరి.

భక్తులకు పురాణపఠనమువలన యజ్ఞదానవ్రతాదులొనర్చిన ఫలితము, మోక్షము లభించును. పురాణము చదివిన విప్రునకు దానము చేయుటవలన దైవప్రీతి కల్గి పాపతాపములు నశించును. పురాణపఠనము పరిసమాప్తమయిన వెంటనే విప్రులకు షడ్రసోపేతమయిన భోజనమును తృప్తిగా పెట్టవలయును” అని జైమిని మునులకు చెప్పగా వారు శ్రద్ధాభక్తి సమన్వితులై జైమిని పురాణ రహస్యములను విశదీకరించినందుల కతనిని యథాశక్తిగ సత్కరించిరి.

సంపూర్ణము

ఓం శాంతిః శాంతిః శాంతిః